# హంసవింశతి – విజ్ఞానసర్వస్వం

## ( HAMSAVIMSATHI - ITS ENCYCLOPAEDIC NATURE )

ప్రథమ సంపుటం




డా॥ జి. వెంకటరత్నం

విజ్ఞానధునీ ప్రచురణలు
దయానంద కాలనీ – వరంగల్.

హంసవింశతి-విజ్ఞాన సర్వస్వం – డా॥ జి. వెంకట రత్నం.

ప్రథమ ముద్రణ : జూన్ 1989



ప్రతులు : 500

మూల్యం : రు. 70-00.



ప్రచురణ కర్త : శ్రీమతి జి. ఆదిలక్ష్మి.

ముద్రణ : పూర్ణిమా ప్రింటర్స్ (హనుమకొండ)
రవీంద్ర ప్రింటర్స్ (వరంగల్)

ప్రతులకు : శ్రీమతి జి. ఆదిలక్ష్మి
ఇం. నెం. 16-7-241
దయానంద కాలనీ
వరంగల్.

విజ్ఞానధునీ ప్రచురణలు – వరంగల్.



ఓరుగల్లులో చందాకాంతయ్య స్మారక కళాశాల అధ్యాపక రత్నాలలో అనర్ఘ రత్నమైన డా॥ జి. వెంకటరత్నం కార్మికు నిగాజీవన పథంలో అడుగిడి, ఈ స్మానియా విశ్వవిద్యాలయం స్నాతకోత్తర కేంద్రం వరంగల్లులో యం.ఏ. తెలుగులో ప్రథముః డుగా ఒక వెలుగు వెలిగి, పరిశోధనయే జీవిత పరమావధిగా సాహితీ క్షేత్రంలో తన విజ్ఞానాన్ని ఘణంగా పెట్టి శోధించి "హంస వింశతి–విజ్ఞానసరస్వం" అనే వినూత్న సిద్ధాంత వ్యాసాన్ని వెలువరించి పరిశోధకులకు, పండితులకు అందించిన సాహితీ కార్మికుడు.

అయ్యలరాజు నారాయణా మాత్యుడు, తెలుగులో విజ్ఞాన సర్వ స్వాలు, హంస వింశతి–వీధి బడి విద్యావిధానం, హంస వింశతి ఉపదేశా త్మక కావ్యమా? **Lexicons in Telugu Literatnre (English)** వంటి వ్యాసాలు తెలుగు విమర్శలో వీరు చేసిన వైవిధ్యపూరిత విన్యాసాలు.

హంస వింశతి-సమకాలీన జీవిత విధానం, తెలుగులో విజ్ఞాన సర్వ స్వాల వికాసం, తెలుగు సాహిత్యంలో దేశీయ క్రీడలు, **Eratic Poetry in Telugu Literature (English)** వీరి రాబోవు విమర్శక గ్రంథాలు.

ధన్యజీవి (నాటకం) వెంకటేశ్వర శతకము (పద్యరచన) శారద రాత్రులు(గేయసంపుటి–అముద్రితాలు) మొదలైన సృజనాత్మక రచనలు వీరిని కవిగా కూడా సాహితీ క్షేత్రంలో నిలిపేందుకు తగి యున్నవి.

తెలుగు నాటక రంగం రచన-ప్రయోగం అనే అంశంమీద మాకళా శాలలో జరిగిన యు.జి.సి. రాష్ట్రస్థాయి సదస్సుకు సమన్వయకర్తగా

వ్యవహరించడమే గాక నాటి ప్రముఖుల ప్రసంగ వ్యాసాలను గ్రంథ రూపంలో వెలువరించి, దానికి సంపాదకత్వం కూడా వహించిన దీక్షాదక్షులు.

అధ్యాపకునిగానే కాక, పరిశోధకుడుగా వీరికృషి అనితర సాధ్యం అనడానికి నాలుగు సంపుటాలతో హంస వింశతిలోని నానా శాస్త్రీయ, సాంకేతిక పదాలను వివరించిన వీరి హంసవింశతి - విజ్ఞాన సర్వస్వం అనే సిద్ధాంత వ్యాసమే సాక్ష్యం. అందులో గ్రంథ రూపంలో మీ ముందు కొస్తున్నది మొదటి సంపుటం మాత్రమే.

మంచి మిత్రునిగా మనసులు దోచడం, ఆప్తునిగా ఆదుకోవడం వీరిలోని మానవత్వపు మనుగడలకు ప్రతీకలు.

డా॥ వనం మధుసూదన్
ఆంధ్రోపన్యాసకులు
సి. కె. యం. కళాశాల

వరంగల్
తేది. 16-8-1990

# అంకితం

జీవిత పాఠాలను ఉగ్గుపాలతో
రంగరించి పోసి,
పరిశ్రమకు ప్రత్యామ్నాయం లేదనే
సూక్తికి ప్రతీకలుగా నిల్చి
నన్నింత వాణ్ణి చేసి వెళ్ళిపోయిన

అమ్మా నాన్నలు

గుంజి వెంకట లక్ష్మమ్మ
గుంజి వెంకటేశ్వర్లు గార్ల

స్మృత్యంజలికి .....

# కృతజ్ఞతలు

పరిశోధన అంటే ఏమిటో తెలియని నాలో పరిశోధనా బీజాలు నాటి నాలో ఉండే జిజ్ఞాసను మేల్కొలిపి, విజ్ఞాన సర్వస్వమైన హంసవింశతిపై పరిశోధన గావించేందుకు అవకాశం కల్పించి, ముందుకు నడిపించిన మా గురుదేవులు ఆచార్య బిరుదరాజు రామరాజుగారికి నమస్సుమాంజలులు.

హంసవింశతిలో శబ్దరూపంలో నిక్షిప్తమై ఉండే విజ్ఞానాన్నంతటిని వివరణాత్మకంగా వెలికితీసి, నలుగురికి అందించవలసిన అవసరాన్ని గూర్చి పదేపదే చెబుతూ, నా యీ పరిశోధనకు పర్యవేక్షకులుగా నుండి, నన్నాదరించి, చేరదీసి ఎప్పుడుపోతే అప్పుడు, విసుగు విరామం లేకుండా తమ అమూల్య సలహాలతో నాచే ఈ బృహత్కార్యాన్ని నిర్వర్తింపజేసిన పూజ్య గురువులు ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యుల గారికి మనః పూర్వక నమోవాకములు.

ఈ పరిశోధన సందర్భంగా నేను పోయినప్పుడల్లా తీరిక చేసుకొని నాకు తగిన సలహాలిచ్చి, ప్రోత్సహించిన గురువర్యులు ఆచార్య కేతవరపు రామకోటిశాస్త్రిగారికి నా హృదయ పూర్వక అభివందనాలు.

నా యీ పరిశోధనా సాఫల్యానికి కారణభూతులై, నేను పరిశోధనా పట్టభద్రుణ్ణి అయ్యేందుకు అవకాశం కల్పించిన మాన్యులు, సహృదయులు ఆచార్య జి. యస్. రెడ్డిగారికి, ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి కృతజ్ఞతాభి వందనాలు.

ఈ పరిశోధనకు అవకాశం కల్పించి, అది నిర్విఘ్నంగా సాగేందుకు అన్ని విధాల సాయపడిన సి. కె. యం. కళాశాలాధ్యక్షులు, అధ్యాపక మిత్రులందరకు ధన్యవాదాలు.

హంసవింశతి—విజ్ఞాన సర్వస్వం అనే అంశంపై పరిశోధన సందర్భంగా నేను మద్రాసు పోయినప్పుడు, హంసవింశతి వ్రాత ప్రతులను, బ్రౌను తయారు చేసిన హంసవింశతి సూచికలను పరిశీలించేందుకు,

ఆదరంతో అంగీకరించి, సదుపాయాలు సమకూర్చిన మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయాధ్యక్షులకు, దాంట్లో తెలుగు పండితులుగా పనిచేస్తున్న మిత్రులు శ్రీధర్‌గారికి, అదే రోజుల్లో హంసవింశతిపై కొన్ని సూచనలు చేసి, క్రొత్త విషయాలను తెలియపరిచిన సహృదయులు శ్రీ ఆరుద్రగారికి ధన్యవాదాలు.

ఈ సిద్ధాంత వ్యాసానికి అందంగా శుద్దప్రతిని తయారుచేసియిచ్చిన పూజ్యులు శ్రీ వింజమూరి పార్వతీశంగారికి నమస్సులు. అవసరమైన చోట్ల ఫోటోలు, చిత్రాలు సమకూర్చిన సోదరుడు చిరంజీవి జి. నారాయణకు, ముద్రణ ప్రతిని తయారుచేయడంలో తోడ్పడిన వీరాచారికి ఆశీస్సులు.

హంసవింశతి-విజ్ఞాన సర్వస్వ రచన నాలుగు సంపుటాల్లో సాగిన బృహద్గ్రంథం. వాటిలో ప్రథమ సంపుటం మాత్రమే ఇప్పుడు ప్రచురింపబడుతుంది. దీని ముద్రణ కార్యక్రమంలో అడుగడుగునా తగిన సలహాలిచ్చి పుస్తకాన్ని అందంగా తీసేందుకు సాయపడిన సహృదయులు, డా॥ హరిశివకుమార్ గారికి, మిత్రులు డా॥ వనం మధుసూదన్ గారికి కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ముద్రణకు సహృదయంతో ఆర్థిక సహకారాన్ని అందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి, ముఖ్యంగా తెలుగు విశ్వవిద్యాలయ కులపతులు ఆచార్య తూమాటి దొణప్పగారికి వందనాలు.

ఈ గ్రంథాన్ని ప్రచురించేందుకు నన్ను ప్రోత్సహించి మొదట్లో ముద్రణ కార్యభారాన్ని కూడా కొంత మేరకు తానే వహించి, సిద్ధాంత ప్రకరణం వరకు అందంగా అచ్చొత్తిచ్చిన పూర్ణిమ ప్రింటర్స్(హనుమకొండ) అధినేత మిత్రులు అయితా నాగేశ్వరరావుగారికి, చివర్లో ఈ గ్రంథంలోని వివరణ ప్రకరణాన్ని అనుకొన్న సమయంలో ముద్రణ పూర్తి చేసి, ఆత్మీయతతో సహకరించిన రవీంద్ర ప్రింటర్స్ (వరంగల్) అధినేత పెనుగొండ రమేష్‌గారికి, సిబ్బందికి కృతజ్ఞతలు.

28–6–1989

జి. వెంకట రత్నం

# మెచ్చుకోలు

చిరంజీవి జి. వెంకటరత్నం వరంగల్లు స్నాతకోత్తర కేంద్రంలో మొదటి జట్టు విద్యార్థి. ఆనాటి నుండి అతనిలో ఉన్న జ్ఞాన తృష్ణను శ్రద్ధను గమనిస్తున్నాను. పట్టభద్రుడైన తరువాత పరిశోధనకు పూను కున్నాడు. హంస వింశతి కథాకావ్యం గూర్చి పరిశ్రమ చేయవలెనను కున్నాడు. తెలుగు సాహిత్యంలో హంసవింశతి, శుకసప్తతి గొప్ప శృం గార కథా కావ్యములు. అంత మాత్రమే కాదు. ఆ రెండు కావ్యాలలో మన సాంఘిక చరిత్రకు పనికివచ్చే మాడిసరుకు చాలా ఉన్నది. వెంకట రత్నం ముందుగా "హంస వింశతి సమకాలీన జీవిత విధానం" అనే విష యం పరిశోధించి **M.Lit.** పట్టా అందుకున్నాడు. హంస వింశతి చదువు తుండగా అధ్యయనం చేస్తుండగా అది విజ్ఞాన సర్వస్వంగా అతనికి తోచింది. ఆ విషయం సాకల్యంగా పరిశోధించి నిరూపించి **Ph.D.** ఉపా ధిని అందుకున్నాడు.

ఈ పరిశోధనము సిద్ధాంతము వివరణము అని రెండు భాగాలుగా ప్రవచించినాడు. సిద్ధాంత భాగంలో హంస వింశతి విజ్ఞాన సర్వస్వం అని నిరూపించినాడు. రెండవ భాగంలో హంస వింశతిలోని సాంకేతిక శాస్త్రాంశాలు వివరించినాడు. ఈ వివరణం ఒక జ్ఞాన సముద్ర మథనం వంటిది నిఘంటువులు పక్షివిశేషం, వృక్షవిశేషం, మత్స్యవిశేషం భక్ష్యవిశేషం, ఆభరణ విశేషం అంటూ దాటవేసే మాటలకు దాదాపు 4000 పదాలకు వివరణం వ్రాసినాడు. ఆ గవేషణలో పూర్వ ముద్రణల్లోని స్ఖాలి త్యాలు ఆయాపరిష్కర్తలు ప్రచురణకర్తలు చేసిన పొరపాట్లు గమనించి నాడు. విరూపాలకు స్వరూపాలు ఆవిష్కరించినాడు. అచ్చు తప్పులో అర్థంలేనివో అనుకున్న చాలా మాటలు ఈనాడు ప్రాణవంతములై మన యెదుట సాక్షాత్కరిస్తున్నాయంటే వెంకటరత్నం ఎంత కృషి చేసినాడో ఊహించవచ్చు. వెంకటరత్నం సంపాదించుకున్న **Ph.D.** చాలా విలువైనది "మణినా వలయం వలయేన మణిః" అన్నట్లు పరస్పరం శోభ. ఇంత గొప్ప కృషి చేసిన చి॥ వెంకటరత్నంను మనసారా అభినందిస్తున్నాను. ఇతోధిక యశఃప్రాభవాలు కలుగాలెనని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

ఆచార్య బి. రామరాజు
రిటైర్డ్ ప్రొఫెసర్
ఉస్మానియా విశ్వవిద్యాలయం

1-8-117/2 చిక్కడపల్లి,
హైదరాబాదు.

# భూమిక

శ్రీ జి. వెంకటరత్నం శ్రద్ధగలవాడు. శబ్దశుద్ధి గలవాడు. ప్రాచీన వాఙ్మయముతో సన్నిహితమైన పరిచయము గలవాడు. ఉద్యోగము చేయుచునే ఎం. ఏ: డిగ్రీ సంపాదించినవాడు.

శ్రీ వెంకటరత్నం తెలుగు సాహిత్యములో పరిశోధన చేయుటకు పూనుకొన్నప్పుడు ఎం. ఫిల్., స్థాయిలో హంస వింశతిలోని సామాజిక పరిస్థితులు విషయముగా పి. హెచ్‌డి. స్థాయిలో హంస వింశతి విజ్ఞాన సర్వస్వస్థాయి లక్షణము విషయమైనది.

ప్రాచీన సారస్వతములో వాఙ్మయము కేవలకావ్యములే కాక బహుళాంశ ప్రతిపాదకములై యున్న గ్రంథములు అనేకములు రచింపబడినవి. కొన్నింటికి కథాకథనము ప్రధానమైతే మరి కొన్నింటికి వర్ణనము ప్రధానము, మరికొన్నింటికి విషయ వివేచన ప్రధానమైతే వేరొకకొన్ని శాస్త్ర సాంకేతిక ఇతరాంశాల వివేచన ప్రధానమైన రచనలు. లాక్షణికులు శాస్త్రకావ్యముల చర్చ చేసినారు. మహాభారతము, భట్టికావ్యము మొదలైనవి శాస్త్రకావ్యములు.

తెలుగు సాహిత్యములో కథాకథన ప్రాధాన్యముగల రచనలే ఎక్కువ. మిగిలిన అంశములకు సర్వత్రా అప్రాధాన్యమే. ఈకథాకథనం రసభావాలను తోడితెచ్చుకొని పాఠకుల మనస్సుల మీద అనంతకాలము వరకు ప్రభుత్వము చేయుచున్నది. కథాకథనము లేనిచోట రసభావములకు తావు లేదు. ఎందుకనగా రసాదికము మానవ జీవితము నుండియే పుట్టుచున్నది.

హంస వింశతి వెలువడిన కాలము బహుక్లిష్టమైనది. మనుచరిత్ర నుండి వసుచరిత్రము వరకు తెలుగు కావ్యములు స్వతంత్రముగా రసభావసమృద్ధికి ధారెత్తిసినవి. తరువాత కాలమున పాండిత్య ప్రకర్ష, చమత్కారము, కావ్యవినోదము మొదలైనవి ప్రధానములైనవి. ద్వ్యర్థికావ్యములు, చమత్కారచాటువులు ఈ కాలమందలి ప్రధానరచనలు. వీటితో

పాటు పారదారికమైన శృంగారమును వర్ణించు రచనలు కూడ నాటి అభి రుచులననుసరించి బహుళముగానే వెలువడినవి. ఈ పారదారికమైన శృంగారము కూడ చాల చోట్ల రసాభాసమునకు దారి తీసినది.

ఈ కాలమున హంసవింశతి వెలువడినది. శక్తిమంతుడైన కవి సమ కాలీన భూమి యందు కాలుమోపి యున్నపుడు తనపై లక్షణ్యమును చెక్కు చెదరనీయడు. నారాయణా మాత్యుని శక్తి అసాధారణమైనది. లోకజ్ఞత సామాన్యమైనదికాదు, బహువిషయ పరిశీలనము, లోకదర్శనము, బహు శాస్త్రవిషయ సమీక్షణము అతనిని సమకాలీన కవులకన్నా కొంచెము ఎత్తుగా నిలబెట్టినవి.

హంసవింశతిలోనికథ సమకాలీన కాముక వృత్తాంతమే అయినను కావ్యములో బహువారములు చేయబడిన నాయికా వర్ణనము, సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణనలు కవి ప్రతిభాశక్తికి తార్కాణములు. ప్రాస్తా వికముగా వర్ణనలో అతడు ప్రస్తావించిన అంశములు విస్తృతమైన శాస్త్రాల పరిజ్ఞానము చేతగానీ ఇతర శాస్త్రముల పరిచయము చేతగాని తెలియ దగిన అంశములు. ఒక పక్షిప్రస్తావన వచ్చినపుడు తనకు తెలిసిన పక్షుల పేర్లన్నియు పేర్కొనును. ఇట్లే క్షేత్రములు, తీర్థములు, నదులు, కొండలు జంతువులు, వృక్షములు, ఆటలు, పిండివంటలు, రంగులు, కుస్తీపట్లు. నానా వర్ణముల వారి వేషభాషలు, ఆభరణములు-ఇట్లు అపరిమితముగా అతడు పేర్కొనిన అంశముల పరంపర ఆనాటి సమాజ జీవితమునకు అద్దము పట్టినది. ఈ అంశములు ఏవిఏవియో వివరింపక పోయినచో ఈ నాటికే చాలా అంశములు అర్థముకాని స్థితికి చేరుకొన్నవి. గడచి పోయిన ఆనాటి సమాజములోని అంశములను తెలిసికొనుట కష్టసాధ్యమైన అంశం. కవిజీవించిన ప్రాంతములు, ఆధునికత ప్రవేశించని కుటుంబములు, పరంపరా విచ్ఛేదము పొందని వృత్తులు, పరివారములు, గ్రామములు ఈ విషయములు తెలిసికొనుటకు ఆధారస్థానములు.

ఇదంతయు దేశీయ విజ్ఞానము. గ్రంథములయందు శాస్త్రచర్చల యందు విశదముగా ప్రస్తావన చేయబడకున్నను సమాజములో వ్యక్తు లందరి యందు వారివారి వృత్తులనాశ్రయించి పరంపరగా కొనసాగినది

విజ్ఞానాంశం. సమాజ జీవితములోని తొంబదితొమ్మిది పాళ్ళు జీవితము ఈ విజ్ఞానాంశముతో ముడిపడి యుండెడిది. మరుగున బడిపోవుచున్న ఈ విజ్ఞానమును నిలువ బెట్టుకొనుట నాగరికమైన ఏ జాతికైనను ప్రధాన లక్షణము.

శ్రీ వెంటరత్నం చేసిన కృషి ఈ దేశీయ విజ్ఞానమును నిలువబెట్టుట ప్రధానాంశముగా చేయబడినది. ఈ కృషిలో నూటికి తొంబయియైదు. పాళ్ళు అతడు సాఫల్యము నొందినాడు. అసాధారణమైన ఈ కృషి కేవలం సారస్వత సీమలకు పరిమితముకాక సామాజిక విజ్ఞానమును సుసంపన్నము చేయుచున్నది. సామాన్య నిఘంటువలె కనిపించు ఈ గ్రంథము వెనుకనున్న కృషి ఇది. అరుదైన ఈ పని చాలశ్రమతో కూడకొన్నది. విషయమును సమాకలనము చేయుటకు బహుశాస్త్రాంశముల పరిచయం కావలయును. జానపద స్థానములందీ విషయము తెలిసికొనుటకు కావలసినంత ఓపికయు, వారితో ఆత్మీయముగా కలిసి పోగల తత్త్వము కలిగి యుండవలయును. ఈ గుణములీతనిలో సమృద్ధిగానున్నవి.

డా॥ జి. వి. రత్నం ప్రచురించిన ఈ తొలిభాగము మొత్తము కృషికి వాచవి మాత్రమే. కాలగర్భము నుండి ఈ రచయిత మోసికొని వచ్చుచున్న ఈ విజ్ఞాన పాథేయమును పాఠకులు ప్రేమతో స్వీకరించగలరని విశ్వసించుచున్నాను.

ఇట్లు

ప్రొ. కె. సుప్రసన్నాచార్య

తేది. [illegible]

ఎం. ఏ., పి. హెచ్‌డి.
ఆంధ్రశాఖాధ్యక్షులు
కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్

# ఒక్క క్షణం ఆగండి........

ఆంధ్ర వాఙ్మయంలో కథాకావ్యాలకు ఒక విశిష్ట స్థానం ఉంది అవి నేటి కాలంలోవచ్చిన విజ్ఞాన సర్వస్వాల లాంటివి.విజ్ఞాన శాస్త్రాలను నిఘంటువులగు రిఫరెన్స్ పుస్తకాలుగా ఉపయోగిస్తారు. కానీ, కావ్యాలలా గానీ, నవలలలాగానీ చదవరు కదా! అలాంటప్పుడు మనోవికాసానికి నిత్య జీవితానికి అవసరమైన వివిధ శాస్త్ర విషయాలను ఒక్కచోట కూర్చి, విజ్ఞాన ప్రసారాన్ని చేయటానికి ఎంతో ఉపకరించిన గ్రంధాలు ఈ కథాకావ్యాలు! అలాంటి సత్ప్రయోజనంతో వెలువడిన గ్రంథాలలో తలమానికం అయ్యలరాజు నారాయణామాత్యుడు రచించిన హంస వింశతి. బ్రౌన్‌దొర మాటల్లో చెప్పాలంటే 'శాస్త్రాన్ని శాస్త్రంగా చదువుకోదలచనివారి కోసం వ్రాసింది ఇది.

మంత్రద్రష్టలైన మహర్షులు వేదాలలో-జ్యోతిషం, గణితం, సంగీతం వంటి అనేక నిగూఢ విషయాలను నిక్షిప్తం చేశారు. మహాభారతం కూడా ఒక విశ్వ విజ్ఞాన కోశమే. అట్లాగే భావితరాల వారికి విజ్ఞాన భాండారాన్ని అందించిన అలాంటి గ్రంథాలలోహంసవింశతి కూడా ప్రముఖమైంది.

కావ్య ప్రయోజనాలైన రసానందము - ఉపదేశము అనే రెండు ఈ గ్రంథంలో చోటు చేసుకున్నాయి. అందరినీ ఆకర్షించి, కదిలించి, చదివించే శృంగార రసాన్ని ప్రధానంగా చేసుకొని, స్వేచ్ఛా శృంగారం లోని కష్టనష్టాలను నయాన భయాన చెప్పి, పతివ్రతా ధర్మాన్ని ఉపదేశించిన గ్రంథమిది. విష్ణుదాసుని ధర్మపత్ని అయిన హేమావతి,చిత్రభోగ మహారాజు పైన మనసుపుట్టి వెళ్లబోయేటప్పుడు హంస చెప్పిన ఇరవై నీతి కథల సంపుటిఇది. ప్రతి కథలోను ఒక్కొక్క కులంవారిని కథానాయకులుగా చేసిన నారాయణామాత్యుడు, ఆయా కథలలో వారి వారి కుల వృత్తులను, సంప్రదాయులను, నమ్మకాలను, గృహోపకరణాలను, వేడుకలను చక్కగా వివరించాడు. అంతేకాదు వీలువెంబడి-చతుష్షష్టి కళలు వివిధ ఆయుధాలు, విద్యలు, శాస్త్రాలు, వాద్యాలు, ఆభరణాలు, పరిమళ ద్రవ్యాలు, పెంపుడు జంతువులు, వీధి బడులు, సంతలు. వంటి అనేక విష

యాలను ఇందులో నిక్షిప్తం చేయటంవల్ల, హంస వింశతి నాటి సమాజానికి దర్పణంగా ఉన్నదనటం అతిశయోక్తి కాదు.

హంస వింశతి కేవలం కావ్యం కాదు.అది కావ్య శాస్త్రము. అంటే-వివిధ శాస్త్రాలను కావ్యరూపంలో పొందుపరచిన గ్రంథము. జంతు-వృక్ష భూగోళ శాస్త్రాలు, నాట్యము-గానము-వాద్యము-కావ్యకళవంటి వివిధ కళలు, శాస్త్రాంశాలు ఇందులో వివరింప బడినాయి.

సామాజిక స్పృహ దృష్ట్యా కూడా ఇది విశిష్టమైనది. ఆంధ్రుల చరిత్రలో విజయనగర ప్రభువుల కాలం ఐహిక సుఖాలకు ఆటపట్టు. స్వేచ్ఛా శృంగారము, నిర్వేల కాముకతలు విలయ తాండవం చేసిన రోజులవి. ఆ తరువాత మన దేశంలోకి చొచ్చుకొని వచ్చిన పాశ్చాత్య నాగరకతా ప్రభావంకూడా హంస వింశతి నాటి సాంఘిక దుస్థితికి దోహదం చేసి ఉంటుందనటం అసమంజసంకాదు. అలాంటి పరిస్థితులకు దాసులవుతూ ఉండిన హిందువులకు నీతినుపదేశించి, హైందవ సంస్కృతీ పరిరక్షణకు తోడ్పడిన గ్రంథాలలో హంస వింశతి ప్రముఖమైంది. అలాంటిదే పాలవేకరి కదిరీపతి వ్రాసిన శుకసప్తతి కూడా - పరోక్ష విశేషము ముల్లును ముల్లుతో తీసివేసినట్లు సమకాలీన ఇతివృత్తాలను తీసుకొని, సమయోచిత నీతి బోధచేసి, సమాజానికి మార్గం చూపిన గ్రంథం ఈ హంస వింశతి. అంతే కాదు బుద్ధికథలతో నీతినుపదేశించుటలో పటిష్టమైన ప్రయోగం చేసిన ప్రముఖ కావ్యంకూడా ఇదే.

భాషాపరంగా చూసినా హంస వింశతి సాటిలేని ఒక శబ్ద పేటిక. ఆనాటికి దేశభాషలలోనికి చొచ్చుకొనివచ్చిన అనేక అన్యదేశీయాలు ఇందులో కనిపిస్తాయి. అట్లాగే పర్యాయ పదాలను చూపటంలో ఇది నిఘంటువులను కూడా మించి పోయింది. దాక్షిణ్యం అన్నపదానికి దాదాపు 50, పోకిరి వాడు అన్నపదానికి 100కి పైన పర్యాయ పదాలను ఇచ్చాడు నారాయణామాత్యుడు ఇలాంటివే అనేకం.

ఈ విధంగా సమకాలీన సమస్యలతో కూడిన ఇతివృత్తాన్ని స్వీకరించి, సమకాలిక భాషలో, నాటి సమాజానికి అద్దం పట్టటమేకాక, రసావంతము నీతి బోధకత్వము అనే కావ్య ప్రయోజనాలను కూడా సాధించిన ఉత్తమ రచన ఈ "హంస వింశతి". ఇన్ని విషయాలను ఒక్కచోట చెప్ప

టానికి ఆనాటి కావ్య ప్రకియలతో అనువైనది కథాకావ్యం. ఒక్కటే కన్పిస్తుంది. అందువల్లనే దీనిని కథాకావ్యంగా తీర్చిదిద్దాడు వారాయణామాత్యుడు.

ఇంత విస్తృత ప్రాతిపదిక కలిగిన ఈ విషయాన్ని పరిశోధనకు ఎన్నుకొని, మిత్రులు డా॥ రత్నాంగారు పై విషయాల నన్నింటినీ కూలంకషంగా చర్చించారు తమ సిద్ధాంత వ్యాసంలో. అంతే కాదు అయన చేసింది కేవలం ఉత్తరకో ధోరణోదికో అందులో నామమాత్రంగా ఉన్న ప్రతి చిన్న విషయానికీ సమగ్రమైన వివరణ వ్రాసి, హంస వింశతికి ఒక చక్కని వ్యాఖ్య వెలయించారనవచ్చును.

ఈ సిద్ధాంత గ్రంథం రెండు భాగాలుగా ఉన్నది.

1. సిద్ధాంత ప్రకరణము. దీనిలో హంస వింశతికి ఆంధ్ర వాఙ్మయంలో ఉన్న విశిష్టతను శాస్త్రీయ దృక్పథంతో చర్చించి, దాని విజ్ఞాన సర్వస్వ లక్షణాలను సిద్ధాంతీకరించారు.

2. వివరణ ప్రకరణము. ఇందులో హంస వింశతిలో నామ మాత్రంగా ఉన్న శాస్త్రీయపదాలను ఒక క్రమ పద్ధతిలో లక్ష్య లక్షణ సమన్వితంగా వివరించారు. ఉదాహరణకు నాట్యకళ అన్నదానిలో వివిధ నాట్య విధానాలు,శాస్త్రీయ దేశీయ నాట్య పద్ధతులు వివరించారు అట్లాగే గానకళలో సప్త స్వరాలు రాగతాళ భేదాలేకాక, ప్రాచ్య పాశ్చాత్య రీతులను సమన్వయం చేసి చూపారు. విద్యావర్గంలో అష్టభాషలు, అష్టాదశ పురాణాలు అష్టాదశ సంహితలు, చతుష్షష్టి విద్యలు, ఛందస్సులు అలంకారాలు, యతులు, ప్రాసలు, వేదాలు, వేదాంగాలు, షట్శాస్త్రాలు, సూర్య సోమాది సిద్ధాంతాలు వంటి అనేక విషయాలను చక్కగా వివరించారు. అంతేకాక వాద్యాలు, వాటి పేరులు,తీరులు వంటి విషయాలను చిత్రాలతో సహా వివరించి సుబోధకం చేశారు రత్నంగారు.

అన్నింటినీ మించి ముద్రణ ప్రతులలో దొర్లిన దోషాలు చూపి, వాటిని సంస్కరించటానికి చేసిన సూచనలున్న "హంస వింశతి-గ్రంధ సంస్కరణం" అన్న అనుబంధం ఈ గ్రంథంలో చాలా విశిష్టమైనది. ఉదాహరణకు హంస వింశతి 3.21వ పద్యంలో "వన్నె లైదింటి కిర

వొందు వన్నెలందు" అనే పాఠమే ముద్రిత ప్రతులు అన్నింటిలోనూ ఉన్నదట! కానీ ఈ కోడి పందాలలో చీకటి పందాలు అనీ, వెన్నెల పందాలు అనీ ఉంటాయని, పూర్వ పరిష్కర్తలు ఈ విషయం గుర్తించలేదనీ కనుక ఆ పాఠం "వన్నెలైదిండిటి కిరులందు వెన్నెలందు" అని ఉండాలని రత్నంగారు చేసిన సూచన సశాస్త్రీయంగాను, సమర్థనీయంగాను ఉన్నది. ఇలాంటివి మరెన్నో ఆ అనుబంధంలో చూపించారు.

ఈ గ్రంథంలోని మరొక విశేషం సిద్ధాంత వ్యాసంలో వివరించిన శాస్త్రీయ పదాలన్నింటికి గ్రంథాంతంలో సూచిక ఇవ్వటం వల్ల, ఆయా విషయాలు గ్రంథంలో ఎక్కడున్నాయో చూసుకోవటం చాలా సులభమయింది. అది కేవలం పాఠకుల సౌలభ్యం కోసమేకాక, హంస వింశతిలోని విజ్ఞాన సర్వస్వ లక్షణాన్ని పాఠకులకు పట్టియిస్తుంది.

మొత్తం మీద, హంస వింశతికి ఆంధ్ర వాఙ్మయంలో ఉన్న విశిష్ట స్థానాన్ని వివరించే ఈ సిద్ధాంత వ్యాసం, సహృదయ హృదయానురంజకం కాగలదనీ, మిత్రులు డా॥ రత్నంగారి కృషి తప్పక ప్రశంసాపాత్రం కాగలదనీ ఆశిస్తూ వారిని అభినందిస్తున్నాను.

డా॥ హరి శివకుమార్
రీడర్, తెలుగుశాఖ
కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్.

వరంగల్
ది. 4-3-1990

# నివేదిక

ప్రాచీన కాలంలో మన భారతీయ భాషా సాహిత్యాల్లో విజ్ఞాన సర్వస్వాల నిర్మాణమనే ప్రత్యేక ప్రక్రియ లేదు. అందువల్ల విజ్ఞాన ప్రసారాన్నాశించిన నాటి కవులూ, రచయితలూ కూడా సమకాలీన విజ్ఞానాన్నంతటినీ కథా సందర్భాల ననుసరించి, సందర్భాలను కల్పించుకొని తమ గ్రంథాల్లో పొందుపరుస్తూ వచ్చారు. సాంఘిక, సాంస్కృతిక చారిత్రక, భౌగోళిక విషయాలను, ఖగోళ, జ్యోతిష, వైద్య, గణితాది సాంకేతిక శాస్త్రాంశాలను ప్రస్తావించిన వేదాలు, మహాభారతం, పురాణాదులు మన ప్రాచీన విజ్ఞాన సర్వస్వాలని ఆధునిక విమర్శకులు అంటున్నారు.

పురాణాల తరువాత వచ్చిన కావ్య ప్రబంధాల్లో కూడా ఆనాటి జీవిత విధానం చక్కగా చిత్రీకరింపబడింది. నాటి సమాజంలోని కులాలు, కులవృత్తులు, గృహాలు, గృహోపకరణాలు, వృత్తులు, వృత్తి పరికరాలు, సంతలు, సమారోహాలు, ఉత్సవాలు, ఊరేగింపులు, ఆచార వ్యవహారాలు, వస్త్రాభరణాలు, క్రీడా విశేషాలు, విద్యలు, విద్యావిధానం మొదలైన సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక, మత, రాజకీయాది విషయాలెన్నో ప్రస్తావించబడి ఉన్నాయి. ఈ విధంగా మన ప్రాచీన సాహిత్యంలో వివిధ శాఖలకు చెందిన మన విజ్ఞానమంతా ప్రకీర్ణమై కనిపిస్తుంది.

మన తెలుగులో వెలసిన కావ్యేతిహాస ప్రబంధాల్లో కూడా సమకాలీన విజ్ఞానమెంతో చోటుచేసుకొని ఉంది. అయితే మన కావ్యాలను అలంకార శాస్త్రం కొలబద్ధగా రసాలంకార కథా దృష్టితో విమర్శించే పద్ధతే ఇంతవరకూ వ్యాప్తిలో ఉంధి కాని అందలి విషయ విజ్ఞానాన్ని సశాస్త్రీయంగా పరిశీలించి, వెలికిదీసే ప్రయత్నం ఇంతవరకూ శిశు దశ లోనే ఉందని చెప్పాలి. ప్రజ్ఞాధినులైన పండిత ప్రకాండులు గానీ, పరిశోధనా నిలయాలైన విశ్వవిద్యాలయాలు గానీ, పరిశోధనా సంస్థలు గానీ ఈ విషయంలతో చూపవలసినంత శ్రద్ధ చూపకపోవడం విజ్ఞాన జిజ్ఞాసవులకు తీరని నిరుత్సాహకరమే కాకుండా, భావి తరాల వారికి ఆ విజ్ఞానమంద

కుండా పోయే ప్రమాదం కూడా ఉంది. కాబట్టి మన సాహిత్యంలో విజ్ఞానాంశాలను వెలికితీసి మన సమకాలీనులకు అందుబాటులోనికి తేవడమే కాకుండా, వాటినన్నిటినీ భద్రపరిచి భావితరాలవారి కందించవలసిన బాధ్యత కూడా మనపైనే ఉంది. ఇటువంటి సమయంలో విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల హంసవింశతిపై అటువంటి ప్రయత్నం చేసే అవకాశం నాకు లభించడం నిజంగా మత్పురాకృత శుభాది కృత్యమేనని భావిస్తాను.

హంసవింశతి సమకాలీన జీవిత విధానానికి అద్దం పట్టిన కథా ప్రబంధం. వివిధ శాఖలకు చెందిన విజ్ఞానాంశాలను, సాంకేతిక పదాలను, ప్రతిపాదించే విజ్ఞాన సర్వస్వం. పద్య రచనా చమత్కారంలోనూ, అలంకారాల కూర్పులోనూ, కథాకథనంలోనూ, కావ్యశిల్పంలోనూ ఇది ఇతర ప్రబంధాల కేమాత్రం తీసిపోని శృంగార ప్రబంధం.

హంసవింశతిలో ప్రతిబింబించే సమకాలీన జీవిత విధానాన్నిగూర్చి నేను వ్రాసిన "హంసవింశతి-సమకాలీన జీవిత విధానం" అనే యం.లిట్. సిద్ధాంత వ్యాసంలో సమగ్రంగా చిత్రీకరించడం జరిగింది. ఇక ఇప్పటి పరిశోధనాంశం "హంసవింశతి-విజ్ఞాన సర్వస్వం." హంసవింశతి స్వరూప స్వభావాలను విశ్లేషించి, విజ్ఞాన సర్వస్వ లక్షణాలను నిరూపించి, ఇది విజ్ఞాన సర్వస్వమని సిద్ధాంతీకరించడం, దీనిలో శబ్ద రూపంలో ఉండే విజ్ఞానాంశాలను వివరించడం ప్రధానాశయంగా సాగిందీ పరిశోధన.

పరిశోధనాంశాలకనుగుణంగా, రచనా ప్రణాళిక నేర్పాటు చేసుకొని ఈ పరిశోధనా వ్యాసం సిద్ధాంత ప్రకరణమని, వివరణ ప్రకరణమని రెండు భాగాలుగా విభజించబడింది. సిద్ధాంత ప్రకరణంలో అరు అధ్యాయాలున్నాయి. ఈ ప్రకరణంలో హంసవింశతి కేవలం కథా కావ్యమే గాకుండా, అది విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల కథా ప్రబంధమనే విషయాన్ని పరిశీలించి సిద్ధాంతీకరించడం జరిగింది.

ఇక ఈ పరిశోధనాంశంలో రెండోది వివరణ ప్రకరణం. ఇందులో, హంసవింశతిలోని సాంకేతిక, శాస్త్రాంశాలకు సంబంధించి దాదాపు 4000 పదాలు సంక్షిప్తంగా వివరించబడ్డాయి. ఈ పదాల్లోని వస్తువు స్వరూప

స్వభావాదులకు, గుణక్రియాదులకు అనుకూలమైన వివరణాత్మక రచనా ప్రణాళిక దృష్ట్యా, వివరణ ప్రకరణాన్ని పద్నాలుగు వర్గాలుగా విభజించి, ఒక్కొక్క వర్గంలోని పదాలను అకారాదిగా వివరించడం జరిగింది.

మన నిఘంటువులు ఒక పక్షిని గురించిగానీ, ఒక చెట్టును గురించి గానీ, ఒక ఆటను గురించి గానీ, వివరించే సందర్భంలో పక్షి విశేషమనీ, వృక్ష విశేషమనీ, బాలక్రీడా విశేషమనీ వ్రాయడం పరిపాటి. అంతేగాని ఆయా వస్తువుల వివరాలను గూర్చి నిఘంటువులు మూకీభావాన్ని వహిస్తున్నాయి. పోనీ ఇవన్నీ ఒక్కచోట మరే గ్రంథాల్లోనైనా దొరుకుతాయా అంటే అదీ లేదు. అటువంటి గ్రంథ నిర్మాణాలు ఇంకా ఆరంభదశలోనే ఉన్నాయి. ఈ పరిస్థితి ముఖ్యంగా విద్యార్థులకు నిరుత్సాహం, విజ్ఞాన జిజ్ఞాసువులకు ఆశాభంగం కలిగిస్తాయనడంలో సందేహం లేదు. ఈ లోపాన్ని తొలగించేందుకు మన భారతీయ భాషల్లో, ముఖ్యంగా తెలుగులో ప్రతి శాఖలోను అనేక విజ్ఞాన సర్వస్వాలు రావలసిన అవసరం ఎంతైనా ఉంది. పాశ్చాత్య భాషల్లో, అందులోనూ ఆంగ్లంలో — **Encyclopaedia of wit. Encyc.opaedia of Religion, Encyclopaedia of Sports.** మొదలైన వివిధ శాఖలకు చెందిన విజ్ఞాన సర్వస్వాలెన్నో వెలువడ్డాయి.

మన సాహిత్యాన్నంతటినీ పరిశీలించి ఆంధ్రుల సాంఘిక చరిత్రను వ్రాసిన శ్రీసురవరం ప్రతాపరెడ్డిగారు మన కావ్యాల్లో పేర్కొన్న వస్త్రాభరణాలు, ఆటలు, భోజన పదార్థాలు మొదలైన వాటిని వివరించేందుకు కొంత ప్రయత్నం చేశారు కాని శ్రీ రెడ్డిగారి దృష్టి కేవలం సాంఘిక చరిత్రకు సంబంధించిందవడం చేత వారు మిగతా పదాల జోలికి పోలేదు. ఇటువంటి సమయంలో హంసవింశతిలో శబ్దరూపంలోనున్న వివిధ శాఖలకు చెందిన పదాలనన్నిటినీ సేకరించి, ఆ విజ్ఞానాన్నంతటినీ క్రమ పద్ధతిలో చెప్పేందుకు చేసిన తొలి ప్రయత్నమిది.

ఉదహరణానికి "పొన్నంగి" అనే పదం తీసుకొంటే– నిఘంటువుల్లో ఇది ఒక పక్షి విశేషంగా కనిపిస్తుంది. కాని ఇక్కడ దాని జంతుశాస్త్రసంబంధమైన పేరు **(Zoo.ogical name)** పక్షి రంగు, పరిమాణం, ఆహారం, ఋతుకాలం, గ్రుడ్లుపెట్టి, పిల్లల్ని చేసే విధానం మొదలైన వివరాలతో

ఆ పక్షి స్వరూప స్వభావాలు వివరించబడ్డాయి. అదేవిధంగా, ఆటలూ, పాటలూ, నాట్యాలూ, వాద్యాలు, విద్యావిషయాలు, శాస్త్రాంశాలు మొదలైనవెన్నో హంసవింశతిలో ఉన్నంత మేరకు ఇచ్చట వివరించడం జరిగింది. వాద్య విశేషం, నాట్య విశేషం అన్నప్పుడు మనకు కలిగే జ్ఞానంకన్నా ఆయా విషయాల స్వరూప స్వభావాలతో గూడిన విజ్ఞానాన్ని పొందడం మిన్న. ఇదే ఈ గ్రంథ రచనలోని ముఖ్యోద్దేశం. దీనిలో వివరించిన ఆయా వస్తువుల స్వరూప స్వభావాదులు పాఠకుల చిత్తముల కెక్కినట్లైతే నా కృషి సఫలీకృతమైనట్టుగా భావిస్తాను.

హంసవింశతిలోని నానావిధ శాస్త్రాంశాలకు, వృత్తులకు, వృత్తి పరికరాలకు మొదలైన వాటికి సంబంధించిన వివరాలను సేకరించడంలో సంబంధిత గ్రంథాలను పరిశీలించడమేగాక ఎందరినో పెద్దలను, పండితులను, వృత్తి పరికరాల విషయంలో జానపదులను, ఆటల విషయంలో బాలబాలికలను కూడా సంప్రదించడం జరిగింది. ఇది ప్రథమ సంపుటం మాత్రమే. దీంట్లో కళావర్గం, విద్యావర్గం మాత్రమే ఉన్నాయి. మిగతా పన్నెండు వర్గాలు రాబోయే సంపుటాల్లో ఉంటాయి.

"దృష్టం కిమపిలోకే స్మిన్ న నిర్దోషం, ననిర్గుణం" అనేది అభియుక్తి. కాబట్టి విషయ సేకరణలో గానీ, వివరించడంలో గానీ ఏవైనా పొరపాట్లు జరిగి ఉంటే సహృదయులు దయతో తెలియపరిస్తే సవరించుకొంటాను.

28-6-1989

జి. వెంకట రత్నం

# హంస వింశతి - విజ్ఞాన సర్వస్వం

## ఒ క టవ అ ధ్యా యం

### హంస వింశతి-కథా కావ్యాలు:

సంస్కృత, ప్రాకృత వాఙ్మయ చరిత్రను పరిశీలించినచో దాదాపు రెండు వేల సంవత్సరాలకు పూర్వమే కథాకావ్యాలు వెలసియున్నట్లు తెలియుచున్నది. గుణాఢ్యుడు పైశాచీ ప్రాకృతంలో రచించిన బృహత్కథ రెండువేల సంవత్సరాల నాటిదని పండితుల అభిప్రాయం. బృహత్కథనాధారంగా సోమదేవుడు కథా సరిత్సాగరాన్ని, క్షేమేంద్రుడు బృహత్కథా మంజరిని రచించి యున్నారు. ఇవి గాక పంచతంత్ర హితోపదేశాలు, బుద్ధుని జాతక కథలు, కాదంబరి, దశకుమార చరిత్ర మొదలైన కథాకావ్యాలెన్నో, ఏనాడో సంస్కృత ప్రాకృతాలందు వెలసి యున్నవి. వీనిలోకొన్ని పద్య కథా కావ్యాలు కాగా, మరికొన్ని వచనరచనలు.

కాని ప్రాచీన కాలమున తెలుగులో వచన కథాకావ్యాలు కనుపించుట లేదు. బహుశా మన ప్రాచీనులు వచన రచనను ప్రామాణికంగా స్వీకరించి యుండలేదుకాబోలు. దండి దశకుమార చరిత్రను వచనంలో వ్రాసి యుండగ, దానినాంధ్రీకరించిన కేతన పద్య కథాకావ్యంగా తీర్చిదిద్దెను. తిక్కన ఉత్తర రామాయణాన్ని నిర్వచనంగా వ్రాసెను. కథాకావ్యాలేగాక వ్యాకరణాలు, నిఘంటువులు, శాస్త్రగ్రంథాలు మొదలైనవన్నియు ఆకాలంలో పద్యరూపంలోనె రచించుట గమనించదగ్గ విషయం. ఇది కారణంగా మన ప్రాచీన కథాకావ్యాలన్ని పద్యరూపంలోనె వెలువడి ఉన్నాయి.

<u>తెలుగులో కథాకావ్యాలు</u> :- ఆంధ్ర సారస్వత లత వేయేండ్లుగా అల్లిబిల్లిగా అల్లుకొని తీగలు సాగుచున్నది. ఈ వల్లికా మల్లికకు వెలసినపుష్పాలే ఇతిహాసాలు, పురాణాలు, కావ్యాలు, ప్రబంధాలు, నాటకాలు మొదలైన సాహిత్య ప్రక్రియలన్ని. వీనిలో కథాకావ్యాలు అపురూప పుష్పరాజాలై విరాజిల్లు తున్నాయి. ఈ కథా కావ్యాల్లో కొన్ని అనువాదాలు, అనుకరణలు కాగా మరికొన్ని స్వతంత్ర ప్రాయాలై ఉన్నాయి.

కేతన కృతమగు దశకుమార చరిత్ర, వేంకటనాధుడు రచించిన పంచ తంత్రం (దీనినే నారాయణకవి, భావయ్యకవి జంటకవులుగా రచించియున్నారు.) కొఱవి గోపరాజు నిర్మించిన సింహాసన ద్వాత్రింశిక, మంచన వ్రాసిన కేయూరబాహు చరిత్ర, వెన్నెలకంటి అన్నయామాత్యుని షోడశకుమార చరిత్ర, జక్కన కృతమగు విక్రమార్క చరిత్ర అనంతామాత్యుని భోజ రాజీయం, కూచిరాజు ఎఱ్ఱన విరచించిన సకల కథానిధానం, పుత్తేటి రామ భద్రుని సకల కథాసార సంగ్రహం, చింతలపూడి ఎల్లనార్యుని (రాధామాధవకవి) విష్ణుమాయా నాటకం, పాలవేకరి కదిరీపతి రచించిన శుకసప్తతి, అయ్యలరాజు నారాయణా మాత్యుని హంస వింశతి మొదలైనవి తెలుగు పద్య కథాకావ్యాల్లో పేర్కొన దగినవి. అందులోను శుకసప్తతి, హంస వింశతి జారశృంగార కథలు వస్తువుగా ఒకే కోవకు చెందినవై శృంగార ప్రబంధాలుగా వన్నెకెక్కినవి. శుక సప్తతి నాటి సమాజానికి నిలువుటద్దము నెత్తగా, హంసవింశతి నాటి సమాజవిజ్ఞానంతో బాటు ప్రసక్తానుసారంగా శాస్త్రాద్యనేక విషయాలు ప్రస్తావించి విజ్ఞాన సర్వస్వంగా విరాజిల్లు చున్నది.

## హంస వింశతి - నారాయణామాత్యుడు :

హంస వింశతి అయ్యలరాజు నారాయణామాత్యుడు రచించిన కథాకావ్యం. ఇందు హంస హేమావతికి చెప్పిన ఇరవైకథలు వర్ణింపబడిఉన్నాయి కాబట్టి దీనికీ పేరు పెట్టబడింది. అప్పటికే సాహిత్య క్షేత్రాన ఎన్నో కథాకవ్యాలు, మరెన్నో ప్రబంధాలు వచ్చేశాయి. హంస వింశతి కోవకే చెందిన శుకసప్తతి అప్పటికీ దాదాపు వంద సంవత్సరాలకు పూర్వమే వచ్చేసింది. ఆరోజుల్లో కవులు ఒకరిని మించి ఒకరు అహమికతో కావ్యాలు వ్రాసేవారు కాబట్టి నారాయణామాత్యుడు గూడా హంస వింశతి యందు వాటన్నిటిని మించిన ఫోకడలు, ప్రౌఢ వర్ణనలు, అనల్ప కల్పనాచమత్కృతులు బహుముఖాలుగా ప్రదర్శించి యున్నాడు.

## అయ్యలరాజు వారి వంశము:

అయ్యలరాజు వంశానికి ప్రాది, ప్రోది కూడా కడప మండలంగా కనుపి స్తుంది. ఈ వంశంలో మనకు కనుపించే ప్రథమాంధ్ర మహాకవి అయ్యలరాజు త్రిపురాంతకుడు. ఇతనికే తిప్పన అని నామాంతరము. ఈ వంశంలో అయ్యలయ్య

పేరు తరచుగ కనుపిస్తుంది. కాబట్టి అయ్యలరాజు ఈ వంశానికి మూలపురుషుడై యుండవచ్చునని పండితాభిప్రాయం.

అయ్యలరాజు వారిది పండిత వంశము. త్రిపురాంతకుడు ఒంటిమిట్ట జానకీరామ శతకాన్ని వ్రాశాడు. అయ్యలాఖ్యుడు, భాస్కరామాత్యులను కవిద్వయం కలిసి రెట్ట మతశాస్త్రమను శాస్త్రగ్రంథాన్ని రచించారు. అష్టదిగ్గజాల్లో ఒకడుగా పేరొందిన అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయాన్ని వ్రాశాడు. నారాయణామాత్యుడు హంస వింశతి, దశావతార కథాసంగ్రహము, ఆంజనేయ కంద పద్య శతకము అను గ్రంథాలను రచించియున్నాడు. ఈ మహాకవి సత్కవితా రచనాఢ్యులైన అయ్యలరాజు వంశజులను ఈ క్రింది పద్యంలో సన్నుతించి యున్నాడు.

ఉ॥ అయ్యలరాజు తిప్పనచివాగ్రణి పర్వతరాజు రామభ
దృయను భాస్కరాగ్రణి, ప్రధాన వరుడగు కొండధీరు నిం
జయ్యన తిమ్మయ ప్రభుని సత్కవితా రచనాఢ్యులైనమా
యయ్యలరాజు వంశజుల నాదికవీంద్రుల సన్నుతించెదన్
(హం. విం. పీఠిక - 12)

పై పద్యంలో పేర్కొన్న అయ్యలరాజు తిప్పనచివాగ్రణి ఒంటిమిట్ట జానకీరామశతకాన్ని రచించిన త్రిపురాంతకుడు. రామభద్రయ్య రామాభ్యుదయాన్ని రచించాడు. భాస్కరాగ్రణి హంస వింశతి కర్త నారాయణామాత్యుని తాతగారు. రెట్ట మతశాస్త్ర కర్తలలో ఒకరు. ఇకపోతే కొండధీరుడు, తిమ్మయ ప్రభులు ఎవరో వారే కావ్యాలు రచించారో యిప్పటి వరకు తెలియ వచ్చుటలేదు.

## నారాయణామాత్యుడు - దేశము - కాలము :

నారాయణామాత్యుడు నియోగి బ్రాహ్మణుడు, కొండమాంబా సూరపామాత్యుల పుత్రుడు. ఇతడు హంస వింశతిని శ్రీరామాంకితంగా రచించాడు. ఈ కావ్యం నందెచ్చటనూ కవి తనదేప్రాంతమో? ఏ కాలంలో నుండెనో? ఎప్పుడెప్పుడు ఏయే కావ్యాలు వ్రాశాడో తెలుపనందున, ఆయా విషయాల్లో పండితుల్లో భేదాభిప్రాయాలు కనుపిస్తున్నాయి.

ఈ కవి కొచ్చర్లకోట మండలానికి చెందిన గోరుగుంతలపాడు నివాసి యని పండిత వంగూరి సుబ్బారావుగారభిప్రాయ పడియున్నారు.1

గోరుగుంతల పాడులో ఆంజనేయస్వామి దేవాలయం ఉండేడిదని, శ్రీరామ భక్తుడైన నారాయణామాత్యుడు ఆంజనేయ కంద పద్య శతకాన్ని వ్రాస్తూ తన గ్రామ నామమైన గోరుగుంతలపాడును సంస్కృతీకరించి నఖ గర్తపురము (గోరు = నఖ, గుంత = గర్త, పాడు = పురము)గా మార్చి, ''నఖగర్త పురాంజనేయ నతజనగేయా'' అను మకుటంతో ఆంజనేయ కంద పద్య శతకాన్ని వ్రాశాడని ఆరుద్ర గారూహించియున్నారు.2

హంస వింశతి వ్యాఖ్యానకర్త శ్రీ మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు కడప, కర్నూలు, నెల్లూరు జిల్లాలకు చెందిన ముయ్యలిరొ ఏదోఒక గ్రామమీతని నివాస స్థానమై యుండునని అభిప్రాయ పడియున్నారు. 3. ఈ విధంగా ఈ కవి ప్రాంతాన్ని గూర్చి పండితుల్లో అభిప్రాయ భేధాలు కనిపిస్తున్నాయి.

కాని అయ్యలరాజు వంశజులు కడప మండలములోని ఒంటిమిట్ట గ్రామ వాసులుగా కనుపిస్తున్నారు. అయ్యలరాజు త్రిపురాంతకుడు ఒంటిమిట్ట జానకీరామ శతకాన్ని వ్రాశాడు. అతని తమ్ముడు పర్వత ప్రెగ్గడ కూడా ఈ ప్రాంతంవాడే. నారాయణామాత్యుడు సైతం హంస వింశతి యందొకచోట గ్రామాల పేర్ల పట్టికగా నిస్తూ కడప మండలంలోని సిద్ధవటం, చింతగుంట మొదలైన పల్లెలను పేర్కొన్నాడు అదే విధంగా కడప మండలంలో ప్రవహించు కుందేరు, చెయ్యేరు మొదలైన చిన్న చిన్న వాగులు వంకలను సూచించి యున్నాడు. కడప సమీపంలోనున్న పుష్పగిరి, అక్కడ జరిగే తిరునాళ్ళను వివరంగా వర్ణించి యున్నాడు. వీటన్నిటినిబట్టి పరిశీలిస్తే నారాయణామాత్యుడు సైతం కడప ప్రాంతం వాడై యుండునని చెప్పవచ్చును.

1. శతక కవుల చరిత్ర - పుట 276.
2. సమగ్రాంధ్ర సాహిత్యం - నాయకరాజుల యుగం II పుట-250
3. హంస వింశతి (టీకాతాత్పర్య సహితము) వావిళ్ళ ప్రతి
పీఠిక - పుట - 4.

అయితే ఇతడు గోరుగుంతలపాడు నివాసి అని కొందరూహించి ఉండడం చేత ఇతని నివాస ప్రాంతాన్ని గూర్చి అభిప్రాయ భేదాలు కనిపిస్తున్నాయి. కాని పై విషయాలన్నిటిని సమన్వయ పరిచి చూస్తే ఈ కవి మొదట కడప ప్రాంతం వాడే అయి యుండి, తదనంతరం దత్తత పోవుట వల్లనో, లేదా ఇల్లరికం కారణంగానో గోరుగుంతలపాడు చేరి స్థిర నివాస మేర్పరచుకొని యుండవచ్చునని ఊహించుట కవకాశము లేకపోలేదు.

నారాయణామాత్యుడు - తాను సుసంపన్నుడని, రూప వంతుడని, దాన ధర్మాలు చేయు గుణాకరుడని ఒక పద్యంలో చెప్పుకొని యున్నాడు.[1] రూప సౌభాగ్య సంపన్నుడు గుణాకరుడు అయిన నారాయణామాత్యుని తమ బంధువు లెవరైన దత్తతో, ఇల్లరికమో చేసికొని యుండవచ్చును. ఆ విధంగా ఈ కవి గోరుగుంతలపాడు చేరి స్థిర నివాస మేర్పరచుకొని యుండవచ్చును. నేటికీ సమాజంలో ముఖ్యంగా సంపన్న కుటుంబాల్లో దత్తత లేదా ఇల్లరికాలు జరుగుట తద్వారా ప్రాంతాలు, ఊర్లు, ఇంటి పేర్లు మారుట సహజమే గదా!

నారాయణామాత్యుని ప్రాంతం వలెనే, ఇతని కాలము సైతం వివాదాస్పదమై ఉంది. ఈ కవి కాలాన్ని నిర్ణయించు పట్ల మన కిప్పటి వరకు మూడు ఆధారాలు కనిపిస్తున్నాయి

1) నారాయణామాత్యుడే తన తండ్రి సూరపామాత్యుని కీర్తిస్తూ దశావతార కథా సంగ్రహంలో చెప్పిన సీస పద్యం.

2) నారాయణామాత్యుడు ధరణి దేవుల రామయామాత్యునకు సమకాలికుడని చెప్పుట.

3) అయ్యలాఖ్యుడు, భాస్కర మంత్రి కలిసి రచించిన రెట్టమత్త శాస్త్రంలో చివర ఆ గ్రంథ రచనా కాలాన్ని గూర్చి చెప్పిన పద్యం.

1. హంస వింశతి - పీఠిక - 15, 16.

<u>మొదటి ఆధారం:-</u>

సీ॥ కౌండిన్యస గోత్ర కల్పకంబగు
పర్వత ప్రెగ్గడదెవ్వాని తాత తాత
కవి చకోర నిశాకర యశస్ఫురదయ్య
లా మాత్యుడెవ్వాని యబ్బ యబ్బ
కు కవితాక్షుద్ర కుద్దాల నముడు భా
స్కర మంత్రి యెవ్వాని గన్న తండ్రి
హంస వింశతి ప్రబంధాకల్పునారాయ
ణాఖ్యుడా నేనే మహాత్మ్యునతుడ
గీ॥ నట్టి యయ్యల రాజాన్వయాంబురాసి
భగణప్యాన్నాధు కొంతమాంబాన్ననాధు
నిఖిలకకుభంతరాళ నిర్జిద్రకీర్తి
మజ్జనక్తు సూరపామాత్య మహిదలంతు।

ఈ పద్యాన్ననుసరించి వీరి వంశ వృక్షాన్ని క్రింది విధంగా చూపవచ్చును.

[illegible] పర్వత (ప్రెగ్గడ [illegible])
|
[illegible] విభుడు *
|
అయ్యలామాత్యుడు
|
భాస్కరామాత్యుడు
|
సూరపామాత్యుడు
|
నారాయణామాత్యుడు (హంస వింశతి కర్త)

దీనిని బట్టి హంస వింశతి కర్త పర్వత పెగ్గడకు ఆరవ తరంలోని వాడౌతున్నాడు. పర్వత ప్రెగ్గడ ఒంటిమిట్ట రఘువీర శతకాన్ని రచించిన అయ్యలరాజు త్రిపురాంతకుని తమ్ముడు. వీరి కాలం క్రీ॥శ॥ 1500 ప్రాంతంగా నిర్ణయింపబడి ఉంది.1 చారిత్రికుల లెక్క ప్రకారం తరానికి 30 సంవత్సరాలు లెక్క కట్టినచో, 6వ తరంలోని వాడైన నారాయణామాత్యుడు క్రీ॥శ॥ 1680 ప్రాంతంవాడౌతాడు ($6 \times 30 = 180 + 1500 = 1680$)

<u>రెండవ ఆధారం:-</u> దశావతార చరిత్రను వ్రాసిన ధరణిదేవుల రామయామాత్యుడు నారాయణామాత్యునకు సమకాలికుడు. ఇతడీ గ్రంథాన్ని రచించు పట్ల పుష్పగిరి తిమ్మన సహాయాన్నాశ్రయించాడు. తన కటువంటి యితరుల సహాయ సహకారాలు లేకుండా కవిత్వం ధాటిగా చెప్పగలనని తెలుపుకొనుటకును రామయామాత్యు నెత్తిపొడుచుటకును నారాయణామాత్యుడు తన హంస వింశతి గద్యలో "నిస్సహాయ కవిత్వ నిర్మాణ చాతుర్య నిస్తంద్రి" అని చెప్పుకొనెనని ఆరుద్ర తెలిపియున్నాడు.2

అంతేగాక రామయామాత్యుడు దశావతార చరిత్రను పదకొండు ఆశ్వాసాల్లో విస్తృతంగా రచించి యుండగ, దానినే నారాయణామాత్యుడు సంక్షిప్తంగా మూడు ఆశ్వాసాల్లో వ్రాసి యున్నాడు. ఇందలి కవిత్వం రామయామాత్యుని కవిత్వానికి దీటుగా ధాటిగా చెప్పబడింది. ఈ విషయం పైన చెప్పబడిన అయ్యలరాజు వంశ వృక్షాన్ని గూర్చిన పద్యాన్ని పరిశీలించిన స్పష్టంకాగలదు. ప్రబంధ కవుల కాలము నుండి కవులు అహమికతో ఒకరిని మించి ఒకరు కవిత్వం చెప్పుట కావ్యాలల్లుట పరిపాటి. కాబట్టి ఇది ఆరుద్ర గారి పై ఊహకు పబలకంగా ఉందని చెప్ప వచ్చును.

ధరణిదేవుల రామయామాత్యుడు మగదలవారి ఆశ్రితుడు. దశావతార చరిత్రను మగదల కృష్ణమూర్తికి అంకితమిచ్చాడు. ఇతడు క్రీ॥శ॥ 1650 ప్రాంతం వాడని తెలుస్తుంది. కాబట్టి రామయామాత్యుడును ఆ కాలానికి చెందినవాడే. ఇతనికి సమకాలికుడైన నారాయణామాత్యుడును అదే కాలానికి చెందినవాడే కావాలి. ఒకవేళ అప్పటికితడు బాలకవియై ఉంటాడను కొంటే నారాయణామాత్యుడు క్రీ॥శ॥ 1680–1700 ప్రాంతం వాడౌతాడు.

---

1. శతక కవుల చరిత్ర - పుట - 147 (2) సమగ్రాంధ్రసాహిత్యం నా. యు. II పుట 250

ఈ కవి కాలాన్ని నిర్ణయించడంలో ఆంధ్రకవి తరంగిణి కర్త చాగంటి శేషయ్యగారి అభిప్రాయం ఈ విధంగా ఉంది. "నారాయణామాత్యుని కాలం ఇది మిథంగా చెప్పుటకు వీల్లేదు. అయినప్పటికీ ఈ కవి ప్రయోగించిన "ఉతము, పరంది, ఇంగిలీషు" మొదలైన పదాలనుబట్టి ఇతడు బ్రిటీష్‌వారు మన దేశానికి వచ్చిన తరువాతి వాడై యుండును. క్రీ॥శ॥ 1800 ప్రాంతమువాడు కావచ్చును. అని తెలిపియున్నారు.[1] ఇది రెట్ట మత శాస్త్ర రచనాకాలాన్ని బట్టి నిర్ణయించిన దానికి కొంచ మించు మించుగా సరిపోతుంది.

పై మూడు ఆధారాల్లో మొదటి రెండింటిని బట్టి ఇతడు క్రీ॥శ॥ 1700 ప్రాంతం వాడు కాగా, 3వ ఆధారాన్ని బట్టి క్రీ॥శ॥ 1800 ప్రాంతం వాడౌతున్నాడు. చాగంటి శేషయ్యగారి అభిప్రాయం దీనికుపబలకంగా ఉంది.

అంతేగాక హంస వింశతి పాలవేకరి కదిరీపతి కృతమైన శుక సప్తతికి ఒరవడిగా వ్రాసిన ప్రబంధమని పండితాభిప్రాయం. అందుకు హంస వింశతి నుండి ఎన్నో పద్యాలను కథలను ఉదహరించ వచ్చును. కదిరీపతి క్రీ॥శ॥ 1660 ప్రాంతం వాడని నిడదవోలు వెంకట్రావు, నేలటూరి వేంకటరమణయ్యగార్లు చారిత్రకాధారాల్తో నిర్ణయించియున్నారు.[2] కదిరీపతి క్రీ॥శ॥ 1660 ప్రాంతంలో శుక సప్తతి రచించినవి ఉన్నా, ప్రచార సాధనాలంతగాలేని ఆ రోజుల్లో అది ప్రచారానికి వచ్చి [illegible] నారాయణామాత్యుని పైబడి, అతడు దానికి ఒరవడిగా హంస వింశతిని వ్రాసేందుకు కనీసం నూరు, నూటయిరవై సంవత్సరాలైనా పట్టియుండును. దీనినిబట్టి ఇతడు క్రీ॥శ॥ 1780 ప్రాంతం వాడౌతున్నాడు.

హంస వింశతిలో ప్రయోగించిన భాష, పద జాలం, [illegible] పరికరాల పేర్లు తిరునాళ్ళు, కోట పండాల పర్వాల మొదలైన అంతరంగిక సాక్ష్యాధారాలను బట్టి చూస్తే ఈ కవి మన దేశంలో బ్రిటిష్ వాళ్ళ పాలన బాగా స్థిరపడిన కాలంలోనాటి వాడై యుండునని తోచును. కాబట్టి నారాయణామాత్యుడు క్రీ॥శ॥ 18వ శతాబ్దపు ఉత్తరార్థమున జీవించి యుండునని చెప్పుటయే సమంజసంగా ఉంటుంది.

---

1. ఆంధ్ర కవి తరంగిణి - 11వ సంపుటము.
2. శుకసప్తతి - చిలుక పలుకులు - పుట XXXII (ఆం. సా. అ. ప్రచురణ)

నారాయణామాత్యుని రచనలు:- 1) హంస వింశతి 2) దశావతార కథా సంగ్రహము 3) ఆంజనేయ కంద పద్య శతకము అను మూడు కావ్యాలు నారాయణామాత్యుని రచనలుగా ప్రచారంలో ఉన్నాయి. ఇందులో మొదటిది పలు మార్లు ముద్రింపబడి, బహుళ ప్రచారంలో నున్న కథా ప్రబంధం. మిగిలిన రెండును అముద్రితాలు. అందులోను చివరిది అలభ్యమని కూడా తెలుస్తుంది.

దశావతార కథా సంగ్రహము:- నారాయణామాత్యునకు సమకాలికుడుగా చెప్పబడుతున్న ధరణి దేవుల రామయామాత్యుడు దశావతార కథను సుదీర్ఘంగా పదకొండు ఆశ్వాసాల్లో రచించి యుండగ దానినే నారాయణామాత్యుడు మూడు ఆశ్వాసాల్లో సంగ్రహించి వ్రాసి, దశావతార కథా సంగ్రహంగా పేర్కొనెనని ఆరుద్ర గారొకచోట చెప్పియున్నారు.1 ఈ కావ్యం అముద్రితం కావున ఇందలి కవితా విశేషాలు, కథా కథన విధానం మొదలైన విషయాలు విపులంగా చర్చించేందుకు అవకాశం లేకున్నది. కాని దీనిలోని కవిత్వం హంస వింశతిలోవలె ప్రౌఢంగా ఉండునని దీని అవతారికలోని ''కౌండిన్యస గోత్ర కల్పకంబగు పర్వత పెగ్గడెవ్వాని తాత తాత'' అను పద్యాన్నిబట్టి తెలుస్తుంది.2

ఆంజనేయ కంద పద్య శతకం:- అముద్రితం, అలభ్యంగా చెప్పబడుతున్న ఈ కావ్యం నారాయణామాత్యుని శతక రచన ''నఖగర్త పురాంజనేయ నతజనగేయా'' అను మకుటంతో కవి దీనిని రచించి యున్నాడని ఆంధ్ర కవి తరంగిణి, శతక కవుల చరిత్ర, సమగ్రాంధ్ర సాహిత్యం మొదలైన ఆంధ్ర సాహిత్య చరిత్రలన్ని పేర్కొంటున్నాయి. గోరుగుంతలపాడు నివాసి అయిన ఈ కవి తన గ్రామ నామాన్ని సంస్కృతీకరించి ''నఖగర్త పురాంజనేయ నతజన గేయా'' అను మకుటంతో ఈ శతకాన్ని రచించాడని ఆరుద్రగారి అభిప్రాయం.* ఇంతకంటె ఎక్కువ విషయాలు ఈ శతకాన్ని గూర్చి తెలియవచ్చుటలేదు.

హంస వింశతి:- నారాయణామాత్యుని కవితా ప్రతిభకు, అనల్ప కల్పనా శిల్పానికి, భావ సౌకుమార్యానికి భాషా పటిమకు, ప్రౌఢ వర్ణనలకు, లోకజ్ఞతకు, శాస్త్రజ్ఞతకు, అన్నిటినిమించి ఆనాటి సమాజ చిత్రణకు నిలువుటద్దం పట్టిన గ్రంథం హంస వింశతి.

---

1. సమగ్రాంధ్ర సాహిత్యం. నాయక రాజుల యుగం II పుట 249
2. నారాయణామాత్యుని కాలము నిర్ణయించు పట్ల ఈ పద్యమే యుపయోగపడింది.

* చూడు పుట - 4

దీనియందు హంస హేమావతికి చెప్పిన ఇరవై రాత్రుల కథలు వర్ణింపబడ్డాయి. కథలతోబాటు సందర్భాన్ని బట్టి సామాజికాలు, సాంస్కృతికాలు, శాస్త్రీయాలు, లౌకికాలు అయిన ఎన్నో విషయాలను కవి చెప్పియున్నాడు. ఇందులో కొన్ని విపులంగా వర్ణించడం, మరి కొన్నింటిని పట్టికలుగా కూర్చడం జరిగింది. అందుకే ఇది ఆధునిక విమర్శకులచే విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల గ్రంథంగా పేర్కొనబడు చున్నది.

నారాయణామాత్యుడు భావ దారిద్ర్యంగాని, భాషాదారిద్ర్యంగాని లేని ప్రౌఢ కవి. ఇతని కల్పనా శిల్పాలు అనల్పాలై పాఠకుల నలరిస్తుంటాయి. ఇందుకు హంస వింశతిలోని స్త్రీ వర్ణనలు ప్రత్యేకించి చెప్పదగినవి. ఈ ప్రబంధం నందు ప్రధాన నాయిక హేమావతి. హంస ఇరవై రాత్రుల కథలు ఈమెకే చెప్పింది. కాబట్టి ఈ కావ్యంలో ఈమె కనీసం ఇరవై మారులైనా కనిపిస్తుంది. ఇందులో ఇరవై అవాంతర కథలూ ఉన్నాయి. ఈ కథల్లో మరి యిరవై మంది నాయికలూ ఉన్నారు. వెరసి నలబైకి పైగా హంస వింశతిలో స్త్రీ వర్ణనలున్నాయి. ఇచ్చట వర్ణ్య వస్తువు ఒక్క స్త్రీయే అయినా చెప్పింది చెప్పకుండా ఆ పరిధిలోనె వివిధములైన చమత్కారాలతో కల్పనలు చేసి కవి పాఠకుల నాకట్టుకొనుటకు ప్రయత్నించియున్నాడు.

కొన్ని ఉదాహరణలు:-

(1) పద్యాల పేర్లతో స్త్రీ వర్ణన.

సీ॥ కబరీభరమునకు కందంబు సెల్లు
నుత్పల మాలికలు నేత్రములకు జెల్లు (1-62)

(2) కావ్యాల పేర్లతో స్త్రీ వర్ణన

సీ॥ నెఱిగొప్పు మేఘ సందేశంబు కనుదోయి
అందమౌ కువలయానంద మరయ (2-142)

(3) కంధర కమలారి కార్ముక కంజాత
కాంచన కంబుల గర్వ మణచి
పద్మరాగ పటీర పద్మారి సన్నగ
పద్మ పల్లవముల బాగునొంచి
వజ్ర వల్లీద్వయ వసుమతీధరవార
ణారి వారణ వసుధాళిగేరి
కదళికా కాహళ కచ్ఛప కలకంఠ
కనక కర్పూర సంఘముల మీరి

తే. గీ॥ కచముఖ భ్రూనయన నాసికా గళోష్ఠ
పరిమళ కపోల రోమాళి పదకర రద
బాహు కచ మధ్యగతి నితంబాంక జంఘ
పదరవాంగ స్మితము లొప్పు భామినులకు (5–275)

ఈ పై పద్యంలో కవి అత్యంత చమత్కృతితో స్త్రీ వర్ణన గావించి యున్నాడు. సీస పద్యంలోని నాలుగు పాదాలలో పాదానికి అరు చొప్పున ఉపమానాలిచ్చి, తేటగీతిలో వానికి వరుసగా ఉపమేయాలను గూర్చి వర్ణించిన తీరు సహృదయ హృదయావర్జకంగా ఉంది. అంతేగాక ఒక పాదంలోని అరు ఉపమానాలను ఒకే అక్షరంతో ప్రారంభించడం ఇందలి మరొక ప్రత్యేకత.

ఇదే విధంగా కాలమానాలతో (4–74)

నదుల పేర్లతో (5–30) అక్షర గుణింతంతో (5–169) నవగ్రహాల పేర్లతో (5-278) శబ్దవైచిత్రితో (2-19) అర్థ వైచిత్రితో (5-104) అలంకార వైచిత్రితో (4–89) వివిధ రీతులలో కవి స్త్రీ వర్ణనలు చేసి యున్నాడు. ఇచ్చట వర్ణ్యవస్తువొక్క స్త్రీయే అయినా అందలి గ్రథన కౌశలాన్ని బట్టి కవి అన్నీ కల్పనలకు నవ్యతను చేకూర్చి తన నైపుణ్యాన్ని ప్రదర్శించి యున్నాడు.

ప్రౌఢ వర్ణనలు:-

సీ॥ చండవేగోత్థభూమండలధూళ్యాప్తి
పంకీకృతాభ్ర కూలంకషాంభ
మభ్రౌత్పతద్దృషద్వ్యాఘాతభగ్నశి
ఖరి శిఖరాపతద్గండశైల
మద్రిభిత్కోశీ వనద్రుమ సందిదృ
క్షాప్రోత్థిత క్షమాస్థక్షమాజ
ముగ్రత్రిపురధీకృదుగ్రత్వరోద్ధిత
ద్యోవీధ్యటద్ధరిత్ర్యున్నతపుర

తే। గీ॥ ముద్ధతాబ్ధి హ్రదహ్రాది నీర్ధవార్మి
హూర్మిణుర్వ్యాతి నిపతద్బృహూరు చక్ర
వాళ మద్ర్యశ్మ పూరిత వార్ధి వీచె
భయదగతినొక్క ఝుంఝూ ప్రభంజనంబు (5-51)

పై పద్యంలోని ఝుంఝూ మారుతం వర్ణన పరిశీలిస్తే ప్రౌఢ వర్ణనలు చేయుటలో ఈ కవి ప్రబంధ కవుల కేమాత్రం తీసిపోదనిపిస్తుంది. ఇట్టివే ప్రౌఢ వర్ణనలు ఈ కావ్యంలో అచ్చటచ్చట కనిపిస్తాయి. 1) ప్రచండ వర్షపాత వర్ణన (4-220), 2) సూర్యాస్తమయ వర్ణన (1-117), 3) హేమంత ఋతు వర్ణన (3-169-172) మొదలైనవి.

నారాయణామాత్యుడు వర్ణన లెంత ప్రౌఢంగా చేయగలడో అంత భావ సౌకుమార్యాన్ని ప్రదర్శించగలడు.

తే। గీ॥ కలయ గొమ్మలతో గూడి కాననమున
నుండు విటపుల ననిల చోరుండు పట్టు
కొని దళాంబరములు దోచుకొని యెననగ
పండుటాకులు గాడ్పుల పర్వరాలె (5-223)

ఈ పద్యంలో జారశృంగారాన్ని పాఠకుల మనో నేత్రాలకు పొడగట్టునట్లు చెప్పిన తీరు కవి భావ సౌకుమార్యానికి నిదర్శనంగా ఉంది.

భావనా పరంగా హంస వింశతి స్థాయి ఒక ఎత్తయితే భాషాపరంగా దీని స్థాయి మరీ ఉన్నతంగా ఉంటుంది. తత్సమ సమాసాల్తో, అలతి అలతి జాను తెనుగు పదాలతో, తెలుగు జాతీయాలను, సామెతలను మిళితంచేసి మనోహరంగా కవిత్వం చెప్పగల దిట్ట నారాయణామాత్యుడు.

తత్సమ పద రచన:-

సీ॥ ఎవని కీర్తి కుభృద్ధవ కుభృద్ధర బుధ
కరి సైంధవ సమిద్ధ హారిణరుచిర
మెవని మేధంబురుద్భవ కభుగ్ధవ విదూ
ద్భవ మరుద్భవ గురు ప్రతి విభూతి (పీఠిక—15)

జాను తెనుగు పద రచన :-

సీ। అత్త మామలుగన్న ఆరడి పుత్రుడు
బావ పరీక్షింప నేవగించు
మరదలు గాంచిన గరికరి నెంతురు
వదిన లెరింగిన వాసి చెడును (1–125)

జాతీయాలు :-

చీరచిక్కన (2-92), చీమ చిటుక్కుమన (3-40), జిగిబిగి, జిలిబిలి (5-16), చిటుక్కున (5-25), చిటిపొటి (5–26) మొదలైనవి.

సామెతలు :-

కాలుగాలిన పిల్లి క్రమముగాను (1—220)
ఉమ్మెత్తకాయ తినిన వెఱ్ఱి తెరగున (1-221
అడుగు దప్పిన యప్పుడె పిడుగు దప్పు (1-
నిక్షేపము గనిన దరిద్రుని యేపున (2-46)
తలవాకిట కాపురమయ్యె దానికిన్ (5-24)
ఊరు ముచ్చృత్తై వతగిన తోడు
బోతుల పివంబను మాక్క నిఉంటె (5-255)

మొదలైన సామెతలను జాతీయాలను సందర్భానుసారంగ ప్రయోగించి, భాషాసౌష్ఠవాన్ని చేకూర్చుటలో నారాయణామాత్యుడు నేర్పరి.

మాండలిక పద ప్రయోగాలు :- ఈ కవి కడప, నెల్లూరు ప్రాంతాలవాడు కాబట్టి అయా ప్రాంతాల్లో జానపదులు వాడే మాండలిక పదాలను హంస వింశతిలో ఎక్కువగా ప్రయోగించి యున్నాడు.

ఉ॥ మిన్నక యిట్లు భర్త తనమీద విరాళి వహింపకున్నయా
కన్నియ చూచి యీ ముదిబికారునితో పనియేమి నాకంచు

(3-208)

పై పద్యంలోని ముదిబికారు అనుపదం నెల్లూరు ప్రాంతాల్లో పనికి మాలిన వాడు, కొరగానివాడు, వ్యర్థుడు అను అర్థాల్లో వాడుతుంటారు. బహుశా భిక్షగాడు అనుదాని భ్రష్టరూపమే బికారు కావచ్చును. ఈ పదం ప్రయోగించడంలో నీచ భావం, ఏహ్యభావం కూడా కనిపిస్తుంటాయి. ఈ చులకన, ఈసడింపు భావాలే పై పద్యంలో జానపదనాయిక వాడిన ''ముదిబికారు'' అనుదానిలో కనిపిస్తుంది.

కాని హంస వింశతి (వావిళ్ళప్రతి) పరిష్కర్త శ్రీ మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి ఇది కవి ప్రయోగం కాదని, దానిని ''అరసికాగ్రణి'' అని మార్చాడు.1 కాని యిది సమంజసంగా కనుపించడంలేదు.

ఇట్టివే మరికొన్ని—అప్పప్పు—ఆశ్చర్యార్థకం (1-34) ఊరుబిండి (1-105) పచ్చడి అనే అర్థంలో నెల్లూరు ప్రాంతాల్లో వాడే మాండలికం. దీనినే ''రాతిమాంసం'' అని కూడ గొప్పలు చెప్పుకొనేందుకు గోప్యంగా వాడుతుంటారు.

బేడలు (1-105) పప్పు దినుసులు- ఇది రాయలసీమ నెల్లూరు ప్రాంతాల్లో వాడే మాండలికం. ఉదా:- కంది బేడలు పెసర బేడలు మొదలైనవి. పూర్వం రెండణాల నాణాన్ని కూడా ఈ ప్రాంతాల్లో బేడ అని వ్యవహరించడం గలదు.

బందాకోరు (2-38) దాసాను దాసుడు, సేవకుడు అనే అర్థాల్లో వాడే మాండలిక పదం. ఇట్లే బాతాకోరు - వ్యర్థ ప్రలాపాలు పలికేవాడు. జూటాకోరు-

1. హంస వింశతి (వావిళ్ళప్రతి) (గ్రంథపరిచయం) - పుట 48

అబద్ధాలు చెప్పేవాడు మొదలైన పదాలు వాడుకలో ఉన్నాయి. వీటిని బట్టి చూస్తే బంటా, బాతా, జూటా మొదలైన హిందుస్థానీ పదాలకు ''కోరు'' అను దానిని చేర్చి పై విధంగా వాడడం ఈ మాండలిక పదాల ప్రత్యేకతగా కనుపిస్తుంది. భావనాపరంగా, భాషాపరంగా హంసవింశతిని గూర్చిన స్థూల పరిచయమే యిది. అంతేగాక హంస వింశతికి విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల ప్రబంధంగా కూడా పేరుంది. హంస వింశతిలో నున్న ఇరవై రాత్రుల కథల్లోను కవి ప్రసక్తాను సారంగా ఏదో ఒక శాస్త్రవిషయాన్నో, వృత్తులు, వృత్తి పరికరాలనో, సాంస్కృతిక విషయాలనో ప్రస్తావించి, ఆయా శాస్త్ర పదాలను, వృత్తిపరికరాలను పట్టికలుగా నిచ్చియున్నాడు. ఇది కారణంగా దీనికి విజ్ఞాన సర్వస్వంగా కూడా పేరుంది. ఈ విషయాన్నే ''హంస వింశతి-విజ్ఞాన సర్వస్వం'' అనే అధ్యాయంలో విపులంగా చర్చించి, హంస వింశతిలో విజ్ఞాన సర్వస్వ లక్షణాలేవిధంగా ఉన్నాయో, హంస వింశతి విజ్ఞాన సర్వస్వమెలా అవుతుందో వివరించడం జరిగింది.



# హంస వింశతి - విజ్ఞాన సర్వస్వము

## రెండవ అధ్యాయం

### హంస వింశతి కావ్య స్వరూపం:

హంస వింశతి ప్రధానంగా కావ్యం కాబట్టి దానిలోని విజ్ఞాన సర్వస్వ లక్షణాలను పరిశీలించే ముందు కావ్యంగా దాని స్వరూప స్వభావాలెట్టివో తెలుసుకోవడం అవసరం.

ప్రాచ్య పాశ్చాత్య అలంకారికులు కావ్యాన్ని అనేక విధాలుగా నిర్వచించి యున్నారు. భరతుని తర్వాత జగన్నాథ పండితరాయలు వరకు వచ్చిన మన ప్రాచీనాలంకారికులు తమ పూర్వుల కావ్య నిర్వచనాలను పూర్వ పక్షంచేసి తమ తమ కావ్య నిర్వచనాలను ప్రతిపాదించారు. అదే విధంగా పాశ్చాత్య సాహిత్య విమర్శకులును ఎన్నో విధాల కావ్యాన్ని నిర్వచించి యున్నారు.

ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య విమర్శకులు కావ్యాన్ని గూర్చి ప్రతిపాదించిన నిర్వచనాలనన్నిటిని పరిశీలించి ఆధునిక సాహిత్యవేత్తలు కావ్యానికి ముఖ్యంగా మూడు గుణాలవసరమని తేల్చారు. అందులో మొదటిది సార్వజనీనకత, రెండవది సుందరమైన రచన, మూడవది భావనాత్మకమైన ఆహ్లాదాన్నిచ్చుట. 1

అంటే కావ్యం ఉపదేశాత్మకంగా నుండి, అక్షర రమ్యతతో అలంకార వైచిత్రితో, సుందరమైనశైలి సౌభాగ్యాలతో విలసిల్లి, రసాత్మకంగా ఉండాలని తాత్పర్యం.

---

1. సాహిత్య శిల్ప సమీక్ష-పుట 5

ఇదే విధంగా పాశ్చాత్య సాహిత్య వేత్తలును, ఎటువంటిది కావ్యమౌతుంది? అని ప్రశ్నించుకొని, కావ్యానికి ప్రధానంగా మూడు లక్షణాలుండాలని సిద్ధాంతీకరించి యున్నారు. అవి 1) సర్వజనాను రంజకత్వం, 2) సుందరమైన రచనము, 3) భావనాహ్లాదము. ఈ మూడు లక్షణాలున్న గ్రంథ మెంతటిదైనా కావ్యమనిపించుకొంటుది. ఏ కావ్యంలోనైనా సుందరమైన రచన (అలంకారిక వచనము) లోపించినా కావ్యత్వానికేమి భంగంలేదు. కాని మిగిలిన రెండు లక్షణాలు లేకుంటే గ్రంథమెంత సుందరశైలీ సౌభాగ్యాలతో ఉన్నా కావ్యమనిపించుకోదు.1

కాబట్టి పై విషయాలను పరిశీలిస్తే కావ్యంలో ఉపదేశం, చక్కని రచన, రసము అనే మూడు లక్షణాలు ప్రధానంగా ఉండాలని తెలుస్తుంది. దీనితో బాటు కావ్యగుణాలెన్నైనా ఉండవచ్చును. ఈ దృష్టితో చూస్తే హంస వింశతిలో ఈ కావ్య లక్షణాలెంత వరకు సరిపడతాయో పరిశీలించి, కావ్యంగా హంస వింశతి స్థాయి ఎటువంటిదో తేల్చవలసి ఉంది.

హంస వింశతి అంటే హంస చెప్పిన ఇరవైరాత్రుల కథలు అనే అర్థంలో దీనికీ పేరు వచ్చింది. అయితే దీనిలో కథలు మాత్రం పందొమ్మిదే ఉన్నాయి. రెండవరాత్రి మొదలు ఇరవయ్యోరాత్రి వరకు చెప్పినవే వేరు వేరు కథలు. అవి పందొమ్మిది మాత్రమే. మొదటి రాత్రంతా జారశృంగారానికి మోహం పురులు గొలిపితే నిజకేళి వేశ్మసీమకు బయలుదేరిన హేమావతీ భామకు జారశృంగారం మంచిదిగాదని, ప్రమాదకరమని హంస నీతిని బోధించడమే చెప్పబడింది.

ఇటువంటి జారశృంగారానికి సంబధించిన కథలతో కూడిన ఈ గ్రంథంలో ఉపదేశమేమిటి? ఒక వేళ హంస వింశతి ఉపదేశాత్మకమే అయితే అది ఏరూపంలో ఉంది, అది ఎలా ప్రతిపాదించబడింది? అనే విషయాలు పరిశీలించాల్సి ఉంది.

హంస వింశతి బూతు కథలద్వారా నీతి నుపదేశించిన కావ్యం. ఇటువంటి కావ్యాల యొక్క ప్రత్యేకతేయిది. ప్రజలెటువంటి సాహిత్యాన్ని ఆదరిస్తున్నారో పరిశీలించి కవి సమాజం యొక్క స్థితిగతులను కూడా దృష్టిలో పెట్టుకొనే కావ్య

---

1. సాహిత్య శిల్ప సమీక్ష-పుట 4

రచనకు పూనుకొంటాడు. నాటి సమాజంలో జారశృంగారం అధికంగా ఉండేది. రాయలకాలం నుండి జనంలో ప్రబలుతూ వచ్చిన శృంగార అభినివేశం నాయక రాజులకాలం నాటికి మరీ ఎక్కువైంది. అందుకనే ఆకాలంలో వచ్చిన విజయ విలాసం, రాధికా సాంత్వనం, సత్యభామా సాంత్వనం మొదలైన ప్రబంధాల్లో శృంగారం విచ్చల విడిగా వర్ణింపబడింది. అంటే నాటి జనం అటువంటి సాహిత్యాన్నే ఆదరించారు. అంతేగాక మతాల పేరట సమాజంలో వెలసిన బసివిలు. దేవదాసీలు వేశ్యలుగా మారడంతో జారశృంగారం కూడా విచ్చలవిడిగా సాగుతుండేది. ఇది కారణంగాఎన్నో కుటుంబాలు బుగ్గిపాలౌతుండేవి. జార శృంగారం అన్నా, అటువంటి సాహిత్యమన్నా ప్రజలు ఎక్కువగా మక్కువ చూపుతుండే రోజులవి. అందుకే జారశృంగార కథలతో కూడిన శుకసప్తతి వెలుగులోకి వచ్చింది. ఇది అనతికాలం లోనె బహుళ ప్రచారాన్ని పొందింది కూడా. శుక సప్తతి వచ్చిన దాదాపు వంద సంవత్సరాల్లోనే మళ్ళీ అటువంటిదే అయిన హంస వింశతి రావడం దీనికి నిదర్శనం. ఆధునిక సామాజిక చైతన్య ఛాయలు ప్రజలపై పడని కాలంలో, జారశృంగార మన్నా, అటువంటి కథలన్నా, ఆశ్చర్యకరాలు, అద్భుతాలు అన్నా జనులు విప రీతంగా మోజు పడుతున్న రోజుల్లో హంస వింశతి వ్రాయబడింది.

నారాయణామాత్యుడు జారశృంగార కథలను కావ్య వస్తువుగా నెన్నుకొను టలో ఇంకొక విశేషం కూడా లేకపోలేదు. హంస వింశతిలో శాస్త్రాద్యనేక విషయాలు ప్రసక్తానుసారంగా ప్రస్తావించబడ్డాయి. నాటి ప్రజలు మోజుపడుతుండే జారశృంగారాన్నే కథా వస్తువుగా చేయడంతో వాటితో బాటు చోటు చేసుకొన్న శాస్త్రాద్యనేక విషయాలు కూడా ప్రచారంలోకి వస్తాయని కూడా కవి ఉద్దేశం కావచ్చును. ※

అయితే జార శృంగారానికి సంబంధించిన కథలద్వారా నీతినుపదేశించడం ఎంటి అనే ప్రశ్నవస్తుంది. ''ముల్లును ముల్లుతోనే తీయాలి'' అనేది తెలుగులో ఒక సామెత అంటే ఏ కార్యాన్ని దేనితో సాధించాలో దానితోనె సాధించాలి గాని, తదితరాలతో అది సాధ్యంకాదని దీని భావం. ఇచ్చట కవి తనకావ్యం ద్వారా

※ ఈ విషయం హంస వింశతి - కావ్యవస్తువనే ప్రకరణంలో వివరంగా చర్చించుట జరిగింది.

జార శృంగారం సమాజ హానికరం అని చెప్పదలచుకొన్నాడు. జార శృంగారం ప్రమాదకరమంటూ మళ్ళీ అవే కథలను చెప్పడమేంటి? అనేది మరొక ప్రశ్న. ఇది మానసిక తత్వ పరిశీలనకు సంబంధించిన విషయం. ఎవరు దేని నెక్కువగా కోరుకొందురో వారు దానితోనే ఉపహతులౌతుంటారు. ఇది లోక సహజం. ఈ విషయాన్ని చక్కగా నెరిగినవాడవడం చేత కవి నాటి సమాజంలో ప్రజలెక్కువగా మక్కువ జూపుతున్న జార శృంగారం ప్రమాదకరమని చెప్పేందుకు అటువంటి కథలనే ఆలంబనంగా తీసికొన్నాడు.

హంస వింశతిలో నారాయణామాత్యుడు నీతినుపదేశించడంలో శాస్త్రీయమైన పద్ధతినే అవలంబించాడు. ఆప్తుడు బోధించే నీత్యుపదేశం ఆగమతుల్యమై ఆచరణీయమని పెద్దలంటారు. ఈ విషయాన్నే భోజుడీ క్రింది శ్లోకంలో వివరించాడు.

"యథాప్త వచనం తద్ధి జ్ఞేయమాగమ సంజ్ఞయా
ఉత్తమం మధ్యమంచాథ జఘన్యంచేతి తత్త్రిధా"1

ఆప్తుడనగా యదార్థవక్త. ఇతని మాటలు వేద వచనాలవలె ప్రమాణాలు. ఇటువంటి ఆప్తవచనం ఉత్తమం, మధ్యమం, జఘన్యం అని మూడు విధాలు.

మరలా ఉత్తమమైన ఆప్తవచనం విధి, నిషేధ రూపాల్లో రెండు విధాలుగా ఉంటుంది. మధ్యమమైన ఆప్తవచనం నిర్దిష్టవక్తృత్వం, అనిర్దిష్టవక్తృత్వం అని రెండు విధాలు. అదే విధంగా జఘన్యమైన ఆప్తవచనం కామ్యము, నిర్దిష్టమని రెండు విధాలుగా ఉంటుంది.

హంస వింశతిలో విధి, నిషేధ రూపాల్లో ఉత్తమమైన ఆప్తవచనంద్వారా నీతి ప్రతిపాదింపబడింది. కవి దానికి తగినట్లుగానే గ్రంథారంభంలోను, గ్రంథాంతంలోను చక్కని వేదికను నిర్మించుకొని యున్నాడు.

1. S. K. B – 2–40

హంస వింశతిలో ప్రధాన నాయిక అయిన హేమావతికి, ఆమె భర్త విష్ణు దాసునకు హంస ఆప్త మిత్రము. ఇది యదార్ధవాది. బహు చమత్కారంగా మాటాడగల నేర్పుగలది. హేమావతికి సర్వస్వం హంసయే విష్ణుదాసునకు హంసపై ఎనలేని నమ్మకం. వీరిరువురకు హంస ఎంత ఆప్తమిత్రమో కవే ఈ క్రింది పద్యాల్లో వర్ణించి యున్నాడు.

తే॥ మణిఖచిత హేమ పంజర మధ్యమమున
పేర్మి నాబాల్యముగ పెంచినట్టి
హంస రాజంబుగదియంగ నరిగి, తనదు
పయన మెరిగించి ఇంటిలో భద్రమనుచు (1–110)

కం॥ చెప్పంగ దగినమాటలు
సెప్పి మరాళంబు పనుప చిత్తంబు నసొం
వుప్పతిల...................... (1–111)

విష్ణు దాసుడు ఇల్లు విడిచి వ్యాపారార్ధం దూరదేశాల కేగాడు. విష్ణుదాసుడు తాను చిన్నతనం నుండి ప్రేమతో పెంచుకొన్న హంస వద్దకు వచ్చి, తన ప్రయాణ విషయం తెలిపి, ఇంటిలో భద్రమని చెప్పాడు. అంతేగాదు ''మరాళంబు పనుప చిత్తంబున సొంపుప్పతిల'' అతడు బయలు దేరాడు. విష్ణుదాసునకు హంసపై ఎంత నమ్మకం. హంస సరే పోయిరావయ్యా అంటే అతను సంతోషంతో బయలుదేరాడట. ఇంతకంటె ఆప్తులెవరుంటారు?

ఇక హేమావతి విషయంలోను హంస ఇదేవిధంగా ఆప్తమిత్రమే. చిత్ర భోగ మహారాజును కలిసేందుకు పోవాలనుకొన్న హేమావతి ఒకరోజు సాయం కాలం చక్కగా అలంకరించుకొని తమకంతో వచ్చి హంసముందు నిలిచింది. కాని హంస ఏమంటుందో అనే భయం ఆమెకు లేకపోలేదు. ఒకవేళ హంస కాదంటే దాని మాట కాదని హేమావతి పోలేదు. వారిద్దరి మధ్యగల బంధం అటువంటిది. ఆబంధాన్ని కవి ఈ విధంగా వర్ణించాడు.

తే॥ తనదుప్రాణంబు దైవంబు తల్లిదండ్రి
యనుగు చెలియైన యలరాజ హంస మున్న
దివ్య నవరత్న ఖచిత దేదీప్య మాన
కనక పంజరమెక్కింత గదిసి నిలిచె (1-122)

హేమావతియే హంస వద్దకు వచ్చి నిలచింది. హంస నిలువమన లేదు. మరి ఎందుకు నిలువాలి? ఆమె పోవాలన్నను అక్కడ అడ్డగించే వాళ్ళెవరూలేరే అంటే అలాగాదు. హేమావతికి తల్లి దండ్రి అనుగు చెలి అన్నీ హంసయే. ఈ విధంగా హంస తనకు పరమాప్తం. ఇటువంటి ఆప్తమిత్రానికి తన కోరిక తెలుపకుండా, దాని సలహా తీసుకోకుండా పోవడం ఎలా? అనే ఆలోచనే హేమావతిని అక్కడ నిలిచేటట్లు చేసింది— ‘‘శిఖిపింఛదళాన్వితయైన సౌమ్యగతి మించుక వంచి ఆత్మతా దలచిన కార్యమెల్ల తిన్నని కల్కి పల్కుల తెలిపింది.’’ అప్పుడు రాజ హంస సుదతీమణిని కనుగొని పక్షయుగ్మం కదిలించి, మనసులో చింతించి తన ప్రాణసఖియైన హేమావతిని జారశృంగారం పట్ల విముఖురాలిని చేసేందుకు ప్రయత్నించింది. ఇదే ఈ కావ్యంలో నీతి ఉపదేశానికి ఆరంభం.

ఈ ఘట్టంలో హంస హేమావతి విష్ణుదాసులకు ఎంత ఆప్తమిత్రమో కవి చక్కగా వర్ణించాడు.

హంస చాలా గడుసరి. ప్రౌఢ గంభీరమైంది కూడా. చిత్రభోగ మహారాజుపై మరులు గొలిపేందుకు రాజదూతిక హేల అప్పటికి కొన్నిరోజుల ముందు నుండే హేమావతివద్దకు రాకపోకలు సాగిస్తూ వచ్చింది. హేలచెప్పే బలవంతపు కబుర్లతో యవ్వనం పొంగులో, చిలిపిగా, అమాయకంగా ఉండే హేమావతి మనసు మారడం కూడా హంస గమనించక పోలేదు. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొనే విష్ణుదాసుడు ‘‘ఇంటిలో భద్రమని’’ చెప్పిపోయాడు. ఇవన్నీ హంసకు తెలుసు. ఇప్పుడు హేమావతి ఎందుకు వచ్చి నిలిచిందో కూడా హంసకు తెలుసు. అయినా హంస తొందరపడి హేమావతినావలేదు. హంస ఎంత గంభీరమైంది. ఎవరైనా ఏదైనా కోరివచ్చి సంకోచిస్తున్నప్పుడు వారితోనే ఆ కోరికను చెప్పించడం గుణవంతుల లక్షణంగదా!

ఈ విధంగా హంస హేమావతీ విష్ణుదాసులకు పరమాప్త మిత్రం. ఆప్త వచనం వేదం వలె ప్రమాణం కాబట్టి ఆప్తమిత్రమైన హంస ద్వారా హేమావతికి

నీతిముపదేశించడం జరిగింది. ఆప్త వచనంలోను విధి, నిషేధ రూపాలు రెండూ ఉత్తమ మార్గాలు కాబట్టి హంస వింశతిలో నీత్యుపదేశం ఈ రెండు మార్గాల్లోను కనిపిస్తుంది.

రాజదూతిక హేల చెప్పిన మాటలకు ఆకర్షితురాలైన హేమావతి భర్త వ్యాపారార్థం దూరదేశాలకు పోగా విజశేళీ వేశ్మ సీమకు బయలుదేరింది. తిన్నగ వచ్చి హంస వద్ద నిలిచింది. తన మనసులోని మాట కల్కి పల్కుల హంసకు తెలిపింది. ఆమాటలు విన్న హంస అందుకు చింతించి, కులకాంతల కటువంటి కోరికలుండరాదని, అది సమాజవాతికరమని నీతి గరపనారంభించింది.

ఉ॥ అక్కట భర్త కాపురము నారడిపుచ్చిన్నపాలమౌళితో
జొక్కి రమించు నందులకు జొచ్చినదావక బంధువర్గముల్
దక్కవచేతురమ్మ చరిత వ్రితముల్ చెడునమ్మ జాతికిం
బక్కన నిందజెందు తలవంపులు దెత్తురటమ్మ మానినీ (1-124)

పర పురుష శృంగారాన్ని కోరడం భర్త కాపురాన్ని అరడి పుచ్చడమే. దాని వలన బంధు జనుల్లో చులకనౌతావు. ఇది జాతికి తలవంపులు తెచ్చే పని. మానినులైన వారికిటువంటి కోరికలు కూడదు. అని హంస హేమావతికి చెప్పింది.

సీ॥ అత్తమామలు గన్న అరడి పుట్టును
బావ పరీక్షింప వేవగించు
మరదులు గాంచిన గలికరి నెంతురు
వదిన లెరింగిన వాసి చెడును
బంధువుల్ గనినచో పట్టి నిందింతురు
తోడి కోడలు చూరనాడుకొనును
పతికనుగొన్నచో ప్రాణహాని యొనర్చు
వాడ వాడెరిగిన వన్నె దరుగు

తే॥ అరయ నిదిగాక యన్నిట నాడుపుట్టు
పుట్ట పాపంబు, పుట్టిన పుట్టి నింటి
కేని మరి చొచ్చినింటికేని కీర్తి ఘనత
దేక యపకీర్తి దెత్తురే తెరవ లెచట (1-125)

అని జారశృగారంలో ఉండే ఇబ్బందులు, ప్రమాదాలు చెప్పి హితబోధ చేయ నారంభించింది. భర్త చూచిన ప్రాణానికే ముప్పని హెచ్చరించింది. అంతకూ చలించని హేమావతిని జూచి హంస... ............

సీ॥ పంక్తి కంఠుని మోహ పరితాప మెంచెనే
భువన మాత జగత్ప్రపూత సీత
యల పుళిందుని బొంద నాసక్తి జెందెనే
ప్రియా హితామి తనయ భీమతనయ
నహుషుని విరహంపు తహతహల్బూచెనే
సౌందర్య సద్గుణ చర్య ఇంద్రుభార్య
మరి సింహబలుని పెన్మాయల జిక్కెనే
యారడి పనిబూని యాజ్ఞసేని

తే॥ మునుపటి పతివ్రతలు మహి మూర్ఖచిత్తు
లైన దుర్జనులతి ఘోర నూనసాయ
కాస్త్ర జర్జరితాత్ములై యానపడిన
మాన ముడిపిచ్చు కొనిరటే మచ్చెకంటి (1-127)

అని పురాణేతిహాసాల్లోని పతివ్రతల చరిత్రల నుదాహరణంగా చూపింది. పతి హిత భక్తిచే వెలయు పద్మ దళ ప్రతిమాన నేత్రికున్ వ్రతము లాచరింప కయే పుణ్యములబ్బునంది. పతిని తిరస్కరించి పర భర్తల చెందు వారి పుణ్య ములు గతజల సేతుబంధనములని పలికింది. (1—128) తుదకు.........

కం॥ పతి సేవయె భూషణములు
పతి సేవయె జీవనంబు భామామణికిం
పతి సేవయె సువ్రతములు
పతి సేవయె యిహము పరము భాగ్యములరయన్

కం॥ లలిజాగ్రత్స్వప్నసుషు
ప్తులను మనోవాక్శరీరముల చేవే
శలనైన నతులు పరపురు
షుల గోరిన వన్నెలేదు చూవె ధరిత్రిన్ (1-130)

అని నీతి వచనాలు నూరిపోసింది. ఇంత వరకూ ఆప్త మిత్రమైన హంస పరపురుష సంగమాసక్త చిత్తమైన హేమావతికి దానిలో గల ప్రమాదాలను వివరించి అది తగనిపని అని నిషేధ రూపంలో హితబోధ చేసింది.

ఆప్త వచనం ఆగమంవలె ప్రమాణమూ, ఆచరణీయమూ అయినా, అప్పటికే హేల ప్రాబల్యానికి లొంగి పోయిన హేమావతికి ఇవేమి నచ్చలేదు. హంస మాటలు ఆమె చెవుల్లో బాణాలై దూరాయి. తత్ఫలితంగా హేమావతి హంసను క్రూర కటాక్షణాలతో కొర కొర చూచింది.

''అంత నారాజహంస.... మదీరిత సునీతి వాక్యంబులు దీనికి పరుషంబులై తోచుచున్నవి. సమద మదన ప్రదర వేదనా దోదూయమానంబయిన దీని మానసంబు సామంబునగాని చక్కబడదని'' ఎంచి అప్పుడు మరొక ఎత్తు వేసింది. ఇక్కడినుండి హంస గడుసుదనం, ప్రౌఢతనం, చమత్కారం తెరచాటుగా మెర మెరలాడుతూ ఉంటుంది. ఆప్తమిత్రమైన హంస నీత్యుపదేశం ఇచ్చట నుండి విధిరూపంలో సాగింది.

ఇక్కడ నుండి హంస చెప్పిన కథలో హేమావతిని చిత్రభోగుని కలిసేందుకు పొమ్మనే చెబుతుంది. కాబట్టి హంస వచనం విధియే. కాని కథలు చెప్పుటలో హేమావతి పోయేందుకు వీలులేని పరిస్థితుల్ని కల్పిస్తుంది. అలా చేయడం ఆమెను నివారించేందుకే కాబట్టి ఇచ్చట వక్త వివక్షననుసరించి విధి నిషేధ రూపంలో పర్యవసిస్తుంది.

ఇకనుండి హంస చెప్పిన కథల్లో రెండవ రాత్రి కథ జార శృంగారం లేని చక్కని నీతికథ. ఈ కథలో ఒక నక్క తొందరపడి ఏతానికి కట్టినవారు (చర్మపు పట్టి) కొరికి బెట్టుతప్పి గుండెకు తగిలి మరణించింది. కాబట్టి తాము చేయ బోయే పని వల్ల కలిగే ఫలితం కీలో, మేలో తెలుసుకొని మరీ చేయాలనే ఒక కొత్త ఆలోచన్ని హేమావతిలో కలిగించి, అప్పటి వరకు ఆమె మనసును ముసురుకొని ఉన్నవలపు తలపుల్ని ప్రక్కకు నెట్టేందుకు కొంత అవకాశాన్ని కల్గించింది. తొందర పడితే నక్కకు వలె ప్రాణహాని తప్పదని హెచ్చరించింది.

మూడవ రాత్రి కథ నుండి ఇరవయ్యో రాత్రి కథ వరకు సాగిన ప్రతి కథలోను జారశృంగారం వర్ణింప బడింది. జారశృంగార వాంఛలకు లోనైన నాయిక భర్త ఏదో పనిమీద ఇతర ప్రాంతాలకు పోగా పర పురుషునితో రమించు చుండడం. అదే సమయంలో భర్త వచ్చినట్లు చెప్పడం. హేమావతిని నీ విషయం గూడా యింతేనని హెచ్చరించడమే. హేమావతినే గాదు సమాజంలో ఏ స్త్రీ పనైనా యింతే.అది తగని పని అని కచ్చితంగా చెప్పడమే. రాజులు తమంత తాము పరదారల కోసంపోరాదని కామశాస్త్ర వేత్తలు నిర్దేశించి యున్నారు. అలాంటప్పుడు నీవంటి లావణ్యవతి మాత్రం రాజువద్దకు పోవచ్చునా? నీవంటి అందగత్తె అంత చులకనా? అని హేమావతిలో రోషాన్ని కలిగించేందుకు ప్రయత్నించింది.

నాయిక విటునితో రమించే సమయంలోనే భర్త వచ్చినట్లు చెప్పి, అప్పుడామె ఏమిచేయాలి? ఎలా తప్పించుకోవాలి? నీవైతే ఏంచేస్తావు? అని హంస శరవరం పరగా కురిపించే ప్రశ్నల తాకిడితో ''మేయబోయి మెడకు తగిలించు కొన్నట్లు'' ఇదంతా ఎందుకు లేబ్బా అనే మానసిక పరివర్తన హేమావతిలో కల్గించేందుకు ప్రయత్నించింది. ఈ విధంగా పురి పురీ మెలివిప్పి సాగలాగి తుదకు హేమావతి మనసు మార్చగల్గింది హంస. దీనికిఅనుగుణమైన కథా కలాపాలతో ఊదర పెడితేగాని చివరకు తలపెట్టిన దెబ్బ తగిలి హృదయం అసలు కుదులోకి చేరి వదిల పడదని హంస వేసిన ఎత్తు నూటికి నూరుపాళ్ళు పారింది.

హంస వింశతి చివరి భాగంలో పర పురుషాయత్త చిత్తమైన హేమావతి రాయంచ పూని చెప్పినట్టి నయ వాక్యాల వలన సన్మనీష అయింది. (5-362) పర పురుష సంగిమం ఇహ పరసుఖ దూరం కావున పాతివ్రత్య స్ఫురణ గల సతులు మది కోరరని నిశ్చయించు కొన్నది. (5-364)

అదే విధంగా పరదారాసక్త చిత్తుడైన చిత్రభోగ మహారాజును- హేమావతి కాంతా వృత్తాంతమంతా నిజదూతిక ద్వారా విని కంపిత శిరస్కుడై కొంత తడవు చింతించి, తన మనస్సులో........

ఉ॥ మున్నల రావణాదులు సమున్నతి సాధ్వులఁగోరి యేమిసా
ధ్యోన్నతి జెందిరిట్లగుట నుర్విజనావళులన్య కాంతలం
బన్నుగ గోరరాదు తగు పాతకమంచు-తలంచాడు. (5-374)

ఈ విధంగా హంస వింశతిలో ప్రధాన భూమికలైన హేమావతీ చిత్ర భోగులందు మానసిక పరివర్తనం కలిగించి జారశృంగారం సమాజ హానికరం అది తగని పని అనే నీతిని కవి సమాజానికందించాడు. ఇచ్చట ఆప్తమిత్రమైన హంస ద్వారా విధి, నిషేధ రూపాల్లో నీతినుపదేశించడం జరిగింది.

కావ్యానికుండవలసిన ప్రధాన లక్షణాలలో అతి ముఖ్యమైంది కావ్యం భావనాత్మకమైన అహ్లాదాన్ని కలిగించేదిగా ఉండడం. అంటే కావ్యం రసాత్మకంగా ఉండాలన్నమాట.

హంస వింశతిలోని కథలన్నిటిలోను జారశృంగారమే వర్ణింపబడింది. రస దృష్టితో ఈ కావ్యాన్ని చూస్తే దీనిలో వర్ణించిన శృంగారం రసమా? రసాభాసమా? అనే ప్రశ్నలుదయిస్తాయి. అలంకారికుల మతానుసారం హంస వింశతి కథల్లో వర్ణించిన శృంగారం రసమనుట పొసగదు.

మనోహరమైన శృంగార రస ప్రతిపాదకం కావ్యంలో అనుకార్యముగా ఉత్తమ పక్రృతులైన స్త్రీ పురుషుల కథయే ఇతివృత్తంగా ప్రయోజనకారి అవుతుంది గాని నీచప్రకృతుల, స్వారస్య రహిత జీవనుల కథలుపాదేయములు కావని మొట్ట మొదట భరతుడే నిర్దేశించి యున్నాడు.1

ఈదృష్టితోహంస వింశతిని పరిశీలిస్తే దానిలో వర్ణించిన శృంగారం రసమనుట కేమాత్రం అవకాశం లేదు. ఎందుకంటే హంస వింశతిలో ఉపకథలందు వచ్చు నాయికా నాయకులు ఉత్తమ ప్రకృతులైన స్త్రీపురుషులు కారు. వీరందరు స్వారస్య రహిత జీవనులైన జానపదులు. ఇట్టివారితో గూడిన ఈ శృంగారకథలు శృంగార రస ప్రదిపాదకానికి ఉపాదేయములు కాజాలవు. కాబట్టి హంస వింశతిలోని కథల్లో వర్ణించిన శృంగారం రసమనుట కవకాశం లేదు.

హంస వింశతి ప్రధాన కథలో నాయకుడు చిత్ర భోగ మహారాజు. ఇతడు ఉత్తమ ప్రకృతియే. ఇతడు హేమావతిపై మరులు గొనుట కొంత వర్ణింపబడింది గాని అది శృంగారమనుటకు వీల్లేదు. అది కేవలం శృంగార భావ శబలత

1. సా.శి.స. పుట—166

మాత్రమే. పైగా ఇతడు కోరింది పరదార అయిన హేమావతిని. ఈ విధంగా చూస్తే ఈకావ్యం నందు రసరూపమైన మనోహర శృంగారం కనుపించదు. అట్లయిన కావ్యం రసాత్మకం కాబట్టి హంస వింశతి కావ్యత్వానికే భంగం వాటిల్లుతుంది.

శృంగారమనేది మానవులకేగాక పశు పక్ష్యాదులకు సైతం ప్రకృతి సిద్ధమైంది. సృష్టి క్రమమంతా దీనిమీదే ఆధారపడి ఉంది. అటువంటప్పుడు ఉత్తమ ప్రకృతులుగల స్త్రీ పురుషుల శృంగారమే రసమనుకొంటే ప్రకృతిలో మిగిలిన శృంగారాన్నంతా ఏమనాలి? అనేది ప్రశ్న. దీనికి సమాధానంగా ఇటువంటి శృంగారమంతా రసాభాస మౌతుందని అలంకారికులు చెప్పియున్నారు. కావ్యం నందు శృంగారాది వర్ణనలవల్ల భావనాత్మకమైన రసానందమెట్లు కలుగుతుందో అదేవిధంగా రసాభాసంవల్ల కూడా తద్విధమైన ఆనందమే కలుగుతుంది. కాబట్టి దీనిని నిరాకరించక అలంకారికులు రసాభాసానికి కూడా కావ్యాల్లో సముచిత స్థానాన్నే కల్పించారు.1

కావ్యాల్లో ఆభాసరూపమైన శృంగారాన్ని ప్రతిపాదించడం గలదు. ఇది నాలుగు తీరులుగా ఉంటుందని సాహితీ వేత్తల అభిప్రాయం. మొదటిది ఏకత్రైవానురాగం :- దీని యందు స్త్రీ పురుషులనే ఉభయాలంబనాల్లో ఒక ఆలంబనయందు ప్రీతి, రెండోదానిలో వైముఖ్యం కనిపిస్తుంది. ఈ విధంగా అన్యోన్యానురాగంలేని స్త్రీ పురుషుల నాలంబనంగా జేసి రచించే కావ్యాల వల్ల గలిగే ఆనందం శృంగారం యొక్క ఆభాసరూపం వల్లనేగాని, శృంగార రసం వల్ల గాదు. ఇటువంటి వాటికి భారతంలోని కీచకవధ, మనుచరిత్రలోని వరూధిని ప్రవరుల సన్నివేశం మొదలైన వానిని దృష్టాంతాలుగా చూపవచ్చును.

రెండోది మ్లేచ్ఛగతమైన శృంగారాభాసం:- దీని యందు ఉభయాలంబనాల్లో ప్రీతి ఉన్నా స్త్రీ పురుషులు అనాగరికులు, పామరులుగా ఉంటారు. కావ్యంలో శృంగార రస ప్రతిపాదకం ఉత్తమ ప్రకృతులైన స్త్రీ పురుషుల వల్లే కలుగుతుందని అలంకారికుల మతం. మ్లేచ్ఛులు నీచ ప్రకృతులు కాబట్టి వీరి శృంగారం రసాభాసంగానే పరిగణింపబడింది.

---

1. సా.శి.స. పుట–170

మూడోది తిర్యగ్గతమైన శృంగారాభాసము. దీనియందు పశుపక్ష్యాదులు ఆలంబనంగా ఉంటాయి. వీటికి మాటల రూపమైన భాష లేనందున, మాటల వలన వ్యక్తం కాదగిన రస భావస్ఫురణమునకు, దానిని పోషించేందుకు అవకాశం లేదు. కాబట్టి వీటి శృంగార చేష్టలు ఆభాస రూపమైన శృంగారమే అవుతుందని సాహితీవేత్తలు భావించియున్నారు.

నాల్గవది అనుచిత ఉభయాలంబన నిష్ఠమైన శృంగారం. ఇది పరకీయ సంయోగం, ముని గురుపత్నీ సంయోగం అని రెండు విధాలు. ఇందు మొదటి దానికి అహల్యా సంక్రందనం ఉదాహరణంగా చూపబడింది. శుక సప్తతి, హంస వింశతి మొదలైన కావ్యాలాన్నీ ఈ కోవకు చెందినవే. రెండోదానికి తారా శశాంకం మొదలైన కావ్యాలు ఉదాహరణాలు.

అనుచిత ఉభయాలంబన నిష్ఠమైన శృంగారంలో నాయికా నాయకుల్లో ఇరువురకు ప్రీతిఉన్నా ఆ శృంగారం ధర్మవిరుద్ధం అనౌచిత్యం కాబట్టి అదికూడా శృంగార రసాభాసంగానే పరిగణింప బడుచున్నది.

హంస వింశతిలో మూడవ రాత్రి మొదలు ఇరవయ్యో రాత్రి వరకు గల కథల్లో జారశృంగారమే వర్ణింప బడింది. ఉదాహరణకు మూడోరాత్రి కథలో హేమరేఖ అనే నాయిక తన భర్త ఏదో పనిమీద వేరే గ్రామానికి పోగా తాను మోహించిన గుణగుప్తుడను ఉపనాయకునితో రతిక్రీడలు జరిపింది. ఇదిపరదారా సంయోగము. ఇదే విధంగా మిగిలిన అన్ని కథల్లో గూడా పరదారా సంయోగమే వర్ణితము. ఈ కథల్లో వర్ణించిన శృంగారం ఉభయాలంబన నిష్ఠమైనా, ఇందలి స్త్రీ పురుషులు ఉత్తమ ప్రకృతులుగారు. సౌరస్యజీవన రహితులైన జానపదులు. అంతేగాక ఇక్కడ జరుగుతుండే జార శృంగారం ధర్మవిరుద్ధం, అనుచితం కాబట్టి ఈ కథల్లో వర్ణించినదంతా శృంగార రసాభాసమనే తేలుతుంది.

అయితే కావ్యాల్లో శృంగార రసాదివర్ణనల వల్ల భావనాత్మకమైన రసానంద మెలా కలుగుతుందో, ఆదేవిధమైన ఆనందం రసాభాసం వలన కూడా కలుగు తుందని సాహితీవేత్తలు చెప్పడం వల్ల, రసానికిచ్చిన సముచిత స్థానాన్నే రసాభాసానికి కూడా కావ్యాల్లో కల్పించడం వల్ల హంస వింశతిలో ఈ లక్షణం కూడా సమకూరినట్లయింది.

కావ్య వస్తువు:- కవి తన కావ్యంలో వర్ణించ దలచుకొన్న ఇతి వృత్తాన్నే కావ్య వస్తువు అంటారు. అంటే స్థూలంగా కవి చెప్పదలుచుకొన్న కథ అని అర్థం.

భరతుడు దృశ్య కావ్యాలనుగూర్చి చెప్తూ నాటకంలో ఇతివృత్తం ప్రఖ్యాతమైందిగా ఉండాలని చెప్పాడు. ప్రఖ్యాత ఇతివృత్తం అంటే రామాయణ భారతాది ఇతిహాసాల నుండిగాని, లేదా పురాణాదులందుగాని ప్రసిద్ధంగా ఉన్న కథా భాగాలను కావ్య వస్తువుగా స్వీకరించడం. భరతుడు ఈ నిబంధన దృశ్య కావ్యాలకే నిర్దేశించినా, శ్రవ్య కావ్యాలకు సైతం దీన్ని అన్వయించడం జరిగింది. శివకవుల యుగం తప్పిస్తే నన్నయ మొదలు దాదాపు ప్రబంధ యుగం వరకు మన సాహిత్యంలో వచ్చిన కావ్యాల్లోని ఇతివృత్తాలన్నీ పురాణేతిహాసాల్లో ప్రసిద్ధాలే.

మన ప్రాచీనాలంకారికులు కావ్య వస్తువును రెండు విధాలుగా విభజించి యున్నారు. 1) ప్రఖ్యాతం: పురాణేతిహాసాల్లోని కథాభాగాన్ని తీసికొని, కవి తన రచనా చమత్కృతితో అందంగా తీర్చి దిద్దిన కావ్యం ప్రఖ్యాత ఇతివృత్తం కలది. 2) ఉత్పాద్యం: కవి ప్రఖ్యాత ఇతివృత్తాన్ని స్వీకరించక, స్వకపోల కల్పితమైన కథనాలంబనంగా కావ్యాన్ని నిర్మిస్తే అది ఉత్పాద్యమౌతుంది.

భామహుడు ఇతివృత్తాన్నిబట్టి కావ్యాన్ని విభజిస్తూ ''వృత్తదేవాది చరితశంసి చోత్పాద్య వస్తుచ కళాశాస్త్రాశ్రియం చేతి చతుర్ధా భిద్యతేపునః'' 1. అని చెప్పి యున్నాడు. అంటే దేవతలు మొదలైన వారి చరిత్ర మితివృత్తంగా గల కావ్యం ఒక విధం. ఇది ప్రఖ్యాతం. రెండోది కల్పితకథ ఇతివృత్తంగా గలది. ఇది ఉత్పాద్యం. ఇవి మరలా కళలనాశ్రయించి, శాస్త్రాలనాశ్రయించి నాలుగు విధాలుగా ఉంటాయి.

హంస వింశతిలోని కథలన్నీ కవి కల్పితాలే కాబట్టి ఇది ఉత్పాద్య కావ్య వస్తువుతోగూడింది. కావ్యం కళాశ్రియమని, శాస్త్రాశ్రియమని మళ్ళా రెండు విధాలుగా ఉంటుందని భామహుడు పై శ్లోకంలో చెప్పాడు. ఈ రెండు లక్షణాలు కూడా హంస వింశతిలో కనిపిస్తాయి. అంటే హంస వింశతి ఒక విధంగా కళాశ్రయమైన కావ్యం మరో విధంగా శాస్త్రాశ్రయమైన కావ్యంకూడా అవుతుంది.*

1. K. A. 1-17

* ఈ విషయం 'హంస వింశతి—కావ్య శాస్త్రం, శాస్త్ర కావ్యం' అనే శీర్షికలో విపులంగా చర్చించడం జరిగింది.

విజ్ఞాన ప్రసారం:- హంస వింశతి ఇరవై కథలతో గూడిన చక్కని కథాకావ్యం. అయితే కథా సందర్భాన్ని బట్టి కవి ప్రసక్తానుసారంగా లౌకికాలు సాంకేతిక శాస్త్రీయాలైన అనేక విషయాలను ప్రస్తావించి యున్నాడు. దీనిని బట్టి కావ్యాన్నీ విధంగా తీర్చి దిద్దడంలో కవి విజ్ఞాన ప్రసారాన్నిగూడా ఆశించియుండ వచ్చునని తెలుస్తుంది.

హంస వింశతి నాటి సమాజం ఇటువంటి కథల నెక్కువగా ఆదరిస్తుండేదని ముందుగానే చెప్పబడింది. కాబట్టి ఇటువంటి కథలనాధారంగా ఇందు పొందు పరిచిన విజ్ఞానం గూడా సమాజానికి తెలిసే అవకాశం ఉంది. కవి తన కావ్యం ద్వారా విజ్ఞాన ప్రసారాన్ని ఆశించి ఉండకపోతే శుక సప్తతి కోవకే చెందిన హంస వింశతి గూడా కేవలం కథలకే పరిమితమై ఉండవలసింది. అలాగాక హంస వింశతి ప్రతి కథలోను సందర్భం వచ్చినప్పుడెల్లా అవకాశాన్ని జారవిడవకుండా కవి వర్ణించిన శాస్త్రాద్యనేక విషయాలు అతని ఆశయాన్ని వెల్లడి చేస్తున్నాయి. ఈ కారణంగానే హంస వింశతి విజ్ఞాన సర్వస్వలక్షణాలుగల కావ్యంగా కూడా చెప్పబడుతుంది.

చక్కని కథలతో గూడిన కావ్యంలో లౌకికాలు, సాంకేతిక శాస్త్రాలు వర్ణించడంగాని, లేదా ఆయా శాస్త్రపదాలను పట్టికలుగా కూర్చడంగాని కథాగమ నానికి ఆటంకం గదా? అనే ప్రశ్న ఇలాంటి సందర్భాల్లో రాక మానదు. కాని విజ్ఞాన ప్రసారంగూడా కావ్య ప్రణాళికలో ఒక భాగం కావడంవల్ల, కవి తన కావ్యంలో విజ్ఞాన ప్రసారాన్నిగూడా ఆశించి ఉండడంవల్ల హంస వింశతిలో కథలతోబాటు శాస్త్రాద్యనేక విషయాలు ప్రస్తావించినట్లు తెలుస్తుంది.

''నతత్ జ్ఞానం, నతత్ శిల్పం, నసా విద్యా నసా కళా
నాఽసౌయోగో తత్కర్మనాట్యేఽస్మిన్ యన్నదృశ్యతే'' (కా.స్వ. పుట 17)

అని భరతుడు నిర్దేశించి ఉండడం చేత కావ్య ప్రణాళికలో విజ్ఞాన ప్రసారం గూడా ఒక భాగమేనని తెలుస్తుంది.

భరతుని తర్వాత వచ్చిన భామహుడు గూడా కావ్యంలో శాస్త్ర విజ్ఞానాన్ని అంగీకరించే ఉన్నాడు.

''స్వాదు కావ్యరసోన్మిశ్రం శాస్త్రమవ్యుపయుంజతే
ప్రథమాలీఢ మధవః పిబంతి కటు భేషజమ్'' ( K.A. 5-3 )

(కావ్యంలో ఎడనెడ శాస్త్ర విషయాలుపదిష్టాలైనా ఆ కావ్యం ఆమోద యోగ్యమే అవుతుంది. మొదట తియ్యని మధువును సేవించిన వారే పిమ్మట కటువైన మందును సేవిస్తున్నారుగదా!)

అనగా రసోన్మిశ్రమైన కావ్యం మధువువలె ఆనందాన్ని కలిగిస్తే, కావ్యంలో ప్రతిపాదించిన శాస్త్ర విషయాలు కటు భేషజంవలె దార్ఢ్యాన్ని కలిగిస్తాయని, కాబట్టి కావ్యంలో శాస్త్ర విషయ ప్రతిపాదనం ఆమోద యోగ్యమేనని భావం.

నారాయణామాత్యుడు అపారమైన లోకజ్ఞానం, ఎనలేని శాస్త్ర పరిచయం, భాషా పరిజ్ఞానం గల ప్రౌఢ కవి. తనకు తెలిసిన పరిజ్ఞాన్నంతా లోకానికంద జేయాలనే కుతూహలం గలవాడుగూడా. ఈ విషయం హంస వింశతిలో వేద వేదాంగాలు మొదలు గడ్డిపేర్లు వరకు చెప్పిన తీరును బట్టే తెలుస్తుంది,

ఇన్ని విషయాలు చెప్పాలంటే ఏ ఒక్క కథ తీసుకొన్నా అవకాశం తక్కువని కాబోలు కవి విస్తృతమైన తన రచనా ప్రణాళికకు ఇరవై కథల నాలంబనంగా తీసుకొన్నాడు. ఒక్కొక్క కథలో ఒక్కొక్క కులాన్ని తీసుకొని వారి గృహాలు గృహోపకరణాలు, వృత్తులు—వృత్తి పరికరాలు, వేష భూషణాలు, సంప్రదాయాలు, నమ్మకాలు మొదలైన విషయాలతో నాటి జనజీవన విధానాన్ని చక్కగా వర్ణించి ఉండడం చేత హంస వింశతి నాటి సమాజానికి దర్పణంగా ఉంది. సమాజాన్ని వర్ణించడంతోబాటు ప్రతికథలోను సందర్భానుసారంగ జ్యోతిష్యం, గణితం, మంత్ర శాస్త్రాది విషయాలను పొందు పరిచి కవి దీనినొక విజ్ఞాన సర్వస్వంగా తీర్చిదిద్దాడు.

నారాయణామాత్యుడు హంస వింశతి నీవిధంగా తీర్చి దిద్దడం వల్ల దీన్ని చదివే పాఠకునకు కథలతో పాటు అనేక విషయాలతో పరిచయమేర్పడే అవకాశం ఉంది. అయితే సామాన్య పాఠకుల కందరకు హంస వింశతిలో చెప్పిన అన్ని విషయాలు తెలుసుకోవాలనే ఆసక్తి ఉండక పోవచ్చును. కాని సామాన్య పాఠకునకు సైతం ఏదో ఒక విషయమునందాసక్తి ఉండవచ్చును. ఒక వేళ

కేవలం కథల కొరకే ఈ కావ్యాన్ని చదివే పాఠకుడుంటే, అతనికి విషయ పరిజ్ఞానంతో గూడిన వర్ణనలు అవసరం లేదనుకొన్నా ప్రమాదం లేదు. అలాంటి వాళ్ళు వర్ణనలను వదిలేసి కథలనే చదువుకొని ఆనందించవచ్చును. కాని హంసవింశతి నీ విధంగా తీర్చిదిద్దకుంటే విజ్ఞాన జిజ్ఞాసువులకు ఇన్ని విషయాలొక్కచోట తెలుసుకునే అవకాశం లేకుండా పోతుంది. కాబట్టి కథల ద్వారా అటు సామాన్య పాఠకుల నానందింపజేయడంలోను, విషయ పరిజ్ఞానం ద్వారా ఇటు విజ్ఞాన జిజ్ఞాసువుల నలవరించడంలోను హంస వింశతి కృతకృత్యమైన కావ్యంగా తెలుగు సాహిత్యక్షేత్రంలో నిలిచిపోతుం దనడంలో సందేహం లేదు.

## శాస్త్రి కావ్యము - కావ్యశాస్త్రిము

కర్తృత్వ అపేక్ష - నిరపేక్షతలనుబట్టి పాశ్చాత్య సాహిత్యవేత్తలు వాఙ్మయాన్నంతటిని కావ్యమని, శాస్త్రమని ప్రధానంగా రెండు విధాలుగా విభాగించారు. కవియొక్క ఆత్మీయతా ప్రతిఫలనంగల గ్రంథం కావ్యం. కవి ఆత్మీయతా ప్రతిఫలనంలేని గ్రంథం శాస్త్రమని పాశ్చాత్యుల సిద్ధాంతం. 1

భారతీయాలంకారికులు వాఙ్మయాన్నంతటిని నాలుగు విధాలుగా విభాగించి యున్నారు.

> "శాస్త్రం, కావ్యం, శాస్త్రకావ్యం, కావ్యశాస్త్రంచ భేదతః
> చతుష్ప్రకారః ప్రసరః సతాం సారస్వతో మతః 2

శాస్త్రం, కావ్యం, శాస్త్ర కావ్యం, కావ్యశాస్త్రం అనే భేదాలతో సారస్వతమంతా నాలుగు విధాలుగా ఉంటుందని మన ఆలంకారికుల అభిప్రాయం. అయితే కావ్యం, శాస్త్రం అంటే ఏమిటో పైన వివరించడం జరిగింది కాబట్టి ఇప్పుడు కావ్యశాస్త్రం, శాస్త్రకావ్యం అంటే ఏమిటో? వాటి లక్ష్య లక్షణాలెలాంటివో పరిశీలించి, విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల హంసవింశతి ఏకోవకు చెందుతుందో విచారించడం ఎంతైనా అవసరం.

---

1. సా. శి. స-పుట 181.

2. S. D. Page - 553.

భరత మహర్షి దృశ్య ప్రబంధ లక్షణాలను నిర్దేశిస్తూ వాటిలో విద్యలకు, కళలకు, శిల్పాలకు, శాస్త్రాలకు సంబంధించిన సర్వ విజ్ఞాన ప్రసారానికి స్థానం కల్పించాడు. (చూడు పుట 31) భామహాచార్యుడు— రసోన్మిశ్రమైన కావ్యంలో అంతర్లీనంగా శాస్త్ర విషయాలు పదిష్టాలైనా అట్టి కావ్యం ఆమోద యోగ్యమే నని వక్కాణించాడు. (చూడు-పుట-32) కాబట్టి మన ప్రాచీనాలంకారికుల మతానుసారం కావ్యంలో శాస్త్ర విజ్ఞాన ప్రతిపాదనం ఆమోద యోగ్యమేనని తెలుస్తుంది. అయితే దృశ్య శ్రవ్య ప్రబంధాల్లో శాస్త్ర విషయాలు చోటు చేసుకొన్నపుడు అది శాస్త్ర కావ్యమా ? కావ్య శాస్త్రమా ? అనే విచికిత్స బయలుదేరి, తర్వాత వచ్చిన అలంకారికులు వాటిని విభజించి లక్ష్య లక్షణాలతో నిరూపించి యున్నారు.

సాహిత్య దర్పణంలో కావ్యభేదాలను గూర్చి చర్చిస్తూ దాని హిందీ వ్యాఖ్యానకర్త - కావ్యశాస్త్రం, శాస్త్రకావ్యం, అను వానిని పేర్కొని, వాటికి లక్ష్య లక్షణాలను చూపు శ్లోకాలను కూడా ఉటంకించి యున్నాడు.

"శాస్త్ర కావ్య విదః ప్రాహుః సర్వకావ్యాంగ లక్షణమ్"
కావ్యం విశిష్ట శబ్దార్థసాహిత్య సదలంకృతి
శాస్త్ర కావ్యం చతుర్వర్గప్రాయం సర్వదేశోపకృత్
భట్టిభౌమక కావ్యాది కావ్యశాస్త్రం ప్రచక్షతే" 1

పై శ్లోకంలో చతుర్వర్గ ప్రాయమైంది శాస్త్రకావ్యమని, సర్వ దేశోపకృతమైంది కావ్యశాస్త్రమని స్థూలంగా నిర్దేశింపబడింది. అంటే ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థాలను సరసంగా ఆఖ్యాన రూపంలో వెల్లడించు సారస్వత ప్రక్రియ శాస్త్రికావ్యమని చెప్పవచ్చును. కాని దీనికిచ్చట దృష్టాంతం చూపలేదు.

శాస్త్రి కావ్యాన్ని గూర్చి మరికొంత విపులంగా చర్చించిన భోజుడు దీని కుదాహరణాల్ని కూడా చూపియున్నాడు.

1. S. D. Pege-553.

"శాస్త్రం యత్ర కవీనాం రహస్యము పకల్పయంత్య నల్పధియః
తద్రతీ విలాస కామందకీయవత్ శాస్త్రకావ్యంతు" 2

భోజుని మతానుసారం మేధావులు కవులకు రహస్య విషయాలు బోధపడు నట్లు నిగూఢాంశాలను శాస్త్రరూపంలో రమణీయంగా ప్రతిపాదిస్తే అదిశాస్త్ర కావ్యమనబడుతుంది. దీనికితడు రతీ విలాసం, కామందకీయం, అనే గ్రంథాలను దృష్టాంతంగా చూపాడు. ఇందులో మొదటిదైన రతీవిలాసం కామశాస్త్రానికి సంబంధించిందైతే, రెండవదైన కామందకీయం రాజనీతిశాస్త్రానికి సంబంధించిన గ్రంథం. దీనినిబట్టి చూస్తే భోజుడు శాస్త్రాలనే శాస్త్రకావ్యాలుగా పరి గణించినట్లు తెలుస్తుంది.

శాస్త్ర కావ్యానికి పైనచూపిన లక్ష్య లక్షణాలనుబట్టి హంస వింశతిని పరిశీలిస్తే అది శాస్త్రకావ్య మనడం పొసగదు. ఎందుకంటే శాస్త్ర కావ్యానికి చెప్పిన నిర్వచనాలుకాని చూపినదృష్టాంతాలుగాని హంస వింశతితో పోలిస్తే సరిపడడంలేదు. హంసవింశతి ప్రధానంగా కావ్యం. దీనిలో అచ్చటచ్చట శాస్త్రాద్యనేక విషయాలు ప్రస్తావించబడ్డా, అవన్నీ ఆయాకథల్లో సందర్భానుసారంగానో, ఆనుషంగికంగానో, అవసరాన్నిబట్టో చేర్చబడ్డాయేగాని అవే కావ్యంలో ప్రధానంకాదు. కాబట్టి హంసవింశతి శాస్త్రకావ్యం అనడం పొసగదు.

ఇక కావ్యశాస్త్రాన్ని గూర్చి పరిశీలిస్తే, దీని విషయంలో మన ఆలంకారికుల అభిప్రాయాలు విధంగా ఉన్నాయి. "సర్వదేశో పకృతమైంది కావ్యశాస్త్రమని చెప్తూ, దానికి భట్టి, భౌమక కావ్యాలను ఉదాహరణలుగా చూపడం జరిగింది. ఏదో ఒక ఇతివృత్తాన్ని తీసికొని ప్రజల కర్థమయ్యే విధంగా శాస్త్ర విషయాలను సందర్భానుసారంగా వివరిస్తూ, సర్దసంగా, ఉపదేశ ప్రధానంగా రచింపబడింది కావ్యశాస్త్రమనబడుతుందని భావం- *.

భోజుడు కావ్యశాస్త్ర విషయాన్ని మరికొంత విపులంగా చర్చించి ఈ విధంగా తెలిపియున్నాడు.

---

2. B· K. Page. 660.

* సాహిత్య దర్పణంలో కావ్యభేదాలను గూర్చి చర్చిస్తూ దాని హిందీ వ్యాఖ్యాన కర్త ఉటంకించిన శ్లోకానికి భావం. S.D. Page - 553.

"యత్రార్థ శాస్త్రాణాం కావ్యే వినివేశ్యతే మహా కవిభిః "

తద్భట్టి కావ్య ముద్రారాక్షసవత్ కావ్యశాస్త్రం స్యాత్" 1

ఏ కావ్యంలో అయితే కవులు సందర్భానుసారంగా శాస్త్ర విషయాలను పొందుపరుస్తారో అది కావ్యశాస్త్రమౌతుందని భోజుని మతం. దీని కతడు భట్టికావ్యాన్ని, ముద్రారాక్షసం అనే దృశ్య ప్రబంధాన్ని దృష్టాంతాలుగా చూపించాడు.

కావ్యశాస్త్రాన్ని గూర్చి చెప్పిన ఇద్దరు అలంకారికులును దీనికి భట్టి కావ్యాన్ని దృష్టాంతంగా చూపారు. భట్టి కావ్యంలో ఇతివృత్తం రామకథ. అయితే దీనిలో రామకథతోబాటు పాణినీయ వ్యాకరణ సూత్రాలుకూడా అనుషంగికంగా అనుసంధించబడ్డాయి కాబట్టి ఇది కావ్యశాస్త్రమైంది.

భోజుడు కావ్యశాస్త్రానికి చూపిన ఇంకొక దృష్టాంతం ముద్రారాక్షసం. దీనిలో ఇతివృత్తం చాణుక్య చంద్రగుప్తుల కథ. ఇది దృశ్య ప్రబంధం. ఈ నాటకంలో అడుగడుగునా రాజనీతి శాస్త్ర విషయాలు ప్రతిపాదించబడ్డాయి కాబట్టి ఇది కూడా కావ్యశాస్త్రమే అవుతుంది.

పైన వివరించిన అలంకారికుల అభిప్రాయాలనుబట్టి కావ్యశాస్త్రాన్ని ఈ విధంగా ఊహించవచ్చును. ఉపదేశకృత్యమూ, రసాత్మకమూ అయిన ఇతివృత్తాలతో కూడిన కావ్యంలో, కావ్యస్వరూపానికి భంగం కలుగని విధంగా శాస్త్రాంశాలను అంతర్లీనంగానో, ఆనుషంగికంగానో, కథా సందర్భానుసారంగానో ప్రతిపాదిస్తే దాన్ని కావ్యశాస్త్రమనవచ్చును.

పై విషయాల వెలుగులో హంసవింశతిని పరిశీలిస్తే అలంకారికులు కావ్యశాస్త్రానికి చెప్పిన లక్షణాలు హంసవింశతిలో కూడా చాలావరకు కనిపిస్తాయి. హంసవింశతి ఇరవై రాత్రుల కథలు ఇతివృత్తంగాగల కథాకావ్యం. దీనిలో కావ్యస్వరూపానికి భంగం కలుగని విధంగా కథా సందర్భాననుసరించి శాస్త్ర విషయాలను ప్రతిపాదించి యున్నాడు కవి.

కథా సందర్భాలనుబట్టి హంస వింశతిలో శాస్త్ర విషయాలు ఎలా చోటుచేసుకున్నాయో పరిశీలించడం ఈ సందర్భంగా అవసరం. హంసవింశతి

1. B. K. Page : 133.

మూడవరాత్రి కథలో అనహాయుడనే వీరుని ప్రసక్తి వచ్చినవుడు అతని పౌరుష ప్రాభవాలను వర్ణించు సందర్భంలో అతడుపయోగించు ద్వాత్రింశతి ఆయుధాలు, ద్వాదశపరవళ్ళు, మొనలు, ప్రచారాలు, గతులు, సరుకులు మొదలైన మల్లశాస్త్రి విషయాలు చెప్పబడ్డాయి. ఆదే విధంగా గుణగుప్తుడనే వైద్యుని ప్రసక్తి వచ్చినవుడు అతని వైద్య పరిశ్రమను గూర్చి వర్ణించే సందర్భములో కవి అయుర్వేద శాస్త్రి విషయాలెన్నింటినో ప్రతిపాదించియున్నాడు. పదమూడో రాత్రి కథలో మతిమంతుడనే జోతిష్కుడు సుఖమతికి ప్రశ్నచెప్పు సందర్భంలో జ్యోతిషానికి, హస్త సాముద్రికానికి, ప్రశ్నశాస్త్రానికి సంబంధించిన విషయాలెన్నో చోటు చేసుకున్నాయి. పద్నాలుగో రాత్రి కథలో సరసుడనేవాడు హస్తినీ కాంతను వశపరచుకొనే సందర్భంలో మోహినీ మంత్ర ప్రయోగం వివరించబడింది. ఇదే విధంగా ఈ కథలన్నిటిలోను అనుషంగికంగానో, సందర్భానుసారంగానో గణితం, ఛందస్సు, క్రీడలు, భూగోళం, కామశాస్త్రాద్యనేక విషయాలు నాట్య, సంగీతాది లలితకళలు చోటుచేసుకొన్నాయి.

కథా కావ్యమైన హంసవింశతిలో కథా గమనానికి అడ్డుతగిలే రీతిలో శాస్త్రి విషయాలను చెప్పడం కథతో కూడా పరుగెత్తే పాఠకుని ఉత్సాహానికి కళ్ళెం వేయడమే అవుతుంది గదా అనే సందేహం మనకు కలగడం సహజమే. అయితే కవి తన అనల్ప కల్పనా శిల్పంతో పాఠకుని నిరుత్సాహానికి గురికాకుండా ఆహ్లాదం, చమత్కారం కలిగేటట్లు ప్రతి కథనూ, ప్రతి సన్నివేశాన్నీ రమణీయంగా తీర్చిదిద్ది యున్నాడు. ప్రధానంగా కథా కావ్యమైన హంసవింశతిలో కావ్య స్వరూపానికి భంగం కలుగనిరీతిలో శాస్త్రివిషయాలు ప్రతిపాదింపబడి ఉన్నాయి కాబట్టి దీనిని ఒక విధంగా కావ్యశాస్త్రిమనడమే సమంజసమనిపిస్తుంది.

ఆనంద వర్ధనాచార్యుడు ధ్వన్యాలోకంలో ఒకచోట కావ్యశాస్త్రాన్ని ప్రస్తావిస్తూ మహాభారతం కావ్యాత్మకమైన శాస్త్రిం... అంటే కావ్యశాస్త్రిం అని చెప్పియున్నాడు.

"మహాభారతేపి శాస్త్రిరూపే కావ్యచ్ఛాయాన్వయని" 1

మహాభారతంలో శాంతిరస పరిపోషణంతోపాటు అంతర్లీనంగా పరమ పురుషార్థమైన మోక్షం, భూగోళాది శాస్త్రి విషయాలు ప్రతిపాదింపబడ్డాయి

---

1. ధ్వ. లో. 4వ ఉద్యోతము.

కాబట్టి ఇది కావ్యచ్ఛాయాన్వయమైన శాస్త్రం .... అంటే కావ్యశాస్త్రం అనిభావం.

ఈ దృష్టితో హంసవింశతిని పరిశీలిస్తే చమత్కార జనితములైన కథల్లో ఆభానరూపమైన శృంగారంతోబాటు సందర్భానుసారంగా శాస్త్ర విషయాలు ప్రతిపాదింపబడిన ఇది కావ్యచ్ఛాయాన్వయమైన శాస్త్రమే అవుతుంది. కాబట్టి హంసవింశతిని కావ్యశాస్త్ర మనడమే సముంజసంగా ఉంటుంది.

అంతేగాక హంసవింశతి సమకాలీన జీవిత విధానానికి నిలువుటద్దం పట్టిన గ్రంథం * సామాజిక చిత్రణం, శాస్త్రవిషయాలేగాక దీనిలో అతి సామాన్యాలైన గడ్డిపేర్లు మొదలు జంతువులు, పక్షులు, పర్వతాలు, నదులు, కొండలు, పల్లెలు, పట్టణాలు, క్రీడలు, వేదవేదాంగాల వరకుగల వివిధ విష యాల పేర్లను పట్టికలుగా నిచ్చి జ్ఞాన విజ్ఞానాన్ని రాశీభూతంగా ఈ కావ్యంలో కవి ప్రోగుపోసి ఉండడంతో ఇది విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల గ్రంథంగా కూడా చెప్పబడుచున్నది.

# 3

# విజ్ఞాన సర్వస్వాలు – నిర్వచనం – ఆశయం – ప్రయోజనం

ప్రపంచ భాషల్లో విజ్ఞాన సర్వస్వాలు లేదా విజ్ఞాన కోశాల రచన నేడు ముమ్మరంగా సాగుచున్నది. ఇటీవలి కాలంలో ఇదొక ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా కూడా వెలసింది. తెలుగులోను ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశం. ఆంధ్ర విజ్ఞానం. విజ్ఞాన సర్వస్వాలు (వీటినిగురించి రాబోవు అధ్యాయాల్లో వివరించడం జరుగుతుంది.) మొదలైన విజ్ఞాన సర్వస్వాలెన్నో వెలువడినాయి. ఇంకా ఎన్నో రావలసికూడా ఉన్నాయి.

అయితే ప్రాచీన కాలంలో నేటి విజ్ఞాన సర్వస్వాల్లాంటి అకారాదిగా విజ్ఞానాన్ని క్రోడీకరించి ప్రజలకందించే ప్రక్రియలేదు.అంత మాత్రాన ప్రాచీన గ్రంథాల్లో విజ్ఞాన విషయాలు లేవని చెప్పేందుకు వీల్లేదు. వేదాలు, భారతాది ఇతిహాసాలు, పురాణాలు, కావ్యప్రబంధాల్లో అంతర్లీనంగానో, ఆనుషంగికంగానో, సందర్భానుసారంగానో మన పూర్వులు శాస్త్రాద్యనేక విజ్ఞాన విషయాలు నిబంధించి యున్నారు. అంటే ఆనాటి విజ్ఞానాన్నంతా తమ గ్రంథాల్లో భద్రపరిచి రాబోవుతరాల వారికి దాన్ని అందించే ప్రయత్నం మన పూర్వులు చేశారన్నమాట. ఆనాడు వాటికి విజ్ఞాన సర్వస్వాలు అనే పేరు లేకున్నా, నేటి విజ్ఞాన సర్వస్వాలు చేసేవనే అవికూడా చేస్తున్నాయి. కాబట్టి వాటిని మన ప్రాచీన విజ్ఞాన సర్వస్వాలనే చెప్పాలి.

ప్రాచీన వాఙ్మయంలో వేదాలను సంహితలని వ్యవహరించడం కలదు. ఋక్సంహిత, భారతసంహిత మొదలైన సమాసాల్లో సంహిత అనేపదం కనిపిస్తుంది. సంహిత అంటే సంధింపబడింది లేదా నిబంధింపబడింది అనే అర్థాలు కనిపిస్తున్నాయి. 1 దీనిని బట్టి అనేక విషయాలను ఏకత్ర సంధింప

---

1. ఆంధ్ర వాచస్పత్యము.

జేయడం, లేదా నిబంధించడమే సంహిత లక్ష్యమని తెలుస్తుంది. నేటి విజ్ఞాన సర్వస్వాల లక్ష్యంకూడా ఇదే. కాబట్టి నాటిసంహితలు నేటి విజ్ఞాన సర్వస్వాల వంటివేనని చెప్పవచ్చును. కావుననే వేదాలు, మహాభారతం, పురాణాలు మొదలైనవి భారతీయములైన మన ప్రాచీన విజ్ఞాన సర్వస్వాలుగా పరిగణించ బడుతున్నాయి.

## నిర్వచనాలు :

నేడు తెలుగులో వాడబడుతున్న విజ్ఞాన సర్వస్వం అనే పదానికి సమానార్థకంగా ఆంగ్లంలో Encyclo-paedia అనే పదం కనుపిస్తుంది. గ్రీకు భాషా పదాలైన Enkyklio - Paidia అనే రెండు పదాలుకలిసి Encyclo paedia అనే పదం ఏర్పడింది.

ఈ రెండు పదాలకు అర్థాలీవిధంగా ఉన్నాయి :

Enkyklio = Circle = చక్రరూపమైన

Paidio = of Learing = విద్య లేక విజ్ఞానం. 1

ఈ పదాల అర్థాలనుబట్టి చూస్తే విద్యా వలయం లేదా విజ్ఞానచక్రం అనే అర్థంలో ఈ రెరెడుపదాలు కలిసి Encyelopaedia అనే పదం ఏర్పడి ఉంటుందని భావించవచ్చును. దీన్నిబట్టి "గ్రీకులు Encyclopaedia ను ఒక పద్ధతి ప్రకారం నిబంధించబడ్డ సంపూర్ణ విజ్ఞానంగా భావించినట్లు తెలుస్తున్నది. 2

క్రీ. శ. 1538లో ఇలియట్ తన లాటిన్ డిక్షనరీలో, Encyclopaedia అనే పదాన్ని నిర్వచిస్తూ "క్రమ పద్ధతిలో కూర్చబడిన అన్ని సిద్ధాంతాల సమాహారమే విజ్ఞాన సర్వస్వం అని చెప్పియున్నాడు." 3

తెలుగులో వచ్చిన సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలకు ఆధ్వర్యం వహించిన ఆచార్యఖండవల్లి లక్ష్మీరంజనంగారు—

---

1 సం. ఆ. కో. I. పీఠిక

2. The greeks seems to have understood by encylcpaedia instruction in the couplete system or circle,. (E.B-VIII-364)

3. "Encyclios at encyclia the cycle or course of all doctrines" (E.B-VIII-364)

"మానవుని మనోవికాసానికి, నిత్యజీవితానికి
అవసరమయ్యే కళాశాస్త్రాల, ప్రకృతి శాస్త్రాల
ఆ వృత్తియే విజ్ఞాన సర్వస్వం" 4 అని నిర్వచించి యున్నాడు.

నేడు వెలువడుతున్న విజ్ఞాన సర్వస్వాలను దృష్టిలో పెట్టుకొనిచూస్తే ఆచార్య ఖండవల్లి గారిపై నిర్వచనం కొంత విపులంగా ఉందనిపిస్తుంది. ఎందు కంటె విశ్వవిజ్ఞానమంత అటు కళాశాస్త్రాల్లోనో, ఇటు ప్రకృతి శాస్త్రాల్లోనో అంతర్భవిస్తుంది. మానవుని మానసోల్లాసానికి కళాశాస్త్రాలు దోహదంచేస్తే, అతని సౌభాగ్యానికి, అభ్యుదయానికి ప్రకృతి శాస్త్రాలెంతగానో తోడ్పడు తున్నాయి.

విజ్ఞాన సర్వస్వాలను గూర్చి ఇటువంటివే ఎన్నో నిర్వచనాలు వెలువడి ఉన్నాయి. ఈ ప్రక్రియి తెలుగులో ఇప్పుడిప్పుడే ప్రచారంలోకి వస్తున్న కార ణంగా వీటిని గురించిన చర్చ తెలుగులో అంత విస్తృతంగా కనుపించడం లేదు. కాని పాశ్చాత్య దేశాల్లో విజ్ఞాన సర్వస్వాలు విస్తృత ప్రచారాన్ని పొందు తున్నాయి. సర్వవిషయ విజ్ఞానానికి సంబంధించిన విజ్ఞాన సర్వస్వాలేగాక ఒక్కొక్క శాఖా విజ్ఞానానికి సంబంధించిన ప్రత్యేక విజ్ఞాన సర్వస్వాలుకూడా వెలువడుతున్నాయి.

Ex:-Encyelopaedia of western drama Encyclopaedia of sporst Etc, కాబట్టి ఆంగ్లంలో విజ్ఞాన సర్వస్వాలను గూర్చిన నిర్వచనాలు విస్తృతంగా వెలువడి ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి కొన్ని ఇచ్చుట చూపడం జరుగుతుంది.

1. "The word encyclopaedia means instruction in the whole circle of learning" (C.O.E.L)
2. A work containing information in all branches of knowledge usually arranged alphabatically.
3. "A work containing information some art or branch of knowledge arranged systematically" (S.O.E.D)
4. "A comprehensive often multivolume reference work containing articles on a wide range of a perticular field usually arranged alphabatically" (A.H.D.E)

4. సం. వి. కో. I. నివేదనము.

ఈ విధంగా విజ్ఞాన సర్వస్వాలకు సంబంధించి ఎన్నో నిర్వచనాలు ప్రచారంలో ఉన్నా, సాహిత్య ప్రపంచంలో నేడు వెలువడుతున్న విజ్ఞాన సర్వస్వాల దృష్ట్యా నేటికిని క్రొంగ్రొత్త నిర్వచనాలు వెలువడుతూనే ఉన్నాయి.

పై నిర్వచనాలన్నిటిని పరిశీలిస్తే—

"చరా చర జగత్సృష్టిలోని వివిధ పదార్థాలకు
సంబంధించిన విషయ సంఘాతాన్నంతటిని
ప్రమాణ పూర్వకంగా సంగ్రహించి క్రమ పద్ధతిలో
ఏకత్ర సంఘటింపజేసి ప్రజల కందించడమే విజ్ఞాన సర్వస్వం"

అని చెప్పవచ్చును.

## ఆశయాలు :-

విజ్ఞాన సర్వస్వాల నిర్వచనాలను బట్టే వాటి ఆశయాలు కూడా తెలుస్తున్నాయి. స్థావర జంగమాత్మకమైన ఈ విశ్వమంతటా వికీర్ణమై యున్న విజ్ఞానాన్నంతటిని ఒక్క చోటికి చేర్చి ప్రజలకు పరిచయం చేయడమే నాటి సంహితలకు గాని, నేటి విజ్ఞాన సర్వస్వాలకుగాని పరమాశయమై ఉంది. ఈ ఆశయసిద్ధి కొరకే మన పూర్వులు ఆయా యుగ ధర్మాల ననుసరించి మహాభారతాది సంహితలను వెలయించి యున్నారు.

భారత సంహితా నిర్మాణ ప్రశంస నుగ్గడిస్తూ నన్నయ్య చెప్పిన వాక్యాన్ని సందర్భంగా స్మరించుకోవడం అవసరం.

మ॥ అమితాఖ్యానక శాఖలంబొలిచి వేదార్థామల చ్ఛాయమై
సుమహద్వర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణ కీర్తనార్థ ఫలమై ద్వైపాయనోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై [1]

ఎందరో రాజుల, ఋషుల, దేవతల ఆఖ్యానాలతోగూడి, వేద మహార్థాలకు వ్యాఖ్యానరూపమై, చతుర్వర్గ పురుషార్థాలను ప్రతిపాదిస్తున్న మహాభారత సంహిత కల్పభూజమైన పారిజాతంతో పోల్చబడింది. పారిజాతం కోరిన కోరికల నిచ్చేది. ఇట్లు చెప్పడంచేత మహాభారతం విజ్ఞాన జిజ్ఞాసవుల కోరికలు [illegible] సిద్ధింపచేసినట్లయింది.

"ఇట్టి మహాభారతంబు ననేక విధ పదార్థ ప్రపంచ
సంచితంబు, ఉప పర్వ మహాపర్వోప శోభితంబు
ఉపద్వీప మహాద్వీప సంభృతంబయిన భువనంబు
నజుండు నిర్మించినట్లు కృష్ణ ద్వైపాయనుండు
నిఖిల లోక హితార్థంబు దత్తావధానుండై
సంవత్సర త్రయంబు నిర్మించె..............." 1

స్థావరజంగమాత్మకమైన ఈ అనంత విశ్వాన్ని భగవంతుడు సృష్టించి నట్లు విశ్వ విజ్ఞానంతో గూడిన మహాభారతాన్ని వ్యాసమహర్షి "నిఖిలలోక హితార్ధము" నిర్మించాడట. కాబట్టి మహాభారతాన్ని నిర్మించడంలో వ్యాసుని ఆశయం సకల ప్రజల సౌభాగ్యమేనని తెలుస్తున్నది. నేటి విజ్ఞాన సర్వస్వాల ఆశయం కూడా విశ్వ విజ్ఞానాన్ని ప్రపంచ ప్రజల కందించడమే గదా!

ఈ విషయాన్నే ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వాల సంపాదకులలో ప్రముఖుడైన డెన్నిస్ డిడిరో ఈ విధంగా వివరించాడు.

"ప్రపంచ వీధుల్లో వికీర్ణమై పడియున్న విజ్ఞానాన్ని
రాశి చేసి సమకాలికులకు పరిచయం చేయుటయే
విజ్ఞాన సర్వస్వ పుటాదర్శం. అనంతర తరాలవారికీ
జ్ఞాన భాండారాన్నందించడం కూడా దీని లక్ష్యమే" 2

డిడిరో చెప్పిన పై వాక్యాల వలన విశ్వ విజ్ఞానమంతటిని ప్రోగుచేసి సమకాలీన ప్రజలకు పరిచయం చేయడం దాన్ని భద్రపరిచి భావి తరాల వారికి ఆ విజ్ఞానా న్నందించడం విజ్ఞాన సర్వస్వాల పరమాశయమై యున్నదని తెలుస్తున్నది.

సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలకు సంపాదకత్వం నిర్వహించిన ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు —

"విశ్వ విజ్ఞానాన్ని సంక్షేప రూపంలో ఆంధ్రి కుటీర ప్రాంగణానికి గొని వచ్చుటయే విజ్ఞాన కోశాల ఆశయమని పేర్కొన్నారు. 3

---

1. ఆం.మ.భా.ఆ.ప. 1–67
2. సం. వి. కో । పీఠిక
3. Ibid — నివేదనము

ఈ విధంగా విజ్ఞాన సర్వస్వాలకు సంబంధించి ఎన్నో నిర్వచనాలు ప్రచారంలో ఉన్నా, సాహిత్య ప్రపంచంలో నేడు వెలువడుతున్న విజ్ఞాన సర్వస్వాల దృష్ట్యా నేటికిని కొంగ్రొత్త నిర్వచనాలు వెలువడుతూనే ఉన్నాయి.

పై నిర్వచనాలన్నిటిని పరిశీలిస్తే—

"చరా చర జగత్సృష్టిలోని వివిధ పదార్థాలకు
సంబంధించిన విషయ సంఘాతాన్నంతటిని
ప్రమాణ పూర్వకంగా సంగ్రహించి క్రమ పద్ధతిలో
ఏకత్ర సంఘటింపజేసి ప్రజల కందించడమే విజ్ఞాన సర్వస్వం"

అని చెప్పవచ్చును.

## ఆశయాలు :-

విజ్ఞాన సర్వస్వాల నిర్వచనాలను బట్టే వాటి ఆశయాలు కూడా తెలుస్తున్నాయి. స్థావర జంగమాత్మకమైన ఈ విశ్వమంతటా వికీర్ణమై యున్న విజ్ఞానాన్నంతటిని ఒక్క చోటికి చేర్చి ప్రజలకు పరిచయం చేయడమే నాటి సంహితలకు గాని, నేటి విజ్ఞాన సర్వస్వాలకుగాని పరమాశయమై ఉంది. ఈ ఆశయసిద్ధి కొరకే మన పూర్వులు ఆయా యుగ ధర్మాల ననుసరించి మహాభారతాది సంహితలను వెలయించి యున్నారు.

భారత సంహితా నిర్మాణ ప్రశంస నుగ్గడిస్తూ నన్నయ్య చెప్పిన వాక్యాల్ని సందర్భంగా స్మరించుకోవడం అవసరం.

మ॥ అమితాఖ్యానక శాఖలం బొలిచి వేదార్థామల చ్ఛాయమై
సుమహద్వర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణ కీర్తనార్థ ఫలమై ద్వైపాయనోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై 1

ఎందరో రాజుల, ఋషుల, దేవతల ఆఖ్యానాలతోగూడి, వేద మహార్థాలకు వ్యాఖ్యానరూపమై, చతుర్వర్గ పురుషార్థాలను ప్రతిపాదిస్తూన్న మహాభారత సంహిత కల్పభూజమైన పారిజాతంతో పోల్చబడింది. పారిజాతం కోరిన కోరికల నిచ్చేది. ఇట్లు చెప్పడంచేత మహాభారతం విజ్ఞాన జిజ్ఞాసవుల కోరికలు తీర్చేదని సూచింపబడ్డయింది.

1. ఆం.మ.భా. ఆ.ప. 1–66

"ఇట్టి మహాభారతంబు ననేక విధ పదార్థ ప్రపంచ
సంచితంబు, ఉప పర్వ మహాపర్వోప శోభితంబు
ఉపద్వీప మహాద్వీప సంభృతంబయిన భువనంబు
నజుండు నిర్మించినట్లు కృష్ణ ద్వైపాయనుండు
నిఖిల లోక హితార్థంబు దత్తావధానుండై
సంవత్సర త్రయంబు నిర్మించె............" 1

స్థావరజంగమాత్మకమైన ఈ అనంత విశ్వాన్ని భగవంతుడు సృష్టించి నట్లు విశ్వ విజ్ఞానంతో గూడిన మహాభారతాన్ని వ్యాసమహర్షి "నిఖిలలోక హితార్థము" నిర్మించాడట. కాబట్టి మహాభారతాన్ని నిర్మించడంలో వ్యాసుని ఆశయం సకల ప్రజల సౌభాగ్యమేనని తెలుస్తున్నది. నేటి విజ్ఞాన సర్వస్వాల ఆశయం కూడా విశ్వ విజ్ఞానాన్ని ప్రపంచ ప్రజల కందించడమే గదా!

ఈ విషయాన్నే ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వాల సంపాదకులలో ప్రముఖుడైన డెన్నిస్ డిడిరో ఈ విధంగా వివరించాడు.

"ప్రపంచ వీధుల్లో వికీర్ణమై పడియున్న విజ్ఞానాన్ని
రాశి చేసి సమకాలికులకు పరిచయం చేయుటయే
విజ్ఞాన సర్వస్వ పుటాదర్శం. అనంతర తరాలవారికీ
జ్ఞాన భాండారాన్నందించడం కూడా దీని లక్ష్యమే" 2

డిడిరో చెప్పిన పై వాక్యాల వలన విశ్వ విజ్ఞానమంతటిని ప్రోగుచేసి సమకాలీన ప్రజలకు పరిచయం చేయడం దాన్ని భద్రపరిచి భావి తరాల వారికి ఆ విజ్ఞానా న్నందించడం విజ్ఞాన సర్వస్వాల పరమాశయమై యున్నదని తెలుస్తున్నది.

సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశాలకు సంపాదకత్వం నిర్వహించిన ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు —

"విశ్వ విజ్ఞానాన్ని సంక్షేప రూపంలో ఆంధ్రి కుటీర ప్రాంగణానికి గొని వచ్చుటయే విజ్ఞాన కోశాల ఆశయమని పేర్కొన్నారు. 3

---

1. ఆం.మ.భా.ఆ.ప. 1–67
2. సం. వి. కో। పీఠిక
3. Ibid — నివేదనము

ఆచార్య ఖండవల్లి గారి అభిప్రాయం ప్రకారం విశ్వ విజ్ఞానాన్ని తమ తమ భాషల్లో క్రోడీకరించి దానిని సంక్షిప్త రూపంలో తమ ప్రజలకు పరిచయం చేయడమే విజ్ఞాన కోశాల ఆశయమని తెలుస్తున్నది.

డిడిరోగాని, ఖండవల్లి వారుగాని చెప్పిన అభిప్రాయాలనుబట్టి విశ్వవిజ్ఞానాన్ని ఏకత్రి సంఘటించి దానిని సమకాలికుల కందజేయడం విజ్ఞాన సర్వస్వాల లేదా విజ్ఞాన కోశాల ఆశయమై యున్నదనుట స్పష్టం. అయితే డిడిరో ఈ విషయంలో ఇంకా స్త ముందుకు పోయి ఆ విజ్ఞానాన్ని భద్రపరిచి భావి తరాల వారి కందించడం కూడ వీటి లక్ష్యమేనని చెప్పడం విజ్ఞాన సర్వస్వాల మనుగడకే మన్నన కల్పించినట్లయింది. ఎందుకంటె పూర్వతరాల వారి విజ్ఞానం భావితరాల వారి కందకుండా పోవడం వల్ల వారా విజ్ఞానాన్ని నష్ట పోవడం జరుగుతుంది. ఇది లోక సౌభాగ్యానికి, ప్రజాభ్యుదయానికి గొడ్డలి పెట్టు వంటిది. కాబట్టి పూర్వతరాల వారి విజ్ఞానాన్ని భద్రపరిచి భావితరాల వారి కందించడం ముఖ్యంగా విజ్ఞాన సర్వస్వాల లక్ష్యమై ఉండాలి.

## ప్రయోజనాలు:-

ఇటువంటి ఉన్నతాశయాలతో నిర్మాణమయ్యే విజ్ఞాన సర్వస్వాలు - ప్రజలను చైతన్యవంతుల్నిచేసి, విజ్ఞాన పూరితుల్ని గావించి, తద్వారా వారి జీవితాలను సుఖమయం చేయడం పరమ ప్రయోజనాలుగా గల్గి ఉన్నాయి.

మహాభారతాన్ని వ్యాసుడు నిఖిలలోక హితార్థం నిర్మించినట్లు చెప్ప బడింది. వ్యాసుడు భారతాన్ని నిర్మించడంలో అతడాశించిన ప్రయోజనం విజ్ఞానావలోడనం వల్ల సకల జనులకు శుభములు చేకూరుటయే. అందుకే వ్యాసుడు భారతాన్ని దేవ, పితృ లోకాల్లోను, నాగ, గరుడ, గంధర్వ, యక్ష, రాక్షస లోకాల్లోను, మానవ లోకంలోను ప్రచారం చేసేందుకు నారద దేవల, సమంత, వైశంపాయనులనే మహర్షుల నియోగించాడు. 1

విజ్ఞాన సర్వస్వాల ఆశయ ప్రయోజనాలను గురించి ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికాలో ఈ విధంగా చెప్పబడింది.

> "Let knowdge grow from more to more
> and thus be human life enriched" 2

1. ఆ. మ. భా-ఆ-వ- 1-67
2. E. B. Cover Page

విజ్ఞానం శాఖోపశాఖలుగా పెరగాలని, తద్వారా మానవ జీవితం సంతోష సౌభాగ్యాలతో విలసిల్లాలని పై వాక్యాల వలన తెలుస్తున్నది, అంటే విజ్ఞానం శాఖోప శాఖలుగా పెరగడం విజ్ఞాన సర్వస్వాల ఆశయమైతే మానవ జీవితం సంతోష సౌభాగ్యాలతో విలసిల్లడం వాటి ప్రయోజనమై ఉంది. కాబట్టి విజ్ఞాన సర్వస్వాల్లోని జ్ఞానావలోడనంవల్ల ప్రజలు సుఖవంతులు, సంపద్వంతులు కావడమే వీటి ప్రయోజనంగా చెప్పవచ్చును.

విజ్ఞాన సర్వస్వాల ప్రయోజనం, అవి లేకపోతే కలిగే ప్రమాదాలను గురించి డిడిరో ఈ విధంగా చెప్పియున్నాడు.

> "ఇట్లు చేయుట వలన (విజ్ఞాన సర్వస్వాలు నిర్మించడం వలన)
> పూర్వ పూర్వ తరాలవారి విజ్ఞానం ఉత్తరోత్తర తరాల వారికి
> అందుబాటులోకి వస్తుంది. లేకుంటే అది నష్టమయ్యే
> ప్రమాదం కలదు. మన సంతతివారు విజ్ఞానావలోడ
> నంతో జ్ఞానవంతులు, సుఖవంతులు కావడం
> కూడా మన లక్ష్యమే'' 1

డిడిరో చెప్పిన పై వాక్యాలను బట్టి ప్రాచీన విజ్ఞానాన్ని సమకాలికులకే గాక భావి తరాల వారి కందించడంలోను, నిద్రాణమై యున్న జనుల్లో విజ్ఞాన బీజాలు వెదజల్లి వారిని చైతన్యవంతులుగాను, సుఖవంతులుగాను చేయడంలో విజ్ఞాన సర్వస్వాలు అనితర సాధనాలని తెలుస్తున్నది. ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వాలు ఈ పాత్ర నిర్వహించడంలో విజయం సాధించినట్లు చరిత్ర చెబుతున్నది.

> "విజ్ఞాన సర్వస్వం ప్రయోజనాత్మక సాహిత్యం
> జీవితానికానందాన్ని కలిగించేందు కిది ఆధారభూతమైంది" 2

అని విజ్ఞాన సర్వస్వాల ప్రయోజనాన్ని గురించి ఆచార్య ఖండవల్లిగారి అభిప్రాయం.

పై అభిప్రాయాల నన్నిటిని క్రోడీకరించి పరిశీలిస్తే, విజ్ఞాన ప్రసారం ద్వారా ప్రజలు సుఖవంతులు, సంపద్వంతులు కావడమే విజ్ఞాన సర్వస్వాల ప్రయోజనంగా కనిపిస్తుంది.

నేటి విజ్ఞాన సర్వస్వాల ప్రయోజనాలు కొంతవరకు సృజనాత్మక సాహిత్యమైన కావ్యాదుల్లోనూ ఉన్నాయి. వేదాలు, భారతం, పురాణాలు,

---

1, సం. వి. కో I- పీఠిక

2, I bid ...

ఆచార్య ఖండవల్లి గారి అభిప్రాయం ప్రకారం విశ్వ విజ్ఞానాన్ని తమ తమ భాషల్లో క్రోడీకరించి దానిని సంక్షిప్త రూపంలో తమ ప్రజలకు పరిచయం చేయడమే విజ్ఞాన కోశాల ఆశయమని తెలుస్తున్నది.

డిడిరోగాని, ఖండవల్లి వారుగాని చెప్పిన అభిప్రాయాలనుబట్టి విశ్వవిజ్ఞానాన్ని ఏకత్రి సంఘటించి దానిని సమకాలికుల కందజేయడం విజ్ఞాన సర్వస్వాల లేదా విజ్ఞాన కోశాల ఆశయమై యున్నదనుట స్పష్టం. అయితే డిడిరో ఈ విషయంలో ఇంకా స్త ముందుకు పోయి ఆ విజ్ఞానాన్ని భద్రపరిచి భావి తరాల వారి కందించడం కూడ వీటి లక్ష్యమేనని చెప్పడం విజ్ఞాన సర్వస్వాల మనుగడకే మన్నన కల్పించినట్లయింది. ఎందుకంటె పూర్వతరాల వారి విజ్ఞానం భావితరాల వారి కందకుండా పోవడం వల్ల వారా విజ్ఞానాన్ని నష్టపోవడం జరుగుతుంది. ఇది లోక సౌభాగ్యానికి, ప్రజాభ్యుదయానికి గొడ్డలి పెట్టు వంటిది. కాబట్టి పూర్వతరాల వారి విజ్ఞానాన్ని భద్రపరిచి భావితరాల వారి కందించడం ముఖ్యంగా విజ్ఞాన సర్వస్వాల లక్ష్యమై ఉండాలి.

## ప్రయోజనాలు :-

ఇటువంటి ఉన్నతాశయాలతో నిర్మాణమయ్యే విజ్ఞాన సర్వస్వాలు - ప్రజలను చైతన్యవంతుల్నిచేసి, విజ్ఞాన పూరితుల్ని గావించి, తద్వారా వారి జీవితాలను సుఖమయం చేయడం పరమ ప్రయోజనాలుగా గల్గి ఉన్నాయి.

మహాభారతాన్ని వ్యాసుడు నిఖిలలోక హితార్థం నిర్మించినట్లు చెప్పబడింది. వ్యాసుడు భారతాన్ని నిర్మించడంలో ఆతడాశించిన ప్రయోజనం విజ్ఞానావలోడనం వల్లి సకల జనులకు శుభములు చేకూరుటయే. అందుకే వ్యాసుడు భారతాన్ని దేవ, పితృ లోకాల్లోను, నాగ, గరుడ, గంధర్వ, యక్ష, రాక్షస లోకాల్లోను, మానవ లోకంలోను ప్రచారం చేసేందుకు నారద దేవల, సమంత, వైశంపాయనులనే మహర్షుల నియోగించాడు. 1

విజ్ఞాన సర్వస్వాల ఆశయ ప్రయోజనాలను గురించి ఎన్సైక్లోపీడియా బ్రిటానికాలో ఈ విధంగా చెప్పబడింది.

"Let knowdge grow from more to more
and thus be human life enriched" 2

హంస వింశతి, వాణీ విలాసవనమాలిక మొదలైన గ్రంథాలన్నీ విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల కావ్యాలే. అయితే ఈ సృజనాత్మక సాహిత్యమంతా పరిణత బుద్ధులకే పరిమితం కాని జనసామాన్యానికది అందుబాటులో లేదు. కాబట్టి సామాన్య ప్రజలకు విషయ విజ్ఞానాన్ని లేదా పదార్థ విజ్ఞానాన్ని విపులంగా, అసందిగ్ధంగా, చక్కగా అర్థమయ్యే విధంగా చెప్పవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. అందుకు తగిన సాధనాలు నేటి విజ్ఞానసర్వస్వాలే.

పైన వివరించిన విషయాలను బట్టి విజ్ఞాన సర్వస్వాల ద్వారా సమాజానికి జ్ఞాన చక్రి పరిచయం చేయడం ఎంతైనా అవసరమని తేలింది. అంతే గాదు పూర్వ తరాలవారి విజ్ఞానాన్ని క్రోడీకరించి, భద్రపరిచి భావితరాల వారి కందించడం కూడా అత్యంతావశ్యకమని తెలిసింది.

ఈ దృష్టితో చూస్తే మన ప్రాచీన వాఙ్మయంలోని వివిధ విషయాలను ఏకత్రి సంఘటించి వాటికి సంబంధించిన విజ్ఞానాంశాలను విపులంగా, అసందిగ్ధంగా, క్రమపద్ధతిలో ప్రజలకు పరిచయం చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. అలా చేయని నాడు ఆ విజ్ఞానమంతా కాలగర్భంలో కలిసిపోయే ప్రమాదం కలదు. ఉదాహరణకు హంస వింశతిలో ఒకచోట బాలబాలికలా ఆడుకొనే ఆటల పేర్లు దాదాపు వందకు పైగా ఇవ్వబడ్డాయి. వీటిలో యిప్పటికే చాలా భాగం మరుగున పడిపోయాయి. ఈ ఆటల స్వరూప స్వభావాలేమిటో ? ఎవరు ఏ సమయాల్లో ఆడుకునేవాళ్ళో? గెలుపు-ఓటమి, ఆరంభం-అంతం ఎలా ఉండేవో మొదలైన విషయాలేమి తెలియరావడంలేదు. ఈ పరిశోధన సందర్భంగా ఎన్నో ఊళ్ళు తిరిగి, ఎందరెందరినో అర్థించి కొన్ని ఆటల స్వరూప స్వభావాలు సేకరించడం జరిగింది. అదే విధంగా ఆయుధాలు వక్షులు, పర్వతాలు, నదీనదాలు, వివిధ శాస్త్ర విషయాలు మొదలైన వెన్నో ఉన్నాయి. కనీసం వీటికి పూర్వం ఏ పేర్లు ఉండేవో కూడా నేటి తరాల వారికి తెలియకుండా పోతున్నది. అందువల్ల అనాదిగా అనంతంగా వస్తున్న మన పూర్వ సంస్కృతి, నాగరికత, చరిత్ర మనకు తెలియకుండా పోయే ప్రమాదం గలదు. కాబట్టి మన ప్రాచీన విజ్ఞానాన్ని కూడా సమీకరించి మన భావితరాల వారి కందించడం ఎంతో అవసరం. ఆ విధంగా చేసిననాడే మన విజ్ఞాన సర్వస్వాల ప్రయోజనం పూర్తిగా నెరవేరినట్లవుతుంది.

* వీటిలో కొన్నింటిని రాబోవు అధ్యాయాల్లో వివరించడం జరిగింది.

# 4

# విజ్ఞాన సర్వస్వాల వికాసం

భారతీయ విజ్ఞాన సర్వస్వాలు :

నేడు మనం చూస్తున్న విజ్ఞాన సర్వస్వాలైన ఎన్‌సైక్లోపిడియా బ్రిటానికా, ఎన్‌సైక్లోపిడియా అమెరికానా మొదలైనవి విశ్వవిజ్ఞానాన్నంతటిని క్రోడీకరించుకొని అకారాది క్రమంలో కూర్చబడ్డ చక్కని విజ్ఞాన సర్వస్వాలు. ఇవి వ్యక్తి ప్రజ్ఞాధీనాలుగాక, సమిష్ఠి కృషి ఫలితాలై ఉన్నాయి. అనంతమైన ఈ కాల ప్రవాహంలో వివిధ దశల నధిగమించి, ఎన్నోమార్పులను జెంది ఈ రూపాలను సంతరించుకొన్న ఈ విజ్ఞాన సర్వస్వాలు నేడు అన్ని దేశాల్లోను, అన్ని భాషల్లోను వెలువడుతున్నాయి.

అయితే ప్రారంభదశలో వీటికి మూలాలైన విజ్ఞాన సర్వస్వాల స్వరూప స్వభావా లేవిధంగా ఉండేవో పరిశీలించినగాని, వీటి క్రమ వికాసాన్ని తెలుసుకోజాలము. ఈ దృష్టితో చూస్తే ఇవి అయిదు దశల్లో క్రమ వికాసాన్ని పొంది యున్నట్లు మనం స్థూలంగా భావించ వచ్చును.

విజ్ఞాన సర్వస్వం అనే పేరు లేకపోయినా వివిధ శాఖలకు చెందిన విజ్ఞానాన్ని తమ గ్రంథాలందు పొందుపరిచే విధానం మాత్రం మన ప్రాచీన సాహిత్యంలో కనుపిస్తుంది. ఇదే మన విజ్ఞాన సర్వస్వాలకు ప్రారంభ దశగా చెప్పవచ్చును.

భారతదేశంలోనే గాక ప్రపంచంలోనే మొట్టమొట వెలసిన విజ్ఞాన సర్వస్వాలనదగిన గ్రంథాలు వేదాలని తెలుస్తున్నది. ఇవి మానవజాతి విజ్ఞానానికే శ్రీకారాలని, భారతీయ విజ్ఞానానికి కీర్తిపతాకలని విజ్ఞుల అభిప్రాయం.

విజ్ఞాన సర్వస్వమంటే మానవ విజ్ఞానాన్ని సమన్వయ పూర్వకంగా సమీకరించి. క్రమబద్ధమైన అవగాహనకు వీలయ్యేటట్లు ఉపపాదించేదిగా ఉండాలనీ, వ్యాపకము, సమన్వయాత్మకమైన వ్యవస్థ ఒక ప్రయోజనాన్ని ఉద్దేశించి తదనుగుణంగా రచన సాగించాలనీ ఆన్‌స్టెడ్, డిడిరో, న్యూమెన్, కాల్‌రిడ్జ్ మొద

లైన పాశ్చాత్య పండితులభిప్రాయపడి యున్నారు. 1 అంటే వివిధ శాఖలకు చెందిన విజ్ఞానాన్నంతటిని ఒక్కచోట కూర్చడం అనేది విజ్ఞాన సర్వస్వానికి ప్రధాన లక్షణంగా కనిపిస్తున్నది. విజ్ఞాన సర్వస్వాలనే పేరు లేకపోయినా ఈ లక్షణాలుగల గ్రంథాలెన్నో భారతీయ వాఙ్మయంలో కనిపిస్తున్నాయి. వాటిలో మొట్టమొట పేర్కొనదగినవి వేదాలు. వీటి ఆవిర్భావమే భారతీయాలైన విజ్ఞాన సర్వస్వాలకు ప్రారంభదశగా చెప్పవచ్చును.

మానవాభ్యుదయానికి హేతుభూతాలైన మతం. ధర్మం, నీతి, న్యాయం, సాహిత్యం, జ్యోతిషం, గణితం, మంత్రశాస్త్రాద్యనేక విషయాలను ఏకత్ర సంఘటింపజేయడం ఉత్తమ పద్ధతని మన ఆర్షమహర్షు లేనాడో గమనించారు. వారి ప్రయత్న ఫలితం మనకు వేదాలనుండే కనిపిస్తుంది.

వేద శబ్దంలోనే జ్ఞానశబ్దం ఇమిడియున్నదని పండితాభిప్రాయం. వేద మనే పదం "విద్" అనే ధాతువునుండి పుట్టింది, విద్ అంటే తెలుసుకొనబడినదని అర్థం. కాబట్టి వేదమంటే కూడా తెలుసుకొనబడినది. లేదా జ్ఞానమని అర్థం చెప్పుకోవచ్చును. 2

చతుర్విధ వేదాల్లో ఋగ్వేదం మొదటిది. నిత్యసత్యవ్రతులు, ఐహికాముష్మిక విజ్ఞాన ఘనులు అయిన ఆర్ష మహర్షులు తాము కని, విని సత్యాలుగా భావించి వర్ణించిన విజ్ఞాన విషయాలెన్నో ఋగ్వేదం నిండా కనిపిస్తాయి. అంతేగాదు ఋగ్వేదం, నాటి సామాజిక జీవిత విధానాన్ని కన్నులకు కట్టినట్లు వర్ణించిన గ్రంథం కూడా. కాబట్టి ఇది కేవలం కర్మపరతంత్రమైన మంత్ర రాశి అనేందుకు వీల్లేదు.

ఆర్యావర్తంలో ప్రవహించే నదులు, నెలకొన్న పర్వతాలు, జనపదాలు ద్వీప, వర్ష సముదాయాలకు సంబంధించిన భూగోళశాస్త్ర విషయాలెన్నో ఇందు చోటు చేసుకొన్నాయి. ధనుర్విద్యాది యుద్ధ విశేషాలు. యజ్ఞయాగాదులు, మతం, సృష్టిరహస్యాలు, పృథివ్యాదిలోక భ్రమణ విషయాలు. నౌకా విమానాది వాహన నిర్మాణాలు, వివాహాలు, పునర్జన్మలు, రాజధర్మాలు, ప్రజాధర్మాలు వర్ణాశ్రమధర్మాలు, అలంకార, వ్యాకరణ, గణిత, జ్యోతిష, శబ్ద ఆయుర్వేదాది శాస్త్రాలు మొదలైన వెన్నో విజ్ఞాన సర్వస్వమనే వేద వృక్షానికి పొటమరించిన చిరుశాఖలు.

---

1. వి. స. VII. పుట 28.
2. వి. స. XI. పుట 1

ఉదాహరణకు మనం ప్రయాణ సాధనాలను పరిశీలిస్తే వేదకాలంలోనే భూమ్యాకాశ జలాల్లో శీఘ్రగతిని ప్రయాణించేందుకనువైన రథం, విమానం, నౌకలున్నట్లు తెలుస్తున్నది. ఇవి వందలకొలది కాళ్ళు గల వానివలె అతి వేగంగా నడిచేవని, వానిలో తీవ్రగతిని కల్గించేందుకు అగ్ని, వాయువు మొదలైన వానితో గూడిన ఆరు యంత్రాలమర్చబడి ఉండేవని చెప్పబడింది. 1

ఇదే విధంగా అంకగణితం, బీజగణితం, రేఖాగణితం మొదలైన గణిత శాస్త్ర విషయాలు, జ్యోతిశ్శాస్త్రా ద్యనేక విజ్ఞానాంశాలు వేదాల్లో ఉన్నాయి. 2

భారతీయ సంగీత శాస్త్రాని కంతటికి సామవేదం మార్గదర్శకంగా కని పిస్తుంది. సామవేదంలోని సప్తస్వరాలకు, భారతీయ సంగీతంలోని సప్త స్వరాలు సరిపోలుచున్నవని నారద శిక్షలోని ఒక శ్లోకం వలన తెలుస్తున్నది. 3

అధర్వణ వేదమునందు ఆయుర్వేద శాస్త్రం, మంత్ర శాస్త్రాది విష యాలు వర్ణించబడ్డాయి. జ్యోతిశ్శాస్త్రం యొక్క అభివృద్ధి యిందులో కను పిస్తుంది. సాంఘిక జీవనం, నాటి ప్రజల ఆచార, వ్యవహారాలతో గూడిన సామాజిక శాస్త్ర విషయాలెన్నో ఇందులో గలవు.

యజుర్వేదం యజ్ఞ యాగాది కృతువులకు సంబంధించిన విషయాలను చర్చించిన గ్రంథం. నాటి సామాజిక విషయాలెన్నో ఇందు వర్ణించ బడ్డాయి. ఈ విధంగా చూస్తే వేదాలు ప్రారంభ దశలో ఆర్ష మహర్షుల సమిష్టి కృషి ఫలితంగా వెలసిన భారతీయ తొలి విజ్ఞాన భాండాగారాలుగా చెప్ప వచ్చును.

కాబట్టే వేద వాఙ్మయాన్ని గ్రహించి-"మానవ జాతి విజ్ఞాన సర్వస్వాంన దగిన వేదాలు మనకొక క్రొత్త అధ్యాయాన్ని సృష్టించాయి, వీటికి సాటిగా నిలువగలవి ప్రపంచలలో మరెచ్చటా కానరావు" అని మాక్సుముల్లర్ తన "హెరిటేజ్ ఆఫ్ ఇండియా" అనే గ్రంథంలో, వేద వాఙ్మయ ప్రాశస్త్యాన్ని ఉగ్గడించి యున్నాడు. 4

---

1. ఋ.భా.భూ. పుట 303
2. ఋ.భా.భూ–229
3. వి. స. II పుట - 178
4. "..................that literature opens to us a chapter in what has been called the education of human raee, to which we can find no parallal any where else"

— (మన సంస్కృతి-మన సాహితి-పుట-3)

అనంతమైన విశ్వ విజ్ఞానాన్ని మంత్ర ద్రష్టలైన ఋషులు మంత్ర రూపంలో వేదాల్లో నిబంధించడంవల్ల కాల గమనంలో ఆ విజ్ఞానమంతా అందరికీ అందుబాటులో లేకుండా పోయే స్థితి ఏర్పడింది. కాబట్టి ఆయా శాఖలకు చెందిన విజ్ఞానమంతా వేరుచేసి వ్యాఖ్యాన రూపంలో వేరువేరుగా చెప్పవలసిన అవసరం కూడా కలిగింది. దాని పరిణామమే వేద విజ్ఞానానికి వ్యాఖ్యాన రూపాలైన ఉపనిషత్తులు, వేదాంగాలు, దర్శనాలు స్మృతులు మొదలైన వాని ఆవిర్భావం. దీనిని మన విజ్ఞాన సర్వస్వాల క్రమ వికాసంలో రెండవ దశగా గుర్తించవచ్చును.

ఉపనిషత్తులు వేదసారములు. ఈ చరాచర జగత్తంతా ఏ విధంగా ? దేనినుండి ఉద్భవించింది ? జగదధిష్ఠాన తత్వానికి, మానవుని నిజ తత్వానికి గల సంబంధమేమి ? మొదలైన విశ్వ రహస్యాలకు పరిష్కార మార్గాలు సూచించిన విజ్ఞాన గనులు ఉపనిషత్తులు. 1

వే దా ం గ ము లు :-

ఇవి వేదాలకు అంగభూతములైన శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము (శబ్దశాస్త్రము) జ్యోతిషము, కల్పము అను ఆరు శాస్త్ర విషయాలను చర్చించిన గ్రంథాలు.

స్మృ తు లు :-

"వేదో ఖిలో ధర్మమూలమ్"— వేదాలు సర్వ ధర్మాలకు మూలము అగుట వల్లా, అటువంటి ధర్మ మూలమగు శ్రుతిజాల మనంతం కావడంవల్లా, ప్రతిపాదితములైన ధర్మాధర్మాలు ప్రజలందరకు సుబోధమయ్యేటట్లు చేసేందుకు పుట్టినటువంటివే స్మృతి గ్రంథాలు.

ద ర్శ న ము లు :—

"దృశ్యతే అనేన ఇతి దర్శనమ్"- అంటే దేనివల్ల చూడబడునో అది దర్శనమని అర్థము చూడబడునది సత్యము (తత్వము) మానవుల వస్తువుల, వసుల, వాగర్థముల, విజ్ఞాన విషయాల, ఇతిహాస కళాకౌశలాల, ఒక్కటేమిటి ఈ విశ్వమంతా— అందున్న పదార్థాల నిజ స్వరూపాలను, యథార్థ స్వభావాలను

1. వి. స. VII పుట-57

గూర్చి తెలిపేవి దర్శనాలు. అంత విజ్ఞాన నిక్షేపాలైన దర్శనాలను తత్త్వ జ్ఞాన భాండాగారాలని చెప్పవచ్చును.

న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంస, వేదాంగాలని దర్శనాలు ఆరు విధాలు. వీనిలో భౌతిక-రసాయనాది శాస్త్ర సిద్ధాంతాలు కూడా ఉన్నాయి. వైశేషిక దర్శన సూత్రాల్లో

"ప్రభవ స్థానం నుండి శబ్దం వాయు తరంగ రూపంలో
కదంబ కోరక న్యాయంగ ప్రసరిస్తుంది."

"వెలుగు-వేడి ఒకే పదార్థం యొక్క భిన్న రూపాలు" మొదలైన భౌతిక శాస్త్ర సిద్ధాంతాలను కణాదుడు ప్రతిపాదించి యున్నాడు.[2]

కొన్నివేల సంవత్సరాలకు పూర్వమే కణాదుడు ప్రతిపాదించిన ఈ సిద్ధాంతాలు నేటి శాస్త్రవేత్తలను సైతం ఆశ్చర్య చకితుల్ని చేస్తున్నాయి. విద్యారణ్యులు వ్రాసిన "సర్వదర్శన సంగ్రహం" అనే గ్రంథం తత్త్వ శాస్త్రానికి సంబంధించిన విజ్ఞాన సర్వస్వంగా పరిగణింబడుచున్నది.

ఈ విధంగా వైదిక వాఙ్మయంలో విస్తరిల్లిన విజ్ఞానమంతా కాలం గడిచేకొద్దీ, కాలంతోబాటు మారిన సమాజానికి అందుబాటులో లేకుండా పోయింది. వైదిక వాఙ్మయంలో వెల్లివిరిసిన విజ్ఞానమంతా చెల్లాచెదరై పోయింది. అలా ప్రకీర్ణమైన ప్రాచీన విజ్ఞానమంతా ప్రోగుచేసి, మరలా ప్రజలకందుబాటులోనికి తేవలసిన అవసరమేర్పడింది. దానికెన్నో ప్రయత్నాలు జరిగాయి. అప్పటి ప్రజల అభిరుచుల కనుగుణంగా కథా రూపంలో విజ్ఞానాన్ని అందించాలని భావించిన మహాకవులు ఇతిహాస-పురాణ రచనలకు పూనుకొన్నారు. దాని పరిణామ ఫలితంగానే మహాభారతం, పురాణాలు పుట్టాయి. ఇది మన విజ్ఞాన సర్వస్వాల క్రమవికాసంలో మూడవ దశగా భావించవచ్చును.

వివిధ శాఖలకు చెందిన విజ్ఞాన విషయాలను కావ్యేతిహాసాల్లో పొందుపర్చడమనేది మహాభారతంతో ప్రారంభమైంది. విజ్ఞాన ప్రసారానికి అనుకూలంగా వ్యాసమహర్షి అతి విస్తృతమైన ఇతి వృత్తాన్ని ఎన్నుకొని, తదనుగుణంగా ఏర్పరచుకొన్న రచనా ప్రణాళికలో కథా సందర్భాలననుసరించి, సందర్భాలను కల్పించి వివిధ శాఖలకు చెందిన విజ్ఞాన విషయాల నెన్నింటినో సమకూర్చి యున్నాడు.

---

2. వి. స. II పుట-2

భారతేతిహాసంలో వస్తువు ప్రధానంగా పాండవులకు, కౌరవులకు సంబంధించిందే అయినా కథతోపాటు దీనిలో దేవదానవుల ఉత్పత్తిక్రమం, రాజుల వంశ వర్ణనలు, ఋషుల చరిత్రలు, నీతిశాస్త్రం, ధర్మశాస్త్రం, తత్త్వ, న్యాయ శాస్త్రాలు, భరత వంశక్రమం, బాలక్రీడలు, అస్త్ర విద్యలు, ఆగ్నేయ, వాయవ్య గారుడాది అస్త్ర విశేషాలు, పద్మ, క్రౌంచాది యుద్ధ వ్యూహాలు, మల్లయుద్ధ, గదా యుద్ధ విశేషాలు, ధనుర్విద్య, మృత సంజీవిని విద్య, సమ్మోహినీ విద్య, కోదండ, నారాచ, ఖడ్గాది ఆయుధ విశేషాలు, మయసభవంటి అత్యద్భుత భవన నిర్మాణాలు. రాజసూయ, అశ్వమేధాది యజ్ఞ విశేషాలు. రాజనీతి సంబంధాలైన రాయబారాలు. నదులు, పర్వతాలు, ద్వీపాలు మొదలైన భూగోళ శాస్త్ర విషయాలు, ఉపనిషత్సారమైన భగవద్గీత, చతుర్విధ పురుషార్థాలు, మోక్ష ప్రాప్తి, మొదలైన విజ్ఞాన విషయాలెన్నో భారతంలో ఉండడంచేత దీనికి పంచమ వేద ప్రశస్తి గల్గింది. వీటన్నిటికి తోడు భారతంలో నాటి జనజీవన విధానం కూడా వర్ణించబడింది. కాబట్టే విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల మహాభారతాన్ని ఎవరు ఏ దృష్టితో చూస్తే వారికా విధంగా దర్శన మిస్తుందని ఆది కవి నన్నయ భట్టారకుని వక్కాణ.

సీ॥ ధర్మతత్వజ్ఞులు ధర్మ శాస్త్రంబని
యధ్యాత్మ విధులు వేదాంత మనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవి వృషభులు మహా కావ్యమనియు
లాక్షణికులు సర్వ లక్షణ సంగ్రహంబని
యైతిహాసకు లితిహాసమనియు
పరమ పౌరాణికుల్ బహు పురాణ సముచ్చ
యంబని మహిగొని యాడుచుండ

ఆ.వె॥ వివిధ వేద తత్వవేది వేద వ్యాసు
డాది ముని పరాశ రాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతమ్ము (ఆం.మ.భా.ఆ:వ 1-32)

తిక్కన మహాభారత ప్రాశస్త్యాన్నీ విధంగా ఉగ్గడించాడు.

కం॥ వేదములకు నఖిల స్మృతి
వాదములకు బహు పురాణ వర్గంబులకున్
వాదైన చోటులను దా
మూదల ధర్మార్థ కామ మోక్ష స్థితికిన్ (ఆం.మ.భా.వి.వ 1-4)

పై అభిప్రాయాలకు ఆధునిక తత్త్వాన్ని జోడించి భారతాన్ని పరిశీలించిన ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు—

"మహాభారతం ధర్మశాస్త్రం, నీతిశాస్త్రం, మహాకావ్యం,

పురాణం, ఇతిహాసం, లేదా వేదాంతశాస్త్రం, వేయేల అదికాని దేదీలేదు.

నిజానికది యొక విశ్వ విజ్ఞాన కోశమని చెప్పదగి యున్నది.1 అని చెప్పుటచే మహాభారతం విజ్ఞాన సర్వస్వమని చెప్పినట్లయినది.

పురాణాలు ఎంచుమించు భారతం వంటి రచనా ప్రణాళిక ననుసరించి వ్రాయబడినవే. విజ్ఞాన ప్రసారమునందు ఇవి కూడా అద్వితీయములే. మన దేశంలో ప్రబలిన జైన, బౌద్ధాది మతాల తాకిడి నుండి వేద మతాన్ని, వేద విజ్ఞానాన్ని రక్షించుకొనేందుకు, భిన్న భిన్న సంప్రదాయాలకు సమన్వయ రూపం సాధించేందుకు సాగిన కృషి ఫలితమే పురాణాల ఆవిర్భావం. నాటి సమాజంలో ప్రజాదరణకు పాత్రములైన పురా గాథలను అలంబనంగా తీసికొని విజ్ఞాన జిజ్ఞాసువులైన మహా రచయితలు తమ ప్రతిభా వ్యుత్పత్తులు ప్రసరించినంత మేరకు భారతీయ విజ్ఞానాన్నంతటిని ఈ పురాణాల్లో నింపి వానిని భారతీయ విజ్ఞాన సర్వస్వాలుగా తీర్చిదిద్దియున్నారు.

పురాణం పంచ లక్షణ సమన్వితమని అమరసింహుడు నిర్వచించి యున్నాడు. 2

ఈ పంచ లక్షణాల్లోనే సర్గ; ప్రతి సర్గలకు సంబంధించిన సృష్టి రహస్యాలు. మనువులు, వారి పరిపాలనాకాలం. ఇంద్రాదుల కాల నిర్ణయాలు రాజుల వంశ చరిత్రలు మొదలైన విజ్ఞాన విషయాలెన్నో నిక్షిప్తం జేయబడి

---

1. వి. స. VI పుట 204 to 207

2. సర్గశ్చ ప్రతి సర్గశ్చ వంశో మన్వన్తరాణిచ
వంశాను చరితం చేతి పురాణం పంచ లక్షణమ్" (ప్ర.మ.పు.పుట-8)

ఉన్నాయి. పురాణాలు పంచ లక్షణాలతో ఆగక విజ్ఞాన రంగంలోని వివిధ శాఖలను తమలో ఇముడ్చుకొన్నాయి.

పురాణాల్లో దాన ధర్మాలు, వ్రతాలు, ఉపవాసాలు, నదీనదాలు, పర్వత శ్రేణులు, ప్రాచీన జనపదాలు, వ్యాపార మార్గాలు, ద్వీప, ఖండ, వర్షాది భూగోళ విషయాలు. యోగ, వేదాంత, వైద్య, సంగీత, వాద్య, నాట్య, జ్యోతిష, గణిత, శిల్ప, వ్యాకరణ, ఛందోలంకార, రాజనీతి, అర్థ, సాంఖ్యాది శాస్త్రాద్యనేక విషయాలు వర్ణింపబడి ఉన్నాయి. కాబట్టే ఇవి భారతీయ విజ్ఞాన సర్వస్వాలుగా పరిగణింపబడుతున్నాయి.

పురాణాల్లోని విషయ సంఘాతాన్ని నిశితంగా పరిశీలించిన శ్రీహరప్రసాదశాస్త్రిగారు అష్టాదశ పురాణాలను ఆరు వర్గాలుగా విభజించాడు. అందులో మొదటిది విజ్ఞాన సర్వస్వాల్లాంటి పురాణాలు. ఈ వర్గంలో 1. గరుడ పురాణం 2. అగ్ని పురాణం 3. నారద పురాణం అనేవి చేరుతాయి. 1

గరుడ పురాణంలో పురాణ లక్షణాలతోబాటు గణిత, జ్యోతిశ్శాస్త్ర విశేషాలు, హస్తసాముద్రికం. నవరత్నాల విశేషాలు, వివిధాగమశాస్త్ర విషయాలు విస్తృతంగా చర్చించబడ్డాయి.

అగ్నిపురాణంలో రాజుల వంశ చరిత్రలు, రాజధర్మాలు యుద్ధ విశేషాలు, యుద్ధ పరికరాలు వాని లక్షణాలు, దండనీతి, స్వప్నశాస్త్రం, శకున శాస్త్రం, వాస్తు శాస్త్రం, ధనుర్విద్య, యజ్ఞవిధానం, సూర్యవంశ, చంద్రవంశ, యదువంశ వర్ణనలు ఆయుర్వేద వైద్యశాస్త్రం, వృక్ష విజ్ఞానం, కావ్య లక్షణాలు, నాటక నిరూపణాదికమైన అలంకార శాస్త్ర విశేషాలు, వ్యాకరణ యోగశాస్త్రాద్యనేక విషయాలు వివరించ బడ్డాయి. 2 కాబట్టి H. H. విల్సన్ గారు అగ్ని పురాణాన్ని విజ్ఞాన సర్వస్వంగానే పేర్కొన్నాడు. 3

ఆదే విధంగా వైద్య వ్యాకరణ సంగీత సాహిత్య జ్యోతిషాది వివిధ శాస్త్రాంశాలు, వివిధాగమ సూత్ర రహస్యాలు వివరింపబడి ఉండడంచేత నారద పురాణం గూడ విజ్ఞాన సర్వస్వంగానె పరిగణింపబడు చున్నది.

తెలుగు కావ్యభాషగా అవతరించిన ఆరంభ దశలో ఇట్టి విజ్ఞానాన్ని

---

1. ప్ర. మ. పుట ; 25
2. అ. పు. విషయసూచిక
3. V. P. Preface Page xxxvII

కావ్యేతిహాసాల్లో ఏకత్ర సంసుటింప చేసేందుకు ప్రయత్నాలు జరిగినట్లు కనుపించవు. సంస్కృత మహాభారతం, విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల గ్రంథం కాబట్టి, దాని అనువాదమైన తెలుగు మహాభారతంలో కొంత వరకు ఆ లక్షణాలు కనిపిస్తాయి. ఆ తర్వాత వచ్చిన కావ్యాల్లో ఇటువంటి లక్షణాలుగల గ్రంథాలు లేవనే చెప్పాలి.

నాచన సోమన, శ్రీనాధుడు, పోతన, అనంతరం కథా కావ్యాలు నిర్మించిన కవులు తమ తమ కావ్యాల్లో సందర్భాన్నిబట్టి అటనట వైద్యం, జ్యోతిషం ఛందస్సు, అలంకారాది శాస్త్ర విషయాలను ప్రస్తావించిన కావ్యాలు లేకపోలేదుగాని అవి విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల గ్రంథాలుగా చెప్పేందుకు వీల్లేదు. ఈ పరిస్థితికి కారణాలు కూడా లేకపోలేదు, నాటి కవులు, పండితులు సంస్కృతంలో నిష్ణాతులై ఉండడం, కవులు సంస్కృత కావ్యాలనే యధాతధంగా తెలుగులోని కనువదించడం రసపంతమైన కావ్యాల్లో విజ్ఞాన విషయాలచర్చ కథా గమనంలోను. రస విషయంలోను భంగం వాటిల్లి, వస్త్వైక్యం చెడుతుందేమోనని కవులు భావిలచడం. భాషాపరంగా చూస్తే తెలుగు భాషా పదజాలం సాంకేతిక విజ్ఞానాన్ని వివరించేటంతగా లేకపోవడం. ఈ మొదలైన కారణాలవల్ల ప్రాచీన తెలుగు కావ్యాల్లో విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల గ్రంథాలు వెలువడి యుండలేదని ఊహించవచ్చును.

తెలుగు సాహిత్య చరిత్రలో శ్రీకృష్ణదేవరాయల కాలం స్వర్ణయుగంగా పరిగణింపబడుచున్నవి. అంతవరకు వస్తున్న అనువాద రచనలుపోయి ప్రబంధ రచనా మార్గానికి అల్లసానివారు శ్రీకారం చుట్టారు. మనుచరిత్ర మొదలు కొని వచ్చిన ప్రబంధాల్లో రచనా వైవిధ్యంతోబాటు నాటి ప్రజల జీవిత విధానం చక్కగా చిత్రీకరించడం జరిగింది. ప్రజల ఆచార వ్యవహారాలు, వినోద విలాసాలు వస్త్రాభరణ విశేషాలు, వృత్తులు వృత్తి పనుముట్లు, తిరునాళ్ళు, వేటలు వేట పరికరాలు మొదలైన విశేషాలతో కూడిన సామాజిక శాస్త్రం ఈ ప్రబంధాల్లో బహుముఖంగా వర్ణించడం జరిగింది. అక్కడక్కడ వైద్య, సంగీత, భూగోళాది శాస్త్ర విషయాలు ప్రస్తావించబడియున్నా వివిధ శాఖలకు చెందిన విజ్ఞానాన్నంతటిని ఏకత్ర నిబంధించాలనే ప్రయత్నం జరిగినట్లు కనుపించదు. అందుకనే ఈ ప్రబంధాలను దేనికదే పరిశీలించిన విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల గ్రంథాలుగా చెప్పుటకు అవకాశం కనుపించడంలేదు.

శ్రీకృష్ణదేవరాయల అనంతరం ఆంధ్రభాషా యోష తంజావూరు మధుర సంస్థానాల్లో కొలువుదీరింది. ఈ కాలంలోను విజయ విలాసాది శృంగార ప్రబంధా లెన్నో వచ్చాయి! యక్షగాన ప్రక్రియ కూడా వెల్లివిరిసింది. కాని విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల గ్రంథాలు వెలువడిన దాఖలాలు కనుపించవు.

ఈ శృంగార ప్రబంధ యుగంలోనే క్రీ.శ. 1800 ప్రాంతంలో నున్న అయ్యలరాజు నారాయణామాత్యుడు హంస వింశతి అనే కథా ప్రబంధాన్ని నిర్మించాడు. దీనిలో జార శృంగారానికి సంబంధించిన ఇరవై రాత్రుల కథలు వర్ణించబడ్డాయి. కాని దీనిని చదివినవారి కెవరికైన ఇది కేవలం కథల కొరకే వ్రాసినట్లనిపించదు. హంస వింశతి ఇరవై కథల్లోను దాదాపు ఆనాటి సమాజంలోని అన్ని కులాల వారిని, వారి కుల వృత్తులను, వృత్తి పరికరాలను, గృహాలు, గృహోపకరణాలను, వారు ధరించు వస్త్ర భూషణాదులను, భుజించు ఆహార విశేషాలను, ఆచార వ్యవహారాలను, వినోద విలాసాలను, మొదలైన జన జీవిత విధానాన్ని కవి చక్కగా వర్ణించాడు. అంతేగాక విద్యా విషయాలు, బాలబాలికలాడుకొను ఆటలు, కోడిపందాలు, తిరునాళ్ళు, బాణసంచా, చెట్ల భేదాలు, పశు పక్ష్యాదులు, పంటలు, వంటలు గడ్డి భేదాలు మొదలైన సామాన్య విషయాలను సైతము కవి ఈ కావ్యం నిండా కథా సందర్భాల ననుసరించి ప్రస్తావించాడు. ఇవేగాక ఛందశ్శాస్త్రం, సంగీత శాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం, ప్రశ్న, శకున శాస్త్రాలు, గణిత శాస్త్రం, వైద్య రసాయన శాస్త్రాలు, మంత్ర శాస్త్రం, వాస్తు శాస్త్రం, కామశాస్త్రం మొదలైన అనేక శాస్త్రాంశాలను కథా సందర్భాల ననుసరించి, సందర్భాలను కల్పించి, కావ్యం నిండా పొందుపరిచారు. దేవాలయ నిర్మాణాలు, ఉద్యాన వన పెంపకాలు, పల్లకీ తయారీలు ఒక్కటేమిటి అతి సామాన్యాలైన గడ్డి భేదాలు మొదలు అత్యుత్కృష్టములైన వేద వేదాంగాలు వరకు నారాయణామాత్యుడు తన కావ్యం నిండా వివిధ శాఖలకు చెందిన విజ్ఞానాంశాలను నిబంధించాడు. ఈ విధంగా చేయడం వల్ల కథా గమనానికి ఆటంకమే అయినా విజ్ఞాన ప్రసారాన్ని కూడా ఆశించిన నారాయణకవి భావితరాల వారికి, ప్రత్యేకంగా తెలుగు ప్రజలకు మహోపకారమే చేశాడనే చెప్పాలి! ఎందుకంటె ఇప్పటికి దాదాపు 200 సంవత్సరాల నాటిదైన హంస వింశతిలో పేర్కొన్న క్రీడల పేర్లు, వడ్ల పేర్లు, వస్త్రాభరణాల పేర్లు, యుద్ధ పరికరాల పేర్లు మొదలైన అనేక విషయాల స్వరూప స్వభావాలెలాంటివో తెలియకుండా పోయాయి. అటువంటి సమయంలో ఆనాటి సమా

జంలోని అన్ని విషయాలను కనీసం వాటి పేర్లయినా మనకు గుర్తుండేటట్లు చేసి, మన విజ్ఞానాభివృద్ధికి దోహదం చేసిన నారాయణమాత్యుడు నిజంగా మనకు మేలే చేశాడని చెప్పాలి. పైన పేర్కొన్న వివిధ శాఖలకు చెందిన విజ్ఞానాంశాల నన్నిటిని హంస వింశతి నిండా పొందుపరచడం జరిగింది. కాబట్టి ఇది విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల కథా ప్రబంధంగా పేర్కొనబడుచున్నది. *

హంస వింశతి తర్వాత వచ్చిన ప్రబంధాల్లో విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల గ్రంథంగా ఏకుమళ్ళ రంగశాయి కవి రచించిన వాణీ విలాస వనమాలికను పేర్కొన వచ్చును. దీనిలోను కవి కథా సందర్భాల కనుకూలంగా వివిధాలైన శాస్త్ర విషయాలను వివరించాడు ఈ రెండు ప్రబంధాల రచనా పద్ధతులను పరిశీలిస్తే ఈ కవులిరువురు విజ్ఞాన ప్రసారాన్ని ధ్యేయంగా పెట్టుకొని తమ కావ్యాల నీవిధంగా మలిచారనడం స్పష్టము. నారాయణ కవియు, రంగాశాయి కవియు మన విజ్ఞానాన్నంతటిని తమ కావ్యాల్లో ఏకత్ర సంఘటింపజేసి, తద్వారా భావితరాల వారి కందించడంలో చేసిన కృషి ప్రశంసనీయము.

అయితే ఈ కవులిద్దరూ విజ్ఞాన ప్రసార విషయంలో తప్ప కథల నెన్నుకోవడంలోను విజ్ఞాన విషయాలను నిబంధించడంలోను, కథలను నడపడంలోను, భాషా విషయంలోను భిన్న దృక్పథాల నవలంభించిన వారని ఈ కావ్యాలను పరిశీలించిన వారి కెవరికైనా తెలియకపోదు.

హంస వింశతిలో నారాయణామాత్యుడు ఆనాడు సమాజంలో ఉన్న జారశృంగారేచ్ఛను, అటువంటి కథలంటే చెవి కోసుకొనే ప్రజల నాడిని తెలిసిన వాడవడంచేత జారశృంగారానికి సంబంధించిన కథలనే తన కావ్య వస్తువుగా స్వీకరించాడు. ** తద్వారా తాను తన ప్రబంధంలో నిబంధించబోయే విజ్ఞానాంశాలు కూడా ప్రచారానికి వస్తాయనే తలంపు కవికి లేకపోలేదు.

రంగశాయి కవి వాణి విలాస వనమాలికలో తాను చెప్పబోయే శాస్త్రాంశాల కనుకూలంగా కవుల, ఋషుల, రాజుల, దేవతల కథలను మాత్రమే కావ్య వస్తువుగా స్వీకరించడం జరిగింది. దీనియందు కవి మత విషయాలు, విద్యా

---

* హంస వింశతిలోని విజ్ఞాన విశేషాలను చివరి అధ్యాయంలోను, అనంతరం అనుబంధాల్లోను నిబ ధించడం జరిగింది.

** హంస వింశతికి ముందే పాలవేకరికదారీపతి వ్రాసిన జరశృంగార కథలతో గూడిన "శుక సప్తతి" ప్రచారంలో ఉంది.

విషయాలు, శాస్త్ర విషయాలకు సంబంధించిన వానిని విపులంగా వివరించి యున్నాడు. దీనిలో పొందుపరిచిన విజ్ఞానాంశాల పరిధి తక్కువ. హంస వింశతిలో నారాయణామాత్యుడు పొందుపరిచిన విజ్ఞానాంశాల పరిధి విస్తృతమైంది.

హంస వింశతిలో సామాజిక శాస్త్ర విషయాలు విపులంగా వర్ణించి యున్నా, మిగిలిన శాఖలకు చెందిన విజ్ఞానాంశాలన్నీ చాలవరకు పట్టికలుగా నివ్వడం జరిగింది. తన రచనా ప్రణాళికలో విజ్ఞాన ప్రసారాన్ని కూడా చేర్చిన కవి, హంస వింశతి ప్రధానంగా కావ్యం కాబట్టి, కావ్యత్వానికి భంగం వాటిల్లని తీరులో అవకాశమున్నచోట విషయాలను వివరించి, అవకాశం లేనిచోట పట్టికల రూపంలో నిచ్చి యుంటాడని ఊహించవచ్చును.

వాణీ విలాస వనమాలిక విజ్ఞానాంశాలను సంతరించడంలో హంస వింశతి మార్గాన్ని అనుసరించిందికాదు. ఇది నాలుగాశ్వాసాల ప్రబంధము. ప్రథమాశ్వాసంలో వరుణ దేవునకు భృగు మహర్షికి జరిగిన సంవాదంలో దేవత్వము, ప్రకృతి విషయము. వైకుంఠ వర్ణనము, రామ, కృష్ణావతార విశేషాలు, సప్త సముద్రాలు, పాతాళ, స్వర్గ వర్ణనలు చేయబడ్డాయి. రెండవ ఆశ్వాసంలో- నదులు పుణ్య స్థలాలు, పర్వతాలు వర్ణించబడ్డాయి. రాజధర్మాలు, కులధర్మాలు, వివరించబడ్డాయి. ఈ ఆశ్వాసంలోనే ఇంద్రుని కథా సందర్భంలో హిందూ మత ధర్మాలు, తులసి ప్రాముఖ్యం మొదలైన విషయాలెన్నో చెప్పబడ్డాయి. సన్యాసి- అప్సరసల కథలోను హిందూ మతానికి సంబంధించిన అనేక విషయాలను ప్రస్తావించడం జరిగింది. నాల్గవ అశ్వాసంలో- వేదాలు, ఉపవేదాలు బ్రహ్మ మరణాన్ని కల్పించడం, ధన్వంతరి ఆవిర్భావం. అయుర్వేద ప్రశస్తి, డెబ్బైరెండు వేల నాడీ భేదాలు. రోగాలు తత్ చికిత్సలు మొదలైన వైద్య శాస్త్ర విషయాలెన్నో వివరించడం జరిగింది. ఈ ఆశ్వాసంలోనే ధనుర్విద్య, మీమాంసాది శాస్త్రాలు, అలంకార శాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, గణితశాస్త్రము, అశ్వగజ శాస్త్రాలు, రత్నపరీక్ష మొదలైన విషయాలెన్నో ప్రస్తావించబడ్డాయి. [1]

---

1. వా. వి. వ. మా. Introduction Pages VI to XVIII

ఈ విధంగా ఈ ప్రబంధం నిండా అనేక విజ్ఞానాంశా లుండడంచేత ఇది కూడా విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల గ్రంథంగా పేర్కొనబడుచున్నది. బ్రౌను దీనిని హిందూ మతానికి సంబంధించిన విజ్ఞాన సర్వస్వంగా పేర్కొన్నాడు. 1

ఈ విధంగా విజ్ఞానాంశాలను ప్రబంధాల్లో ఏకత్ర నిబంధించడం మన విజ్ఞాన సర్వస్వాల క్రమ వికాసంలో నాల్గవ దశగా చెప్పవచ్చును.

ప్రబంధ యుగానంతరం మన సాహిత్యంలో హంస వింశతి, వాణీ విలాస వనమాలిక వంటి విజ్ఞాన సర్వస్వాలనదగిన గ్రంథాలు వెలువడినట్లు కనుపించడంలేదు. అప్పటికే ఆంగ్లేయులు మన దేశంలో స్థావరాల నేర్పాటు చేసుకోవడం, తర్వాత రాజ్యపాలన చేపట్టడం తద్వారా ఆంగ్ల భాషాభివృద్ధి క్రమ క్రమంగా మన దేశంలో అభివృద్ధిచేయడం జరిగింది.

ఆంగ్ల భాషా సాహిత్యాల ప్రభావం భారతదేశంలోని అన్ని భాషా సాహిత్యాల మీద ఉన్నట్లే మన భాషా సాహిత్యాల మీద కూడా ఉన్నది. ఇది కారణంగా మన సారస్వతంలో అనేక నూతన ప్రక్రియలు బయలుదేరాయి. ఆంగ్లంలో అకారాదిగా అత్యుత్తమ స్థాయిలో నిర్మించబడిన బ్రిటానికా విజ్ఞాన సర్వస్వం కూడా ప్రచారంలో ఉండేది. ఈ కారణాలుగా మన వారిలో మేధావులైన కొందరిని అకారాదిగా విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం ఆకర్షించింది. భారత దేశ భాషల్లోను ఇటువంటి విజ్ఞాన సర్వస్వాల నిర్మాణానికి ప్రయత్నాలు జరిగాయి. తెలుగులోను ఇటువంటి కృషి జరిగింది. మొట్టమొదట కొమర్రాజు వేంకట లక్ష్మణరావుగారి అధ్యక్ష్యాన ఒక పండిత సంఘ మేర్పడి ఆంధ్ర విజ్ఞాన సర్వస్వానికి అంకురార్పణ చేసింది. ఇది మన విజ్ఞాన సర్వస్వాల క్రమ వికాసంలో అయిదవ దశగా చెప్పవచ్చును. * పాశ్చాత్య భాషా సాహిత్యాల ప్రభావం

---

1. The Present work is a ganeral miscellany upon all branches of Hindu Learning.
(వా.వి.వ.మా. Introduction)

* మన భారతీయ విజ్ఞాన సర్వస్వాల క్రమ వికాసంలో వేదాలు మొదటి దశ. స్మృతి సాహిత్యం రెండవ దశ. ఇతిహాస పురాణాలు మూడవ దశ. (ఇంత వరకు సంస్కృత వాఙ్మయానికి సంబంధించింది) ఆ తర్వాత తెలుగులో ప్రబంధాలు (హంస వింశతి మొదలైనవి) నాల్గవ దశ. ఆధునిక విజ్ఞాన సర్వస్వాలు అయిదవ దశ. కాని ప్రత్యేకంగా తెలుగులో చూస్తే— పురాణేతిహాసాలు ఆరంభ దశ. ప్రబంధాలు రెండవ దశ. ఆధునిక విజ్ఞాన సర్వస్వాలు మూడవ దశగా భావించవచ్చును.

వల్ల, అకారాది వర్ణక్రమంలో, ప్రక్రియాపరంగా, పరిణాళికా బద్ధంగా నిర్మింపబడిన ఈ విజ్ఞాన సర్వస్వాలను ఆధునిక విజ్ఞాన సర్వస్వాలుగా పేర్కొనవచ్చును. ఈ ఆధునిక విజ్ఞాన సర్వసాల్లో చాలవరకు సమిష్టి కృషి ఫలితాలై ఉన్నా, కొన్ని వ్యక్తి ప్రజ్ఞాదీనములుగా కూడా ఉన్నాయి. మేధావులైన ఎందరో రచయితలు కలిసి నిర్మించినవి సమిష్టి కృషి ఫలితాలైన విజ్ఞాన సర్వస్వాలు. ఒకే వ్యక్తి తన ప్రజ్ఞా పాటవాలతో నిర్మించిన విజ్ఞాన సర్వస్వం వ్యక్తి ప్రజ్ఞాధీనమైంది. 1938 లో శ్రీ ప్రసాద భూపాలుడు రచించి ప్రకటించిన "ఆంధ్ర విజ్ఞానము" అనే గ్రంథం ఈ కోవకు చెందింది.

## ఆధునిక విజ్ఞాన సర్వస్వాలు :

(1) ఆంధ్ర విజ్ఞానము :

క్రీ॥ శ॥ 1916 ప్రాంతంలో మద్రాసులో కీ॥ శే॥ శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి ఆధ్వర్యాన ఒక పండితసంఘమేర్పడి, ఆంధ్ర విజ్ఞానము అనే పేర ఒక విజ్ఞాన సర్వస్వాన్ని నిర్మించేందుకు కృషిచేసింది. విశ్వవిజ్ఞానాన్నంతటిని సమీకరించి తెలుగు ప్రజల కందించాలనే ఉన్నతాశయాలతో, నిర్మించబడిన ఈ విజ్ఞాన సర్వస్వం ఉన్నత ప్రమాణాల్లో ఉంది. ఆయా విషయాల్లో నిష్ణాతులైన రచయిత లెందరో తమ వ్యాసాలనిందు పొందుపరిచారు. అకారాది వర్ణక్రమంలో నిర్మింపబడిన ఆంధ్ర విజ్ఞానంలో కళలు, సాహిత్యం, మానవీయ శాస్త్ర విషయాలు, ప్రకృతిశాస్త్రాలు మొదలైనవన్నీ చోటు చేసుకొన్నాయి. కాని లక్ష్మణరావుగారి మరణంతో ఈ విజ్ఞాన సర్వస్వం మూడు సంపుటాలు మాత్రమే వెలువడి ఆగిపోయింది. లక్ష్మణరావుగారి మరణానంతరం కాశీనాథుని నాగేశ్వరరావుగారు దీని కధ్వర్యం వహించారు. ఆయన కూడా కాలధర్మానొందడంచేత ఆంధ్ర విజ్ఞాన నిర్మాణ కృషి పూర్తిగా ఆగిపోయింది.

(2) ఆంధ్ర విజ్ఞానము :

ఇది వ్యక్తి పరిజ్ఞానాధీనమైన విజ్ఞాన సర్వస్వం. రచయిత ప్రసాద భూపాలుడు. ఇది 1938 లో వెలువడింది. సంగీత, సాహిత్యాది లలిత కళలు, చరిత్ర, భూగోళాది విషయాలు, వివిధ శాస్త్రాంశాలకు సంబంధించిన విజ్ఞానమంతా సంక్షిప్త రూపంలో ఇందు పొందుపరచబడింది. ఏడు సంపుటాల్లో వెలువడ్డ బృహత్ గ్రంథమిది.

(3) తెలుగు విజ్ఞాన సర్వస్వం :—

ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ నిర్మాణ మాగిపోవడంతో, మరలా కొంతకాలం అటువంటి ప్రయత్నమేమి జరుగలేదు. తర్వాత తెలుగు భాషా సమితివారు మొదట తమ కార్యాలయాన్ని మద్రాసులో నేర్పాటు చేసుకొని తెలుగులో ఒక సంపూర్ణ విజ్ఞాన సర్వస్వాన్ని నిర్మించేందుకు ప్రణాళికలు తయారు చేశారు. వీరు తయారు చేసుకొన్న ప్రణాళిక ప్రకారం మొదట పన్రెండు సంపుటాల్లో తెలుగు విజ్ఞాన సర్వస్వ మనేపేర ఈ గ్రంథాన్ని వెలువరించదలుచుకొన్నారు. అయితే అది తర్వాత 16 సంపుటాలకు పెరిగినట్లు తెలుస్తున్నది.

తెలుగు విజ్ఞాన సర్వస్వం అకారాది వర్ణక్రమంలో గాక ఒక్కొక్క శాఖా విజ్ఞానాన్ని ఒక్కొక్క సంపుటంలో వెలువరించిన గ్రంథం. ఆయా సంపుటాల్లోని విషయాల కనుకూలంగా గ్రంథాంతంలో అకారాది వివరణ భాగంకూడా జత పర్చబడింది. అవసరమైనచోట్ల చిత్రపటాలు సమకూర్చడం జరిగింది. గ్రంథారంభంలో రచయితల పరిచయం, గ్రంథం చివర అనుబంధాల్లో పరిభాష (తెలుగు–ఇంగ్లీషు, ఇంగ్లీషు-తెలుగు) పదాలు అకారాదిగా పొందుపరచబడ్డాయి. ఉపయుక్త గ్రంథ సూచిక (Selected Bibliagraphy) చేర్చబడింది.

తెలుగు విజ్ఞాన సర్వసాల్లో ఒక్కొక్క సంపుటానికి సంపాదకులెవరు? ఎప్పుడు ప్రచురించారు? ఏయే విషయాలున్నాయి? అనే అంశాలతో కూడిన పట్టిక యిచ్చుట ప్రచర్శింపబడుతున్నది.

| తెలుగు విజ్ఞాన సర్వస్వం సంపుటము | సంపాదకులు | విషయం | ప్రచురణ సంవత్సరం |
|---|---|---|---|
| మొదటి సంపుటము | గాడిచర్ల హరిసర్వోత్తమరావు మొ॥ | చరిత్ర—రాజనీతి | 1954 |
| రెండవ సంపుటము | " " | భౌతిక, రసాయనిక శాస్త్రాలు | 1955 |
| మూడవ సంపుటము | మల్లంపల్లి సోమశేఖరశర్మ మొ॥ | తెలుగు సంస్కృతి I | 1959 |
| నాల్గవ సంపుటము | " " | తెలుగు సంస్కృతి II | 1961 |
| ఐదవ సంపుటము | ఆచార్య వేమూరి వెంకటరామనాథం | ఆర్థిక, వాణిజ్య. భూగోళ శాస్త్రాలు | 1961 |
| ఆరవ సంపుటము | ఆచార్య దివాకర్ల వెంకటావధాని | విశ్వసాహితి | 1961 |
| ఏడవ సంపుటము | డా॥ కొత్త సచ్చిదానందమూర్తి | దర్శనములు, మతములు | 1962 |
| ఎనిమిదవ సంపుటము | మాగంటి బాపినీడు మొ॥ | వ్యవసాయ, పశుపాలన, అటవీ శాస్త్రాలు | 1964 |
| తొమ్మిదవ సంపుటము | డా॥ అ. నరసింగరావు మొ॥ | గణిత, ఖగోళ శాస్త్రాలు | 1965 |
| పదవ సంపుటము | సి. జె. జయదేవ్ మొ॥ | సాంఘిక శాస్త్రములు | 1965 |
| పదకొండవ సంపుటము | ఆచార్య జి. సి. వెంకటసుబ్బారావు మొ॥ | న్యాయ, పరిపాలనా శాస్త్రాలు | 1968 |
| పన్నెండవ సంపుటము | కె, ఎల్. రావు | ఇంజనీరింగు-టెక్నాలజీ | 1970 |

ఈ విధంగా సాగుతున్న ఈ తెలుగు విజ్ఞాన సర్వస్వం అకారాది వర్ణక్రమంలో లేకపోయినా యిప్పటికి తెలుగులో వెలువడిన విజ్ఞాన సర్వస్వాల్లో శ్రేష్ఠమైనదిగా భావించవచ్చును.

(4) సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశములు :-

అకారాది వర్ణక్రమంలో విషయాల నెన్నుకొని, వ్యాసాల రూపంలో నిర్మించిన విజ్ఞాన సర్వస్వమిది. ఆచార్య మామిడిపూడి వేంకట రంగయ్యగారు సంపాదకీయ మండలి అధ్యక్షులుగా ఇది ఎనిమిది సంపుటాల్లో వెలువడి ఉంది. మొదటి సంపుటం 1958 లో వెలువడగా చివరి సంపుటం 1971 లో వచ్చింది. వివిధ శాఖలకు చెందిన విషయ విజ్ఞానాన్నంతా సేకరించి, సంక్షిప్త రూపంలో తెలుగు ప్రజల కందించడమే దీని ధ్యేయమని ఈ సంస్థకు కార్యదర్శిగా వ్యవహరించిన ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు చెప్పుకొన్నారు.

ఒక్కొక్క సంపుటాని కొక్కరు సంపాదకులుగా వ్యవహరించిన ఈ విజ్ఞాన సర్వస్వంలో గ్రంథారంభంలో సంపాదకుల పరిచయం, రచయితల పరిచయం సమకూర్చడం జరిగింది. గ్రంథాంతంలోని అనుబంధాల్లో పదసూచికలు, పారిభాషిక పదాలు చేర్చబడ్డాయి.

(5) ఆంధ్ర సర్వస్వం :-

ఇది 32 అధ్యాయాల్లో నిర్మించబడిన విజ్ఞాన సర్వస్వం. చరిత్ర సంస్కృతి, సాంఘిక, ఆర్థిక, రాజకీయ, భూగోళాది శాస్త్రాంశాలు ఇందు ప్రధానంగా చర్చించబడ్డాయి. మాగంటి బాపినీడు, గిడుగు వెంకట సీతాపతి, మోటూరి సత్యనారాయణ దీనికి సంపాదకీయ వర్గంగా వ్యవహరించారు. 1961 లో వెలువడిన ఈ విజ్ఞాన సర్వస్వం, ప్రధానంగా ఆంధ్ర రాష్ట్రానికి సంబంధించిన విషయాలతో గూడి విద్యార్థుల నుద్దేశించి వ్రాయబడిందిగా కనుపిస్తున్నది.

(6) విజ్ఞాన దీపిక :-

నూకల నరోత్తమరెడ్డిగారి అధ్యక్షతన, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన విజ్ఞాన సర్వస్వమిది. 1976 లో వెలువడిన ఈ విజ్ఞాన సర్వస్వం రెండు సంపుటాలుగా ఉంది. మొదటి సంపుటంలో మానవీయ శాస్త్రాలు (Humanities) రెండవ సంపుటంలో విజ్ఞాన శాస్త్రాలు (Sciences) చర్చించబడ్డాయి. ఇది అకారాదిగా కూర్చబడిన విజ్ఞాన సర్వస్వంగాదు. ఇందులో ఆయా విషయాల్లో నిష్ణాతులైన వారి వ్యాసాలు పొందుపరచబడ్డాయి.

(7) ఆంధ్రప్రదేశ్ దర్శిని :-

ఇది ఆంధ్ర రాష్ట్రానికి సంబంధించి సమగ్ర విజ్ఞానాన్ని అందించే విజ్ఞాన

సర్వస్వం. వై. వి. కృష్ణారావు, ఏటుకూరి బలరామమూర్తి సంపాదకత్వంలో, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌసువారు 1976 లో దీన్ని ప్రచురించారు.

ఈ బృహత్ గ్రంథంలో ఆంధ్రప్రదేశ్ నైసర్గిక స్వరూపం మొదలు, రాజకీయ పాలనా యంత్రాంగం, సామాజిక పరిణామం, శాస్త్ర విజ్ఞానం, సాంకేతిక రంగాలు, విద్యలు, కళలు, సాహిత్యం, సంస్కృతి, జిల్లాల సమాచారం, తెలుగు వెలుగుల్లో ఆంధ్ర ప్రముఖుల జీవిత చరిత్రలు కూర్చబడ్డాయి. ఆంధ్ర రాష్ట్రానికి సంబంధించిన అన్ని విషయాలు దీనిలో చోటు చేసుకొని ఉండడంతో దీన్నొక ప్రాంతీయ విజ్ఞాన సర్వస్వంగా పరిగణించవచ్చును. గ్రంథారంభంలో రచయితల పరిచయం, గ్రంథాంతంలో ఆంధ్రప్రదేశ్ సంక్షిప్త చిత్రణం యివ్వడం జరిగింది. 1987 లో కొన్ని సవరణలు, మరి కొన్ని విషయాలు చేర్చి దీన్ని ద్వితీయ ముద్రణగా ప్రచురించారు.

(8) ప్రపంచ రాజ్య సర్వస్వము :

దేవులపల్లి రామానుజరావుగారి సంపాదకత్వంలో, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదువారు 1977 లో దీన్ని ప్రచురించారు. ఇది అకారాది వర్ణక్రమంలో నిర్మించిన గ్రంథంకాదు. ప్రపంచంలో ఉండే ఖండాలు-అందులో ఉండే దేశాలు ఇందులో పేర్కొనబడ్డాయి. ఒక్కొక్క దేశానికి సంబంధించిన చరిత్ర, పాలనా విషయాలు, ఆర్థిక సాంఘికాది విషయాలు, నైసర్గిక స్వరూపం మొదలైన అంశాలు, ఐక్యరాజ్య సమితి మొదలైన అంతర్జాతీయ సంస్థలు, ఇంకా ఎన్నో ప్రపంచ విషయాలిందు ప్రదర్శించడం జరిగింది. ప్రపంచ రాజ్యాలను గురించి సంక్షిప్తంగా తెలుసుకొనేందుకీ విజ్ఞాన సర్వస్వం దోహదం చేస్తుంది.

(9) వరంగల్ దర్శిని ;-

ఇది వరంగల్ జిల్లాకు మాత్రమే సంబంధించిన విశేష విషయాలతో కూడిన గ్రంథం. కె. జగదీశ్వర్‌గారి సంపాదకత్వంలో వెలువడిన ఈ గ్రంథంలో వరంగల్ జిల్లా విషయాలను గురించి బాగా తెలిసిన ఎందరో రచయితల వ్యాసాలెన్నో ఇందులో ఉన్నాయి.

ఓరుగల్లు నగరానికి సంబంధించిన ప్రాచీన చరిత్ర మొదలు ఆధునిక విషయాల వరకు గల- చారిత్రకాంశాలు, సాహితీమూర్తులు, సాంఘిక రాజకీయాది విషయాలు, కళలు, ఆధునిక పరిశ్రమలు, వ్యాపారం, దర్శనీయ స్థలాలు మొదలైన అన్ని విషయాలతో ఇది వరంగల్ జిల్లా సర్వస్వంగా భాసిస్తుంది. ఇది ఒక సంపూర్ణ విజ్ఞాన సర్వస్వం కాకపోయినా, కనీసం వరంగల్ జిల్లాకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వంగానైనా దీన్ని పరిగణించవచ్చును.

పాశ్చాత్య దేశాల్లో Encyclopaedia of wit, Encyclopaedia of Sports అనే విధంగా ఏదో ఒక శాఖకు చెందిన విజాన సర్వస్వాలు కూడా వచ్చాయి.* అదే విధంగా ఒక ప్రాంతానికి, లేదా రాష్ట్రానికి సంబంధించిన విజ్ఞాన సర్వస్వంగా ఆంధ్రప్రదేశ్ దర్శిని, ఒక జిల్లాకు సంబంధించిన విజ్ఞాన సర్వస్వంగా వరంగల్ దర్శిని మొదలైన వానిని స్వీకరించవచ్చును.

తెలుగులో వివిధ రీతుల విజ్ఞాన సర్వస్వాలు వెలువడి ఉన్నా, Encyclopaadia Br ttanica వంటి ఉన్నత స్థాయిలో సంపూర్ణమైన విజ్ఞాన సర్వస్వం తెలుగులో రావలసిన అవసరం ఎంతైనా ఉంది. అంతేగాకుండా పాశ్చాత్య దేశాల్లో వలె ఒక్కొక్క విజ్ఞాన విభాగానికి సంబంధించిన విజ్ఞాన సర్వస్వాలు కూడా తెలుగులో విరివిగా రావలసి ఉంది. వీటి నిర్మాణానికై అటు ప్రభుత్వం, ఇటు రచయితల కృషి ఎంతైనా అవసరం.

పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వాలు :-

పాశ్చాత్య దేశాల్లో మొట్ట మొదట విజ్ఞాన సర్వస్వ మనదగిన గ్రంథం ప్రాచీన గ్రీకు దేశంలో వెలువడి ఉంటుందని పండితు లూహించు చున్నారు. మహాతత్త్వవేత్త అయిన ప్లేటోకు శిష్యులైన అరిస్టాటిల్, స్పూస్యెపస్ (Speusippus) అను వాళ్ళలో ఒకరు క్రీ.పూ. 384-323 ప్రాంతాల్లో దీన్ని నిర్మించి యుంటారని పండితాభిప్రాయం. 1

అటు పిమ్మట ప్రాచీన రోము దేశానికి సంబంధించిన మార్కస్ టెర న్షియన్‌వారో క్రి.పూ. 166-27 ప్రాంతంలో ఒక విజ్ఞాన సర్వస్వాన్ని కూర్చి నట్లు తెలుస్తున్నది. ఈతడు జూలియస్ సీజరుకు సమకాలికుడుగా చెప్పబడు చున్నాడు. మార్కస్ నిర్మించిన విజ్ఞాన సర్వస్వంలో కావ్యశాస్త్రం, గణిత శాస్త్రం, జ్యోతిష వైద్య శాస్త్రాలు, సంగీత వాస్తు శాస్త్రాలుమొదలైన వివిధ శాస్త్ర విషయాలు చర్చించబడ్డాయట, 2

పాశ్చాత్య దేశాల్లో ఈ విధంగా కొనసాగుతూ వచ్చిన విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం ప్లీని అనే మేధావి సాహిత్య క్షేత్రంలో అడుగిడడంతో ఒక గొప్ప మలుపు తిరిగింది ఇతడు మొట్ట మొదట నేటి విజ్ఞాన సర్వస్వాల్లాంటి గ్రంథ సంపుటాలను సంతరించి విశ్వ విజ్ఞానాన్ని ప్రపంచ ప్రజలకు అందుబాటులోకి తెచ్చే ప్రయత్నం చేశాడు. వీరి కృషి ఫలితంగా నాచురల్ హిస్టరి అనే 37 సంపుటాల ఉద్గ్రంథం వెలుగులోనికి వచ్చింది. ఇది వ్యక్తి ప్రజ్ఞాధీనంగాక

---

* చూడు పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వాలు — పుట - 67

1. సం. వి. కో I (పీఠిక)
2. —Ibid—

నేటి విజ్ఞాన సర్వస్వాల వలెనే బహు కర్తృకమైన రచనా విశేషం. ఈ గ్రంథములో భూగోళశాస్త్రం మానవీయశాస్త్రం, జంతుశాస్త్రం, వృక్షాయుర్వేదశాస్త్రం, వృక్షశాస్త్రం, ఖనిజ శాస్త్రం వంటి వివిధ శాఖలకు చెందిన వివిధ విజ్ఞానాంశాలు విపులంగా చర్చించబడ్డాయి. 1

మధ్య యుగాల్లో ఐరోపా ఖండంలో ప్రజ్ఞావంతులైన కొందరు విజ్ఞాన సర్వస్వాల నిర్మాణానికై కృషి చేశారు. యూరపులో విజ్ఞాన సర్వస్వాల నిర్మాణానికై ప్రయత్నాలు జరుగుతున్న రోజుల్లో ఫ్రాన్సు దేశంలో ఫాదరీ బ్యూవే నగరానికి చెందిన విన్సెంట్ అనే మేధావి క్రీ.శ. 1190-1264 మధ్య కాలంలో "స్పెక్యులమ్ మాజస్" అనే గ్రంథాన్ని సమకూర్చాడు. వ్యక్తి ప్రజ్ఞాధీనమైన ఈ ఉద్గ్రంథం మధ్య యుగాల్లో వెల్లివిరిసిన విజ్ఞానానికి అద్దం పట్టిందని ప్రశంసింపబడింది.

ఈ విధంగా ప్రారంభ దశలో పాశ్చాత్య దేశాల్లో వివిధ శాఖలకు చెందిన విజ్ఞానాంశాలతో వెలువడిన గ్రంథాలన్నీ విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల గ్రంథాలేగాని విజ్ఞాన సర్వస్వం అనే పేరుతో వెలువడినవికావు. భారతీయ విజ్ఞాన సర్వస్వ క్రమవికాసంలోను ప్రాచీన గ్రంథాలు విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గలవేగాని విజ్ఞానసర్వస్వమనే పేరుతో ప్రచారానికి వచ్చిన గ్రంథాలులేవు.

పాశ్చాత్య దేశాల్లో క్రీ.శ. 16వ శతాబ్దంలో మొట్ట మొదటిసారిగా విజ్ఞాన సర్వస్వాలనే పేరుతోనే కొన్ని గ్రంథాలు వెలువడ్డాయి కాని ఇవి పరామర్శ గ్రంథాలై అన్ని శాఖలకు చెందిన విజ్ఞాన విషయాలతో కూడినవిగాక తరచుగా తాత్విక సంబంధమైన విషయాలతోను, కళలకు సంబంధించిన విషయాలతో కూడినవై ఉండేవి. 2

జర్మను దేశంలో క్రీ.శ. 1630 ప్రాంతాన ఆల్‌స్టెట్ లాటిను భాషలో ప్రకటించిన గ్రంథం విజ్ఞాన సర్వస్వాం నిర్మాణంలో క్రొత్త దశను ప్రారంభించింది. ప్రప్రథమంగా ఎన్‌సైక్లోపిడియా అనే పేరుతో వెలువడిన ఈ గ్రంథం నేటి విజ్ఞాన సర్వస్వాలవలె అకారాది క్రమంలో కూర్చబడి యుండడం మరొక విశేషం.

క్రీ.శ. 16వ శతాబ్దంలో విద్యా సంబంధమైన విషయాలతో గూడిన సంక్షేపరూపమైన గ్రంథాలు గూడ విజ్ఞాన సరస్వాలుగానే వ్యవహరింపబడు

1. సం. వి. కో I (పీఠిక)
2. E. B. VIII - 364.

చుండేవి క్రీ. శ. 17, 18 శతాబ్దాల్లో నిఘంటువులు, కోశములు (Dict.onaries and Lexicons) కూడ విజ్ఞాన సర్వస్వాలుగానే పరిగణింపబడుచుండేవి. 1

క్రీ.శ. 17వ శతాబ్దంలోనే తాత్త్విక సంబంధమైన విషయాలనుండి విజ్ఞాన సర్వస్వాల పరిధి కళలు ప్రకృతి శాస్త్ర విషయాల వరకు విస్తృత పరచడం జరిగింది. ఈ కాలంలోనే వివిధ శాఖలకు చెందిన విశ్వ విజ్ఞానంతో గూడిన విజ్ఞాన సర్వస్వాల నిర్మాణంతో బాటు, ఏదో ఒక శాఖకు చెందిన విజ్ఞానాంశాలను నిబంధించిన గ్రంథాలు కూడా వచ్చాయి. ఇవి కూడా విజ్ఞాన సర్వస్వాలుగానే పరిగణింపబడుచుండేవి. ఇవి హాస్యానికి సంబంధించినవి. క్రీడలకు సంబంధించినవి, వ్యావసాయక, భౌగోళిక, సాంకేతిక, సామాజికాది శాస్త్ర విషయాలకు సంబంధించినవెన్నియో ఇటువంటి విజ్ఞానసర్వస్వాలు వెలుగులోనికి వచ్చాయి. అంతేగాక ప్రత్యేకంగా మత, సాంస్కృతిక సంబంధమైన విషయాలతో గూడిన విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం కూడా ఈ కాలంలోనే జరిగింది.2

క్రీ. శ. 14 వ శతాబ్దం నుండి 16 వ శతాబ్దం వరకు సాగిన విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం రెండు విభిన్న మార్గాల్లో జరిగిందని చెప్పవచ్చును. (1) వివిధ శాఖలకు చెందిన విజ్ఞానాన్ని క్రమ పద్ధతిలో సమీకరించి ఏకత్ర సంఘటించడం. (2) తాత్త్విక, విద్యా, భాషా, నిఘంటు, చరిత్ర, జీవిత చరిత్రాది విషయాలను వేరు వేరుగా సమకూర్చడం.

వివిధ శాఖలకు చెందిన విజ్ఞాన విషయాలను పట్టికలుగా నిచ్చిన గ్రంథాలు కూడా విజ్ఞాన సర్వస్వాలుగా పరిగణింపబడుచుండేవి. ఇవి పైన వివరించిన రెండు విభిన్న మార్గాల్లో, మొదటి మార్గానికి సంబంధించనవై ఉన్నాయి. 3

---

1. Pedagogical manuals were often called encyclopeadias in 16 th century and encyclopeadias were often Called dictionarees and Lexlcons in 17th and 18th centuries·
2. In the 17th Century the term was applied also to work that used all the seiences in app'ication to a perticular subject............ Such as encyc'opeadia of wit and sport, agriculture, Geography, technology, arts and manufacturers law and Social Sciences, Literature .................... or of Perticular religion or cultures such as Islamic, catholic, Jewish encyclopeadias.
3. "The works that are usually listed as encyclopeadia follow the first tendency". E B. Vol. VIII Page 3[illegible]4

క్రీ శ. 17వ శతాబ్దంలోనే ఇంగ్లీషులో కూడ అకారాది వర్ణక్రమంతో విజ్ఞాన సర్వస్వాలను నిర్మించడం ప్రారంభమైంది. జాన్ హారిస్ అను ఆంగ్ల పండితుడు క్రీ.శ. 1667-1719 ప్రాంతంలో "కళలు-ప్రకృతి శాస్త్రాల ఆంగ్ల విశ్వకోశము" (An universal English dictionary of Arts and Sciences) అనే విజ్ఞాన సర్వస్వాన్ని ప్రకటించాడు. ఇది నేటి విజ్ఞాన సర్వస్వాల వలె సమిష్టి కృషి ఫలితమై ఉన్నది. జాన్ హారిస్‌కు సమకాలికులైన ఎందరో పండితుల రచన లీ గ్రంథంలో చోటు చేసుకొన్నాయి. విశ్వ విఖ్యాత శాస్త్రవేత్త అయిన న్యూటన్ "ఆమ్లములు" అనే అంశంపై ఈ గ్రంథంలో ఒక వ్యాసాన్ని ప్రకటించినట్లు తెలుస్తున్నది. అకారాది వర్ణక్రమంలో విజ్ఞానాన్ని సేకరించడమేగాక, ఉపయుక్త గ్రంథాల పట్టికల నివ్వడం కూడా ఈ గ్రంథం లోని ప్రత్యేకతగా కనుపిస్తుంది.

క్రీ.శ. 19వ శతాబ్దంలో ఈ విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం మూడు మార్గాల్లో సాగింది. (1) కళలు-ప్రకృతి శాస్త్రాలకు సంబంధించిన వ్యాసాలతో గూడిన విజ్ఞాన సర్వస్వాలు (Combination of artic'es on Arts and Sciences) (2) వివిధ విషయాలను గూర్చి సుదీర్ఘ వ్యాసాలతోను, పదాలకు సంబంధించిన సంక్షిప్త విషయ విపులీకరణంతోను, ఒక క్రమ పద్ధతి ననుసరించి విజ్ఞానాంశాలను సమీకరించిన గ్రంథాలు (Development of simple short entry encyclopeadias of systematic long entry encyclopeadias that combined long articles about subjects with short articles about terms) (3) ఆయా విషయాలపై రచించిన పరిశోధనాత్మక వ్యాసాలను అకారాది వర్ణక్రమంలో సమీకరించిన విజ్ఞాన సర్వస్వాలు.

పాశ్చాత్య దేశాల్లో ఈ విధంగా సాగిన విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం ఈ అనంతకాల వాహినిలో ఎన్నో మార్పులు, చేర్పులు పొంది, వివిధ దశల నధిగమించి ఇప్పుడు ప్రక్రియా రూపంలో, ప్రణాళికాబద్ధమై నిర్మింపబడు తున్నాయి. విశ్వ వీధుల్లో వికీర్ణమై పడియున్న విజ్ఞానాన్నంతటిని సేకరించి అకారాది వర్ణక్రమంలో నిబంధింపబడిన ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా, ఎన్‌సైక్లోపీడియా అమెరికానా, ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వము మొదలైనవన్నీ ఈ కోవకు చెందినవే.

# 5

# హంస వింశతి - నిఘంటులక్షణాలు

విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల హంస వింశతిలో నిఘంటు లక్షణాలు కూడా ఉన్నాయి. నిఘంటువులు శబ్ద జ్ఞానాన్ని పెంపొందించుకొనేందుకు దోహదం చేసే గ్రంథాలు. శబ్ద జ్ఞానం కూడా విజ్ఞాన సర్వస్వ లక్షణాల్లో ఒక భాగమే.

ని = నిశ్చయేన. ఘంటయతి = భాషయతి. అని నిఘంటు పదానికి వ్యుత్పత్తి. 1 అంటే శబ్దాలను గురించి నిశ్చయంగా స్పష్టంగా చెప్పేది నిఘంటువని తెలుస్తున్నది.

మన ప్రాచీన నిఘంటువులు సంస్కృతంలోని అమరకోశాదులు కానీ, తెలుగులోని నానార్థ రత్నమాల, ఆంధ్రనామ సంగ్రహం, సాంబ నిఘంటువు మొదలైనవి కానీ ఒక పదానికి సమానార్థకాలుగా ఉండే పదాలను చేర్చి నిర్మించిన నిఘంటువులే. ఈనాటి నిఘంటువుల్లో మాదిరి అకారాది వర్ణక్రమంలో పదాలు వాటికి అర్థాలునిచ్చే పద్ధతి మన ప్రాచీన నిఘంటు రచనా ప్రణాళికలో లేదు. హంస వింశతి కూడా మన ప్రాచీన నిఘంటు రచనా ప్రణాళిక ననుసరించిందనే చెప్పాలి. అంటే ఒక పదానికి సమానార్థాలుగా, సమీపార్థాలుగా ఉండే పదాలను కూర్చి కవి హంస వింశతిలో సందర్భానుకూలంగా కొన్ని చోట్ల ప్రవర్తించాడు.

స్నేహం, అనురాగం, మంచితనం అనే పదాలకు పర్యాయ పదాలనీ క్రింది పద్యంలో ఒక పట్టిక రూపంలో కవి పొందుపరిచాడు.

---

1. సం.వి.కో. V- పుట 235

సీ॥ దాక్షిణ్య మనురక్తి దయయు విశ్వాసంబు
బాంధవ్యము హితంబు భయము భక్తి
అంతఃకరణము సఖ్యంబుఁ బోరామియు
నేస్తంబు చెలిమియు నెనరు ప్రేమ
చల్లదనంబు వాత్సల్యంబు కలువుగో
త్తనము ప్రీతియు మంచితనము మైత్రి
ప్రాణపదంబు తాత్పర్యంబు గారాబ
మను గుణ మనుబంధ మనుసరింపు

తే॥ మచ్చికయు చుట్టరిక మైక్య మిచ్చకంబు
స్నేహ మనురాగ మాసక్తి మోహ నియతి (2-42)

విటుడు, వేశ్యాపతి అనే పదాలకు సమానార్థక పదాలను సందర్భాను సారంగా కవి ఏ విధంగా సమకూర్చాడో మనమీ క్రింది పద్యంలో చూడగలం.

సీ॥ వేశ్యాపతి చకోరవి రసంబులకు నురి
విటలతావళికి లవిత్రకంబు
యువజన మాతంగ నివహంబు కోదండబు
కాముక వ్యాఘ్రపుంబు గమికి బోను
పాంధమాన సమత్సుపటలికి గాలంబు
పల్లవోక్షాళికి వల్లెత్రాడు
షిద్గకపోతరాజికి చీరు దీమంబు
హిత భుజంగ హిహంగ తతికిఁ బిపురు

తే॥ జార కిటి కోటికిని మోటు, నరస శశక
సంతతికిని గట్టువ, యుపకాంత చటక
సంఘమునకును గుబ్బిక శంబరారి
ఘోర రణహోరి జయభేరి ... వారి. (2-83)

పై సందర్భంలో పద్య భావాని కనుగుణంగా కవి ఒక్కొక్క పాదంలో విట శబ్దానికి ఒక్కొక్క సమానార్థక పదాన్ని కూర్చి రచించడం జరిగింది.

అబద్ధంలేదు అనే అర్థంలోగల పదాలు ఈ క్రింది పద్యాల్లో మొదటి

దాంట్లో పట్టిక రూపంలోను, రెండవ దాంట్లో భావానుగుణంగాను పొందు పరచబడ్డాయి.

తే॥ నాస్తి యనృతంబు దబ్బర నహిహుళక్కి
కల్లమరి యిల్ల లేదు .... ...... (2-145)

పై పద్యంలోని పదాల్లో "నహి" (హిందూస్తానీ) "ఇల్ల" (తమిళం) అనే అన్య దేశీయాలు కూడా కనిపిస్తున్నాయి. ఇది అనాటి మన తెలుగు భాషా స్థితిని తెలియపరుస్తుంది.

మ॥ గుణమాసెబ్ర వివేకమానహి మనోగూఢత్వమా లేదు భా
షణమా కల్ల విచారమాతవశి వంశాచారమా నాస్తి మా
ర్గణ ముఖ్యావన శీలమా శశశృంగప్రాయ మాప్తాది తో
షణమా దబ్బర నత్యమా హుళక్కి గణించన్ వాని కద్రిస్తనీ
(5-111)

జలాశయమనే పదానికి పట్టిక రూపంలో నిచ్చిన పర్యాయ పదాలు.

కం॥ తిరుకొళము నూయి కోడును 1
చెరువు మడువు లొండుకుంట చెలమ పడియ కో
నెరు బుగ్గవాగు దొన తల
పరి గుండము కాల్వ 2 డిగ్గి బావి దొరువులన్ (4-210)

గమనిక :— ఈ పద్యాల్లోని కొన్ని పదాలకు అర్థాలు తెలియకుండా వాటి స్వరూపాలే మారిపోయి ఉన్నాయి కాబట్టి అటువంటి పదాలకు పాఠ భేదాలు కూడా యివ్వబడ్డాయి. కోడు, లొండు అనే పదాలకు నీటి పల్లము, జలాశయము అనే అర్థాలు శబ్దరత్నాకరంలో ఉన్నాయి. కాని తలపరి అనే దానికి మాత్రమీ యర్థం కనిపించడంలేదు. బహుశా ఈ పద స్వరూపం మారి ఉంటుందేమో.

హేమావతి అందాన్ని హంస మెచ్చుకొనే సందర్భంలో విలాసం, సొంపు, అందం అనే అర్థాల్లో ఉండే పదాలను ఒక పట్టిక రూపంలో కవి పొందుపరిచాడు.

---

పాఠ భేదాలు :- 1. నూతి మోటను 2. లోన (శృం.గ్రం)

సీ॥ సొగసు మిటారంబు సొంపు నొయారంబు
నీటు జాణతనంబు 1 నెఱతనంబు 2
సొబగు నాగరికత చొక్కాట మును డెక్కు
గరిగరికయు 3 రాణ కలికితనము 4
హొయలు చక్కదనంబు నొనపరితనమును 5
సొరును 6 జెలువంబు నరసతయును 7
హొను చమత్కార మారజంబును నేర్పు
రవణము నెఱతీవి రకము వన్నె

తే॥ సిన్తు జిగిబిగి వగబాగు చిన్నె మెప్పు
పెరిమె 8 నాణెంబు మురిపెంబు పెద్దతనము
కులుకు ప్రోడతనము 9 ముద్దు గొనబు తియ్య 10
మంద మిట్లుండ వలదె హాయసుచు బలికె (5-86)

ఆకతాయిగా తిరిగి చెడిపోయిన వాడి నారోజాల్లో ఎన్ని రకాలుగా అనే వాళ్ళో ఈ క్రింది పద్యంలో మనకు కనిపిస్తుంది.

సీ॥ ఆకతాయి బికారి యడిబండ గుండడు 11
మొండి కట్టె గులాము మొప్పెగోవు
బోలె గాడగచాట్లపోతు దుర్మార్గుండు
పడిసేటును 12 గరాసు పందలండి
కొయ్యత్రిప్పు ఖరాబు కూళ 13 బందెలమారి
ముండరి పాపాలముద్ద ధగిడి

---

పాఠ భేదాలు :- 1) జగ్గుతనంబు 2) నేవళంబు 3) గరికరికందంబు
4) ఘనత నడక 5) నొనవరి నెరదీవి 6) నవరణ
7) సరసరీతి 8) పేరు 9) ప్రౌఢత్వ మభినుతి
10) నెళవు 11) యడిగుండబండడు 12) బడిశవాటు
13) కోచ

గులాము, హరాంకోరు, బికారి, మొదలైనవన్నీ హిందూస్థానీ పదాలకు రూపాంతరాలు కావచ్చును. ప్రాద్యాయి, యత్భవిష్యుండు మొదలైన పదాలు తత్సమాలు. ఇవి ముఖ్యంగా 'చదువుకొన్నవాళ్ళు,' బ్రాహ్మణులు వాడేపదాలు. పలుగాకి, ఉలిపికట్టె, దర్వేసి మొదలైనవి రాయలసీమ, నెల్లూరు ప్రాంతాల్లో వ్యవహారంలో ఉండే మాండలికాలు.

అష్టోత్తర శత తిరుపతులను, అందు కొలువై ఉండే విష్ణుమూర్తులను దర్శించి వందనాలర్పించే సందర్భంలో వందనం, ప్రణతి, నమ్రత అనే పదాలకు కవి నూట ఎనిమిది సమానార్థక పదాలను సమకూర్చాడు. (4–231) వాటి నెలాగు రాబోయే అధ్యాయాల్లో వివరించడం జరుగుతుంది కాబట్టి ఇక్కడ చూపడంలేదు.

ఈ విధంగా పూర్వ నిఘంటువుల రచనా పద్ధతిలో అక్కడక్కడా హంస వింశతిలో కొన్ని పద్యాలుండడంవల్ల ఇది ఏ విధంగా చూచినా భాషా నిఘంటువుల నుండి భేదించడంలేదని బ్రౌను పేర్కొన్నారు [1]

## హంస వింశతి - పదజాలము :-

భాషాపరంగా హంస వింశతిని పరిశీలిస్తే ఇది తెలుగు శబ్దజ్ఞానాన్ని పెంపొందించుకొనేందు కుపయోగపడే కావ్యంగా కూడా కనిపిస్తుంది. తత్సమ, తద్భవ, దేశీయాలే కాకుండా అన్య దేశీయాలైన తమిళ, కన్నడ, ఉర్దూ, పారసీ భాషా పదాలెన్నో ఈ కావ్యం నిండా ఉన్నాయి. "పరంగులింగిలీసులు, పరాసులు, వళంద (3–29) మొదలైన పాశ్చాత్య దేశ భాషాపదాలు కూడా హంస వింశతిలో కనిపిస్తాయి.

పై పద్యాల్లో చూపిన పర్యాయ పదాలే కాకుండా వృత్తిపరమైన, వాణిజ్య వ్యాపారాలకు సంబంధించిన, రాజకీయ పాలనా పరమైన సాంకేతిక పదాలెన్నో ఈ హంస వింశతిలో పట్టికల రూపంలో ఇవ్వబడ్డాయి. గణిత, జ్యోతిష, యోగ, ఆయుర్వేద, వాస్తు, జంతు, వృక్ష శాస్త్రాది పదాలు లెక్కకు మిక్కుటంగా ఈ కావ్యం నిండా చోటు చేసుకొన్నాయి *. విస్తృత పరిధిలో

---

1. "...Many of the verses are in reality mere vocabularies of similar words, in no respect differing from the dictionaries of the Language."
(హం.వి.ప్రా.ప్ర. Vol I D.No. 912 (M.M.S. Library)

* (ఈ సాంకేతిక పదజాలాన్నంతటిని ఆయా వర్గాలుగా విభజించి, దాదాపు [illegible] పదాలను రాబోయే అధ్యాయాల్లో వివరించడం జరిగింది.

వివిధ వర్గాలకు చెందిన పదజాలం కల్గిందవడంచేత భాషా పరంగా హంస వింశతి విలువను గమనించిన బ్రౌను దీనికొక శబ్ద సూచికను తయారు చేశాడు. ఇది రెండు సంపుటాల్లో మద్రాసు ప్రాత ప్రతుల గ్రంథాలయంలో భద్రపరచ బడి ఉంది. 1

హంస వింశతి తన సమకాలీన జీవిత విధానాన్ని చిత్రించడంలోను, భాషా జ్ఞానాన్ని జనసామాన్యాని కందించడంలోను ఉపయోగపడేటట్లు కవి [illegible] బ్రౌను చెప్పిన ఈ వాక్యాలను పరిశీలిస్తే మన కవగతమౌతుంది.

"The Hamsavimsathi of the Telugu phoer ix the swan's tales being twenty amorous stories written by Ayyalaraju Naraya nappa to exemplity the Telugu Language in topies of common life every class of meen ......"

"The authour has taken this mode to induce readers to learn the language who would have rejected the usual rotine of study............" 2

హంస వింశతిలోని పదజాలాన్ని గురించి శ్రీ కందుకూరి బాలప్రసాద్ భూపాలుడుగారి అభిప్రాయ మీ విధంగా ఉంది.

"అయ్యలరాజు నారాయణ కవికి పదసంపద మెండు. సాధారణ వ్యాపారములకును, కృషులకును సంబంధించిన వ్యవహార పదములను ఈతని వలె చేర్చి పట్టికలుగా నొనర్చిన కవి మరియొకడు లేడు అన్యదేశ పదముల నితడు పుష్కలముగా వాడి యున్నాడు." 3

హంస వింశతిని చదివవారి కెవరికైనా అది శబ్ద జ్ఞాన ప్రచారంలోను, విజ్ఞాన ప్రసారంలోను, సమకాలీన జీవిత విధానాన్ని చిత్రించడంలోను అప్పాడు వెలువడ్డ కథా ప్రబంధాల్లో కొంత ప్రత్యేకతను సంతరించుకొన్నదని తెలుస్తుంది.

---

1. హం. విం. శ. సూ. 1 D 3100 & D 3102

2. హం.విం. (వా.ప్ర.) Vol I D.No. 9/2 M.M.S. Library

3. ఆం.వి.స. II పుట - 1486.

# 6

# హంస వింశతి - విజ్ఞాన సర్వస్వ లక్షణాలు

హంసవింశతి శారశృంగారానికి సంబంధించిన ఇరవై కథలతో కూడిన కథా ప్రబంధమని మొదటి అధ్యాయంలో వివరించడం జరిగింది. కథలతో పాటు విజ్ఞాన ప్రసారాన్నికూడా ఆశించినవా డవడంచేత అయ్యలరాజు నారాయణామాత్యుడు కథాసందర్భాల ననుసరించి, సందర్భాలను కల్పించి ఈ ప్రబంధంనిండా వివిధ శాఖలకు చెందిన ఎన్నో జ్ఞాన, విజ్ఞాన విషయాలను వివరించాడు. కాబట్టే ఇది విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల కథా ప్రబంధంగా సాహిత్య క్షేత్రంలో ప్రచారానికి వచ్చింది.

జ్ఞానము-విజ్ఞానము -

సర్వసాధారణంగా జ్ఞానం, విజ్ఞానం అనే రెండుపదాలు సమానార్థకాలుగా వ్యవహారంలో నున్నా, సూక్ష్మంగా పరిశీలిస్తే ఈ రెంటికి కొంత భేదం లేకపోలేదు. బాహ్యవస్తువులపై ఇంద్రియాలు ప్రవర్తిల్లడంవల్ల కలిగే ఎరుకనే జ్ఞానమంటున్నారు. దీనినే ప్రత్యక్ష జ్ఞానం లేదా సామాన్యజ్ఞానం అని కూడ అంటారు. అయితే ఇలా కలిగిన సామాన్యజ్ఞానానికి బుద్ధిని సమన్వయపరిచి సమన్వయించినపుడది అనుభవమౌతుంది. ఈ అనుభవం తర్కచాలితమై కార్యకారణ [illegible] నియమబద్ధమై నిలచినప్పుడది విజ్ఞానంగా పరిణమిస్తుంది. [illegible]

అనగా మనం ఒక వస్తువును చూచినపుడు మన కేర్పడు ఎరుకను బుద్ధి, దాన్ని తర్కచాలితంచేసి, ఆ వస్తువు గుణగణాలను విచారించి ఇది, ఈ కారణంగా వృద్ధి చెందుతుంది, ఫలానా కారణంగా నశిస్తుంది. ఈ విధంగా చేస్తే దీనినింకొక వస్తువుగా మార్చవచ్చును మొదలైన విషయాల నన్నిటిని ఒక నియమ పద్ధతిలో చెప్పినప్పుడు అది ఆ వస్తువును గూర్చిన విజ్ఞానమౌతుంది.

---

1. వి. స. సం. II-పుట-1.

ఉదాహరణకు మనం ప్రకృతిలోనున్న ఒక పిట్టను చూచినపుడు వెంటనే అది ఏదో ఒక పక్షియని మాత్రం మనకు తెలుస్తుంది. ఇలా తెలియడం సామాన్య జ్ఞానం మాత్రమే. ఇక దానిని గురించి విచారించి అది ఏజాతి పక్షి? దాని పుట్టుక ఎట్టిది? స్వరూప స్వభావాలేమి? ఊర పక్షియా ? జల పక్షియా ? ఆహారమేమిటి ? ఋతుకాలమెప్పుడు ? ఎన్ని గ్రుడ్లు పెడుతుంది? పిల్లలనే విధంగా చేస్తుంది? అది స్థానికమైందా? వలనవచ్చిందా? సరాసరి దాని జీవిత కాలమెంత? మొదలైన అనేక ప్రశ్నలకు చర్చలో ఇమిడిన జ్ఞాన పరంపరయే ఆ పక్షికి సంబంధించిన విజ్ఞానం. ఈ విధంగా ఒక వస్తువు యొక్క విశేషజ్ఞానాన్ని నియమపద్ధతిలో తెలిపేదే విజ్ఞానం. సామాన్యజ్ఞానం కోరకం లాంటిదైతే విజ్ఞానం రేకులు విప్పిన శత పత్రంలాంటిది.

విజ్ఞాన సర్వస్వం - జ్ఞాన, విజ్ఞాన విభాగాలు :-

ఈ చరాచర జగత్తులోగల జ్ఞాన-విజ్ఞాన పరంపర నంతటిని మూడు విభాగాలుగా విభజించవచ్చునని పండితాభిప్రాయం" 1 అవి — 1) సమాజ శాస్త్ర విభాగం. 2) మానవ సంస్కృతీ విభాగం. 3) ప్రకృతి శాస్త్ర విభాగం. *

సమాజ శాస్త్ర విభాగంలో — ప్రజల జీవిత విధానానికి సంబంధించిన విషయాలు, అందులో అంతర్భాగాలైన అర్థశాస్త్రం, రాజనీతి శాస్త్రం. మన శ్శాస్త్రం, మానవశాస్త్రం, సాంఘికశాస్త్రం మొదలైనవన్నీ చేరుతాయి.

మానవ సంస్కృతీ విభాగంలో — సాహిత్యం, సంగీతం, కవిత్వం, శిల్పం, చిత్రలేఖనాది లలితకళలు, విద్యా విషయాలు, సాంఖ్య, యోగ న్యాయాది దర్శనాలు, చరిత్ర, చారిత్రక నిర్మాణాలు మొదలైనవన్నీ చేరుతాయి.

ప్రకృతి శాస్త్ర విభాగంలో — జీవశాస్త్రం, భౌతికశాస్త్రం, రసాయన శాస్త్రం, భౌగోళిక శాస్త్రాది విషయాలన్నీ చేరుతాయి.

ఇటువంటి అన్నిశాఖలకు సంబంధించిన, అన్నివస్తువుల, అన్ని విషయాల విజ్ఞానాన్నంతటిని క్రమపద్ధతిలో సమీకరించి జన సామాన్యానికి సులభంగా అందుబాటులో ఉండేందుకు చేసే ప్రయత్నమే విజ్ఞాన సర్వస్వాల నిర్మాణం.

---

1. వి. స. సం II - పుట-2.

* కొందరి అభిప్రాయం ప్రకారం ఇవి రెండు విభాగాలే 1. మానవీయ శాస్త్రాలు (Humanities) 2. ప్రకృతి శాస్త్రాలు (Natural Sciences) పుట : 41

అయితే విజ్ఞాన సర్వస్వాలు ఒక రచనా ప్రక్రియగా ఊపు నందుకొన్న ఈ రోజుల్లో అన్ని విభాగాలకు సంబంధించిన విషయా లన్నిటిని సమీకరించి అకారాది క్రమంలో, సులభగ్రాహ్యమైన వచన రచనలో జనసామాన్యానికి సైతం అందుబాటులో ఉండే విధంగా విజ్ఞాన సర్వస్వాలను నిర్మించడం జరుగుతూంది. ఈ పద్ధతి మనదేశంలో ఆంగ్లే యులపాలన, వారి విద్యా విధానం స్థిరపడి, తద్వారా వారి భాషాసాహిత్యాల ప్రభావం మనపైపడి నప్పటి నుండి జరుగుచున్నదని చెప్పవచ్చును. దీనికి పూర్వం ప్రత్యేకంగా విజ్ఞాన సర్వస్వాలను నిర్మించడమనేది మన దేశంలోలేదు. కాని వివిధ శాఖ లకు, విభాగాలకు చెందిన జ్ఞానవిజ్ఞానాలను పొందుపరిచిన కావ్యాలుమాత్రం మనకూ ఎన్నో వున్నాయి. విజ్ఞాన ప్రసారాన్ని ఆశించి, తమ విజ్ఞానాన్నంతటిని భావితరాల వారి కందించాలనే సదుద్దేశంతో కవులు, మేధావులు అటువంటి ప్రయత్నాలు చేశారు. అయితే నేటి విజ్ఞాన సర్వస్వాల్లాంటి రచనా ప్రక్రియ లేని కారణంగా అప్పటికి వారికున్న కావ్య ప్రక్రియలోనే తమ కాలంనాటి విజ్ఞానాన్నంతటిని పొందుపరచవలసి వచ్చింది. కావ్యంలో విజ్ఞాన విషయాలను పొందుపరచడమంటే కత్తిమీద సాములాంటిది. ఎందుకంటే కావ్యం రసా త్మకమైంది కాబట్టి విజ్ఞాన విషయాలను వివరిస్తూ పోవడంవల్ల లేదా వివిధ వస్తువులను పట్టికలుగా ఇస్తూ పోవడంవల్ల రసస్ఫూర్తికి భంగం వాటిల్లవచ్చు. లేదా కథా గమనం కుంటుపడి వస్త్వైక్యం లోపించవచ్చు. అందుకని కావ్య త్వానిక భంగం కలుగని విధంగా కొందరు మేధావులు తమ కావ్యాల్లో అనేక శాస్త్ర విషయాలను లౌకిక విషయాలను కథా సందర్భాల ననుసరించి వివరించి యున్నారు. ఇటువంటిచోట్ల అన్ని శాఖలకు సంబంధించిన విజ్ఞాన విషయాలుండాలనే నియమంకానీ, అవన్నీ ఒక క్రమపద్ధతిలో చెప్పాలనే నియ మంకానీ ఉండదు. అది కావ్యం కాబట్టి ఎక్కడ ఏది అవసరమైతే దానికి సంబంధించిన విషయాలనే ఎక్కువగా వివరించడమో, వివరించడం కూడా అనవసరంగానో, లేదా ఇబ్బందికరంగానో ఉంటే అటువంటిచోట్ల ఆ విజ్ఞాన శాఖకు సంబంధించిన పదజాలాన్ని పట్టికలుగా ఇవ్వడమో జరుగుతుంటుంది. ఈ విధంగా వివిధ శాఖలకు సంబంధించిన విషయ విజ్ఞానాన్ని విస్తృతపరిధిలో సంతరించుకొన్న కావ్యాలే విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల కావ్యాలుగా పరిగ ణింపబడుతున్నాయి. అటువంటి విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల బహుకొద్ది కావ్యాల్లో ప్రముఖమైంది హంసవింశతి ఒకటి.

విజ్ఞాన సర్వస్వాల్లో ఉండాలనుకొనే జ్ఞాన విభాలన్నీ హంసవింశతిలోనూ కనిపిస్తాయి. అయితే హంస వింశతి ప్రధానంగా కావ్యం కాబట్టి వాటిలో కొన్నిటిని విషయ విశ్లేషణంతో వర్ణించడం, కొన్నిటిని పట్టికలుగా ఇవ్వడం జరిగింది. ముఖ్యంగా సమాజ శాస్త్ర విభాగంలో కొన్ని అంశాలను, మానవ సంస్కృతీ విభాగంలో మరికొన్ని అంశాలను కవి వర్ణించాడు. మిగిలిన అన్ని శాస్త్రాంశాలను కవి పట్టికల రూపంలోనే ప్రదర్శించాడు. ఈ విధంగా పట్టికల రూపంలో యిచ్చిన వివిధ శాస్త్రాంశాలకు సంబంధించిన పదాలు హంసవింశతిలో దాదాపు నాలుగువేలకు పైగా ఉన్నాయి. వాటన్నిటిని అనంతర అధ్యాయాల్లో ఆయా వర్గాలుగా విభజించి సంక్షిప్తంగా వివరించడం జరిగింది.

ప్రస్తుతం హంసవింశతిలో ఉండే విషయాం నన్నిటిని మూడువిజ్ఞాన విభాగాలుగా వింగడించి, ఏయే సందర్భాల్లో ఏయే విషయాలు కవి చెప్పాడో వాటి ఆశ్వాస, పద్య సంఖ్యలు మాత్రం యిక్కడ ప్రదర్శింపబడుతున్నాయి.

సమాజ శాస్త్రం :

"హంస వింశతి-సమకాలీన జీవిత విధానం" అనే అంశంపై నేను వ్రాసిన సిద్ధాంత వ్యాసంలో, ఆనాటి ప్రజల జీవిత విధానం. వారి ఆర్థిక మత, రాజకీయ పరిస్థితులు. ప్రజల వినోదాలు, వేడుకలు మొదలైన సమాజ శాస్త్రాంశాలు ఎన్నో వివరించబడ్డాయి, 1 అవే విషయాలను మరల యిక్కడ వివరించడం పునురుక్తి అవుతుంది కాబట్టి ఆయావిషయాలు, కవి వాటిని వర్ణించిన సందర్భాలు ఇచ్చుట ఆశ్వాస-పద్య సంఖ్యలతో సూచితం.

కులాలు :

హంసవింశతి కాలంలో ఆంధ్రదేశంలో ప్రచురంగా ఉండే కులాలు, కుల వృత్తులు, వృత్తిపరికరాలు, గృహాలు-గృహోపకరణాలు మొదలైన వనీ కవి వర్ణించాడు.

హంసవింశతిలో ఉండే ఇరవై రాత్రుల కథల్లో ఒక్కొక్క కథలో ఒకొక్క కులాన్ని తీసికొని, ఆయా కుల వృత్తులాధారంగా నాటి సమా

1. The Contemporary life as dipi cted in Hamsavimsathi
M. Litt· Thesis

జంలో వారు ఏథంగా జీవితాన్ని గడుపుతుండేవారో కవి కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు.

2,6,11,13 రాత్రుల కథల్లో బ్రాహ్మణులు,వారి జీవిత విధానం, 3వ రాత్రి కథలో యుద్ధ విద్యలాధారంగా జీవించేవాళ్ళ, 4వ రాత్రి కథలో సాలెవారు, 5వ రాత్రి కథలో గొల్లలు, 7వ రాత్రి కథలో కంసాలివారు, 8, 14 రాత్రుల కథల్లో వైశ్యులు, 9వ రాత్రి కథలో రంగాజీవులనబడే చిత్రకారులు, 10వ రాత్రి కథలో భూత చికిత్సకులు, 12వ రాత్రి కథలో శైవాచార సంప న్నులు, 15వ రాత్రి కథలో రెడ్లు, 16వ రాత్రి కథలో బెస్తలు, 17వ రాత్రి కథలో కుమ్మరి, 18వ రాత్రి కథలో బలిజలు, 19వ రాత్రి కథలో గాండ్లవారు, 20వ రాత్రి కథలో ప్రభుత్వో ద్యోగి అయిన ఒక మంత్రి మొదలైన వారికి సంబంధించిన విశేషాలతో నాటి ప్రజల జీవిత విధానాన్ని కవి వర్ణించాడు.

అంతేగాకుండా ఆనాడు తెలుగునాట వివిధ వృత్తులాధారంగా జీవించే అన్ని కులాలవారిని(దాదాపు150కి పైగా) పేరుపేరున పేర్కొన్నాడు(3-29).

గృహాలు-గృహోపకరణాలు :-

బ్రాహ్మణ గృహాలు గృహోపకరణాలు. 1-154, 2-137. వైశ్యుల గృహాలు - గృహోపకరణాలు- 2-131, 2-226. కోమట్లు అమ్మే అంగడి దినుసులు—2-227 నుండి 229 వరకు రెడ్ల గృహాలు, వ్యవసాయ పనిముట్లు — 4-126. సాతానుల సంపన్నగృహం—1-81, గొల్లవారు—పాడిపరిశ్రమకు సంబం ధించిన పరికరాలు — 2-75. గొల్లల పశుసంపద, గొఱ్ఱెల మందలు, మేకలమందలు, 2-76 నుండి 79 వరకు. ఆహార పదార్థాలు, పిండివంటలు, వంటదినుసులు 1—105. ఊరగా యలు 4-135. పెంపుడు జంతువులు (5-354) పడకటింటి సామగ్రి 5-52, 5-122.

వృత్తులు–వృత్తిపరికరాలు :-

రెడ్లు-వ్యవసాయం- ఇది ముఖ్యవృత్తిగా ఉండే రెడ్లు పండించే రకరకాల పంటలు -

వడ్ల పేర్లు (దాదాపు 200 పైన) 4–128. ధాన్యాలు—4-127. కూరగాయలు - 4-129, 130, దుంపకూరలు-4–131. ఆకు కూరలు – 4-132. పశుగ్రాసాలు (దాదాపు 200 వరకు) – 5-43 నుండి 47 వరకు, పండ్లతోటలు - 4-134 సాలీలు – చేనేత పరిశ్రమ. వృత్తి పరికరాలు – 2-11. కుమ్మరి – కుండలుచేయడం. వృత్తిపరికరాలు – 5-9. కుమ్మరివారి పనితనం – 5-13. రకరకాల మట్టిపాత్రలు – 5-11, 12. కంసాలి- వెండి, బంగారు నగలు చేయడం. వృత్తిపరికరాలు- 2- 8 , నగలు చేయడంలో నైపుణ్యం 2-182. బెస్తలు - చేపలుపట్టడం. వృత్తి పరికరాలు- 4-182 నుండి 185 వరకు. గాండ్ల -తిలఘాతకులు, నూనెలు తీయడం. వృత్తిపరికరాలు- 5-205. రకరకాల నూనెలపేర్లు 5-206. రంగాజీవులు చిత్రపటాలు వ్రాయడం. చిత్రపటాలు వ్రాసేందు కుపయోగించే రంగులపేర్లు 3-8 రకరకాల చిత్రాలపేర్లు - 3-9 నుండి 13 వరకు. బలిజశ్రేష్ఠి - వ్యాపారం - 5-97.

వినోదాలు – వేడుకలు :-

కోడిపందాలు-పరికరాలు–3-212. కోడిపుంజుల్లోని భేదాలు-వాటి విజయసమయాలు - 3-213. కోడిపుంజులపేర్లు - వాటి బిరుదులు-3–214, 215. కోడిపందాలువేసే విధానం-3-216.

బాలబాలికలాడుకొనే ఆటలు (దాదాపు 150 పైన) 3-147, 5-155.

తిరునాళ - బాణసంచా కాల్చడం, మయూరనాట్యాలు, బుట్టబొమ్మలాటలు, ఇంద్రజాల మహేంద్రజాలాలు - 3-29.

ఆచారాలు - నమ్మకాలు :-

గొల్లల కొలువులు - 2–89. భూతచికిత్స 3–63 నుండి 68 వరకు. మొక్కుబళ్ళు - 3–30. మంత్ర ప్రభావం. 3–95 నుండి 100 వరకు. మర్లుమందులు-5-129, 130, 131, 152,

బాల్య వివాహాలు - కలిగే యిబ్బందులు - 5-115, 116.

వేషధారణలు :-

1) జోగురాలు (1-45) 2) తైర్థికుడు (1-172) 3) ఆయుర్వేద వైద్యుడు (1-232) 4) మంత్రసాని (2-34) 5) భూత వైద్యుడు (3-62) 6) వీరశైవుడు (3-185) 7) కోమటి శెట్టి (4-156) 8) సుద్దుల గొల్లలు (2-85) 9) రెడ్డిసాని (4-138) 10) రెడ్డి (౩-90) 11) తంబళి పూజారి (1-182) 12) అసహాయుడనే వీరభటుడు (1-245) 13) దుబుదుక్కల వాడు (2-27) 14) పారుపత్తేదారుడు (2-28) 15) కరణము (3-93) 16) బలిజశెట్టి (5-95) 17) వేపారి (3-99) 18) తలారి (3-87) 19) పేద నియోగి (4-26) 20) సుంకరి కొలువుకాడు (4-79) 21) వేష్ట సలంకరించడం (5-96)

స్త్రీ వేషధారణలు ;—

హంస వింశతిలో స్త్రీ వర్ణనలేగాక, స్త్రీ వేషధారణలు కూడా ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నాయి. ఈ కావ్యంలోని ప్రధాన నాయిక హేమావతిని ఇరవై కథల్లోను రకరకాల వస్త్రాభరణాలతో కవి వివిధ రీతుల్లో వర్ణించాడు. ఇక ఇరవై కథల్లో వచ్చే నాయికలు చాలవరకు జానపదులే కాబట్టి వాళ్ళవాళ్ళ స్థితిగతులు, పద్ధతుల ననుసరించి, వాళ్ళను వర్ణించడం జరిగింది. ఈ రెండు తీరుల స్త్రీ వర్ణనలుబట్టి నాటి సమాజంలో హేమావతి లాంటి సంపన్నస్త్రీలు ఎలాంటి వస్త్రభూషణాదుల ధరించేవాళ్ళో, వాళ్ళ అలంకరణ పద్ధతి ఎలా ఉండేదో మనకు తెలుస్తుంది. అదే విధంగా అవాంతర కథల్లో వచ్చే నాయికల వర్ణనలబట్టి మధ్య తరగతి కుటుంబాల్లోని జానపదులైన పౌఢలు ఎలాంటి వస్త్రాభరణాదుల ధరించే వాళ్ళో, వాళ్ళ అలంకరణ పద్ధతులెలా ఉండేవో కూడా మనకవగతమౌతాయి.

విద్యారంగం,

వీధిబడి 3-40, విద్యావిధానం, శిక్షలు 3-141, 142. అకతాయి విద్యార్థి ఆగడాలు 3-142 నుండి 145 వరకు.

క్రీడారంగం :

దేశీయ క్రీడల పేర్లు :- బాలురాడుకొనే - ఆటలు, బాలబాలిక లాడుకొనే ఆటలు (3-147), బాలికలాడుకొనే ఆటలు (5-155).

పాలనావ్యవస్థ - గ్రామపాలనం - అధికారులు.

రెడ్డి (మునసబు) 3-90, కరణం 3-93, పారుపత్తేదారుడు 2-29, తలారి 3-87, వేపారి 3-99, సుంకరి కొలువుకాడు. లెక్కలు సరిచూచి, పన్నులు వసూలు చేయడం 4-84, డెబ్బై రెండుమంది వినియోగదార్లు(5-263)మంత్రి (5-260 to 262)

పేదనియోగి పొట్టకూటికై పడేపాట్లు, 4-30 నుండి 32 వరకు

పేద బ్రాహ్మణుడు దిన వెచ్చానికై పడేపాట్లు 2-152,

చలిపందిరి (Ihust aid centre) ఏర్పాట్లు 2-159.

పల్లకిమోసే బోయలు - వారి పరిభాష. 5-15,

రెడ్డికులంలోని తెగలు — 4-136,

చతుర్దశమనువులు 4-13, అప్సరసలు 5-118.

మతాలు :

హంసవింశతి కాలంనాటికి దక్షిణ భారతంలో ప్రధానంగా వ్యాపించి ఉండే మతాలు రెండే. అవి హిందూమత శాఖలైన వైష్ణవం. శైవం. ఈ రెండింటిని గురించే కవి ప్రస్తావించాడు. అయితే అప్పటికే దక్షిణ భారతంలో స్థిరపడి ఉన్న మహమ్మదీయుల ప్రసక్తిగానీ, అప్పుడప్పుడే స్థిరపడుతున్న పాశ్చాత్యులైన క్రైస్తవుల ప్రసక్తిగానీ కవి ఎచ్చటా తీసికొని రాలేదు.

వైష్ణవం :

రామచంద్రి పెరుమాళ్ళ తిరునాళ, పట్టుగొడుగులు, ధవళాత పత్రాలు, శ్రీవైష్ణవులు, కులశేఖరులు, ద్రావిడ ప్రాతప్రబంధాలు 3-29.

అష్టోత్తరశత తిరుపతులు-అందు కొలువై ఉండే విష్ణుమూర్తులు 4-213,

నూట ఎనిమిది తిరుపతుల్లో కొలువై ఉండే అమ్మవార్లు 4-215.

ఆళ్వారులు 4-216, దశావతారాలు 4-218.

శైవం :

జంగమార్చనలు, వీరభద్రుపళ్ళెం 3-188. వీరశైవం 3-190, శ్రీశైలమేగుట 3-189. భసితపుండ్రాలు, కామాక్ష, కక్షపాలలు 3-185.

ఈ విధంగా సమాజశాస్త్ర విజ్ఞానానికి సంబంధించిన ఎన్నో విషయాలు హంసవింశతి కథల్లో సందర్భం వచ్చినప్పుడల్లా వర్ణించబడ్డాయి. ఇవన్నీ యిక్కడ ఆశ్వాస–పద్యసంఖ్యల్లో చూపబడ్డా, అనంతర అధ్యాయాల్లో వీటన్నిటినీ వివరించడం జరిగింది.

## మానవ సంస్కృతీ విభాగం

మానవజాతి సంస్కృతికి చిహ్నాలైన కళలు, విద్యావిషయాలు దేవాలయాది నిర్మాణాలు, చారిత్రక కట్టడాలు, తిరునాళ్ళు, ఉత్సవాలు, వస్త్రాభరణాది అలంకరణ విశేషాలు జ్యోతిష, గణిత, యోగ కామశాస్త్రాది విషయాలెన్నో ఈ విభాగంలో ఉంటాయి.

దక్షిణ భారతదేశంలో హంసవింశతి నాటికి వెల్లివిరిసిన ఆంధ్రుల నాగరికత, సంస్కృతులు ఈ కథా ప్రబంధంలో ఏయే సందర్భాల్లో ఎలా చోటు చేసుకొన్నాయో పరిశీలించవలసి ఉంది. హంసవింశతి ప్రధానంగా కథా ప్రబంధం కాబట్టి అన్ని అంశాలను వర్ణించేందుకు అవకాశం తక్కువ. అందుకని ఈ విభాగంలోను కవి చాలవరకు కథా సందర్భాల ననుసరించి వివిధాంశాలను పట్టికల రూపంలోనే ప్రదర్శించాడు. వాటిలో సంస్కృతీ విభాగంలో చేరే అంశాలను మాత్రం ఇక్కడ పొందుపరచడం జరిగింది. ఇవన్నీ రాబోయే అధ్యాయాల్లో వర్గాలుగా విభజింపబడి, సంక్షిప్తంగా వివరింపబడతాయి. కాబట్టి ఏయే సందర్భాల్లో కవి ఏయే విషయాలను పేర్కొన్నాడో అవన్నీ ఇక్కడ వాటి ఆశ్వాస, పద్య సంఖ్యలతో చూపబడుతున్నాయి.

కళలు :

నాట్యకళ - షోడశనృత్తాలు 5–122.

గానకళ :

చతుర్వింశతి స్త్రీరాగాలు 5–123, ముప్పైరెండు నపుంసక రాగాలు 5–124, అయిదు మిత్రలు 5–125, తాళాదులు 5-122, సప్తస్వరాలు, మహిమలు 5-126, వివిధ వాద్యాల పేర్లు 3-29.

చిత్రలేఖనం : రంగులు, బొమ్మల పేర్లు 3–9.

విద్యలు :

1) అలంకారాలు, 2) ఇరవై ఆరు రకాల ఛందోభేదాలు, 3) యతి, ప్రాసలు, 4) అష్టాదశపురాణాలు, 5) అష్టాదశ సంహిత లనే స్మృతులు, 6) అష్టాదశపర్వాలు, 7) వేద: వేదాంగాలు 8) సిద్ధాంతాలు, 9) శాస్త్రాలు, 10) నిఘంటువులు, 11) అష్ట భాషలు, 12) శయ్యా-పాకాలు 3-128. 13) చతుష్షష్టి విద్యలు 1-155.

తిరునాళ్ళు - ఉత్సవాలు :

1) దేవతా విగ్రహాల ఊరేగింపు 3-39, 2) బాణసంచాకాల్చడం 3-28, 29, 3) హారతి విశేషాలు, 4) రంగవల్లికలు, 5) నవ రత్నాలు, 6) దశాంగగుగ్గులు, 7) శ్రీవైష్ణవులు-ద్రావిడ పార ప్రబంధాలు, 8) మయూరనాట్యాలు, 9) బుట్టబొమ్మలాటలు, 10) తెరనాటకంగాలు, 11) వివిధ వాద్యాలు 3-29.

నిర్మాణాలు :

1) దేవాలయ నిర్మాణం 1-180. 2) చప్పర నిర్మాణం 3-27. 3) పల్లకి నిర్మాణం 5-161 4) ఉద్యానవన నిర్మాణాలు 1-183 నుండి 187 వరకు.

అలంకార విశేషాలు :

1) ఆభరణాలు-1-216, 2-37, 144, 190, 3-182.
2) వస్త్రవిశేషాలు - 5-354, 355. 3) పరిమళద్రవ్యాలు 5-140
4) పడకటింటి అలంకరణ 5-52, 5-142.

శాస్త్ర విశేషాలు :

జ్యోతిషం- శకునాలు 4-48. నక్షత్రాలు-రాశిసంఖ్యలు 4-55 నవగ్రహాలు — రాశికూటమి 4-56. వేధలు, లత్తలు, నీచా వ్రమయాలు 4-57. చక్రాలువేసి బీజాక్షరాలు వ్రాయడం 4-58, 59.

గణితం :

రకరకాల గణితశాస్త్ర విశేషాలు - సిద్ధాంతసూత్రాలు 4-27. గణితశాస్త్ర గ్రంథాలు, వర్గ-వర్గమూలం, ఘన-ఘనమూలం,

క్షేత్రగణితం, బీజగణితం, సూర్య, సోమ సిద్ధాంతాలు మొదలైనవి 4-28. కులవర్గులు, ఆయకట్లు, దినసరి లెక్కలు 4-29.

మల్లయుద్ధం-సాముగరిడీలు :

ఆయుధ విశేషాలు 1-205, పండ్రెండు దండలు, పద్నాలుగు విసరులు, ముప్పైరెండు విన్నాణాలు, పండ్రెండు పరవళ్ళు, పండ్రెండుగతులు, పండ్రెండు కాయమాన భేదాలు, పండ్రెండు మొనలు, నరుకులు, షోడశోపవీతంబులరీతులు, ముప్పై రెండు ప్రచారాలు 1—206.

యోగశాస్త్రం :

పంచభూతాలు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు. రూప, రస, గంధవిషయాలు,అంతఃకరణలు, జీవుడు, పంచవింశతి తత్వాలు, అష్టాంగయోగాలు, ఆసనాలు, ప్రధానవాయువులు, ఉపవాయువులు, నాదబిందుకళలు, యోగాలు, చక్రాలు మొ॥ 3-186.

మంత్ర శాస్త్రం :

మోహినీమంత్ర జపాకర్షణ 4-93, వివిధ మంత్రాలపేర్లు 4-95. మోహినీ మంత్రప్రయోగము-పద్ధతి-4—96 నుండి 100 వరకు.

కామ శాస్త్రం :

సాత్విక భావాలు, సంచారీభావాలు 4-87; శృంగారచేష్టలు, ఆలింగనాలు 5—145, చతుర్విధ ముఖరతి భేదాలు 5-146, కళాస్థానాలు 5—147, దశవిధచుంబనాలు 5—148, నఖక్షతాలు 5-148, దంతక్షతాలు 5-149, చతుర్విధ రతిభేదాలు 5-150, చౌశీతి బంధాలు 5-151.

ప్రకృతి శాస్త్ర విభాగం : (Natural Sciences)

ఈ విభాగంలో జంతుశాస్త్రం, వృక్షశాస్త్రం, ఆయుర్వేద, రసాయన శాస్త్రాలు, భూగోళశాస్త్రం మొదలైన శాస్త్రాంశాలన్నీ చేరుతాయి. హంస వింశతిలో అనేక సందర్భాల్లో వివిధ శాస్త్రాంశాలు పట్టికలుగా యివ్వబడ్డాయి. వాటిలో ప్రకృతి శాస్త్ర విభాగంలో చేరే అంశాలనన్నిటిని వేరుపరచి వాటి అర్థాలు వ్యాఖ్యలతో యిచ్చట చూపడం జరిగింది.

జంతు శాస్త్రం :

పక్షుల పేర్లు 3-13. జంతువుల పేర్లు 3-10 నుండి 12 వరకు. చేపల పేర్లు 4-187. ఇతర జలచరాలు 4-186.

వృక్ష శాస్త్రం :

కంపలు, తీగలు, మొక్కలు 4-9. చిన్నచెట్లు, పొదలు 4-10. పెద్దజాతి వృక్షాలు 4-11. పూల చెట్లు, మొక్కలు 1-184.

భూగోళ శాస్త్రం :

పర్వతాలు 4-8, నదీనదాలు 4-205, పల్లెలు, పట్టణాలు 5-359 ప్రాచీన జనపదాలు 4-14, పుణ్యతీర్థాలు 4-209, జంబు మొదలైన ద్వీపాలు 4-12 భరతాది ఖండాలు 4-13, కేతుమాలాది వర్షాలు 4-13, వనాలు 4-240, సరస్సులు 4-207, పుష్కరిణులు 4-208, ద్వాదశకోటులు 4-206, బ్రహ్మర్షాది నవమానస్సులు 4-13, సప్తసముద్రాలు 4-12.

ఆయుర్వేద, రసాయన శాస్త్రాలు :

అశ్వగంధాది ఘృతాలు, భృగ్వాదిచూర్ణాలు, చించిల్యాది లేహ్యాలు, నారికేళాది రసాయనాలు, శరపుంఖాది తైలాలు, కర్పూరాంజనాది అంజనాలు, మదన భైరవరసాది దివ్యరసౌషధాలు, సువర్ణాది భస్మాలు, తాళీసాది మాత్రలు, ద్రావకాలు, గుగ్గులు, కషాయాలు, మూలికలు వైకల్పికలు. 1-234.

సూత్రస్థానాలు, డెబ్బైరెండు వేల నాడీ భేదాలు, త్రిశతషష్ఠి రోగాలు, చికిత్సలు 1-234.

ఈ విధంగా ఈ కథా ప్రబంధాన్ని విశ్లేషించి పరిశీలిస్తే సాధారణంగా విజ్ఞాన సర్వస్వాల్లో ఉండాలనుకొనే జ్ఞాన-విజ్ఞాన విభాగాల్లో చాలమటుకు ఇందులో కనిపిస్తాయి. అయితే సాంఘికశాస్త్రానికి సంబంధించిన గృహాలు, గృహోపకరణాలు, వృత్తులు-వృత్తిపరికరాలు, తద్వారా నాటి ప్రజలజీవిత విధానం, దేవాలయాది నిర్మాణాలు మొదలైన కొన్ని అంశాలు తప్పితే, మిగిలిన అన్ని విషయాలు ఇందులో ప్రత్యక్షరూపంలోనే ఉన్నాయి.

"పట్టికలుగా నిచ్చిన శబ్దజాలమంతా ఆయావస్తువులకు, లేదా పదార్థాలకు లేదా ప్రదేశాలకు సంబంధించిన విజ్ఞానమనేందుకు వీల్లేదు. ఎందుకంటే శబ్దంవల్ల కలిగేది ఆయా వస్తువుల ఎరుక మాత్రమే. ఇది సామాన్య జ్ఞానమే గాని, విషయ విశ్లేషణతో గూడిన విజ్ఞానంకాదు గదా * అని పూర్వపక్షం చేసేందుకిక్కడ అవకాశం ఉంది. కాని హంసవింశతి ప్రధానంగా కథా ప్రబంధం. కాబట్టి అన్ని వస్తువుల్ని, పదార్థాల్ని లేదా ప్రదేశాల్ని కావ్యంలో వర్ణించేందుకు వీలుండదు. ప్రతి విషయాన్ని వర్ణిస్తూపోతే కావ్యత్వానికి భంగం వాటిల్లే ప్రమాదమూ లేకపోలేదు. అందుకనే కవి ఆనాటి జనజీవన విధానానికి మూలభూతాలైన సాంఘికాది విషయాలను అవకాశమున్నంత వరకు వర్ణించి, మిగిలిన శాస్త్రాంశాలన్నిటినీ పట్టి కలుగానిచ్చాడు.

కేవలం కథల కోసమేగాకుండా, విజ్ఞాన ప్రసారాన్నికూడా ఆశించిన కవి తన కావ్యాన్నీ విధంగా రూపొందించడంచేత, ఇన్ని విషయాలను సంత రించుకొన్న ఈ కావ్యం సాహిత్య క్షేత్రంలో విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల కథా ప్రబంధంగా ప్రణుతికెక్కింది,

పాశ్చాత్య దేశాల్లో కూడా వివిధ శాస్త్రాంశాలకు చెందిన శబ్దజాలా న్నంతా పట్టికల రూపంలో నిచ్చిన గ్రంథాలు విజ్ఞాన సర్వస్వాలుగానే పరిగ ణింపబడుతూ ఉండేవి, క్రీ.శ. 14–17 శతాబ్దాల మధ్య కాలంలో పాశ్చాత్య దేశాల్లో యిటువంటి గ్రంథాల నిర్మాణం జరిగింది. **

ఈ దృష్టితో పరిశీలించినా — ఎన్నో శాస్త్రాంశాలకు సంబంధించి, దాదాపు 4000 కు పైగా సాంకేతిక పదాలను సంతరించుకొన్న హంసవింశతి విజ్ఞాన సర్వస్వ లక్షణాలుగల కథా ప్రబంధ మనడం సమంజసమే అవుతుంది.

హంస వింశతి–విజ్ఞాన సర్వస్వమనే ఈ సిద్ధాంత వ్యాసం, రచనా ప్రణాళిక రీత్యా రెండు విభాగాలుగా విభజించబడింది. మొదటి భాగంలో హంసవింశతి కేవలం కావ్యమే గాకుండా, అది విజ్ఞాన సర్వస్వ లక్షణాలు గల కథా ప్రబంధమనే విషయాన్ని పరిశీలించి సిద్ధాంతీకరించడం జరిగింది.

ఇక ఈ సిద్ధాంత వ్యాసంలోని రెండవ భాగంలో, హంసవింశతిలో కవి పట్టికలుగా నిచ్చిన వివిధ శాస్త్రాంశాలు, సాంకేతిక పదాలు (దాదాపు 4000 పదాల వరకు) సంక్షిప్తంగా వివరించబడ్డాయి. ఈ పదాల్లోని వస్తువు స్వరూప స్వభావాదులకు, గుణ క్రియాదులకు అనుకూలమైన వివరణాత్మక రచనా ప్రణాళిక దృష్ట్యా ఈ రెండవ భాగాన్ని పద్నాలుగు వర్గాలుగా విభజించి, ఒక్కొక్క వర్గంలోని పదాలను అకారాదిగా వివరించడం జరిగింది.

ఇది మొదటి సంపుటం. ఇందులో కళా వర్గ, విద్యా వర్గాలకు సంబంధించిన పదాలు మాత్రమే వివరించ బడ్డాయి. హంసవింశతిలో అక్కడక్కడా పేర్కొన్న కళలకు సంబంధించన పదాల నన్నిటిని ఏర్చి కూర్చి కళా వర్గంలో పొందుపరచడం జరిగింది. ఈ వర్గ విభజనలో కొన్ని చిక్కులున్న మాట వాస్తవం. కొన్ని కళలను శాస్త్రాలుగాను, శాస్త్ర విషయాలను కళలుగాను సంభావించడం పండితుల్లో కూడా కనిపిస్తుంది. ఉదాహరణకు కామశాస్త్రం, కామ కళా రహస్యాలు. సంగీత శాస్త్రం, సంగీత కళ మొదలైనవి శాస్త్రాలుగాను, కళలుగాను కూడా వ్యవహారంలో ఉన్నాయి. ఏవి శాస్త్రాలు, ఏవి కళలు అనే చర్చ యిక్కడ అప్రస్తుతం. కాబట్టి పదాల్లోని విషయ ప్రాధాన్యాన్ని బట్టి, వాటిని స్థూలంగా ఆయా వర్గాలుగా విభజించి వివరించడమే యిక్కడ ముఖ్యోద్దేశము. ఈ దృష్ట్యా నృత్యాలు, వాద్యాలు, సంగీత విషయాలు మొదలైనవి కళా వర్గంలో వివరించబడ్డాయి. అదే విధంగా ఒక పండిత పుత్రికాండుని విద్యా పరిశ్రమను గూర్చి వర్ణిస్తూ హంసవింశతిలో పేర్కొన్న పదాలను (3–128) చౌషష్ఠి విద్యలను (1–155) విద్యా వర్గంలో చేర్చి వివరించడం జరిగింది.

# నాట్యకళ

షోడశ నృత్తాలు:- హంసవింశతిలో ఒక చోట పేరణాది షోడశ నృత్తాలను కవి పేర్కొన్నాడు (5-122). పదహారు పేర్లతో వ్యవహారంలో ఉండే ఈ నృత్యాలు, సాంప్రదాయ నృత్యాల నుండి విడి వడి దేశకాల పరిస్థితుల కనుగుణంగా కొన్ని మార్పులు, చేర్పులు జరిగి దేశీయ నృత్యాలుగా ప్రచారానికి వచ్చాయి.

భరత మహర్షి తర్వాత వచ్చిన నాట్యశాస్త్ర కర్తలు, సాంప్రదాయ నాట్యాల్లో చెప్పిన వివిధాంశాలను పేర్లు మార్చి ప్రయోగిస్తూ వచ్చారు. ఉదాహరణకు సాంప్రదాయ నాట్యాల్లోని "చాలక" (హస్తాభినయం) అనే దాన్ని సారంగదేవుడు "బాహుపర్తనం" అని పేర్కొన్నాడు. ఇదే విధంగా పార్శ్వదేవుడు, జాయప సేనాని మొదలైన నాట్యశాస్త్ర కర్తలు దేశీ వస్తు సామగ్రిని తమ నాట్యాల్లో విస్తృతంగా ప్రయోగించారు.

దేశీ నృత్తాలను సోమేశ్వర, సారంగ, పార్శ్వదేవులు, జాయప మొదలైనవారు వర్ణించారు. ఇవి రెండు విధాలుగా ప్రచారంలో ఉన్నాయి. మొదటిది సాంప్రదాయ నాట్య పద్ధతులకు అధికంగా చేర్చబడ్డ కరణాలు, స్థానకాలు, భ్రమరాలు, పదాలు, పాటలు, లస్యాంగాలు, గతులు, భంగిమలు, అభినయాది విశేషాలతో కూడిన దేశీ నాట్యాలు. రెండవది పేరణి, పెక్కణ, రాసక, చర్చరి, కందుక, కోలాటాది ప్రాంతీయ నృత్యాలు. ఈ ప్రాంతీయ నృత్యాలనే హంస వింశతి కారుడు షోడశ నృత్తాలని పేర్కొన్నాడు. వాటిని సంక్షిప్తంగా ఇక్కడ వివరించడం జరిగింది.

కందుక నృత్తం:- రూ. కందుక ఖేలనం.

ఈ నృత్యాన్ని పూర్వం ఎక్కువగా రాకుమార్తెలు ఆదరిస్తుండే వారు. సంస్కృత కావ్య, నాటకాదుల్లో ఈ నాట్యానికి సంబంధించిన విశేషాలు అధికంగా వర్ణించబడ్డాయి. స్వప్నవాసవదత్త నాటకంలోని రెండవ అంకంలో కందుక ఖేలనాన్ని గూర్చిన వర్ణన ఉంది. దశకుమార చరిత్రలో కూడా రాకుమార్తెలు వింధ్యవాసిని అనే దేవత ప్రీత్యర్థం ప్రతి మాసంలోను కృత్తికనాడు ఈ కందుక నృత్యాన్ని చేసేవారని చెప్పబడింది.

ఒక సమతల ప్రదేశంలో యువతులు ఒక క్రమ భంగిమలో అడుగులు వెనుకకు, ముందుకు వేస్తూ, అంగ విన్యాసాలతో బంతిని మృదువుగాను, గట్టిగాను (Soft and Violent) కొట్టుతూ చేసే నృత్యాన్ని కందుక నృత్యం అన్నారు. కందుకం అంటే బంతి. బంతిని కొట్టుతూ చేసే నృత్యం కాబట్టి దీనికిపేరు వచ్చింది.

దశకుమార చరిత్రలో దండి ఇంకో విశేషాన్ని కూడా చెప్పాడు. బంతిని గట్టిగా కొట్టి, అది పైకి లేచినపుడు నాట్యగత్తె "గీతమార్గాన్ని" అవలంభిస్తుందట. గీత మార్గమంటే— పది విధాలైన పద విన్యాసాలని వ్యాఖ్యాతలు వివరించారు. ["దశపద చంక్రమణం గీతమార్గం విదుః ఇతి కందుక తంత్రే"]

దండి వర్ణించిన పద్ధతిలోనే జాయపసేనాని కూడా తన నృత్తరత్నావళిలో కందుక నృత్యాన్ని పేర్కొన్నాడు. దండి చెప్పిన గోమూత్రికా విధానాన్ని జాయప పద్మాకారము (Design of Lotus) గా పేర్కొన్నాడు. దీనిని బట్టి ఈ కందుక నృత్యంలో గోమూత్రికా పద్ధతిలో, పద్మాకార విధానంగా, సర్పాకారంగా, చక్రాకారంగా మొదలైన అనేక రీతుల్లో ఈ నాట్యం ప్రదర్శింప బడుతుండేదని తెలుస్తున్నది. చాలా మంది యువతులు కలిసి సర్పాకారంగాను, చక్రాకారంగానూ, తిరుగుతూ, తత్సంబంధమైన వాద్యాలకనుగుణంగా నృత్యంచేసే విధానాన్ని జాయప బృంద నాట్యంగా పేర్కొన్నాడు.

కందుక నృత్యంలో ఉపయోగించే బంతి నిర్మాణాన్ని కూడా జాయప వర్ణించాడు. తేలికైనలోహంతోగాని, కఱ్ఱతోగాని బంతినిచేసి, దానిలోపల సన్నని, గుండ్రని లోహపు రాళ్ళు ఉంచాలి. నృత్యం చేస్తూ, బంతిని కొట్టినపుడు వీటి శబ్దాలు కూడా వినిపించేటట్లు నిర్మించాలి.

అయితే కందుక నృత్యానికి, కందుక ఖేలనం అనే పేరు కూడా ఉండడం వల్ల ఇది నాట్యమా? ఆటా? అనే సందేహం కూడా రాకమానదు. భారతంలోని "ధృతరాష్ట్ర పాండు నందనులు కందుక క్రీడాపరులై వేడుకతో ఆడుచున్నంత........" (ఆ. ప. V-206) అనే వాక్యాన్ని బట్టి ఇది బంతితో ఆడుకొనే ఒక విధమైన ఆట అనేది స్పష్టం. దేశీయ క్రీడల్లో

ఎన్నో తీరుల బంతియాటలున్నాయి. ఇక్కడ బంతితో ఆడుకొనే ఆట అనే గాని, కందుక నృత్యానికి దీనికి ఎటువంటి సంబంధమూ లేదు. క్రీడాభిరామంలో కూడా కందుక క్రీడ ప్రసక్తి కనిపిస్తుంది.

"కాంచీ నూపుర కంకణక్వణనముల్ గ్రాలంగ బాలాజనుల్
కించిన్న్యంచదు దంచిత క్షమముగా క్రీడించెదర్ చూడుమా
చంచత్కాంచన కందుక త్రియములన్ సవ్యాపసవ్యంబులన్(258)

కందుక నృత్యానికి సంబంధించిన యిటువంటి ఉదాహరణలు మన సాహిత్యంలో కోకొల్లలుగా దొరుకుతాయి. పూర్వకాలం ఇది నృత్యంగాను, ఆటగాను కూడా ప్రచారంలో ఉన్నట్లు ఈ ఉదాహరణలను బట్టి తెలుస్తున్నది. అయితే అతి ప్రాచీన కాలంలో ఈ కందుక నృత్యం కేవలం రాకుమార్తెలకే పరిమితమై ఉండగా క్రీడాభిరామ కాలానికిది సంపన్న యువతులు ఆడుకొనే ఆటగా ప్రచారానికివచ్చి ఉంటుంది. ఇది మొదట నృత్యంగా ఉండి తర్వాత రానురాను ఆటగా మారిందో? లేక మొదట ఆటగానే ఉండి తర్వాత నృత్యావిర్భావాన్ని పొందిందో యింకా పరిశోధించవలసిందేగాని యిప్పుడు కచ్చితంగా చెప్పలేము. కాని క్రీడాభిరామంలోని పై పద్యంలో "కందుకత్రయములన్" అని పేర్కొనడంచేత ఇందులో ఒక బంతి కాకుండా మూడు బంతుల వరకు ఉపయోగిస్తారనే మరొక విశేషం తెలుస్తున్నది. కందుక క్రీడలాంటిదే Dodge Ball అనే ఆట ఒకటుంది. ముఖ్యంగా బాలికలాడుకొనే ఈ ఆట ఈ రోజుల్లోకూడా ప్రచారంలో ఉంది

కుండలీ నృత్తము :— రూ. గొండిలి, గొండ్లి, గొండలి. గొండలి నృత్తమే సంస్కృతీకరింపబడి కుండలీ నృత్యంగా రూపాంతరం చెందింది. చాళుక్య రాజైన సోమేశ్వర దేవుడు ఈ నృత్తాన్ని నిర్మించినట్లు తెలుస్తున్నది.

పూర్వం కళ్యాణ కటకంలో జరిగిన భూత మాతృ ఉత్సవంలో ఒక భిల్లిణి ఉత్సాహంతో పాడుతూ, తిరుగుతూ, ఉండడాన్ని చూచిన సోమేశ్వర దేవుడు తన మానసోల్లాసం అనే నాట్యగ్రంథంలో దీని నొక నృత్యంగా పేర్కొని "గొండలి విధి" అని పేరు పెట్టాడు. మరాఠలో గొండలి అంటే భిల్లిణి అని అర్థం.

"కల్యాణ కటకే పూర్వం భూతమాతృ మహోత్సవే
సోమేశః కౌతుకాత్ కాంచిత్ ఖిల్లవేషముపేయుషీమ్
నృత్యంతీ మధుగాయంతీ స్వయం ప్రేక్ష్య మనోహరమ్
ప్రీతో నిర్మితవాన్ చిత్ర గొండిలి విధి మిత్యయమ్
యతో ఖిల్లినీ మహారాష్ట్రి గొండలీత్యభిధీయతే"

ఈ నృత్యానికి సంగీతం, అలంకారం, కర్ణాటక పద్ధతిలోనే ఉండా అనే నియమముంది. ["గొండిల్యా మండలం ప్రోక్తం తంజ్ఞైః కర్నాట దేశజం"],

గొండలి నృత్యాన్ని జాయప సేనాని కుండలి నృత్తంగా పేర్కొన్నాడు. ఈ నృత్యం పార్వతీదేవి కుండలి అనే ఒక యువతికి నేర్పినట్లు, తర్వాత అది ప్రచారానికి వచ్చినట్లు జాయప వర్ణించినాడు.

"కుండలీ నామమృదంగం సుకేశం దివ్య యోషితం
సంగీతం కోమలం నృత్తం శిక్షియా మాస పార్వతీ
తన్నృత్తం కుండలీ మాహుః తత్సంబంధాత్ పురాతనాః".

సోమేశ్వర దేవుని వర్ణనను బట్టి ఈ నృత్యానికి గొండలి అనేది వ్యుత్పత్తి పదం. అయినప్పటికీ కుండలీ అనేదే దాని కంటే కూడా పురాతనమైనదనే భావం కల్గించేందుకే జాయప పైవిధంగా వర్ణించి ఉంటాడని ఊహించ వచ్చును.

సారంగదేవ పార్శ్వ దేవాదులు కూడా గొండలి నృత్యాన్ని విపులంగా వర్ణించారు. వీరి తర్వాత వచ్చిన నాట్య శాస్త్రకారులు దీనికి వాద్యపద్ధతిని, గీత పద్ధతిని ప్రవేశపెట్టారు. గాత్ర, వాద్య, సంగీతాల్లో పార్శ్వదేవునితోనూ, పాట, తాళ నృత్య విశేషాల్లో సారంగదేవునితోనూ జాయపకు సామ్యం కనిపిస్తుంది.

సంగీత ముక్తావళి అనే గ్రంథంలో కుండలీ నృత్యానికి సంబంధించిన గీత, వాద్య, తాళ, ప్రబంధ పద్ధతులు వివరించబడ్డాయి. వీటిలో కొన్నిటిని జాయప నృత్తరత్నావళిలో పేర్కొన్నాడు. ఈ నృత్యంలో

ఇద్దరూ అంతకు మించి జంటలు జంటలుగా చేరుతుంటారు. చివరికిది ఒక పెద్ద బృందనృత్యంగా పరిణమిస్తుంది. చివరన పిండి బంధాలు కూడా యిందులో చేర్చబడ్డాయి. అందరూ కలిసి వృత్తాకారంలోనూ, పద్మాకారంలోనూ, చతురస్రాకారంలోనూ, వరుసలు వరుసలుగానూ, ఎదురెదురుగానూ నిలబడి ఈ నృత్యాన్ని ప్రదర్శిస్తుంటారు. (NR 134-137)

కోలాటం :- రూ. కొల్లాటిక

ఇరువైపుల వెదురు బొంగులు నాటి, వాటికి ఎత్తుగా కట్టిన తాడు మీద ఒక యువతి పొడవైన సన్నని ఒక కోల పట్టుకొని సమతుల్యం (Balance) గా నడవడం, గుండ్రంగా తిరగటం, పెద్దపెద్ద బరువులనెత్తడం, కత్తివిసురుల నుంచి గాయపడకుండా తప్పించుకోవడం, మొదలైన ఆశ్చర్యకర విషయాలతో కూడి ఉంటుంది నృత్యం. ఇవి ప్రదర్శిస్తున్నప్పుడు డప్పులు, ఢంకాల్లు మొదలైన వాద్యాలను వాయిస్తుంటారు. ఈ నృత్యాన్నే జాయప కోలాటం అనీ, సారంగదేవుడు కొల్లాటిక అని పేర్కొన్నారు. నృత్య పద్ధతులను ఇద్దరూ ఇంచుమించు ఒకే విధంగా వర్ణించారు.

మొన్నమొన్నటి వరకు ముఖ్యంగా దసరా వేడుక సమయల్లో దక్షిణ భారతావనిలో ఈ నృత్యం ప్రదర్శింపబడుతూ ఉండేది. వెదురు బొంగులకు ఎత్తుగా కట్టిన తాడు మీద సమతుల్యంగా నడవడం, వెదురు బొంగుపై ఎక్కి వివిధ రీతుల విన్యాసాలు చేయడం మొదలైన వానిని ప్రదర్శించే వారిని తమిళనాడు ప్రాంతాల్లో దొమ్మరి నాట్యగత్తెలంటారు. (Domb Dancers). వీరు ఊరూరు తిరిగి ప్రదర్శనలిస్తూండేవారు. స్త్రీలు, పురుషుల కలిసి డప్పులు, ఢంకాలు వాయిస్తూ ఈ ప్రదర్శనలిచ్చేవారినే పూర్వం ఆంధ్ర ప్రాంతాల్లో పైల్వాన్ ఆటగాళ్ళు అనేవాళ్ళు. వీరిచ్చే ప్రదర్శనలు ఆశ్చర్యకరంగానూ, భయంకరంగానూ ఉంటాయి కాబట్టి బహుశా ఈ పేరు వచ్చి ఉంటుంది. లేదా దృఢకాయులైన పహిల్వానులు పెద్దపెద్ద బరువులు గుండెలమీది కెత్తుకోవడం, బండలను చేతితో పగుల గొట్టడం, ఎత్తుమేడల మీది నుండి దూకడం, కత్తి విసురుల నుండి తప్పించుకోవడం మొదలైనవి ప్రదర్శించేవాళ్ళు కాబట్టి; అందువల్లకూడా దీనికీ పేరు వచ్చి ఉంటుంది. క్రీడాభిరామంలో మైలార వీరభటులు

ప్రదర్శించే "అవ అవ మండే చంద్రనిప్పుల్లో దూకడం, అలుగులు పాతిన గనవ పాత్రల్లో ఉట్టి చేపట్టుకొని ఊరకడం, కత్తెర నమిలి మింగడం మొదలైన పురుషులిచ్చే ప్రదర్శనలు, తొట్టి నీళ్ళలో ఉండే ముక్కరను మొగ్గవాలి తలనీళ్ళలోముంచి ముక్కరను ముక్కుకు కరిపించుకొనిలేవడం, నాలుకతో పూసలదండ గ్రుచ్చడం మొదలైన స్త్రీలిచ్చే ప్రదర్శనలకూడా ఇంచు మించు ఇటువంటివే. ఇటువంటివన్నీ కలిసి రాను రాను కొన్ని మార్పులు చేర్పులు చెంది సర్కసు ఫీట్సులోనికెక్కాయి.

కోలాటం (కోల + ఆట) చేతులందు కఱ్ఱలుంచుకొని ఆడే ఒక విధమైన ఆట లేదా చేసే నృత్యాన్ని కూడా కోలాటం అంటారు. దాదాపు 18 అంగుళాలు పొడవు గల్గి సన్నగా గుండ్రంగా చెక్కిన రెండు కఱ్ఱలను చేతుల్లో పట్టుకొని వలయాకారంగా నిలబడి ఎదురుగాను, ఫక్కన ఉన్నవారు కలిసి లయబద్ధంగా కఱ్ఱలను కొట్టుతూ, అడుగులు వేస్తూ చేసే నృత్యమే కోలాటం. ఇది దండరాసకం లాగా ఉంటుంది. కోల అంటే కఱ్ఱ అని అర్థం. కోలలతో ఆడే ఆట కాబట్టి దీనికిపేరు వచ్చి ఉంటుంది. జడకోలాటం దీనిలో ఒక భేదం. ఒక ఎత్తయిన చెట్టు కొమ్మకు తాళ్ళు కట్టి క్రిందికి వ్రేలాడవేస్తారు, ఆ తాళ్ళ చివర కఱ్ఱలు కట్టి వాటిని చేతబట్టి లయబద్ధంగా ఒకరి చేతిలోని కఱ్ఱలతో మరొకరు కొట్టుతూ పాటపాడుతూ, దానికనుకూలంగా అడుగులు వేస్తూ తిరుగుతూ ఉంటే త్రాళ్ళు జడలాగా అల్లుకుపోతాయి. మళ్ళీ అదేవిధంగా నృత్యంచేస్తూ జడ విప్పుకొనేలాగా చేస్తారు. ఇలా చేసే నృత్యాన్ని జడకోలాటం అంటారు ఇదే విధంగా దీనిలో యింకా కొన్ని బేధాలుండవచ్చును.

చర్చరి :- రూ. నాట్యరాసకం. శృంగార ప్రకాశం అనే గ్రంథంలో చర్చరి నృత్యం విపులంగా వర్ణించబడింది. దీనినే నాట్యరాసకం అని కూడా కొందరంటారు. ఈ నృత్యారంభంలో నర్తకి రంగ ప్రవేశం చేస్తూ చర్చరి ద్విపద పాటలను వర్ణతాళంలో పాడుతుంది. ఈ నృత్యం శృంగారం లేదా వీర రస ప్రధానంగా ఉంటుంది. ఈ నాట్యం ప్రదర్శించబడుతుండే ప్రాంతపు రాజు గుణగణాలను కీర్తించడం గాని, లేదా వసంతఋతు వర్ణన గాని దీనిలో ప్రధానాంశాలుగా ఉంటాయి. రాసక నృత్యంలో మాదిరిగానే ఇందులోకూడా నర్తకీమణులు

నృత్తాకారంలో నృత్యం చేస్తారు. ఇది ముఖ్యంగా వసంతోత్సవ వేళల్లో ప్రదర్శించే నృత్యంగా పేర్కొనబడింది. "మండలేన వ్రినృత్యంతి కాంతా వాసంతకోత్సవే". (N. R. 145)

చారణ నృత్తం :- రూ. చానరి. దోధక్. వామదేవీయం. ఇది గుజరాత్ పద్ధతి నృత్యం. దీనిని చానరి అని కూడా అంటారు. పరిచారిక స్త్రీలు, పురుషులు కలిసి ఈ నృత్యాన్ని మండలావృత్తంగా అభినయిస్తారు. ఈ నృత్యాన్ని అభినయించే స్త్రీలు ముఖాచ్ఛాదనాలతో ఉండి, దొహిక గీతాన్ని పాడుతారు. ఇది దోధక్ అనుభందం నుండి తీసుకోబడింది. కాబట్టి కుంభకర్ణుడు దీనిని దోధక్ నృత్తమని పేర్కొన్నాడు. ఈ నృత్యాన్ని బృందంగా కాని, ఒక్కొక్కరు గాని మండలాకారంలో అభినయిస్తున్నప్పుడు, వారి అభినయానికి కనుగుణంగా వాద్య గాత్ర సంగీతాలుంటాయి. ఇది లలితోద్ధతి పద్ధతిలో (Partly soft and partly forceful) ఉంటుంది.

గీత గోవిందానికి "నృతి రంజని" వ్యాఖ్యానం రచించిన లక్ష్మీధరుడు ఈ నృత్తాన్ని "వామదేవీయం" అని పేర్కొన్నాడు.

"చారణ నృత్యలక్షణంతు వామదేవీయే దద్య (ర్ధ) తా వాద్య
షట్కేషు (వక్త్రేషు) హహా హుంకార భాషితే (N. R. 151)

చిత్ర పద్ధతి :- "స్వరై ర్బద్దైన పాటై శ్చక్రమేణ కరణత్రయమ్
గేయం వర్ణ స్వరోపేతంగాయనై రథ వాదకైః"
వాద్యం యథాక్షరం యత్ర సాచిత్రా పద్ధతిః స్మృతా
"నర్తకీ నర్తనం కుర్యాత్ తత్రవాద్యాక్షరై స్సమమ్".

ఈ నృత్య విధానంలో గాయకులు స్వరతాళ బద్ధంగానూ, పాటలను క్రమంగానూ వర్ణస్వర సహితంగానూ పాడుతూ ఉంటే వాద్యకారులు వర్ణ స్వరోపేతంగా వాయిస్తుంటారు. అప్పుడు నర్తకి వాద్యాలకనుగుణంగా నర్తిస్తుంది. దీనినే చిత్ర పద్ధతి అంటారు. (నృ. ర. 345)

దండలాస్యం :- రూ. దండసరాకం. ఆంధ్ర, తమిళ ప్రాంతాల్లో ప్రచారంతో ఉండే కోలాటం వంటిది దండలాస్యం. దండ మనగా కర్ర. చిన్నచిన్న రంగు రంగుల కర్రలతో ఈ నృత్యాన్ని చేస్తారు కాబట్టి

దీనికీ పేరు వచ్చింది. దీనిని "దండ రాసకమని" కూడా అంటారు. ఇది రాసక నృత్తాల్లో ఒకటి. జాయప, పార్శ్వదేవులు, యీ నృత్తాన్ని విపులంగా వివరించారు.

"............ అథవాదండ చామరే
క్షురికాదండకై ర్యద్వాతత్త ద్దేశీయ భంగిభిః"

రెండు కర్రలతోపాటు, మరొక కర్రను, ఒక ఛురిక (బాకు) ను గూడ ప్రాంతీయ బేధాలను బట్టి ఉపయోగించాలని జాయప పేర్కొన్నాడు.

ఈ నృత్యంలో కర్రల చప్పుళ్ళతోపాటు వాద్య శబ్దాలకనుగుణంగా ఎదురెదురుగానూ, కుడియెడమలకు మారుతూ, వృత్తాకారంగా తిరుగుతూ, పదవిన్యాసం చేస్తూ అభినయిస్తారు. పార్శ్వదేవుడు దీనికనేక విధాలైన చేతాళాలు, గంటలు, గజ్జలు, పటహం, హుడుక్క, మృదంగాది తాళ వాద్యాలను ఉపయోగించాలని చెప్పాడు.

ఈ నృత్యం మొదట ఎనిమిది మందితో మొదలై రానురాను రెండు వరుసల్లో అరవై నాల్గు మంది వరకు పెరుగుతుందని జాయప సేనాని పేర్కొన్నాడు. పార్శ్వదేవుని మతానుసారం ఇది ప్రారంభంలో రెండు జంటలతో మొదలై ఎదురెదురుగా నిల్చి రెండు వరుసల్లో ఎనిమిదిజంటల దాక ఈ నృత్యాన్ని అభినయిస్తారు.

దేశీ పద్ధతి :– ఈ నృత్యారంభంలో మొదట సమ హస్త వాద్యాల మేళగింపు జరుగు తుంది. తరువాత వరసగా యతి ప్రహరణం, పాట, వాద్యం లేకుండ పుష్పాంజలి జరుగుతాయి. వెంటనే ఝుంకారం, శివగతి మరియు తుండుకం, చమత్కారం, చూపబడుతాయి. ఆ తరువాత గీతాంగ వాద్యాలతో ఉచ్ఛలితమైన యతి, ప్రహరణం జరుగుతుంది. ఈ మొత్తం విధానాన్ని దేశీ పద్ధతి అంటారు. (నృ. ర. 351)

నాటరాసకం :– రూ. నాట్యరాసకం, రాసకం. ఈ నాటరాసకాన్ని శోఢ్ఢలుడు చర్చరి నృత్యంగా పేర్కొన్నాడు. జాయప మాత్రం దీన్ని రాసకం కంటేనూ, చర్చరి కంటేనూ, భిన్నమైందిగా పేర్కొ

[illegible]
యించడానికి సుందరాకారులై ఆకర్షణీయంగా ఉన్న కులీనులు కావాలి. వీరు మధురమైన కంఠాన్ని కలిగి ఉండి, వాద్య గాత్ర సంగీతాల్లో ప్రావీణ్యతను, చక్కని ఉచ్చారణను కూడ కలిగి ఉండాలని జాయప చెప్పాడు. అంతేగాక అలాంటి వారు తాండవ లాస్యంలో కూడ నిపుణులై ఉండాలని, సులభంగా కరణాలు గంతులు, చక్రగతులు చేయగలవారై ఉండాలని జాయప వివరించాడు.

ఈ నృత్యాన్ని చేసేవారు గడ్డం క్షౌరం చేసుకొని, దేహమంతా పవిత్రమైన విభూతి పూసుకోవాలి. బంగారు, రత్నాల, వజ్రాల వంటి ఆభరణాలతో అలంకరించుకొని, కాళ్ళకు గజ్జలు, తలపై పాగను, ఒక చేతిలో దండాన్ని (రంగయష్టి) మరో చేతిలో చురిక (fly-whisk)ను ధరించాలి.

ప్రధాన పేరణి (నృత్యాన్ని అభినయించేవాడు) రంగ ప్రవేశం చేయడానికి ముందు నాలుగు-ఆరు లేక ఎనిమిది మంది అతనికి సహాయకులుగా, అదే అలంకరణాలతో జతలుగా కాని, ఒక్కొక్కరుగా కాని రంగ ప్రవేశం చేయాలి. వీరందరు కూడ ప్రధాన నర్తకుని చుట్టూ చేరి ఉండాలి.

సారంగ దేవుడు మొదటి నర్తకుడు రంగప్రవేశం చేసే పద్ధతిని "అట్టబోడక" అని పేర్కొన్నాడు. ఈ పద్ధతిలో రంగ ప్రవేశం చేసి హాస్యాన్ని అభినయిస్తున్న సందర్భంలో ప్రధాన నర్తకుడు ప్రవేశించాలని సారంగదేవుని అభిప్రాయం.

కల్లినాథుడు అట్టబోడక శబ్దాన్ని "అట్టబోడక ఇతి సకలశిరో ముండితాభిదాయీ దేశీ శబ్దః" అని వ్యాఖ్యానించాడు. ఈ విషయాన్ని జాయప పేర్కొనలేదు.

పేరణి నృత్యం (1) నృత్తం (2) కైవారం (3) ఘూర్ణరం (4) వికటం (5) గీతం అనే ఐదు అంగాలతో కూడి ఉంటుంది. ఇందులో మొదటిది ప్రారంభ నృత్యాభినయం. కైవారం, నాయకుని స్తుతించేందుకు సంబంధించింది. ఘూర్ణరం వాద్య సంబంధమైంది. ఇది తాళంతో కూడి గాని, లేకుండా గాని ఉండవచ్చును. సారంగదేవుని అభిప్రాయం ప్రకారం ఇది తాళంతోకూడి ఉండాలి. హస్తం ఇందులో

ఒక భాగంగా ఉంటుంది. ఇక నాల్గవదైన వికటలో కోతులు మొదలైన వాటిని అలంకరించి, వాటిని రంగ ప్రవేశం చేయించి, కొన్ని చేష్టలను చేయించాలి. ("యన్మర్కట పిశాచాది హాస్య వేష సమాశ్రయం వికటాభినయోపేతం వాగర్థం తత్ప్రచక్షతే".)
అయిదవ అంగమైన గీతలో మాత్రం పాటలుపాడాలి. ఈవిధంగా పేరణి ఐదు అంగాలతో కూడి ఉంటుంది. "సంగీత దామోదర", "నాట్య మనోరమ" మొదలైన గ్రంథాల్లో పేరణి నృత్యం అవయవ కదలికలతో కూడుకున్నదని పేర్కొనబడింది.[1]

ఈ నృత్యాన్ని నటరాజ రామకృష్ణగారు అభివృద్ధి పరచి తన శిష్యబృందంతో బహుజనాదరంగా ఈరోజుల్లోకూడా ప్రదర్శిస్తున్నారు.

బహురూప :– ఈ నృత్యం, సంగీత మకరందం, సంగీతకౌముది, సంగీత దామోదర వంటి అనేక సంగీత గ్రంథాల్లో విపులంగా వివరింపబడింది. ఈ నాటికూడా ఈ నృత్యం ఏదో ఒక రూపంలో భారతదేశ మరదలి కొన్ని ప్రాంతాల్లో ప్రయోగంలో ఉంది.

ప్రపంచంలో విభిన్న స్వరూప స్వభావాలు గల మానవ వ్యక్తి రూపాలైన బహువిధ పాత్రలతో కూడిన నృత్యం కాబట్టి దీనికి ఈ పేరు వచ్చినట్లు నృత్తరత్నావళిలో జాయప పేర్కొన్నాడు. బహురూపంలో అలంకరణ, నటన, సంభాషణలు యిత్యాదులన్నీ పాత్రోచితంగా నడుస్తుంటాయి. ఇందులో ప్రధాన నర్తకుడు చాల చురుగ్గానూ, అనేకభాషలు మాట్లాడగల ప్రజ్ఞ కలవాడుగానూ ఉంటాడు. మరికొంత మంది స్త్రీ పురుషులు అతనికి సహాయకులుగా ఉంటారు.

ఈ నృత్యాభినయంలో భారతదేశ తూర్పు ప్రాంతాలకు, దక్షిణ ప్రాంతాలకు కొంత తేడా వుంది. తూర్పు భారతదేశంలోని గ్రంథాలన్నింటిలోనూ తాండవ నృత్యంలో ఒక విస్తృతమైన భాగంగా బహురూపకం కనిపిస్తుంది. దక్షిణ ప్రాంతాల్లో మాత్రం పగటివేషాలే బహు

---

1. పేరణిర్బహురూపంచ తాండవం ద్వివిధం మతమ్
అంగ విక్షేప బాహుళ్యం తదాభినయ శూన్యతా
యత్రసా పేరణిస్స్యాత్ సంజ్ఞా దేశీతి లోకతః. (N. R.)

రూపంగా పరిగణింపబడుతున్నాయి. ఆంధ్ర తమిళ ప్రాంతాల్లో ఇది నేటికీ ఆచరణలో ఉంది. పురాణేతిహాసాల్లోని ప్రసిద్ధమైన ఘట్టాలను తీసుకొని, ఒకరు లేదా ఇద్దరు ముగ్గురు ఆయా పాత్రలకు తగిన వేష ధారణ చేసుకొని, పట్టణాల్లోనూ, గ్రామాల్లోను, పగటివేళ ఇంటింటికి తిరుగుతూ, ఆయా పురాణ ఘట్టాలకు సంబంధించిన పద్యాలను, పాటలను అభినయ రూపంలో పాడుతుంటారు. పగటిపూట వేషాలు గట్టి అనభి యించే వీళ్ళను పగటి వేషగాళ్ళని అంటారు. సాధారణంగా కూచిపూడి భాగవతులు అప్పుడప్పుడూ పగటి వేషాల్లో మనకు దర్శనమిస్తుంటారు. *(N.R. 152)*

ఖాండికం :— ఈ నృత్యం పూర్తిగా హాస్యానికి సంబంధించింది. ఖాండికులు అంటే హాస్య నటులని అర్థం. వీరు పక్షులను అనుకరించి కూస్తారు. అలాగే కుక్క, నక్క వంటి జంతువుల అరుపులను, కుంటివా ళ్ళను, మరుగుజ్జులను, పిల్లలను అనుకరిస్తూ నటిస్తారు. వీరు అసభ్యకర మైన మాటలు కూడ వాడుతూ పోటీకి వారే వప్పుకుంటూ నటిస్తారు. ఈ నృత్యంలో వాద్యాలను కూడ ఉపయోగిస్తారు. ప్రభువులు నిరుత్సా హంగా ఉన్న సమయంలో వారిని సంతోషపెట్టి ఉత్సాహవంతులుగా చేయడానికి పూర్వం ఈ నృత్యాన్ని అభినయించేవారు. *(N.R. 150)*

పక్షులను, జంతువులను, అనుకరించి కూయడం, అరవడం అంటే అది యీనాటి ధ్వన్యనుకరణ (*Mimicry*) వంటి కళ కావచ్చును. దీనిని బట్టి ధ్వన్యనుకరణ అతి ప్రాచీనమైందని, ఇది ఖాండికం అనే యీ నృత్యంలో ఒక భాగంగా ఉండేదని తెలుస్తున్నది.

బారుడం :— రూ. వారుణం. భరత కోశంలో ఈ నృత్యం వారుణంగా పేర్కొనబడింది.

కర్తరీ స్వస్తికా హస్తౌ స్థానకం వర్ధమానకం
జానునీనమితే కించిత్ భూయోభూయః ప్రసారితే
భవేతాం యత్రకరణమ్ తద్వా రుణముదాహృతమ్ (భ.కో. 600)

కర్తరి మరియు స్వస్తిక హస్తములు వర్ధమానక మను స్థానకం అనువానితోపాటు మోకాళ్ళను కొంచెం కుంచించి మాటిమాటికి చాచుతూ చేసే నృత్తాన్ని వారుణం అంటారు.

రాసకం :- ఇది బృంద నృత్యం. ఇందులో పదహారు, పన్నెండు లేక ఎనిమి మంది యువతులు కలిసి పాల్గొంటారు. వీరు నాలుగు విధాలైన పిండి బంధాలను ప్రదర్శిస్తారు.

పిండీనాం విధయశ్చైవ చత్వారః సంప్రకీర్తితాః
పిండీం శృంఖాలికా, చైవ లతాబంధ కోధ భేద్యకః
పిండి బంధస్తు పిండత్వాత్ గుల్మః (గుఫః) శృంఖాలికా భవేత్
జాలోపనద్ధా చలతాసన్నృత్తో భేద్యకః స్మృతః"

పిండీ అనే బంధంలో ఇద్దరు నర్తకీమణులు, గుల్మ లేక శృంఖాలిక అనే బందంలో ముగ్గురు, "లత" అనే బంధంలో నల్గురు "భేద్యక"అనే పిండి బంధంలో అంత కంటె ఎక్కువ మంది పాల్గొని, ఈ నృత్యాన్ని రమణీయంగా ప్రదర్శిస్తారు,

గుల్మం అతి నెమ్మదిగానూ, శృంఖాలక కొద్ది వేగంగానూ, లత మధ్యరకంగానూ, భేద్యక బంధం అతి వేగంగాను ప్రదర్శన యోగ్యములు.

ఈ నృత్యంలో ప్రవీణులైన యువకులు కూడ పాల్గొనవచ్చును. వీరు చీరలు గాని, చొక్కాలు గాని ధరించాలి. వాద్య సంగీతం ప్రారంభం కాగానే దీనికి అనుకూలంగా పాడుతూ, చప్పట్లు కొట్టుతూ ఒక్కొక్కరు గాని, లేక జతలుగాగాని నృత్యం చేస్తూ, ఇరు వైపుల నుండి రంగస్థలం మీదకు ప్రవేశిస్తారు. ఈ నృత్యంలో పాల్గొనే యువతులు గాని, యువకులు గాని యౌవనులై అందంగా ఉండాలి అని జాయప తెలిపారు. *(N. R. 142, 145)*

శద్ధ పద్ధతి :- రంగస్థల విఘ్నాలు శాంతింపచేసేందుకు సభా నాయకుని అభ్యుదయాన్ని కాంక్షిస్తూ మేఘాల ఉరుముల వంటి గంభీర

మైన ధ్వనులు వచ్చేట్లుగా, నృత్యారంభంలో సమహస్తాలతో అన్ని వాద్యాలను వాయించాలి. తరువాత నర్తకి సమపాదాలతో రంగస్థలం మీదకు వస్తుంది. ఆ విధంగా నర్తకి రంగప్రవేశం చేస్తూ, సందంశన హస్తాన్ని ప్రదర్శించి ఎడమ పాదాన్ని నికుట్టితం చేయాలి. సాంగమగు ముఖత్రయంతో పుటిలం చేస్తూ, పాటను పాడవచ్చును. ఆ తరువాత ముఖత్రియంతో పదాలతోనూ, అంగప్రదర్శనలతోనూ ప్రవేశం చేయాలి. ఆ తరువాత మంఠినతో కొంత కాలగతి జరపాలి.

ఇక క్రమంగా యోజ ఖండగతి, పదం, మలపం, అంగాలతోకూడి మనోహరాలైన పాటలు పాడాలి. నాట్య ప్రదేశమందు శుష్కవాద్య ప్రయోగాలు చేయాలి.

వినుటకు యింపైన తాళం, మృదంగం, కటహం మొదలైన వాద్యాలను వైచిత్రి కొరకు వాయించాలి. నృత్య ప్రదర్శనలో ఈ నియమాలనే పాటిస్తూ మర్యతాళంతో కొంత వరకు పాట నడపాలి. ఈ నియమమే కలిగి మిగిలిన మూడు తాళాల్లోనూ ముందుకు సాగాలి. ఈ విధంగా ప్రదర్శించే నృత్యాన్నే మతంగుడు శుద్ధ పద్ధతి అని నిర్దేశించాడు. (నృ. ర. 341)

# వాద్యకళ

లలిత కళల్లో సంగీతం ఒకటి. వీణ, వేణు, మృదంగాది వాద్యాలను చక్కగా వాయించడం కూడా సంగీత కళలో ఒక భాగంగా పేర్కొనబడింది. సాహిత్యాన్ని ఆలోచనామృతంగానూ, సంగీతాన్ని ఆపాత మధురంగానూ మన పెద్దలు భావించారు. "శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి ఫణాగానరసం" అంటూ సంగీతం వల్ల కలిగే పారవశ్యాన్ని ప్రశంసించారు. నాగస్వరాన్ని మధురంగా ఆలపిస్తే పాములు సైతం తలలూపడం అందరికీ తెలిసిన విషయమే.

వాద్యకళ భారత దేశంలో అతి ప్రాచీన కాలం నుండి ప్రచారంలో ఉన్నట్లు తెలుస్తున్నది వాద్యాలు సంగీత నాట్యాదులందు ప్రముఖ పాత్రను వహిస్తున్నాయి. వివిధాలైన వాద్యాలన్నింటిని (1) అనద్ధ వాద్యాలు (2) తతవాద్యాలు (3) సుషిర వాద్యాలు (4) ఘన వాద్యాలు – అని నాలుగు విధాలుగా విభజించారు.

చర్మంతో కప్పబడి తద్వారా ధ్వనులు పలికించే భేరి, మృదంగాది వాద్యాలను అనద్ధ వాద్యాలంటారు. తంత్రుల మీటి శ్రుతులు పలికించే వీణ, తంబురాది వాద్యాలను తతవాద్యాలనీ, గాలి పూరించి, వాయించే వేణు, నాగస్వరం, సింగినాదం, గాళె మొదలైన వాద్యాలను సుషిర వాద్యాలనీ, కంచు ఇనుము మొదలైన లోహాలతో చేసిన గంట, తాళం మొదలైన వాటిని ఘనవాద్యాలనీ అంటారు. ఈవాద్యాలన్నింటిని మళ్ళీ శ్రుతివాద్యాలు, లయవాద్యాలు అని రెండు వర్గాలుగా పేర్కొన్నారు.

ఈ చతుర్విధాలైన వాద్యాల్లో చర్మసంబంధమైన అనద్ధవాద్యాలను లోహసంబంధమైన ఘన వాద్యాలను మానవుడు మొట్టమొదట కనిపెట్టాడని కొందరు పండితులు భావిస్తున్నారు. కాని వీటి కంటే పూర్వమే తంత్రి వాద్యాలు, సుషిర వాద్యాలు ఉన్నట్లు నిదర్శన లున్నాయని మరి కొందరు చెబుతున్నారు. ఈ అభిప్రాయ భేదాలను కాస్త ప్రక్కన

పెట్టి పరిశీలించినట్లయితే, అతి ప్రాచీన కాలం నుండీ కూడా వాద్య కళ ప్రచారంలో ఉన్నట్లు చెప్పవచ్చును. వివిధ రీతుల వాద్యాలు, వాటిని నిర్మించే విధానం, ప్రయోగ వైశిష్ట్యం మొదలైన విషయ సమాహారాన్నే యిక్కడ వాద్యకళగా పేర్కొంటున్నాము.

హంస వింశతిలో తిరునాళ సందర్భంగా వర్ణించిన ఉత్సవ విగ్రహాల ఊరేగింపులో, కవి రకరకాల వాద్య విశేషాలను పట్టిక రూపంలో యిచ్చాడు. (3–28) వీటిని పరిశీలిస్తే హంసవింశతి కాలంలో ప్రచారంలో నున్న రకరకాల వాద్యాలు, వాటి నుపయోగించే కళాకారుల ప్రతిభా విశేషాలు తెలుస్తాయి. వాటి నన్నిటిని యిక్కడ అకారాది క్రమంలో వాటి రూపాంతరాలను పేర్కొంటూ, సంక్షిప్తంగా వివరించడం జరిగింది.

ఉరుమ :– రూ. ఉరమ పరుమ(ఆం.వా.) ఖంజీర (సూ.ఆ.ని). ఇది చర్మవాద్యం. నిర్మాణమంతా తప్పెటవలె ఉంటుంది. కాని పరిమాణంలో దాని కంటె చాల చిన్నది. మూడు అంగుళాల వెడల్పుగల పలుచని పనసకట్టను, తొమ్మిది అంగుళాల వ్యాసం ఉండేటట్లు గుండ్రంగా వంచి, దానికి మూడు, నాలుగు చోట్ల కన్నాలు చేస్తారు. అందులో సరిపోయేంతటి గుండ్రని కంచురేకుల నమర్చుతారు. సర్వీసు లాంటి జిగురు పూసి, బిగువుగా తయారుచేసిన ఉడుము చర్మంతో వలయాకారంగా తయారుచేసికొని యున్న పనసకట్టె కొక ప్రక్క కప్పి ఉరుమును తయారు చేస్తారు. దీనిని లయానుకూలంగా కదిలిస్తూ చేతితోనే వాయిస్తారు. జానపద గేయాలు పాడేటప్పుడు, జానపద నృత్యాలు ప్రదర్శించేటప్పుడు ఈ వాద్యాన్ని ఎక్కువగా వాడుతుంటారు.

ఒంటికంటి ఉరుమ:– ఇదికూడా చర్మవాద్యమే. ఆకారంలో అంతా ఉరుమలాగే ఉన్నా, పరిమాణంలో మాత్రం దాని కంటె చిన్నదిగా ఉంటుంది. ఉరుమలో లాగా తీనికి కంచురేకులమర్చిన కన్నాలుండవు. అయితే ఒంటి కంటి ఉరుమ అంటే యిక్కడ చర్మం బిగించిన చిన్న కైవారమేనని కొందరి వాద్య కళాకారుల అభిప్రాయం. ఈ వాద్యాన్ని పూర్వం మోడి పెట్టే కళాకారులు పాటపాడుచూ తదనుగుణంగా వాయించేవాళ్ళు. ఉరుమలాగే దీన్ని కూడా చేత్తోనే వాయిస్తారు.

కటాహం :- ఇది ఇరుప్రక్కల కొడుపుతో వాయించే అడ్డ పొడ వైన చర్మవాద్యం. (నృ.ర. 342)

కఱకొమ్ము :- రూ. కర్ణకొమ్ము. కఱ అనగా నలుపు. కఱకొమ్ము అంటే నల్లని కొమ్ముతో చేసిన ఒక విధమైన సుషిర వాద్యం. ఇది ఆకారంలో గాళెలాగా ఉన్నా సైజులో మాత్రం చిన్నది. (చూడు. గాళె.)

కాంశ్యశృంగం :- కంచుతో చేసిన కొమ్ము వాద్యం. ఇది సుషిర వాద్య విభాగానికి చెందింది. మొదలు సన్నంగా ఉండి పోను పోను వెడల్పుగానూ, గుండ్రంగానూ ఉండేటట్లు అర్ధచంద్రాకారంలో ఈ వాద్యాన్ని తయారుచేస్తారు. సన్నగా ఉండే భాగాన్ని పెదవులకు ఆనించుకొని గాలిని పూరిస్తారు. గాలి ఈ వాద్యంగుండ ప్రసరించేటప్పుడు ఘీంకారాల వంటి ధ్వనులు *[Trumphet like sounds]* వస్తాయి. దీనిని లయానుకూలంగా వాయిస్తారు. పంచవాద్యాల్లో, బాండులో దీని నెక్కువగా ఉపయోగిస్తారు. *(L.V. 39)* పూర్వం రాచరికాల్లో సైనికులు కోటకొమ్మల మీది నుండి హెచ్చరికలు చేసేటప్పుడు, స్వాగతాలు పలికే టప్పుడు దీనినెక్కువగా వాడుతుండేవారు.

కాహళం :- రూ. కాహళి. కాహళిక. ఇది పొడవైన దండం కలిగి ముఖభాగం ఉమ్మెత పువ్వు ఆకారంలో వుంటుంది. దీనిని వెండి,రాగి మొదలైన లోహాలతో చేస్తారు. ఇది సుషిర వాద్యం. *(B.K 133)* ఒక విధంగా యిప్పటి బాకాలాగా ఉంటుంది. పెద్ద పెద్ద ధ్వనులు కలిగించేం దుకు, బిగ్గరగా అరిచేందుకు దీని నెక్కువగా వాడుతారు.

గాళె :- రూ. కాళె. కాళియు. సం॥ గభీరిక, కుహణం, ఖురంఖం. దీనినే కొమ్ము, కొమ్ముబూర. బూరకొమ్ము అనికూడ అంటారు. (ఆం.వా. III - 154) (సూ.ఆ.ని. II - 285)

ఈ వాద్యం అర్ధచంద్రాకారంలో మొదలు సన్నగా వుండి పెదవుల కానించి ఊదేందుకు అనుకూలంగా గుండ్రంగా నిర్మింపబడి వుంటుంది. రానురాను దీని పరిధి పెరిగి ప్రారంభంలో కంటె పదిరెట్ల వైశాల్యం కలిగి గుండ్రని బూరలాగా ఉంటుంది. ఈ వాద్యానికి మధ్యభాగంలో

అక్కడక్కడ గుబ్బలు తగిలిస్తారు. పట్టుకొనేందుకు అనుకూలంగా ఒక దారాన్ని కూడా కడతారు. పూర్వం దీనిని కొమ్ముతోనో లేదా కొమ్ము ఆకారంలోనో నిర్మించడం మూలంగా ఈ వాద్యానికి పేరువచ్చి ఉంటుంది ఇప్పుడు మాత్రం దీన్ని రాగితో కూడా చేస్తున్నారు.

ఈ వాద్యాన్ని సాధారణంగా తిరునాళ్ళు, కొలువులు, ఉత్సవాలు, జాతరలు మొదలైన వేడుక సమయాల్లో మిగిలిన వాద్యాలతోపాటు పెద్ద ధ్వనులు చేయడం కోసం ఉపయోగిస్తారు (తె వి స. III ఫలకం 48. చిత్రం-3)

ఈ వాద్యాల్లో బూరగాళె, హెగ్గాళె అనే రెండు భేదాలు కూడా ఉన్నాయి. (యక్షగాన వాఙ్మయ చరిత్ర 366)

గిడియ :- రూ. తుడుము. తముకు. అరగజం. ఇది అనద్ధ విభాగానికి చెందిన చర్మవాద్యం గిడియ, తుడుము, తముకు అనేవి పటాహభేదాలుగా చెప్పబడ్డాయి. (సూ.ఆ.ని II-751) తుడుమనంగను, తముకు నాగిడియ యనగ, నరగజంబన తద్భేద నామంబులగు. (శర) అనుటను బట్టి ఒకే వాద్యానికే పైన పేర్కొన్న పేర్లన్ని నామభేదాలు మాత్రమేనని తెలుస్తున్నది.

తముకు అను వాద్యాన్ని సాంబమూర్తిగారు ఈ విధంగా వర్ణించినారు. "ఇది గోలెం *[Pot drum]* ఆకారంలో వుంటుంది. దీనిని కంచు, కర్ర, మట్టి, దేనికైనను చేయవచ్చును. చర్మాన్ని చంద్రవలయాకారంగా ఉన్న గుండ్రని సలాకకు బిగించి, దానితో తముకు ముఖభాగాన్ని కప్పి తాళ్ళతో బిగించి, అడుగుభాగంలో కట్టి వేస్తారు. దీనిని రెండు చర్మపు వార్లతో అల్లిన కొడుపులతో వాయిస్తారు. ఎక్కువగా దండోరాలు వేయడానికి ఉపయోగిస్తారు". *(L.V. 39)*

గుమ్మెట :- రూ. గుమ్మెత. చర్మవాద్యం. కూజా ఆకారంలో చేసిన మట్టిపాత్ర ఒక ప్రక్క వెడల్పుగా ఉండి రెండవ ప్రక్క కూజా మూతిలాగా సన్నగా పొడవుగా ఉంటుంది. వెడల్పుగా ఉన్న ప్రక్క చర్మంతో కప్పి వార్లతో బిగిస్తారు. దీన్ని భుజానికి తగిలించుకొని ఒక

చేత్తో వాయించుతూ, కూజా మూతిలాగా ఉండే భాగాన్ని లయాను గుణంగా రెండో చేత్తో మూయడం, తీయడం చేస్తుంటారు. ఈ వాద్యాన్ని బుర్రకథలు చెప్పేవాళ్లు ఎక్కువగా ఉపయోగిస్తారు. *(L V. 37)*

చక్కి :- రూ. ఢక్కి. జక్కి. ఝక్కి. ఒక విధమైన చర్మవాద్య మని ఆంధ్రవాచస్పత్యంలో పేర్కొనబడింది. సాంబమూర్తిగారు దీన్ని జక్కి అని పేర్కొన్నాడు. ఇది చిన్న మద్దెల వంటి వాద్యం. దీని నెక్కువగా దేవాలయ కార్యక్రమాలకు ఉపయోగిస్తారు. ఇటువంటిది వృద్ధాచల దేవాలయంలో కనిపిస్తుంది. *(L.V. 30)*

చిటికెలు :- చేతి వేళ్ళతో చిటుకలు వేస్తే వచ్చే ధ్వని విశేషాన్ని కలిగించే చిన్న కర్రపలక వాద్యాన్ని చిటికెలు అంటారు. వీటిని దాదాపు అరచేయి పెడల్పున గుండ్రంగా పలుచని కర్రతో తయారు చేస్తారు. రెండు పలకలకు చేతివేళ్ళ మధ్య అమర్చుకొనేందుకు వీలుగా కాడలుం టాయి. ఈ కాడలను ఎడమచేతి వేళ్ళ సందుల్లో వుంచి పట్టుకొని కుడి చేత్తో లయబద్ధంగా వాయిస్తారు.

"ఎయిరా చిన్నప్పారెడ్డీ నీపేరే బంగారు కడ్డీ"అని పాడుతూ మోడి పెట్టేవాళ్ళు పూర్వం ఈ వాద్యాన్ని ఎక్కువగా వాడేవాళ్లు. ఈనాడు ఈ చిటికలను వాయిస్తూ పాటలు పాడే యాచకులను తరచుగా రైళ్ళలో, బస్సుల్లో చూస్తుంటాము.

చిటి తాళాలు :- రూ. చిర్తలు. వాయించుటకు అనువుగా మ్రానితో తయారుచేయబడిన చిన్న తాళవిశేషాలే చిటితాళాలు(వా.ని. II-4016)

తెలుగు విజ్ఞాన సర్వస్వం. మూడవ సంపుటంలోని 47వ ఫలకంలో చిటితాళ చిత్రం యివ్వబడింది. వీటిని సామాన్యంగా జిడ్డేగు కర్ర *(Rose w od)* తో తయారుచేస్తారు. జానెడు కర్రను తీసుకొని క్రింది భాగాన్ని చదునుగా చేస్తారు. వెనుక భాగం రెండు చివరల ఉబ్బుగా నున్న రెండు చివరల రంధ్రాలు చేసి, కంచు రేకులను అమర్చి, చిరు గజ్జెలను కడతారు. వంపు ప్రదేశంలో మాత్రం చేతి వ్రేళ్ళకు తగిలించు

కునేందుకు వీలుగా కొక్కెములను అమర్చుతారు. ఇలా తయారుచేసిన రెండు పలకలను చేతివ్రేళ్ళకు తగిలించుకొని వాయిస్తారు. వీటిని ఎక్కువగా సాతాని జియ్యర్లు వాడుతారు. కొందరు పూజా సమయాల్లో భజన పాటలు పాడేటప్పుడు వీటిని ఉపయోగిస్తారు.

చేసన్నాయి :- షహనాయి అపభ్రంశ రూపం సన్నాయి. ఇది హిందుస్తానీ సంగీతాన్ని శాస్త్రీయంగా ప్రదర్శించేందు కుపయోగించే వాద్యాల్లో ప్రముఖమైంది. ఇది సుషిర వాద్యవిభాగానికి చెందింది.

సన్నాయి ఆకారంలో నాదస్వరాన్ని పోలివుంటుంది. ఊదేందుకు పయోగించే, ఆకు పీకలు, రంధ్రాలు మొదలైన నిర్మాణమంతా నాద స్వరం లాగానే ఉంటుంది. ప్రయోగించే పద్ధతిలో కూడ ఈ రెండింటికి భేదం లేదు. పరిమాణంలో మాత్రం కొంత భేదం ఉంది. నాదస్వరం సన్నగా పొడవుగా ఉంటుంది. సన్నాయి లావుగా ఉండి పొడవు తక్కువగా ఉంటుంది. నాదస్వరానికి వున్నట్లు సన్నాయికి అడుగు భాగంలో గంటాకారంలో చేయబడిన లోహపు చుట్టు వుండవు, సన్నాయిని చందనపు కఱ్ఱతోనే గొట్టముతో కలిపి చేస్తారు. దీని ధ్వని మనోహరంగానూ గంభీరంగానూ ఉంటుంది.

షహనాయిని సాధారణంగా మహమ్మదీయులు వాయిస్తారు. భారత దేశంలోని మహమ్మదీయులు వివాహాది శుభసందర్భాల్లో బాండు మేళంలో దీన్ని ఎక్కువగా ఉపయోగిస్తారు. (సం. క. ప్ర. I-176)

జమిడిక :- రూ. జెమిడిక, జెమిళిక, జెమళిగ, జెమిలిక. ఒక విధమైన చర్మవాద్యం (సూ. ని. III-391). ఇది ఆకారంలో డోలులాగా ఉంటుంది. పరిమాణంలో మాత్రం దానికన్నా చిన్నది.

దాదాపు 9 అంగుళాల వ్యాసం గల రెండు కంచు గొట్టాలను ఒకటిగా చేర్చి, వాని కిరువైపుల చర్మాలను బిగిస్తారు. ఈ వాద్యాన్ని మెడకు తగిలించుకొని గాని, నడుముకు కట్టుకొని గాని రెండు సన్నని కొడుపు లతో వాయిస్తారు. ఈ వాద్యాన్ని సాధారణంగా కొలుపుల్లో జాతరలందు పంబ మొదలైన వాద్యాలతో కలిపి వాయస్తారు. జతగా ఉండే వాద్యం

కాబట్టి దీనికి జమిడిక అని పేరు వచ్చి ఉంటుంది. సాంబమూర్తి గారు దీనిని పంబ అని పేర్కొన్నారు. *(L. V.)* కాని పంబ వేరు, జమిడిక వేరు.

ఝర్ఝరీ :– రూ. ఝర్ఝరం=డమరు. కయిముడి అనే వాద్యం(శ.ర.) డమరు బుడుబుడుక్కల వాడు వాయించే చర్మ వాద్యం. (సూ. ని. - III–535). రెండు ముఖాలు గుండ్రంగానూ, మధ్య సన్నగానూ వుండే ఒక పరికరానికి రెండు దిక్కుల చెర్మాన్ని బిగిస్తారు. ఇరువైపుల చర్మానికి తగిలేటట్లు అనుకూలంగా అటు యిటు రెండు తాళ్ళు కట్టి కొనలు ముడివేసి ఉంచుతారు. ఇది చేతిలో పట్టుకొనేందుకు వీలుగా ఉంటుంది. డమరుకాన్ని చేతిలో పట్టుకొని లయానుగుణంగా చేతిని తిప్పినప్పుడు రెండు వైపుల కట్టబడిన తాళ్ళు చర్మాలకు తగిలి బుడు బుడుక్ మనే శబ్దం వస్తుంది.

ఇది యింకొంచెం పెద్దదిగా ఉన్నట్లైతే, శివుడు వాయించే ఢమరుకం అవుతుంది. శివుడు ఝర్ఝరం కలవాడు కాబట్టి ఝర్ఝరుడు అయినాడు.

డోలు :– రూ. తవిల్. ఇది అనద్ధ వాద్య విభాగానికి చెందిన చర్మ వాద్యం, దీన్నే సాంబమూర్తిగారు తవిల్ అని పేర్కొన్నారు.

డోలును దక్షిణ భారతదేశ వాసులు ఎక్కువగా, వివాహాది శుభ సమయాల్లోను, తిరునాళ్ళ వంటి ఉత్సవాల్లోనూ నాదస్వరంతో కలిపి ప్రదర్శించిన మేళానే మంగళ మేళమని, పెరియ మేళమని అంటారు.

డోలును పనస కఱ్ఱతో చేస్తారు. 16 అంగుళాల పొడవుగల పనస మొద్దును తీసుకొని లోపల బోలుగా చేస్తారు. ఈ బోలు యొక్క వ్యాసార్థం 9 అంగుళాలుంటుంది. దీని ఆకారాన్ని తీర్చి దిద్దేందుకు మృదంగానికి వుపయోగించే యంత్రాన్నే ఉపయోగిస్తారు. దీనిని రెండు ప్రక్కల చర్మంతో మూసి, చర్మపు తాళ్ళతో గట్టిగా బిగిస్తారు. దీనిని నడుముకు కట్టుకొని ఒకవైపు కర్రతోను మరోవైపు చేతితోనూ వాయిస్తారు. డోలును చేతితో వాయించే ప్రక్క 8 న్నర అంగుళాల వ్యాసం కలిగి రెండున్నర అంగుళాల వ్యాసంతో కరణి వంటి నల్లని పదార్థాన్ని పూస్తారు. కర్రతో వాయించే ముఖభాగం దాదాపు 9 అంగుళాల వ్యాసం

కలిగి ఉంటుంది. డోలు మధ్య భాగం 13న్నర అంగుళాల వ్యాసం కలిగి ఉంటుంది. *(L. V. 19)*

ఢక్కా :- రూ. యశఃపటము. ఢంకా (శ. ర.) ఇదియిసుక గడియారం ఆకృతిలో మధ్య భాగంలో సన్నగానూ, గుండ్రంగానూ ఉండేటట్లు, కర్రతో గానీ, కంచు లేదా మట్టితో గానీ తయారు చేస్తారు. రెండు ముఖాలను చర్మంతో కప్పిన తీగలతో బిగిస్తారు. ఇది చూచేందుకు హుడుక్కా లాగా ఉన్నా దాని కంటె పరిమాణంలో పెద్దది.

ఢక్కా 12 అంగుళాల పొడవును 8 అంగుళాల వ్యాసం గల ముఖంతో, మధ్యభాగం అరంగుళం మందం కలిగి ఉంటుంది. దీనిని కర్రతో ఒక ప్రక్కనే వాయిస్తారు. విష్ణు ఆలయాల్లో దీన్నెక్కువగా వాడుతారు. *(L.V. 31 & B.K. 840)*

ఢక్కా అనేది వ్యవహారంలో ఇలా కూడా ఉంది. పైన వెడల్పు గానూ, క్రింద భాగంలో దాని కంటె కొంచెం వెడల్పు తక్కువగా ఉండే టట్లు తొట్టి *(Pot Drum)* ఆకారంలో కంచుతోగాని, కఱ్ఱతోగాని తయారు చేసి, దానికి పై భాగంలో చర్మంతో కప్పి తాళ్ళతో బిగిస్తారు. దీన్ని రెండు కఱ్ఱ కొడుపులతో పెద్ద ధ్వనులు వచ్చేటట్లు వాయిస్తారు. పూర్వం రాజ ప్రముఖుల ఆగమనాన్ని తెలిపేందుకు, హెచ్చరికలు చేసేందుకు, దండోరాలు వేసేందుకు దీన్ని ఉపయోగించేం వాళ్ళు. డిండిమభట్టు కంచు ఢక్కాను శ్రీనాథుడు పగులగొట్టించినది కూడా యిటువంటిదే కావచ్చును.

ఢమామిక :- రూ. డమామి. ఇది ఒక పెద్ద చర్మవాద్యం, అనద్ధ వాద్యవిభాగంలో చేరుతుంది. ఇది రాజ చిహ్నంగా పూర్వం ఉండేది. రాజు పురప్రవేశాన్ని చేస్తున్నప్పుడు ఈ వాద్యాన్ని వాయించే వారని తెలుస్తున్నది.

చ॥ దూపములు నల్దెసల ఘుమ్మురనందనర్చు నప్పురము
ప్రవేశమై నృపతి ముందరవచ్చె ఢమామి మ్రోయగన్
(సూ. ని. *III-536)*

తంబుర :- రూ. తంబురు, తంబూరి. తంబూర్. తుంబుర. ఇది తతవాద్యం. కర్ణాటక, హిందుస్థానీ సంగీతాలకు శ్రుతివాద్యంగా దీన్ని వాడుతారు. హరికథా కాలక్షేపాలకు, భజనలకూ, సంగీత నాటికలకు కూడా తుంబురను వాడుతారు. వీరేశలింగంగారు నాటకాలలో తుంబురను వాడారు. ఇది ప్రాచీన పౌరాణిక వాద్యం. కళాస్వరాలైన పంచమ, షడ్జమ స్వరాలు దీనిపై చక్కగా ఆలాపించవచ్చును.

(ఆం. వి. *IV-3051*)

తంబుర వీణాకారంలో వుంటుంది. కాని దీనికి మెట్లు, సొరకాయ బుర్ర, యాళి (పురాతన జంతు తల ఆకారం) వుండవు ఈ వాద్యాన్ని పనస కర్రతో తయారు చేస్తారు కుండ, దండె, తీగలు బిగించుకొనుటకు బిరడాలు ఉంటాయి. దండెను, కుండను ఒక దంతపు ముక్కతో కలుపుతారు, ఇందులో నాలుగు తీగలుంటాయి. వాటిలో మొదటిది 26 గేజ్ రెండు, మూడు తీగలు 31 గేజ్‌లో ఉండే ఉక్కు తీగలు. నాల్గవది మాత్రం ఇత్తడితో తయారుచేయబడిన 26 గేజ్ తీగ ఉంటుంది. ఈ వాద్యాన్ని వాయించేప్పుడు కుండను ఒడిలో వుంచుకొని కుడి చేతితో శ్రుతి నాలపిస్తారు.

1) తంజావూరు తంబుర, 2) మిరాజి తంబూర 3) సప్తతంత్రి తంబూర 4) అష్టతంత్రి తంబూర 5) స్వవాది తంబూర (*Automatic Tumbura*) అని వీటిలో వివిధ రీతుల తంబూరాలున్నాయి. అష్టతంత్రీ తంబూరలో గంభీరమైన శ్రుతి వస్తుంది. సాధారణ తంబూరకు దండె భాగంలో ఎలెక్ట్రిక్ మోటర్‌ను బిగిస్తే, ఆ మోటర్‌కు సన్న లోహపు మూడు వ్రేళ్ళ ద్వారా, మనిషి సహాయం లేకుండానే తంత్రులు మీటుతుంటుంది. ఇది స్వవాది తంబుర. (సం.గా.క.బో. 132 – 133).

తప్పెట :- రూ. డప్పు. ఇది చర్మవాద్యం. అవనద్ధ విభాగంలో చేరుతుంది. పలకపాటి కర్రతోనూ, చర్మంతోనూ యీ వాద్యాన్ని చేస్తారు. నాలుగు అంగుళాలు వెడల్పుగల గుండ్రని పలకపాటి కర్రను తీసికొని, దాన్ని ఒక ప్రక్క చర్మంతో మూసివేస్తారు. దీన్ని భుజానికి తగిలించుకొనుటకు వీలుగా ఒక తాడును కడతారు.

తప్పెటను భుజానికి తగిలించుకొని ఒక చేతితో సన్నని పుల్లని ఆడిస్తూ, రెండవ చేతితో కొద్ది లావుపాటి కొడుపుతో వాయిస్తారు. దీనిని ముఖ్యంగా జాతర, కొలుపులు, పొంగళ్ళు, దండోరాలు మొదలైన సందర్భాలలో ఉపయోగిస్తారు. తెలంగాణా ప్రాంతంలో దీన్ని డప్పు అంటారు.

తమ్మటం :— ఇది తప్పెటాకారంలో ఉండే చర్మవాద్యం నాలుగు అంగుళాల వెడల్పుగల గుండ్రని కర్రకు జల్లెడవంటి చర్మాన్ని బిగిస్తారు. దీనిని సన్నని వార్లతో వలలాగా అల్లుతారు. తప్పెటవలె దీన్ని రెండు కర్రలతో వాయిస్తారు. *(L. V. 38)*

తాళాలు :— మూడు అంగుళాల వ్యాసం కలిగి వుండేట్లుగా ఇత్తడితో గుండ్రంగా పోతపోసి తాళాలను తయారుచేస్తారు. వీటి మధ్య భాగం కొంచెం ఎత్తుగా ఉండి, తాళాలను పట్టుకునేందుకు వీలుగా దారాలను కట్టడానికి రంధ్రాలమర్చబడి ఉంటాయి. ఈ తాళాలు జతగా ఉంటాయి. వీటిలో పై తాళాన్ని ఇత్తడితోనూ, క్రింది తాళాన్ని ఇనుముతోనూ తయారు చేస్తారని సాంబమూర్తిగారు పేర్కొన్నారు. కాని రెండు తాళాలు కూడా ఇత్తడివో, ఇనుమువో ఉండడం పరిపాటి.

ఈ తాళాలను ఎక్కువగా భజన కీర్తనలు పాడుతున్నప్పుడు, భరతనాట్యాన్ని, భాగవతాలను ప్రదర్శిస్తున్నప్పుడు లయానుకూలంగా వాయించడానికి ఉపయోగిస్తారు.

తిపిర కిన్నెర :— రూ. ఏక్‌తార. తిపిర అంటే సొరకాయ అని ఆంధ్ర వాచస్పత్యంలో చెప్పబడింది. కావున సొరకాయ బుర్రతో తయారుచేయబడిన కిన్నెరనే తిపిర కిన్నెరగా భావించవచ్చును. ఇది తతవాద్యానికి చెందింది. దీనిని ఏక్‌తార అనికూడ అంటారు. దీనికి ఒకే తీగ ఉంటుంది కాబట్టి బహుశా దీనికీ పేరు వచ్చి ఉంటుంది.

నాలుగు అడుగుల పొడవు రెండంగుళాల పరిధి కలిగిన ఒక వెదురు బొంగుకు ఒక ప్రక్కన తంత్రులు బిగించుటకు వీలుగా ఒక గుబ్బను అమర్చుతారు. రెండవ పక్క ఒక గుండ్రని సొరకాయబుర్రను అమర్చు

తారు. వెదురుకు పైభాగాన అమర్చిన గుబ్బకు తంత్రిని కట్టి దానిని సొరకాయ బుర్ర మీదుగా తీసి దాని కింద బిగిస్తారు. తీగ, సొరకాయ బుర్రకు తగలకుండా ఉండేందుకై మధ్యలో ఒక పరికరాన్ని అమర్చుతారు, ఇలా తయారుచేసిన ఏక్‌తారను చేతితో పట్టుకొని చూపుడు వేలితో తీగను మీటుతూ వాయిస్తారు. ఈ వాద్యాన్ని ఎక్కువగా బైరాగులు, దాసర్లు, ఉపయోగిస్తారు. ఇది తత్త్వాలు పాడేందుకు చాల అనుకూలంగా ఉంటుంది. *(S. V. 22)*

నాగసరం :– రూ. నాదస్వరము. నాగస్వరము. సన్నాయి. ఇది సుషిర వాద్యం. దీన్ని ఒత్తు వాద్యం అని కూడా అంటారు. దక్షిణ హిందూ దేశంలో ఇది చాలా ప్రముఖమైంది. తిరునాళ్ళు, ఉత్సవాలు వివాహాది శుభకార్యాలకు విరివిగా వాడుతారు.

నాగసరాన్ని 2 లేక రెండున్నర అడుగుల పొడవుండే గుండ్రని బోలు కఱ్ఱతో చేస్తారు. క్రింద వెడల్పుగానూ, పైన సన్నగానూ ఉంటుంది. గొట్టం క్రింది భాగంలో ఏడు రంధ్రాలుంటాయి. అవి ధ్వనిని అదుపు చేయడానికి ఉపకరిస్తాయి. పై భాగంలో ఒక లోహపు గడి ఉంటుంది. అందులో పీకలు *[Reeds]* అమర్చుతారు. దీని సహాయంతో నాగసరం వాయిస్తారు.

నాగసరం=పాముల వాడు వాయించే బుఱ్ఱ (శ. ర.) ఇది సుషిర వాద్యం. దీనిని వాయించితే నాగుబాములు పడగలు విప్పి ఆడుతుంటాయి కాబట్టి దీనికీ పేరు వచ్చి ఉంటుంది.

మొదలు కొంచెం సన్నగా, గుండ్రంగా ఉండి, వంపుగల్గి, తర్వాత కొంచెం లావుగా పొడవుగా ఉండే సొరకాయ బుఱ్ఱకు క్రింది భాగంలో రంధ్రం చేసి, దానిలో సన్నని వెదురును (9" పొడవుతో ఏడు రంధ్రాలుచేసి ఉంటాయి.) అమర్చుతారు. దీనికి పై భాగాన రంధ్రం ఉంటుంది. దీని ద్వారా గాలి పూరించి, క్రింద నున్న వెదురు రంధ్రాలను మూస్తూ తెరుస్తూ ఉండడం వల్ల మనోహరమైన ధ్వనులు వస్తాయి. పూర్వం మోడి పెట్టే వాళ్ళు, పాములనాడిపించేవాళ్ళు దీనినెక్కువగా వాడేవాళ్ళు.

నారద వీణ :- "నారదస్యాపి మహతీ తుంబురోస్తు కళావతీ విశ్వ
వసోస్తు బృహతీ సరస్వత్యాస్తు కచ్ఛపీ"

నారదుడు ధరించే వీణ. దీని పేరు మహతి. ఇది తతవాద్యం. ఈ వీణకు మొదట, చివర రెండు తుంబురలు వుంటాయి. ఈ రెండు తుంబురలను కలుపుతూ పెదురు బొంగు వుంటుంది. స్వరాలను పలికించేందుకు వీలుగా యిరవై మెట్లు, వీటి మీద నాలుగు తీగలు అమర్చి ఉంటాయి. దీని మెట్లు అవసరమైన స్వరాన్ని పలికించేందుకు వీలుగా చలనం కలిగేవిగా ఉంటాయి.

నారద వీణ ఉత్తర భారతదేశంలో ఎక్కువగా వాడుకలో ఉంది. ఈ వీణను మీటితే నారాయణస్మరణం పలుకుతుందని చెబుతారు.

(ఆ. వి. *IV-3050*)

నిస్సాణం :- ఇది అనద్ధ విభాగానికి చెందిన చర్మ వాద్యం. రాగితో తొట్టి ఆకారంలో చేసిన నిస్సాణం యొక్క పై భాగాన్ని గాడిద చర్మంతో కప్పి, తాళ్ళతో గట్టిగా బిగిస్తారు. దీన్ని వాయించేందుకు చర్మపు తాళ్ళతో చేసిన కొడుపులను ఉపయోగిస్తారు. దీని శబ్దాలు గంభీరమై, భయంకరంగా ఉంటాయి. *[B K 338]*

పంబ :- ఈ వాద్యాన్ని వాయించేవారిని పంబలవారు అంటారు. ఇది చర్మవాద్యం. దీన్ని కర్రతోనూ, చర్మంతోనూ తయారు చేస్తారు. ఈ వాద్యాన్ని సాంబమూర్తిగారు జమిడిక అని పేర్కొన్నారు. కాని అది సరికాదేమోననిపిస్తున్నది. *[L V. 34]*

ఒక అడుగు పొడవు 3 అంగుళాల కై వారం గల కర్రను బోలుగా తొలుస్తారు. దీన్ని కంచుతోకూడ తయారు చేయవచ్చును. ఒక ప్రక్క చర్మంతో మూసి, దాని మధ్య నుండి ఒక దారాన్ని అమర్చుతారు. ఈ వాద్యాన్ని వాయించేవాళ్ళు దీనిని నడుము వద్దకు వచ్చేట్లు ఎడమ చంకలో పెట్టుకొని, ఎడమ చేత్తో దారాన్ని గట్టిగా లాగి పట్టి కుడిచేతి బొటనవేలు చూపుడు వేలూ కలిపి ఆ దారాన్ని లయబద్ధంగా కొడుతూ వాయిస్తారు. పంబలవాళ్ళు కథలు చెప్పేందుకు ఈ వాద్యాన్ని ఉపయో

గిస్తారు. బవనీల చక్రవర్తి పంబవాయిస్తూ పరుశురామ కథలు పాడినట్లు క్రీడాభిరామంలో ఉంది.

పిల్లనగ్రోవి :— రూ. వేణువు, మురళి. పిల్లంగోవి (వ్య) ఇది సుషిర వాద్యం. దీన్ని వెదురుతో తయారుచేస్తారు. ఈ వాద్యానికి ఏడు రంధ్రాలుంటాయి. వీటిలో మొదటిది కాస్త పెద్దది. దీని నుండే గాలి పూరిస్తారు. గాలి పూరించేటప్పుడు మిగిలిన చిన్న రంధ్రాలను వేళ్ళతో రాగానికి అనుగుణంగా మూస్తూ, తీస్తూ ఉంటారు. ఇలా చేయడం మూలంగా పదహారు స్థానాలు కలుగుతాయి. ఈ వాద్యాన్ని వాయించడానికి అనుభం ఎంతో అవసరం. (క్రౌ. సం, వి. ద. 24).

పిల్లనగ్రోవిని కేవలం వెదురు కర్రతోనే గాక, ఏనుగు దంతాలతోనూ, చందనపు కర్రతోనూ, రక్తచందనంతోనూ, ఇనుము, కంచు, బంగారు, వెండి వంటి లోహాలతోనూ, తయారు చేయవచ్చును. వెదురుతో తయారు చేసిన మురళి గాన మాధుర్యమే అన్నిటికన్న మధురాతిమధురంగా వుంటుంది కాబట్టి సాధారణంగా ఈ వాద్యాన్ని వెదురు కర్రతోనే చేస్తారు. (సం,గా.క.బో. 184) ఇది రెండు రకాలుగా ఉంటుంది. సన్నాయి మాదిరి నోటిలో పెట్టుకొని వాయించేది ఒక రకం. పెదాలకానించి గాలిని పూరించి వాయించేది రెండో రకం.

పురభిడ్డమరు :— (పురభిత్ + ఢమరు) నటరాజు వాయించే వాద్యాన్నే ఢమరు అంటారు. ఇది హుడుక్కాను పోలిన నిర్మాణాన్నే కలిగివుంటుంది. ఢమరుకు మధ్యభాగంలో కొసలు ముడి వేసిన రెండు సన్నని తాళ్ళు కట్టి ఉంటాయి. ఈ తాళ్ళు ఢమరును వాయించినప్పుడు దానికి రెండు వైపులనున్న చర్మాన్ని తగిలి లయానుకూలంగా ధ్వనులు రావడానికి తోడ్పడతాయి. ఢమరు వంటి నిర్మాణాన్ని కలిగి, ఆకారంలో దానికంటే చిన్నగా ఉండేదాన్ని హుడుక్కా అంటారు.

(చూడు. హుడుక్కా)

భేరి :— రూ. దుంధుభి. ఇది నగారా వాద్యం కంటే పెద్దగా ఉంటుంది. గూన ఆకారంలో కంచు లేక రాగితో చేసిన భేరి ముఖాన్ని

చర్మంతో కప్పి వార్లతో బిగిస్తారు. దీని ముఖ భాగం మూడున్నర లేక 4 అడుగుల పరిమాణం కలిగి ఉంటుంది. భేరి పరిమాణం పెద్దగా ఉండటం మూలంగా దీనిని ఒక బండిలో అమర్చి ఉంటారు. అందువల్ల దీన్ని వాయించేవాడు బండిమీద భేరి ప్రక్కన నిలబడి రెండు కర్ర కొడుపులతో వాయిస్తాడు. దీని ధ్వనులు గర్జనల వలె గంభీరంగానూ, భయంకరంగానూ ఉండి గగనాంతరాలలో వ్యాపిస్తాయి. యుద్ధ సమయాల్లోనూ, విజయ యాత్రా సమయాల్లోనూ భేరీలనుమోగిస్తారు. దీన్ని దుంధుభి అని కూడ అంటారు.

మర్దల :— రూ. మద్దెల, మద్దల. ఇది అనద్ధ వాద్యాల్లో ఒకటి. మద్దెల మృదంగ ఆకారాన్ని పోలి ఉంటుంది. పరిమాణంలో మాత్రం యిది మృదంగం కంటె పెద్దది. మద్దెలకు, మృదంగానికి ఉపయోగించే కరణి కంటె గట్టిగా వుండేదాన్ని తీసుకొని మద్దెల చర్మానికొకవైపు (మృదంగ చర్మం కంటె) ఎక్కువ భాగం పూయబడి ఉంటుంది. మద్దెల మృదంగం కంటె గట్టిగా మోగుతుంది. తెలుగునాట దీన్ని వీధి భాగవతులు ఎక్కువగా ఉపయోగిస్తారు. భజనలు, హరికథలు మొదలైన వాటికి కూడ ఉపయోగిస్తారు. కేరళ రాష్ట్రంలో మద్దెల పంచ వాద్యాలలో ఒకటిగా పరిగణింపబడుతుంది. కథాకలి నృత్యంలో ఈ వాద్యాన్ని ఎక్కువగా ఉపయోగిస్తారు. దీన్ని నందికేశ్వర వాద్యం అని కూడ అంటారు. సాంబమూర్తిగారు మాత్రం ఈ వాద్యాన్ని శుద్ధ మద్దల అని పేర్కొన్నారు. *[L. V. 30]* (దీని నిర్మాణపద్ధతికి. (చూడు మురజం)

మహోత్తాళములు :— భరత కోశంలో ఇది కాంశ్య తాళంగా పేర్కొనబడింది. 13 అంగుళాల ముఖం కలిగి, మధ్యభాగం రెండు అంగుళాల వ్యాసంతో అంగుళం ఎత్తు ఉబ్బుగా పైకి లేచి ఉండేటట్లు కంచు, లోహంతో తయారు చేస్తారు. శంఖాది వాద్యాలతో కలిపి, దేవాలయాల్లో ఈ వాద్యాన్ని ఉపయోగిస్తారు.

ముఖవీణ :— దీని పేరులో నున్న వీణ అనే పదాన్ని బట్టి ఆకారంలో వీణకు ఈ వాద్యానికి దగ్గరి పోలిక లుంటాయని భ్రమపడరాదు. ఇది నాగస్వరాన్ని పోలిన సుషిర వాద్యం. కాని దీని ధ్వని వీణ వలె

మనోహరంగా ఉండటం మూలంగా దీనికి ముఖ వీణ అనే పేరు వచ్చింది. ఈ వాద్యాన్ని ఉత్తర భారతీయులు ఎక్కువగా వాడుతారు. దక్షిణ ప్రాంతంలో మాత్రం కొన్ని వైష్ణవ దేవాలయాల్లో ఢంక, డోలు వాద్యాలతో కలిపి, ఈ వాద్యాన్ని వాయించటం సంప్రదాయం.

పూర్వకాలంలో భరత నాట్యాదులందు తప్పనిసరిగా ఈవాద్యాన్ని ఉపయోగించేవారు. ఇప్పుడు పాశ్చాత్య సంగీత సంప్రదాయానికి చెందిన క్లారనెట్ ఉపయోగంలోకి రావడం మూలంగా ఈ వాద్యం మూలపడి పోయింది. ఈ వాద్యంతో వివిధాలైన జానపద పాటలను రమణీయంగా పాడవచ్చును. ఈ వాద్యం నిర్మాణంలోనూ, ప్రయోగంలోను నాగస్వరాన్ని పోలివున్నప్పటికీ, పొడవులోనూ, లావులోను ఇది నాగస్వరం కంటే పెద్దది. (సం. క. ప్ర.-I-175)

మురజం :- రూ. మృదంగం. ఇది అనద్ధ వాద్యం. త్రిపురాసుర వధానంతరం శివుడు నాట్యం చేస్తున్నప్పుడు బ్రహ్మ ఈ వాద్యాన్ని నిర్మించినట్లు, గణపతి దీనిని మొదటిసారి వాయించినట్లు ప్రతీతి. ఇది లయ ప్రధానమైన వాద్యం. దక్షిణ భారత దేశంలో కథా కాలక్షేపాలకు, భజనలకు, గాన సభలు యిత్యాది సందర్భాల్లో దీన్ని ఎక్కువగా ఉపయోగిస్తారు. ఇలాంటి వాద్య విశేషం విదేశీ వాద్యాల్లో లేదని వాద్యకళాకారుల అభిప్రాయం.

పనస కర్రను గాని, రెడ్ కర్రను గాని తీసికొని దానిని అవతలికి రంధ్రమేర్పడేటట్లు తొలుస్తారు. రెండు వైపుల ఉన్న రంధ్రాలను చర్మంతో కప్పి చర్మపు తాళ్ళతో గట్టిగా బిగిస్తారు. సందుల్లో శృతి సాధనాలైన చిన్న కర్రముక్కలుంటాయి. కుడి ముఖానికి మూడు చర్మాలుండి పై చర్మానికి నల్లటి మందు పూయబడి ఉంటుంది. దీనిని నోరు లేక కరణి అంటారు. దీనిని మాంగనీసు లేక ఇనుప పొడి, అన్నం, చింతపండు పులుసు కలిపి తయారు చేస్తారు. దీని వల్లనే మృదంగానికి అద్భుతనాదం కలుగుతుంది. ఎడమ ముఖం కుడి ముఖం కంటె కొంచెం పెద్దదిగా ఉంటుంది.

వీణ, వేణు, మృదంగాలకు నాదత్రయమని పేరు. మృదంగంలో తగ్గు శృతి, హెచ్చు శృతి అని రెండు మృదంగ భేదాలు వున్నాయి.
(సం. గా, క. బో. 135, 136)

వీణ :- రూ. వీణె. వీణియ. ఇది సప్తతంత్రులు గల తత వాద్యం. అను మందరం, మందరం, మందర పంచకం, షడ్జమం అనే నాలుగు తంత్రులు పైన బిగిస్తారు. ప్రక్కన శృతి తాళాలకు ఉపయుక్తంగా షడ్జమం, పంచమం, తారం, అనే మూడు తంత్రులను బిగిస్తారు.

వీణ వాయించేటప్పుడు కుడిచేత్తో మీటుతూ, దానికి అమర్చి ఉన్న 24 మెట్లు, (రెండు స్థాయిలు) దానిలోని స్వరాలకు అనుగుణంగా ఎడమ చేతి వేళ్ళతో మెట్టు మీద అదిమి పట్టి ఆయా స్వరాలను పలికించాల్సి ఉంటుంది. దీనికి చాలా అనుభవం, నేర్పరితనం కావాలి.
(కొ.సం.వి.ద. 24)

వీణలో ముఖ్యంగా కుండ, దండి, యాళి (పౌరాణిక జంతువు మెడ ఆకారం) సొరకాయ బుర్ర అనే భాగాలుంటాయి.

తంజావూరులో వీణలను పనస కఱ్ఱతో చేస్తారు. మైసూరులో నల్ల కఱ్ఱ *(Black wood)* తో తయారు చేస్తారు. కర్రను కుండలాగా తొలచి ఒక పలచటి కఱ్ఱ పలకను పై భాగానికి అంటిస్తారు. దండి కూడ అదే కర్రతో చేస్తారు. ఈ దండిని ఒక కాలువ లాగ తొలచి పైన కఱ్ఱ పలకను అంటిస్తారు. దీనిపైన కంచు లేక ఇత్తడితో చేసిన మెట్లు నిరిస్తారు. కుండతో దండిని దంతపు ముక్క *(Ivory Bridge)* తో కలుప్తుతారు. దండి చివర పౌరాణిక జంతు మెడ ఆకారంలో ఒక పరికర ముంటుంది. దీనినే యాళి అంటారు. దీని క్రింది భాగంలో సొరకాయ అమర్చుతారు. కుంత నుండి దండి మీదుగా వాద్య తంత్రులు, తాళ తంత్రులు అమర్చి ఉంటాయి. (సం. గా. క. బో.) దీనిలో రుద్రవీణ, రావణ హస్తము మొదలైన వీణా భేదాలు చాలా ఉన్నాయి.

సరస్వతీ వీణ :- సరస్వతీ వీణకే కచ్ఛపీ అని పేరు. (సరస్వ

త్యాస్తు కచ్ఛపి) ఈ వీణను సరస్వతి ధరిస్తుంది కాబట్టి ఈ పేరు వచ్చి వుంటుంది. ఇది తతవాద్యం. సరస్వతీ వీణ నిర్మాణం చాల వరకు సామాన్య వీణను పోలి ఉన్నా కొన్ని సూక్ష్మ భేదాలు కూడా లేకపోలేదు. ఈ వీణ మెట్లు అమర్చడంలో కొంత భేదం కనిపిస్తుంది. ఈ మెట్లు వేరు వేరు స్వరాలు పలికేందుకు వీలుగా వేరువేరు తావుల్లో మైనంతో బిగిస్తారు. అలా బిగించిన మెట్లపై నాలుగు తీగలను అమర్చుతారు. వీణకు కుడివైపు క్రింది భాగాన చిటికెన వ్రేలితో లయ వేయడానికి వీలుగా మూడు తీగలుంటాయి. తాబేటి ఆకారంలో క్రింది తుంబ ఉంటుంది. ఇది సరస్వతి వీణ నిర్మాణంలోని ముఖ్యాంశాలు.

ఈ వీణను ఆంధ్రదేశంలోనూ, దక్షిణ భారతదేశంలోనూ, ఎక్కువగా ఉపయోగిస్తున్నారు. సౌందర్య దృష్టిగలవారు ఈ వీణలను వెండి బంగారాలతో అలంకరించుకోవడమే గాక, ధ్వనిని చక్కగా నిలిపి ఉంచేందుకు పచ్చల పలకలు, నీలపు పలకలు, తంత్రుల క్రింద బిగిస్తారు. ఇలాంటి వీణలు పూర్వం జమీందార్ల గృహాల్లో వుండేవి.

సింగినాదం :- రూ. సింహనాదం. ఇది సుషిర వాద్యం. బాకాలాగా పెద్ద ధ్వనులు చేసేందుకుపయోగించే వాద్య విశేషం. ఇది సన్నాయిని పోలి మొదలు సన్నగానూ, చివర వెడల్పుగానూ ఉంటుంది. ఈ వాద్యం ద్వారా వివిధ ధ్వనులను వాయిస్తారు.

పూర్వం మహమ్మదీయ వర్తకులు ఆంధ్ర ప్రాంతానికి వచ్చినప్పుడు తమ రాకను తెలుపుతూ, పెద్దపెద్ద ఎనుము కొమ్ములతో ఊదెడివారట. పెద్దపెద్ద ధ్వనులు రావడం మూలంగా వీటిని సింహనాదాలు అని వ్యవహరించి వుంటారు. అదే వ్యవహారంలో సింగినాదంగా రూపాంతరం చెంది వుంటుంది. మధ్యకాలంలో రామానుజ మతస్థులు తమ వైష్ణవ గురువుల రాకను తెలిపేందుకు ఈ వాద్యాన్ని ఉపయోగించేవారు. (ఆం. వి. *VII-3419*)

సిద్ధ కిన్నెర :- దీనినే సారంగి అని అంటారు. (ఆం.వా. *III-154*) ఇది తంత్రీ వాద్యం. వాయులీనం వలె దీనిని కమానుతో వాయి

స్తారు. ఇది గొప్ప సంగీత సామరస్యం కలిగిన వాద్యం కావడం వల్ల బహుళ ప్రచారంలో ఉంది

వీణలాగే మొదట కర్రను తొలచి గర్భాన్ని ఏర్పాటు చేస్తారు. దానిపై భాగాన్ని చర్మంతో కప్పి, దీనిపై మొదట మూడు దళసరమైన నరాలతో చేయబడిన తంత్రులను బిగిస్తారు. 1, 2 ముఖ్య తంతులకు మధ్య ఆరు ఇత్తడి తంతులను, వాటి క్రింద 15 సన్నని ఉక్కు తంత్రులను అదనంగా అమర్చుతారు. 3 వ తంత్రి ప్రక్కన 8 ఇత్తడి తంతులను వాటిక్రింద 12 సన్నని ఉక్కు తంత్రులను బిగిస్తారు. ఈ విధంగా ఈ వాద్యం 6+15+8+12=41 అదనపు తంత్రులను కలిగి సంగీత సామరస్యానికి అనుకూలంగా ఉంటుంది. కొన్నిటిలో ఈ అదనపు తంతులు 15 వరకే ఉంటాయి.

ఈ తంత్రులను శ్రుతి చేసేప్పుడు 1వ తంత్రిని ఆధారశ్రుతి మధ్యమ షడ్జమంగాను, 2వ తంత్రిని మంద్ర పంచమంగాను, 3వ తంత్రిని మంద్ర షడ్జమంగానూ శ్రుతి చేస్తారు. ఈ మూడు ముఖ్య తంత్రుల మధ్యనుండే 14 ఇత్తడి తంతులను ఆయారాగాల ఆరోహణ స్వరాల ననుసరించి, వాని కిందనున్న 27 సన్నని ఉక్కు తంతులను ఆయారాగాల శుద్ధవికృతి భేదాలను అనుసరించి శ్రుతి చేస్తారు. ఈ విధంగా దీనిలో 41 తంత్రులు అయాస్వరాలకు తగిన ప్రతిధ్వనులను కలిగించడం మూలంగా వినేందుకు ఎంతో హాయిగా ఉంటుంది.

దీనిని తంబురవలె ఒడియందు నిలిపి ఎడమచేతి వేలి గోళ్ళతో ఆయా స్వరాల కనుకూలంగా తంత్రులను ముందు వెనుకలకు లాగుతూ, కుడిచేతిలోని కమానుతో వాయిస్తారు. ఇది సినిమా స్టూడియోల్లోనూ, రేడియో కేంద్రాల్లోనూ ఎక్కువగా వాడుకలో ఉంది. (సం.క.ప్ర I-154).

సుతి చెంగు :- చెంగు అనగా ఒక విధమైన వాద్యం. సుతికాడు అనగా సుతి పోసేవాడు. (శ.ర.)

సాధారణంగా వివాహాది శుభకార్యాల్లో మంగళమేళం జరుగుచున్న

ప్పుడు శ్రుతి పోసేవాడు ఒకడుంటాడు. ఇతడు నాదస్వరం వంటి వాద్యాన్నే తీసుకొని ఊదుతుంటాడు. ఈ పద్ధతినే సుతి పోయడం అంటారు. ఈ వాద్యానికి రంధ్రాలు మూయుట, విప్పుట అనేది ఉండదు కాబట్టి ఒకే విధమైన శబ్దం వస్తుంది దీనినే శ్రుతి అంటారు. ఇది ఆకారములో నాగసరం వలె ఉన్నప్పటికి పొడవులో మాత్రం దానికంటె ఎక్కువగా ఉంటుంది. దీని నాలుగు రంధ్రాలు శ్రుతికి అనుకూలంగా మైనంతో మూస్తారు. మొదటి భాగంలో ఊదేందుకు అనుకూలంగా పీక *(Reed)* ఉంటుంది. (ఇదికాక తిత్తిని కూడ శ్రుతిపోయడానికి ఉపయోగిస్తారు. (సం.క.ప్ర. I-174).

స్వరమండలం :- దీనినే శత తంత్రీవీణ అంటారు. ఇది తంత్రీ వాద్యమే అయినప్పటికి వీణ, తంబురవలె ఉండక అర్ధచంద్రాకారంలో ఉంటుంది. దీనికి అనేక తంత్రులు అమర్చి ఉంటాయి. ఈ తంత్రులను ఒక చిన్న పరికరంలో మీటడం వలన హృదయ రంజకమగు ధ్వనులు వస్తుంటాయి. (సం.క.ప్ర. I-135).

హుడుక్కా :- రూ. ఉడుక్కా. ఇది ఇసుక గడియారం ఆకారంలో ఉంటుంది. అనగా మధ్యభాగంలో సన్నగానూ, అటు యిటు వెడల్పుగానూ ఉండి, వెడల్పుగా వున్న రెండు ముఖాలను తోలు కాగితంతో కప్పి ట్వైన్ దారంతో బిగిస్తారు. సన్నగా ఉన్న మధ్యభాగంలో ఒక టేపుతో గట్టిగా బిగిస్తారు దీనివలన తోలు కాగితం బిగువై ధ్వనులు స్ఫుటంగా వస్తాయి.

ఈ హుడుక్కాకు కావలసిన డొల్లను *(Shell)* కర్రతోగాని, కంచుతోగాని, మట్టితోగాని తయారు చేస్తారు దీనికి ఎడమప్రక్క ఉన్న ముఖానికి, తోలు కాగితంపై గుర్రపు వెంట్రుకలనమర్చడం వల్ల కుడి ముఖాన్ని వాయించినప్పుడు కలిగే కదలికల మూలంగా గుర్రపు వెంట్రుకలు కంపించి, ఝుమ్మనే శబ్దాలు *(Buzzing Sounds)* వస్తాయి.

ఈ వాద్యాన్ని మారెమ్మ మొదలైన గ్రామదేవతల గుళ్ళలోనూ, తిరునాళ్ళలోనూ ముఖ్యంగా ఉపయోగిస్తారు. *(L. V. 27)*.

# గాన కళ

"గీతం వాద్యంచ నృత్యంచ త్రయం సంగీతముచ్యతే" గీతం, వాద్యం, నృత్యం అనే మూడింటి సమ్మేళనమే సంగీతం. గానకళ అతిప్రాచీనమైంది. శ్రీవేంకట మఖి, త్యాగయ్య, శ్యామశాస్త్రి, క్షేత్రయ్య, ముత్తుస్వామి మొదలైన సంగీత కళాకారులు మన సంగీత కళను చక్కదిద్ది, అభివృద్ధి పరిచి దీనికొక ఔన్నత్యాన్ని కల్గించారు.

నాదాత్మకమైన ఈ జగత్తులో గానరసంలో ఓలలాడని జీవులే ఉండరంటే అతిశయోక్తి కాదేమో! నాగస్వరం వాయించితే, ఆ గానరసాస్వాదనలో మైమరచి విషసర్పాలు సైతం తలలూపడం, మురళీ మోహనుని వేణుగాన రసాస్వాదనగోలి పశువులు గడ్డి తినడం మాని మోరలెత్తి నిల వడం, తల్లి జోలపాటలో శిశువులు ఆదమరిచి హాయిగా నిదురపోవడం మొదలైనవన్నీ మనందరకు తెలిసిన విషయాలే. అనంతకోటి జీవరాశుల్లో అంతశ్చైతన్య రూపంగా ఉండే ఈ గాన రసాస్వాదనా శక్తి మరే కళకు లేదంటే అత్యుక్తి కాజాలదు.

ఇటువంటి కళారాజమైన సంగీతం మానవుని మానసిక ఆనందానికి అత్యంతావశ్యకం. మానవుడు మానసిక ఆందోళనలకు గురైనప్పుడూ, కష్టాలు, దుఃఖాలు అలుముకొన్నప్పుడూ, హృదయాహ్లాదకరమైన పాటవిని తాత్కాలికంగానైనా కాస్త సేదదీరడం సహజం. అదే విధంగా సంతోష సమయాల్లోనూ, ఉత్సాహ విజయాల్లోనూ, మానవుడు కూని రాగాలు తీసుకొంటూ, ఆ మధుర క్షణాలను నెమరు వేసుకోవడం కూడా సహజమే.

హంస వింశతిలో ఒకచోట కళలకు కాణాచి అయిన రతిసేన అనే వేశ్య గానకళా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ కవి ఈ కళకు సంబంధించిన సప్తస్వరాలు, రాగతాళాది విభజన మొదలైన విషయాలనెన్నిటినో పేర్కొన్నాడు. (5-122-126) వాటినన్నిటిని యిక్కడ సంక్షిప్తంగా వివరించడం జరిగింది.

సప్తస్వరాలు :- "షడ్జగాంధార మధ్యమర్షభ నిషాద
పంచమ సుదైవతాఖ్య సప్తస్వరములు" (5-126).

షడ్జమం, రిషభం, గాంధారం, మధ్యమం, పంచమం, దైవతం, నిషాదం అనేవి సప్తస్వరాల పేర్లు. ఈ సప్తస్వరాలే సంగీత కళకు పునాదిరాళ్లు. వీటిలో మొదటి అక్షరాలైన స-రి-గ-మ-ప-ద-ని అనేవి ఆరోహణ, అవరోహణ క్రమంలో ఆలాపన గుర్తులు. సప్తస్వరాల్లో స్వరభేదాలుండేవి, వికృతస్వరాలు. స్వరభేదాలు లేనివి ప్రకృతి లేదా సహజస్వరాలు. సప్తస్వరాల్లో షడ్జమం, పంచమం ప్రకృతిస్వరాలు. మిగిలినవి వికృతిస్వరాలు. వికృతిస్వరాల్లో మధ్యమ స్థానాలు రెండు. రిషభ, గాంధార, దైవత, నిషాదాలకు మూడేసిస్థానాలుగా ఏర్పరచి స్వరస్థానాలను ఒక క్రమపద్ధతిలో ప్రస్తరించి పెట్టారు మేళకర్తలు. అవే జనకరాగాలుగా రూపొంది, వాటి నుండి ఔడవ, షాడవ, వక్ర, ఉపాంగ, భాషాంగ భేదాలతో వేలాది రాగాలు ఉద్భవించాయి.

షడ్జమం :- సంగీత శాస్త్రానికి పునాదులైన సప్తస్వరాల్లో షడ్జమం మొదటిది. ఆలాపనలో దీనికి "స" అనేది గుర్తు. ఇది నెమలి కూత నుండి పుట్టినట్లు ప్రాచీన శ్లోకాలను బట్టి తెలుస్తున్నది. దీనిలో భేదాలు లేవు కావున ఇది ప్రకృతి లేక సహజస్వరమని పిలువబడుతుంది.

రిషభం :- సప్తస్వరాల్లో ఇది రెండవది. ఆలాపనలో దీనికి "రి" అనేది గుర్తు. వృషభధ్వని నుండి రిషభస్వరం పుట్టినదని చెప్పబడి ది. దీనిలో శుద్ధరిషభం, చతుశ్శృతి రిషభం అనే రెండు భేదాలుండడంవల్ల ఇది వికృతిస్వరం.

గాంధారం :- సప్తస్వరాల్లో ఇది మూడవది. "గ" దీని ఆలాపన గుర్తు. మేక అరుపు నుండి గాంధార స్వరం పుట్టినట్లు తెలుస్తున్నది. గాంధారంలో సాధారణ గాంధారం, అంతర గాంధారం అని రెండు భేదాలున్నాయి. కాబట్టి ఇదికూడా వికృతస్వరమే.

మధ్యమం :- స్వప్తస్వరాల్లో ఇది నాల్గవది. "మ" అనే అక్షరం

దీని ఆలాపన గుర్తు. క్రౌంచ పక్షి పలుకులు మధ్యమ స్వరంగా ఆవిర్భ వించినట్లు తెలుస్తున్నది. శుద్ధమధ్యమం, ప్రతిమధ్యమం అని రెండు భేదాలుండడం వల్ల ఇదికూడా వికృత స్వరమే.

పంచమం :- సప్తస్వరాల్లో ఇది ఐదవది. శ్రేష్ఠమైనది కూడా. చైత్రమాసంలో కోకిలలు పంచమ స్వరంలో ఆలపిస్తాయని ప్రతీతి. ఈ స్వరానికి "ప" అనే అక్షరం ఆలాపనకు గుర్తు. పూర్వశ్లోకాలు కూడ ఈ స్వరం వసంతఋతువులోని కోకిల కూజితం ద్వారానే ఆవిర్భవించినట్లు తెలుపుతున్నాయి. దీనిలో భేదాలు లేవు కవున ప్రకృతి లేదా సహజ స్వరంగా పిలువబడుతుంది.

ధైవతం :- ధైవతం సప్తస్వరాల్లో ఆరవది. "ద" అనే అక్షరం దీని ఆలాపన గుర్తు. పూర్వశ్లోకాల ద్వారా గుర్రపు ధ్వనియే ధైవతంగా పుట్టినట్లు తెలుస్తుంది. శుద్ధ ధైవతం, చతుశ్శృతి ధైవతం అనే భేదాలను కలిగివుండడం వల్ల ఇది వికృత స్వరం.

నిషాదం :- సప్తస్వరాల్లో యిది చివరిది. "ని" అనే అక్షరం దీన్ని ఆలాపనకు గుర్తు. ఏనుగు ఘీంకారం నిషాదంగా రూపొందినట్లు తెలుస్తున్నది. దీనిలో కైశికీ నిషాదం, కాకలీ నిషాదం అనే రెండు భేదాలుండడంవల్ల యిది వికృత స్వరం.

మొదటిదైన షడ్జమం, ఐదవదైన పంచమంలో తప్ప మిగిలిన ఐదు స్వరాల్లోను రెండేసి భేదాలుండటం మూలంగా స్వరస్థానాలు మొత్తం పన్నెండు అవుతున్నాయి. ఈ స్వరభేదాలు — వికృతి భేదాలు — ఆయా స్వరాల ఉచ్ఛ — అధమ స్థానాలను బట్టి ఏర్పడుతున్నాయి. ఇవి హిందుస్థానీ సంగీతంలోనేగాక, యూరోపియన్ సంగీతంలో కూడా ఉన్నాయి. హిందుస్థానీలో "కోమల—తీవ్ర" స్వరాలని, యూరోపియన్ సంగీతంలో *Flate Note* - *Sharp Note* అని వీటి పేర్లు.

ఈ క్రింది పట్టికలో హిందూస్థానీ, యూరోపియన్, కర్ణాటకసంగీతాల్లో సప్తస్వరాలకు, స్వరస్థానాలనుకు గల పేర్లుమనం గుర్తించ వచ్చును.

| సప్త స్వరాలు | 12 స్వర స్థానాలు | హిందుస్థానీ సంగీతంలోని పేర్లు | కర్ణాటక సంగీతంలోని పేర్లు | యూరోపియన్ సంగీతంలోని పేర్లు |
|---|---|---|---|---|
| షడ్జమం | 1 | "స" | "స" | "C" |
| రిషభం | 2 | కోమల్ "రి" | శుద్ధరిషభం | "D" Flate |
| | 3 | తీవ్ర "రి" | చతుశ్శృతిరిషభం | "D" sharp |
| గాంధారం | 4 | కోమల్ "గ" | సాధారణగాంధారం | "E" Flate |
| | 5 | తీవ్ర "గ" | అంతర గాంధారం | "E" sharp |
| మధ్యమం | 6 | కోమల్ "మ" | శుద్ధ మధ్యమం | "F" Flate |
| | 7 | తీవ్ర "మ" | ప్రతి మధ్యమం | "F" sharp |
| పంచమం | 8 | "ప" | "ప" | "G" |
| ధైవతం | 9 | కోమల్ "ధ" | శుద్ధ ధైవతం | "A" Flate |
| | 10 | తీవ్ర "ధ" | చతుశ్శృతి ధైవతం | "A" sharp |
| నిషాదం | 11 | కోమల్ "ని" | కైశికీ నిషాదం | "B" Flate |
| | 12 | తీవ్ర "ని" | కాకలీ నిషాదం | "B" sharp |

సప్తస్వరాల్లోని ప్రకృతి, వికృతి భేదాలవల్ల స్వరస్థానాలు పన్నెండు అయితే, డెబ్బైరెండు మంది మేళకర్తల రాగ ప్రణాళికలో క, ట, ప, యాది సంఖ్యలో స్వరాలు పదహారు అవుతాయి. అవి షడ్జమం, శుద్ధ రిషభం, చతుశ్శృతిరిషభం, షట్శృతిరిషభం, శుద్ధ గాంధారం, సాధారణ గాంధారం, అంతర గాంధారం, శుద్ధ మధ్యమం, ప్రతి మధ్యమం, పంచమం, శుద్ధ ధైవతం, చతుశ్శృతి ధైవతం, షట్శృతి ధైవతం, శుద్ధ నిషాదం, కైశికీ నిషాదం, కాకలీ నిషాదం. (సం. గా. క. బో. 4)

స్థాయీ భేదాలు :- "మంద్ర మధ్యమ తారక మహిమ లెరిగి" (5–126) షడ్జమం మొదలు ఆరోహణ గతిలో మరల షడ్జమం స్వరాన్నందుకొనే వరకు ఒక స్థాయి అనబడుతుంది. మంద్ర స్థాయి, మధ్యమ స్థాయి, తారస్థాయి అని ఇవి మూడు విధాలు.

మంద్ర స్థాయి అంటే తక్కువ స్వరం కలది. మంద్ర-తారస్థాయిలకు మధ్య నుండే స్వర స్థాయి మధ్యమం. తారస్థాయి, మంద్ర-మధ్య స్థాయిల కంటే హెచ్చైనది. ఈ స్థాయి భేదాలను సంగీత కళాకారులు ఐదు విధాలుగా విభజించి ఉన్నారు. అవి అను మంద్ర స్థాయి, మంద్ర స్థాయి, మధ్యమ స్థాయి, తారస్థాయి, అతి తారస్థాయి. (సం. గా. క. బో. 73, 74) (క్రొ. సం. వి. ద. 14, 15).

తాళములు :– మనం పాడేటువంటి గీత రచన కనుకూలంగా చేతితో కొట్టడంవల్లగాని, తాళయంత్రంతో కొట్టడంవల్ల కానీ తెలుసుకొనేటువంటి కాల ప్రమాణాన్ని తాళమంటారు.

మార్గ, దేశి అని ఇవి రెండు విధాలు. వీటిలో శుద్ధం, సాలగం, సంకీర్ణం అని మరల ఒక్కొక్కటి మూడు విధాలు. తాళానికి కాలం, మార్గం, క్రియ, అంగం, గ్రహం, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారం అనే దశ విధ ప్రాణాలుంటాయి. (సం. క. ప్ర. 55).

"ధ్రువో మఠ్యరూపకశ్చఝుం పాత్రి పుట ఏవచ
ఆటతాళేకతాళశ్చ సప్తతాళః ప్రకీర్తితాః"

పై శ్లోకంలో తాళాలు ప్రధానంగా ఏడు విధాలని చెప్పబడింది. అవి ధ్రువ, మఠ్య, రూపక, ఝంపె, త్రిపుట, అట, ఏక తాళాలు. ఇవి కాక చంచుపుటం, జాంపుటం అనే రెండు విధాలైన తాళ పద్ధతులను హంసవింశతి కారుడు అదనంగా పేర్కొన్నాడు. "సరవి చెంచుపుటంబును, జాంపుటంబును ధృవము మధ్యము, రూపక త్రిపుటజంపె యేకతాళాటతాళాదులెల్ల నెరిగి" (5-122).

ధ్రువతాళం :– "భరతోధత్తళశ్చైవ అంజనేయోమతో ధ్రువం" భరతాచార్యులు, దత్తళాచార్యులు, ఆంజనేయుడు కలిసి ధ్రువ తాళాన్ని ఏర్పరచారు. దీనికి నాలుగు ఘాతలు, ఒక ద్రుతం, మూడు లఘువులుంటాయి.

మఠ్యతాళం :– "మఠ్యతాళ స్వకార్తారో మతంగార్జున కోలాహలః"

మతంగ మహాముని, అర్జునుడు, కోలాహలాచార్యులు కలిసి మఠ్యతాళాన్ని నిర్మించారు. దీనికి మూడు ఘాతలు, రెండు లఘువులు, ఒక ద్రుతం ఉంటాయి.

రూపక తాళం:- "ఆంజనేయః కుంభజోపి యాజ్ఞవల్క్యస్తు రూపకే". ఆంజనేయులు, అగస్త్యుడు, యాజ్ఞవల్క్యుడు కలిసి రూపక తాళాన్ని నిర్మించారు. రెండు ఘాతలు, ఒక ద్రుతం, ఒక లఘువు దీనిలో ఉంటాయి.

ఝంపెతాళం:- "నందీశో భరతో శౌనః ఝంపాయాం చైవ సప్తధా". నందీశ్వరుడు, భరతాచార్యులు, శౌనక మహాముని కలిసి ఝంపెతాళాన్ని ఏర్పరచారు. దీనిలో మూడు ఘాతలు, లఘువు, అను ద్రుతం, ద్రుతం ఉంటాయి.

త్రిపుట తాళం:- "నిశాచరపతిః బ్రహ్మ త్రిపుటీ శంఖపాలకః" రావణాసురుడు, బ్రహ్మ, శంఖపాలుడు కలిసి ఈ తాళాన్ని నిర్మించారు. ఘాతలు నాలుగు, రెండు లఘువులు, రెండు ద్రుతాలు ఉంటాయి.

అటతాళం:- "బలిః కౌమార దేవేంద్రో అట తాళ సముద్భవః" బలి చక్రవర్తి, దేవేంద్రుడు, కుమారస్వామి కలిసి అటతాళాన్ని నిర్మించారు. దీనికి ఘాతలు నాలుగు, రెండు లఘువులు, ద్రుతాలు రెండు ఉంటాయి.

ఏకతాళం:- "మహతాం చాపి సర్వేషాం ఏకతాళ సమః పిదుః." పై అందరి అభిప్రాయాల ప్రకారం ఏకతాళాన్ని సమంగా పేర్కొన్నారు. ఏకతాళానికి ఒక ఘాతం, ఒక లఘువు ఉంటాయి.

జాంపుట తాళం:- ఇది దేశీ తాళ భేదాల్లోనిది కావచ్చును. లేదా ఝాంపట తాళం కావచ్చును. ఇది ప్రాచీన లక్షణకారులు ఆది తాళానికి యిచ్చిన పేరు. అంటే యిది ముప్పది ఐదు తాళాల్లో గల చతురస్ర జాతి త్రిపుటమని తెలుస్తుంది.

చంచపుట తాళం:- ఇది కూడా దేశీ తాళ భేదమే అయి

ఉంటుంది. లేదా చాచపుట తాళం కావచ్చును. ఇది మార్గ తాళాల్లో ఒకటి.

చచత్పుట, చాచపుట. షట్పితా పుత్రిక, సంపద్వేష్టిక, ఉద్ఘట్ట అనునవి మార్గతాళాలు.

ఇంతవరకు చర్చించిన తొమ్మిది విధాలైన తాళాల్లోనూ, ఘాత, లఘువు, ద్రుతం, అను ద్రుతం అనే పదాలు వచ్చాయి. ఘాత అంటే సంగీతం పాడేటప్పుడు లేదా నేర్చుకొనేటప్పుడు చేతితో తొడమీద గాని, చేతి మీద గాని లయాను గుణంగా కొట్టే దెబ్బ. ఘాత కొట్టిన తరువాత వేళ్ళతో అక్షర మాత్రా కాలాన్ని లెక్కించడం లఘువు. ఇవి ఒక్కొక్క జాతికి ఒక్కొక్క విధంగా ఉంటాయి. రెండక్షరాల విలువ ద్రుతం అవుతుంది ఒక అక్షరం విలువైతే అనుద్రుతం అవుతుంది.

ఈ తాళాలకు షడంగాలు, ఆయా అంగాలకు గుర్తులు, వానికి పట్టు అక్షర కాలం సంగీత శాస్త్రానుసారం నిర్ణయింపబడి ఉన్నాయి. తాళాలకు జాతులు, ఆయా జాతులకు అక్షర సంఖ్యలు నిర్ణయింపబడి ఉన్నాయి.

తాళాలకుగల అంగాలు, వాటి సంజ్ఞలు, అక్షర కాలం ఈ క్రింది పట్టికలో చూపడం జరిగింది.

| అంగాలు | అంగ సంజ్ఞ | అక్షర కాలం |
|---|---|---|
| అనుద్రుతం | U | 1 |
| ద్రుతం | O | 2 |
| లఘువు | I | 4 |
| గురువు | S | 8 |
| ప్లుతం | S | 12 |
| కాకపాదం | + | 16 |

తాళాలకుగల ఐదు జాతులు తత్సంబంధమైన అక్షర సంఖ్య ఈ క్రింది పట్టికలో చూపబడింది.

| జాతులు | అక్షర సంఖ్య |
|---|---|
| చతురస్ర జాతి | 4 |
| త్రిశ్ర జాతి | 3 |
| మిశ్ర జాతి | 7 |
| ఖండ జాతి | 5 |
| సంకీర్ణ జాతి | 9 |

సప్త తాళాలు ఐదు జాతులతో కలిసి ముప్పై అయిదు తాళాలౌతున్నాయి. ఇదేవిధంగా తాళభేదాలు అనేకంగా ఏర్పడుతుంటాయి. (క్రొ. సం. వి. ద. 1_21).

రాగాలు - "యోసౌధ్వని విశేషస్తు స్వరవర్ణ విభూషితః
రంజకో జన చిత్తానాం సరాగః కథితో బుధైః"

స్వర వర్ణాదులచే, వినేవారి చిత్తాన్ని రంజింపచేసే ధ్వని విశేషం రాగం. ఈ రాగాలకు గ్రహ, అంశ, మంద్ర, తార, న్యాస, అపన్యాస, సన్యాస, విన్యాస బహుత్వ, అల్పత్వాలనే పది లక్షణాలను మతంగాది మునులు చెప్పారు.

భాషను వ్యాకరించి, అది సుబోధమయ్యేందుకు వ్యాకరణమెలా తోడ్పడుతుందో అదే విధంగా సంగీతం ఆస్వాద యోగ్యం కావాలంటే ఆ శాస్త్ర జ్ఞానం ఎంతైనా తోడ్పడుతుంది. లక్ష్య లక్షణాన్వితమైన సంగీతమే శ్రోతలను ఆనందింపజేయ గల్గుతుంది మన సంగీత మంతా రాగ ప్రధానమైంది. వేంకటమఖి అనే సంగీత శాస్త్రవేత్త సుమారు మూడు వందల సంవత్సరాలకు పూర్వం లక్ష్య లక్షణ సమన్వితంగా రాగ విధానాన్ని ఏర్పరిచారు. ఆయన సిద్ధాంతీకరించిన 72 మేళ కర్తల (జనక రాగాల) నుండి మనరాగ విధానమంతా ఉద్భవించింది. లాక్షణికులు ఈ మేళకర్త విధానాన్ని రూపొందించినా సాహిత్య పరంగా దీన్ని గానం చేయడం మాత్రం అప్పట్లో జరగలేదు. క్రీ. శ. 19వ శతాబ్దంలో తంజావూరును పాలించిన సఖారాం సాహెబ్ ఈ బాధ్యతను తన ఆస్థాన విద్వాంసుడైన లావణి వెంకట్రావుకు అప్పగించాడు. ఆయన 72 జనక రాగాల్లో, రాగ ముద్రలతో సహా మరాఠి భాషలో రచించారు.దానికి ఆయా రంగాల్లో సంగీతాన్ని మహావైద్యనాథయ్యర్ సమకూర్చి, రాగ ముద్రలతో శ్రీరాగంలో సుప్రసిద్ధ మేళ రాగ మాలికను రూపొందించాడు. ఇందులో ప్రతి రాగం చివరా ఆ రాగంలోని చిట్టస్వరం ఉంటుంది. రాగ రాగానికీ ఒక స్వరస్థానమే భేదించినా జీవ స్వరాలను సరైన గమక పద్ధతిలో ప్రయోగించి ప్రతి జనక రాగానికీ ఒక అపూర్వ భావాన్ని స్ఫురింపచేశాడు రచయిత. రచన ఎంతటి ఉత్కృష్టమైనదైనా, దాని స్వరూపం, వ్యక్తిత్వం ప్రతిబింబించాలంటే సమర్థులైన గాయకుల అవసరం ఎంతైనా ఉంటుంది. సంగీత కళలో ఎంతో అనుభవం గడించి అంతర్జాతీయ కీర్తినార్జించిన శ్రీమతి ఎం.ఎస్. సుబ్బలక్ష్మిగారు ఈ మేళ రాగమాలికను గానం చేసి శ్రోతలను ఆనందపరవశుల్ని చేయడమేగాక,

మన గానకళా ప్రాభవాన్ని లోకానికి చాటి చెప్పారు.
(నేదునూరి కృష్ణమూర్తి–ఆంధ్రజ్యోతి 2-6-89)

ఇటువంటి ఉత్కృష్టమైన రాగ ప్రాధాన్యం గల మన సంగీత శాస్త్రానికి సంబంధించిన రాగ విభాగాలను నారాయణామాత్యుడు హంస వింశతిలో ఒకచోట పేర్కొన్నాడు.

పురుషరాగాలు 8. "భైరవి మాళవి బంగాళ హిందోళ రాజమంజరియు శ్రీరాగ గౌళ భూపాళ లెన్మిది పురుష రాగంబులు." (5–123).

స్త్రీరాగాలు–24. "దేశాక్షి ఘూర్జరి దేశి తోడి దేవక్రియా... ........ మంగళకైశికి యనవెలయు నారాయణియు చతుర్వింశతి విధముల దనరారు స్త్రీ రాగములును." (5–123).

నపుంసక రాగాలు–32. "కాంభోజి కేదారగౌళ శోకవరాళి శంకరాభరణము....................నీలాంబరియు ననంగ పొసగు ముప్పదిరెండు నపుంసకములు. (5–124).

మిత్రరాగాలు–5. "మాళవశ్రీ యనంగను మలహరి దేవమలహరి రేనప్తి దిరముకుంద మలహరగునైదు మిత్రలు." (5-125).

మన సంగీత శాస్త్ర గ్రంథాలు జనకరాగాలు 72 అని సూచిస్తున్నాయి. అయితే హంస వింశతిలో పురుష, స్త్రీ, నపుంసక, మిత్రరాగాలని నాలుగు వర్గాలుగా విభజించి పేర్కొన్న రాగాల పేర్లు 69 మాత్రమే ఉన్నాయి. సంగీతశాస్త్ర గ్రంథాల్లోను, హంస వింశతిలోను రాగాల పేర్లలో కొంత తేడా కనుపించినా, (పురుషరాగాలు–8, స్త్రీ రాగాలు–24) రాగాల సంఖ్య మాత్రం సమంగానే ఉంది. భరతకోశం, సంగీత కళా ప్రదర్శిని మొదటి సంపుటం పురుష రాగాలు–8, స్త్రీ రాగాలు–22 అని పేర్కొంటున్నాయి. సంగీత కళా ప్రదర్శినిలో పుత్ర, మిత్ర రాగాల ప్రస్తావన ఉంది. వీటి విషయం భరతకోశంలో లేదు.

హిందూస్థానీ సంగీతంలో రాగ, రాగిణి, పరివార రాగాలని, రాగ విభజన మూడు విధాలుగా ఉంది. రాగరాగాలంటే పురుషరాగాలు.

రాగిణి రాగాలంటే స్త్రీ రాగాలు. పరివార రాగాలంటే పుత్ర మిత్రరాగాలు. కాని ఈ సంగీత శాస్త్ర గ్రంథాల్లో దేనిలోనూ నపుంసక రాగ విభజన కనుపించదు. హంసవింశతిలో మాత్రం నపుంసక రాగాలు-32 అని వాటి పేర్లతో సహా సూచించడం జరిగింది. అయితే ఈ రాగాల పేర్లు మిగతా శాస్త్ర గ్రంథాల్లో స్త్రీ రాగాలుగాను, పుత్ర, మిత్ర రాగాలుగాను పేర్కొనబడి ఉన్నాయి. కాబట్టి ఈ నపుంసక రాగవిధానాన్ని యింకా పరిశీలించి వాటి సాంప్రదాయం, స్వరూప స్వభాలు తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. పురుష రాగాలకు, స్త్రీ రాగాలు, వాటి అధిదేవతులు, వేదాలు, కులాలు, రసాలు, గుణాలు మొదలైన అంశాలు మన సంగీత శాస్త్రజ్ఞులు నిర్ధేశించి ఉన్నారు. వాటినన్నిటిని ఈ క్రింది పట్టికలో చూపడం జరిగింది.

| పురుష రాగాలు | స్త్రీ రాగాలు | అధి దేవతలు | వేదాలు | కులాలు | రసం | గుణాలు |
|---|---|---|---|---|---|---|
| భూపాలం | బిలహరి, మలహరి, ఖాండి | శివుడు | సామవేదం | బ్రాహ్మణ | శృంగారం | రాజసం |
| భైరవి | దేవక్రియ, మేఘరంజి, కురంజి | విష్ణువు | సామవేదం | బ్రాహ్మణ | రౌద్రం | రాజసం |
| శ్రీరాగం | ఆంధాళి, భల్లాతి సాహుళి | సరస్వతి | యజుర్వేదం | క్షత్రియ | బీభత్సం | తామసం |
| ఫలమంజరి (రాగ మంజరి) | దేశి, ముఖారి లలిత | లక్ష్మి | యజుర్వేదం | క్షత్రియ | కరుణ | తామసం |
| వసంత (హిందోళ) | రామక్రియ వరాళి గౌళ | సూర్యుడు | ఋగ్వేదం | వైశ్య | హాస్యం | సాత్వికం |
| మాళవి | గుండక్రియ, ఘూర్జరి, బాళి | నారదుడు | ఋగ్వేదం | వైశ్య | భయానకం | సాత్వికం |

| | | | | | |
|---|---|---|---|---|---|
| బంగాళ | కళ్యాటి,సావేరి ఆహరి | వినాయ కుడు | అధర్వణ వేదం | శూద్ర | అద్భుతం రాజస |
| నాట (గౌళ) | ఘంటారవం, కాంభోజి శంకరాభరణం | తుంబు రుడు | అధర్వణ వేదం | శూద్ర | వీరం రాజసం |

(గమనిక:- కుండలీకరణాల్లో యిచ్చినవి పై వానికి బదులుగా హంస వింశతిలో చెప్పిన రాగాల పేర్లు).

పైన తెలిపిన ఎనిమిది రాగాలు కాక మిగిలిన రాగాలన్నీ శాంత రసానికి చెందినవి. కాబట్టి రాగాలు రసాశ్రయాలని తెలుస్తున్నది.

ఇక హంస వింశతిలో పేర్కొన్న రాగాలను ఆకారాది క్రమంలో వివరించాల్సిఉంది. హంస వింశతిలోచెప్పిన రాగ విభాగాలను అనుసరించి పురుష, స్త్రీ, నపుంసక రాగాలను కుండలీకరణాల్లో సూచించడం జరిగింది. కాని నపుంసక రాగాలు హంసవింశతిలో తప్ప సంగీత శాస్త్ర గ్రంథాల్లో కనిపించడం లేదు.

సూచన: ఆ=ఆరోహణం. అవ=అవరోహణం.

.. (రెండు చుక్కలు) స్థాయిని, ఊనికను తెలుపుతాయి.)

ఆందోళి:- (స్త్రీరాగం) ఇది హరికాంభోజి అనే ఇరువై ఎనిమిదోమేళ కర్త రాగజన్యం.

ఆ॥ సరిమపనిస అవ॥ సనిదమరిస ఔడవ రాగానికి సంబంధించింది. (సం.గా.క.బో-25)

ఆహరి:- (స్త్రీ రాగం) ఇది హనుమతోడి అనే ఎనిమిదవ మేళకర్త రాగజన్యం.

ఆ॥ సరిగమపదనీదపస అవ॥ సనిదాప మగరిస(సం.గా.క.బో-25)

కన్నడ:- (స్త్రీరాగం):- మేళరాగం-ధీర శంకరాభరణ మేళజన్యం.
ఆ॥ సగమదనిస అవ॥ సదపమగమమరిస

కన్నడాయాం వృషం త్యక్త్వాస్వారోహే పక్రకపంచకమ్ [భ.కో.]

కాంభోజి:- [నపుంసక రాగం]

ఇది ఇరువై ఎనిమిదవ మేళకర్త జన్యరాగం. భాషాంగం షాడకం సంపూర్ణరాగం.

ఆ॥ సరిగమ పదనిస అ ॥ సనిదపమగరిస
రాగచ్ఛాయ స్వరాలు – మ, ద, $ని_1$, $ని_2$
సర్వ స్వరగమకవరికరక్తి – స, గ, వ, ర
విశేష ప్రయోగాలు - మగస, పదమ
రంజక ప్రయోగాలు - మగపదస, సరిగస
కాంభోజి అన్ని వేళల పాడదగిన రాగం [సం.గా.క.బో.పట్టిక]

కుందమలహరి:- [మిత్రరాగం]
మేళరాగం - ఖరహరప్రియమేళ జన్యం.
ఆ॥ సరిగవధనిస అవ॥ సనిదపమగరిస [భ.కో.]

కురంజి:- [స్త్రీ రాగం]

ఇది యిరువై తొమ్మిదవ మేళకర్త. ధీర శంకరాభరణ రాగజన్యం ధైవ తాంత్యరాగం.

ఈ తెగకు చేరిన రాగాలు మధ్యస్థాయి ధైవతంతో ముగుస్తాయి.
ఆ॥ సని సరి గమ పద. అవ॥ దప మగ రిస నిస [సం.గా.క.బో-47]

కేదారగౌళ:- [నపుంసక రాగం]

ఇరువై ఎనిమిదవ మేళకర్త జన్యరాగం కేదారగౌళ, ఉపాంగం, ఔడవ సంపూర్ణరాగాలకు చెందినది.

ఆ॥ సరిమ పనిస అవ॥ సనిద పమగరిస
రాగచ్ఛాయ స్వరం-రిని

పర్వ స్వర గమకవరిక, రక్తి – గ, వ, ర
కేదార గౌళ అన్ని వేళల పాడదగిన రాగం [సం.గా.క.బో. పట్టిక]

గుండక్రియ:- [స్త్రీరాగం]

"షడ్జాంశా రిషభా తాచ దైవతేనచ వర్జితా
ప్రకంపితా నిజస్థానే నామ్నా గుండకృతిర్మతా॥"
మేళరాగం - మాయామాళవ గౌళమేళ జన్యం.
ఆ॥ సరిగరిప మనిధనిస అవ॥ సనిదపమగరిగస (భ.కో.)

గుమ్మకాంభోజి - (నపుంసకరాగం)

మేళరాగం - మాయామాళవ గౌళమేళ కర్త రాగజన్యం.
ఆ॥ సరిగదస అవ॥ సనిధప మగరిస (భ.కో.)

గౌళ - (పురుషరాగం) ఇది మేళరాగం-మాయామాళవ గౌళ అనే మేళకర్త జన్యం.

ఆ॥ సరిమపనిస అవ॥ సనిప మగమరిగ మరిస. షాడవ ఔడవ గణాల్లో పరిగణింప తగిన రాగం గౌళ.

"తత్షాడ వౌడవ గణేపరిగణ్యగీతమ్" (భ.కో. 187).

ఘూర్జరి:- (స్త్రీరాగం) ఇది మేళరాగం - మాయామాళవ గౌళ అనే మేళకర రాగజన్యం.

ఆ॥ సరిగపదస అవ॥ సధపగరిస [భ.కో. 193]

చెంచు మలహరి [నపుంసక రాగం]
మేళరాగం-హరి కాంభోజి మేళజన్యం.

ఆ॥ సగరిగమ పమధని ధపనిధనిస అవ॥పనిపనిమగరిస[భ.కో.]

తోడిరాగం:- [స్త్రీరాగం] ఇది మేళకర్తరాగం నెం.8. నేత్ర చక్రానికి సంబంధించినది.

| | |
|---|---|
| ఆ॥ సరిగమపదనిస | రాగచ్ఛాయ స్వరాలు: గ.మ.ద. |
| అవ॥ సనిదప మగరిస | ఇది సంపూర్ణరాగం |

సర్వ స్వరగమక, వరిక, ర :- స, గ, వ, ర
తోడిరాగం అన్నివేళల పాడదగింది. (సం.గా.క,బో.)

దేవక్రియా:- (స్త్రీరాగం)

"మధ్యమ వ్యాప్తికాషడ్జన్యాస ధైవతకగ్రహా
సమస్వరాదేవకృతి రఘుంధ్రారిప వర్జితా।"

మేళరాగం – ఖరహర ప్రియమేళ జన్యం.

ఆ॥ సగరి గమపధనిదస - అవ॥ సనిధపమగరిగస (భ కో.–276).

దేవగాంధారి:- (స్త్రీరాగం) ఇది ఇరవైతొమ్మిదవ మేళకర్త జన్య రాగం. భాషాంగం. ఔడవ సంపూర్ణరాగాలకు సంబంధించినది.

ఆ॥ సరిమపదసా అవ॥ సనిదప మగరిస.

రాగచ్ఛాయలు – రి, గ, ద; సర్వ స్వరగమక వరిక రక్తి – గ,వ,ర

విశేష ప్రయోగాలు – సరిగమా గరి, పదనిప

ఇది అన్ని వేళల పాడదగిన రాగం.

దేవమలహరి - (మిశ్రరాగం) ఇది దేవమనోహరి అని కవిపిస్తున్నది. (సం.గా.క.బో -96 మరియు భ.కో.–278) ఇది ఇరవై రెండవ మేళకర్త మేళరాగం ఖరహర ప్రియమేళ జన్యం.

ఆ॥ సరిమపదనిస అవ॥ సనిదపమగరిస.

దేశాక్షి:- (స్త్రీరాగం) దేశాక్షి ధీర శంకరాభరణమను ఇరవై దొమ్మిదో మేళకర్త జన్యరాగం. ఔడవ సంపూర్ణరాగం.

ఆ॥ సరిగపదస అవ॥ సనిదప మగరిస (సం.గా.క.బో. 32)

దేశీ:- (స్త్రీరాగం) రుచివైచిత్రితో జనుల చిత్తాన్ని రంజింపజేస్తూ తమ తమ ప్రాంతాల్లో ప్రయోగంలో ఉండేది దేశీరాగం.

("తదేవరుచి వైచిత్ర్యా చ్చిత్త రంజన కృజ్జనైః
ప్రయుక్తం స్వస్వదేశేయత్తతో దేశీతి కీర్తితం॥"

దేశీ మేళరాగం

ఆ॥ స.రి..మ...నిస అవ॥ స.ని.దప.మగ.రి.స.
ఇది అన్ని వేళల పాడదగినది. (భ.కో. 262)

ధన్యాసి:- (స్త్రీ రాగం)

ధన్యాసి జనతోడి అను ఎనిమిదో మేళకర్త రాగజన్యం. జనతోడి శుద్ధరిషభం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, శుద్ధ ధైవతం, కైశికీ నిషాదాలను కలిగి ఉంటుంది. జన్యరాగమైన ధన్యాసి కూడ శుద్ధరిషభం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, శుద్ధ ధైవతం, కైశికీ నిషాదాలనే కలిగి ఉన్నది.

ఆ॥ సగామపనీస
అవ॥ సనీదపమగారిస } రాగచ్ఛాయ స్వరాలు – గ.ని.
సర్వ స్వర గమక వరిక రక్తి:- గ.వ.ర.
విశేష ప్రయోగం – పనీసదాప. ఇది ఉదయ వేళల్లో పాడదగింది.

నాట :- (స్త్రీ రాగం) ఇది ముప్పై ఆరవమేళ కర్తజన్యరాగం. ఉపాంగం. సంపూర్ణ ఔడవాలకు చెందినది.

ఆ॥ సరిగమపదనిస అవ॥ సనిపమరిస
రాగచ్ఛాయ స్వరాలు — రి, మ, ని
ఇది సాయంకాలం సమయాల్లో పాడదగిన రాగం

(సం.గా.క.బో. పట్టిక)

నాదనామక్రియ - (నపుంసక రాగం)

ఇది పదిహేనవ మేళకర్త మాయామాళవ గౌళ రాగ జన్యం. నిషాదాంత్యరాగం. కర్ణాటక సంగీతంలో కొన్ని రాగాలు నిషాదంతోనే సమాప్తమౌ తుంటాయి. అంటే ఆ రాగం యొక్క సంచారం, నిషాదంతో ఆగి, తారస్థాయిని అందుకోదు. అటువంటి వానిలో ఈ నాదనామక్రియ రాగమొకటి.

ఆ॥ సరిగమపదని. అవ॥ నిదపమగరిసని. (సం.గా.క.బో-47)

నారాయణగౌళ – (నపుంసక రాగం)

మేళరాగం - హరికాంభోజిమేళ జన్యం.

ఆ|| సరిమపనిదనిస. అవ|| సనిదపమగరిస (భ.కో.)

నీలాంబరి - (నపుంసక రాగం)

నీలాంబరి యిరువై తొమ్మిదో మేళకర్త జన్యరాగం. భాషాంగం. ఉభయ వక్ర, సంపూర్ణషాడవాలకు చెందింది.

ఆ|| సరిగమపధసస. అవ|| సనిపమగరిగస.

రాగచ్ఛాయ స్వరాలు — రి, మ, ని.

సర్వ స్వరగమక వరిక రక్తి — గ, వ, ర

ఈ రాగం రాత్రివేళలందు పాడేందుకు అనువైనది.

(సం.గా.క.బో. పట్టిక).

పంతువరాళి - (నపుంసక రాగం)

ఇది ఏభై యొకటో మేళ కర్త జన్యం. ఉపాంగం. సంపూర్ణరాగం.

ఆ|| సరిగమపదనిస
అవ|| సనిదమపదనిస } ఇవన్నీ రాగచ్ఛాయ స్వరాలే.

సర్వ స్వరగమక వరిక రక్తి — స, గ, వ

విశేష ప్రయోగం — పదమదస,నిదపమ. - రంజిక ప్రయోగం. ఇది అన్ని వేళల పాడదగిన రాగం (సం.గా.క.బో. పట్టిక)

పున్నాగ (వరాళి) - (నపుంసక రాగం)

హంసవింశతిలో పున్నాగ అని ఉన్నా, సంగీతశాస్త్ర గ్రంథాల్లో ఇది పున్నాగవరాళిగానే కనిపిస్తుంది. ఇది ఎనిమిదో మేళకర్త రాగానికి సంబంధించింది.

ఆ|| నిసరిగమపదని అవ|| నిదపమగరిసని (సం.గా.క.బో-361)

పూర్వగౌళ - (స్త్రీ రాగం)

మేళరాగం - ధీర శంకరాభరణ మేళ జన్యం.

ఆ|| సరిగమ పనిదనిపదనిస అవ|| సనిదనిపమగరిస (భ.కో.)

బంగాళ - (పురుషరాగం)

ఇది యిరవై తొమ్మిదో మేళకర్త ధీరశంకరాభరణ రాగజన్యం.

వక్రరాగాల్లో షాడవ తెగకు సంబంధించింది. అంటె ఆరోహణలోనూ అవరోహణలోనూ వక్రంగా ఉండే రాగం.

ఆ॥ సరిగమ పమరిపస అవ॥ సనిపమరిగరిస (సం.గా.క.బో. 43)

బౌళి – (నపుంసక రాగం) ఇది పదిహేడో మేళకర్త మాయామాళవ గౌళ జన్యం. ఔడవ షాడవ రాగం.

ఆ॥ సరిగపదస అవ॥ సనిదపగరిస (సం.గా.క.బో. 33)

బిలహరి - (స్త్రీరాగం) ఇది ఇరవై తొమ్మిదో మేళకర్త జన్యరాగం. భాషాంగం. ఔడవ సంపూర్ణరాగం.

ఆ। సరిగపదస అవ॥ సనిదపమగరిస

రాగచ్ఛాయ స్వరాలు – రి, ద, ని

సర్వ స్వరగమక వరిక రక్తి – స, వ, ర

ఇది ఉదయం పూట పాడుకునే రాగం (గా.క.బో. పట్టిక)

భల్లాతి - (స్త్రీరాగం) మేళరాగం, చక్రవాక మేళరాగ జన్యం.

ఆ. సరిగమపదనిస అవ. సనిపమరిగమరిస (భ.కో.)

భాండీ – (నపుంసక రాగం) మేళరాగం.

ఆ. స.రి...వ.ద..వ. - అవ. స.నిద.ప.మ.గరి.స. (భ.కో)

భూపాలం - (పురుషరాగం) ఇది హనుమతోడి అనే ఎనిమిదో మేళ రాగజన్యం. దీనిలో మధ్యమం, నిషాదం వర్జింప బడినాయి.

ఆ. సరిగపదస అవ. సదపగరిస

ఇది ఔడవరాగానికి సంబంధించింది (సం.గా.క.బో. 24)

భైరవి - (పురుషరాగం) ఇది యిరువైవెవ మేళకర్త జన్యం.

ఆ॥ సరిగమపదనిస అవ॥ సనిద పమగరిస

దీనికి అన్నీ రాగచ్ఛాయ స్వరాలే. దిఇ సంపూర్ణరాగం. సర్వ స్వర గమకవరికరక్తి. -స, గ, వ, ర. ఇది అన్నివేళల్లో పాడుకోదగిన రాగం (సం.గా.క.బో. పట్టిక)

మంగళ కౌశికి (కైశికి) - (స్త్రీరాగం)
మేళరాగం - మాయామాళవ గౌళమేళ జన్యం
ఆ॥ సరిగమసమగమపమగమ - అవ॥ సనిదపమగరిస. దీనికి మంగళ కైశికి అను పేరుకూడ కనిపిస్తుంది. (భ.కో.)

మధ్యమావతి - (నపుంసకరాగం)
ఇది యిరవైరెండో మేళ కర్త జన్యరాగం.
ఆ॥ సరిమపనిస అవ॥ సనిపమరిస
రాగచ్ఛాయ స్వరాలు - రి, మ, ని
ఇది ఉపాంగ రాగం, ఔడవరాగం
సర్వ స్వర గమక వరిక రక్తి - గ, వ, ర
మధ్యమావతి మధ్యాహ్నవేళల్లో పాడదగన రాగం.
(సం.గా.క.బో సట్టిక)

మలహరి - (స్త్రీరాగం)
మాయామాళవగౌళ అనె పదునైదో మేళకర్త రాగజన్యం రాగం మలహరి. మాయామాళవగౌళ రాగం వలె మలహరికూడ శుద్ధ రిషభం, అంతరగాంధారం శుద్ధ మధ్యమం, శుద్ధ ధైవతం, కాకలీ నిషాదాలను కలిగి ఉన్నది. ఇది ఉపాంగరాగం (సం.గా.క.బో-17)

మాయా (మాళవ) గౌళ - (స్త్రీరాగం)
ఈ రాగం అగ్ని చక్రానికి సంబంధించినది. పదనైదవ. మేళకర్త రాగజన్యం.
ఆ॥ సరిగమపదనిస అవ॥ పనిదసమగరిస
రాగచ్ఛాయ స్వరాలు - గ, ని. ఇది సంపూర్ణ రాగం.
సర్వ స్వరగమక వరిక రక్తి - స, గ, వర
ఇది అన్నివేళల పాడుకోదగిన రాగం. (సం.గా.క.బో. పట్టిక)
మాళవశ్రీ - (మిత్రరాగం)
"కైశిక్యాం కైశికః ప్రోక్తోమల వాద్యస్తదుద్భవా
సమస్వరా తార మంద్రాషడ్ జాంశ న్యాస షడ్జభాక్
మాళవశ్రీ సదా గేయా రసే వీరాద్భుతే తథా॥"

ఇది కైశికి నుండి పుట్టినది. సమస్వరాలు, తార మంద్ర స్థాయిలు కల్గినది. మాళవశ్రీ రాగ మెప్పుడు వీర, అద్భుత రసాలందు పాడదగినది.

ఇది రాగాంగా, పూర్ణా సత్రయ సంయుతమైనది. (మాళవశ్రీశ్చ రాగాంగా పూర్ణా సత్రయసంయుతా॥) (భ.కో. 490)

శుద్ధ రిషభం, శుద్ధధైవతం ఎక్కడ చతుశ్శృతి రిషభం, చతుశ్శృతి ధైవతంగాకూడా అయి, ఉద్గ్రాహలలో షడ్జావరోహణం, సరి న్యాసాంశ ఉంటుందో అది మాళవి.

("రిధౌతుకోమలౌయత్ర తీవ్రౌచ మాళవె
షడ్జావరోహణోద్గ్రాహే సరిన్యాసాంశ శోభితే"
తృతీయ ప్రహరోత్త రేగేయః) (భ.కో. 488)

ఇది హంస వింశతిలో పురుషరాగాల్లోనూ, నపుంసక రాగాల్లోనూ కూడ పేర్కొనబడింది.

ముఖారి (నపుంసకరాగం)

ముఖారి, ఖరహరప్రియ అనే ఇరవై రెండవ మేళ కర్త జన్యం. ఇది చతుశ్శృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధ మధ్యమం, చతుశ్శృతి దైవతం, కైశికీ నిషాదాలతో అన్య స్వరమైన శుద్ధ దైవతాన్ని కూడ కలిగి ఉంటుంది. శుద్ధ దైవతం "సనిదప" అనే ఆవరోహణ సంచారంలో కనిపిస్తుంది. (సం.గా.క,బో–20)

మేఘరంజి (ని) – (నపుంసక రాగం).
మేళరాగం - మాయామాళవ గౌళమేళ జన్యం.
ఆ॥ సరిమపదనిస అవ॥ సదపమగరిస (భ.కో.)

రాగమంజరి (పురుషరాగం) రాగపంజర (సం.గా.క.బో. 364)
ఇది యిరవై ఎనిమిదవమేళ కర్త రాగానికి చెందినది.
ఆ॥ సరిమపదనిదస అవ॥ సనిదమరిస.

రామక్రియ [రామకృతి] – [స్త్రీరాగం] క్రియాంగరాగం.

షడ్జమం మధ్యమస్థాయిలోను, రిషభంతీవ్ర స్థాయిలోను, గాంధారం మంద్ర స్థాయిలోను ఉండి, షడ్జమం న్యాసాంశగ్రహంతో కూడి ఉండేది రామక్రియ. ఇది విప్రలంభ శృంగారం, కరుణ రసాలు ఆలపించేందుకు అనుకూలమైన రాగం.

"యాషడ్జర్షభ గాంధార మధ్యమైః తారమంద్రభాక్
సన్యాసాంశ గ్రహష్షడ్జః సా రామస్య కృతిస్తుతా
శృంగారే విప్ర లంభాఖ్యే కరుణేచ ప్రగీయతే"

ఋష బోధిక యితి రఘు నాథః

దీనికి పైన చెప్పినవి గాక ఋషభ మధిక మని రఘునాథుడు చెప్పిఉన్నాడు (భ. కో.)

రామ క్రియమేళ - (నపుంసక రాగం) పదిహేనవ మేళ కర్తరాగ సంబంధమైనది. ఆ॥ సగమద దనిస అవ॥ సనిపదపమగస (సం. గా. క. బో. 9).

రీతి గౌళ – (నపుంసకరాగం). ఇది యిరువైవ మేళ కర్త. నటభైరవి రాగ జన్యం. ఇది వక్రరాగంలో ఆరోహణంలోనూ అవరోహణ లోనూ వక్రమంగా ఉంటుంది.

ఆ॥ సగరిగమని దమనిస – అవ॥ సనిదమగమప మగరిస (సం. గా. క. బో. 46)

రేగుప్తి – (మిశ్రరాగం) ఇది మేళరాగం – హరి కాంభోజి అను మేళ కర్త రాగ జన్యం.

ఆ॥ సరిగ పదస - అవ॥ సదపగరిస

మాళవ గౌళ మేళ జన్యమైన ఈ రాగం రేగుప్తిఅనే పేరుతో ప్రసిద్ధమై ఉన్నది. (భ. కో. 558)

లలిత – (స్త్రీరాగం) గ్రహ, న్యాస, అంశలతో గూడి, శుద్ధధైవతం, చతుశ్శృతి ధైవతం, షట్శృతిధైవతం కలిసి, పంచమస్వర వర్జితమైంది లలిత రాగం. ఇది నిత్యం ఉషోదయ వేళల్లో ఆలాపింపదగిన రాగం: మేళరాగం - మాళవ గౌళమేళ రాగ జన్యం.

("సగ్రహన్యాస సంయుక్తస్సాంశః పంచమ వర్జితః
ప్రాతః ప్రయుజ్యతే నిత్యం పూర్ణకై రపి సమస్తః
ధత్త్రియేణ సమాయుక్తోమతాన్యా లలితా బుధైః) (భ. కో.)

వరాళి - [స్త్రీరాగం] మేళ కర్త జన్యరాగం.

అ॥ సరిగ . . . మపద . . నిస

అవ॥ సని. ద. పమ . . . గరిస

బహుళ కల్పనలతో, వివిధ చమత్కారాలతో కూడు కొన్నది వరాళి రాగం.

బర్హాది ధేను విధిమేష విరుద్ధమధ్య పంచాధిదైవ శివదంతి తదోభ యాత్ర పూర్ణాభిదే బహుళ కల్పనయా వరాళి రాగో చమత్కృతి మనేక విధాం వదంతి. [భ.కో.]

వసంతం - (నపుంసకరాగం) ఇది పదునేడవ మేళ కర్త జన్యరాగం.
ఉపాంగం, ఔడవ, షాడవములు గలది.
ఆ॥ సరమదనిస - అవ॥ సనిగమగరిస
రాగచ్ఛాయ స్వరాలు - గమదని
సర్వ స్వర గమక వరిక రక్తి - గ, వ
రంజక ప్రయోగం - సమగమ

ఇది అన్ని వేళల్లో పాడదగిన రాగమే అయినా సాయం సమయాల్లో పాడడం మిక్కిలి సమంజసం. [సం. గా. క. బో, పట్టిక]

శంకరాభరణం :- (నపుంసక రాగం)
ఇది బాణ చక్రానికి సంబంధించినది.
ఇరువై తొమ్మిదో మేళ కర్త రాగం. సంపూర్ణ రాగం
ఆ॥ సరిగపనిస అవ॥ సనిదప మగరిస.
సర్వ స్వర గమక వరిక రక్తి - స, గ, వ, ర

విశేష ప్రయోగాలు - సదాపమ గరిస. రంజిక ప్రయోగం.
ఇది అన్ని వేళల్లో పాడ దగినది. [సం.గా. క. బో. పట్టిక]

శుద్ధ వసంత - (నపుంసక రాగం)
మేళ రాగం - ధీర శంకరాభరణ మేళ జన్యం.
ఆ॥ సరిగమపదనిస. అవ॥ సనిదమదమగస. [భ.కో.]

శోకవరాళి - (నపుంసక రాగం)
మేళ రాగం - నాటక ప్రియా మేళ రాగ జన్యం.
ఆ॥ సరిమగ మపమదరి గమపదని దస.
అవ॥ సనిదమగరిస. (భ.కో.)

శ్రీరాగం :- [పురుష రాగం]
ఇది ఖర హర ప్రియఅనే ఇరువై రెండవ మేళ కర్త రాగ జన్యం. ఔడవ సంపూర్ణ రాగం. ఆ॥ సరిమపనిస.
అవ॥ సని పదని పమరి గరిస. [సం. గా. కి, బో. 33]

సామంత - (నపుంసక రాగం)
మేళ రాగం - కర్ణాట గౌడ మేళ జన్యం.
సామం తస్య త్రయేణాప్తః సప్త స్వర విభూషితః
గేయః ప్రభాత కాలే సౌ కాకల్యాంతర రాజితః॥ (భ.కో.)
"త్రయేణాప్తమై, సప్త స్వరాలతో కూడి ప్రభాత వేళ్ళల్లో పాడేందకను కూలమైంది సామంత రాగం".

సారంగ - (స్త్రీరాగం)
సారంగ యాభై అరో మేళ కర్త జన్యరాగం. భాషాంగం వక్ర సంపూర్ణాలకు సంబంధించింది.
ఆ॥ సరిగమపదపస - అవ॥ సనిదపమగరిస
రాగచ్ఛాయలు - రిగమద.
సర్వ స్వర గమక వరిక రక్తి - గవర
విశేష ప్రయోగాలు :- సదాపమ, సగరిసని, సపమహ. సారంగ మధ్యాహ్న సమయాల్లో పాడు కొనేరాగం. (సం. గా. క. బో. పట్టిక)

సింధు రామక్రియ - (నపుంసక రాగం)
మేళ రాగం - మాయామాళవ గౌళ మేళ జన్యం.
ఆ॥ సరిమసనిదస - అవ॥ సనిపమరిగరిస. (భ.కో.)

హిందోళ - (పురుష రాగం)
మేళ రాగం. నటభైరవ అనే మేళ కర్త రాగజన్యం.
ఆ॥ సగమదనిస - అవ॥ సనిదమగస.
హిందోళ రాగం దేశీ వసంత సదృశమైనదని మదనుని మతం (దేశీ వసంత సదృశో హిందోళో రాగజోమతః - మదనః) (భ.కో.777)

హెజిజ్జి - (నపుంసక రాగం)
మేళ రాగం - గాయన ప్రియ మేళజన్యం.
ఆ॥ సరిగరి మగమ పనిదస - అవ॥ సనిదపమరిస.

# విద్యావర్గం

హంస వింశతిలోని 11వ రాత్రి కథ(బ్రాహ్మణదంపతులు)లో సకల విద్యా ప్రారంగతుడైన చండశర్మ నేర్చిన విద్యలనన్నిటిని కవి పట్టిక రూపంలో ఇచ్చాడు. దీనిలో వేద వేదాంగాలు మొదలు భారతం, పురాణాలు, స్మృతులు, అలంకారాలు, ఛందస్సు, సిద్ధాంతాలు మొదలైన అనేక విషయాలున్నాయి. మరికొన్ని కథల్లో అక్కడక్కడా సందర్భాల ననుసరించి జ్యోతిషం, ఆయుర్వేదం, గణితం మొదలైన శాస్త్రాంశాలను కవి పేర్కొన్నాడు. వాటిని ఈ విద్యా విషయాల్లో చేర్చలేదు. ఈ విద్యా విషయాల్లో చెప్పిన అంశాలను, ఆశాస్త్ర విషయాల్లో చెప్పలేదు. దీనిని బట్టి ఆనాటి విద్యా విధానంలో సాధారణంగా సంస్కృతంలో ఇవన్నీ నేర్పే వాళ్ళని తెలుస్తుంది. వీటిలో అసాధారణ ప్రజ్ఞ సంపాదించిన వాళ్ళు సకల విద్యా పారంగతులు. చండశర్మ అటువంటివాడు. "అతడక్షరలక్షణ ఋగ్యజుస్సామాథర్వణంబుల వేదాంత వైవేషిక భాట్ట ప్రభాకర పూర్వోత్తర మీమాంసా శాస్త్రంబులును............... ద్రాక్షా నారికేళ పాకంబుల కవిత్వ రచన లెరింగి సకల విద్యా పారంగతుడై యుండె." (3–128)

అయితే హంస వింశతిలో జ్యోతిషం, ఆయుర్వేదం, గణితం మొదలైన శాస్త్ర విషయాలు ప్రస్తావించిన సందర్భాలననుసరించి అవి వృత్తి విద్యలుగా కవి పేర్కొన్నట్లు మనకు తెలుస్తుంది. జ్యోతిషం చెప్పడం వృత్తిగాగల మతిమంతుని గూర్చి చెప్పే సందర్భంలో (13వ రాత్రికథ) జ్యోతిశ్శాస్త్ర విషయాలు (4-46 నుండి 58) ప్రస్తావించడం జరిగింది. ఆయుర్వేదాది శాస్త్ర విషయాలను కూడా కవి అదేవిధంగా పేర్కొన్నాడు. కాబట్టి ఆనాటి వృత్తి విద్యలైన శాస్త్రవిషయాలనుగాక, సాధారణ విద్యలకు సంబంధించిన వేదవేదాంగాది విషయాలనే విద్యావర్గంగా విభజించి, వివరించడం జరిగింది. వృత్తి విద్యలైన శాస్త్రాంశాలు శాస్త్రవర్గంలో వివరించబడ్డాయి.

వ్రాయడం మాత్రమే విద్యగాదు. నేర్చుకోదగినటువంటివి, తెలుసుకోవలసినటువంటివన్నీ విద్యలే.

పూర్వం ఈ విద్యలు రకరకాలుగా ఉండేవి.

చతుర్విద్యలు–అన్వీక్షకీ=విజ్ఞానాన్ని తెలిపేది. త్రయి–ధర్మాధర్మాలను వివరించేది.

వార్త – అర్థాఅనర్థాలను గూర్చి చెప్పేది. దండనీతి–నయానయాలను తెలిపేది

షడ్విద్యలు – ఆకర్షణం, స్తంభనం, మారణం, విద్వేషణం, ఉచ్చాటనం. మోహం అనేవి ఆరు విద్యలు.

చతుర్దశ విద్యలు–నాలుగు వేదాలు. ఆరు వేదాంగాలు. మీమాంస శాస్త్రం. న్యాయ శాస్త్రం. పురాణాలు. ధర్మశాస్త్రం అనేవి కలిసి పద్నాలుగు విద్యలు.

అష్టాదశ విద్యలు :– పైన చెప్పిన చతుర్దశ విద్యలు + ఆయుర్వేదం, ధనుర్వేదం, నీతిశాస్త్రం, అర్థశాస్త్రం వెరసి పద్దెనిమిది విద్యలైనాయి.

షడ్విద్యలు మళ్ళీ చతుష్షష్ఠి విద్యల్లో చేరుతాయి. పురాణాలు పద్దెనిమిది, వీటికి ఉపపురాణాలు ఈ విధంగా విద్యలు శాఖోపశాఖలుగా విస్తరిల్లి ఉన్నాయి.

హంసవింశతిలో పైన చెప్పిన విద్యల్లో చతుర్దశ విద్యల వరకు ఉన్నటువంటి వానిని వాటి శాఖలను, చతుష్షష్ఠి విద్యలను (1-155) కవి విద్యాసంబంధ విషయాలుగా పేర్కొన్నాడు. కాబట్టి వాటినే విద్యావర్గమనే ఈ శీర్షికలో అకారాదిగా వివరించడం జరిగింది.

# అలంకారాలు

"అలంకరోతి అలంకారః". అంటే (అందాన్ని) ఇనుమడింప చేసేది అలంకారమని భావం. కావ్యపరంగా ఈ పదాన్ని పరిశీలిస్తే కావ్య శోభను అతిశయింప చేసేవి అలంకారాలు అని చెప్పవచ్చును.

కావ్యాన్ని కాంతతో పోలుస్తూ రామరాజ భూషణుడు తన కావ్యాలంకార సంగ్రహమనే గ్రంథంలో............

కం॥ తనువగు శబ్దార్థంబులు
ధ్వని జీవమలం క్రియా వితానము సొమ్ముల్
తనరుగుణంబులు గుణములు
ఘన వృత్తులు వృత్తులౌర కావ్యేందిరకున్ (2-58).

అని చెప్పాడు. శబ్దార్థాలు, గుణాలు, వృత్తులు మొదలైన కావ్య సామగ్రి ఇక్కడ అప్రస్తుతం కాబట్టి వానిని ఆవలపెట్టి, ప్రస్తుతమైన అలంకారాలను తీసుకొంటే— అవి కావ్య కాంతకు సొమ్ముల వంటి వని కవి వర్ణించాడు. అంటే అలంకారం స్త్రీ సౌందర్యాన్ని ఇనుమడింపజేసి నట్లే, అలంకారాలు కావ్య శోభను అతిశయింప చేస్తాయని భావం.

కావ్య శోభను ఇనుమడింపచేస్తాయి గదా అని అలంకారాలను ఇచ్ఛ వచ్చినట్లు ప్రయోగించడం తగని పని. అలంకార ప్రయోగంలో సౌందర్య ముండాలి. ఇక్కడ సౌందర్యమంటే ఆనందాన్ని కలుగజేసే సామర్థ్యం. రసాత్మక మైన కావ్యంలో ఆ రసావిష్కారానికి తగినట్లుగా అలంకారాలు ఉండాలనేది పండితాభిప్రాయం.

అలంకారాలు శబ్దాలంకారాలని, అర్థాలంకారాలని రెండు విధాలు. అయితే కావ్యాల్లోగాని, కావ్య శాస్త్రాల్లో గాని, అర్థాలంకారాల ప్రసక్తే ఎక్కువగా కనిపిస్తుంది. శబ్దాలంకారాల ప్రసక్తి తక్కువే గాకుండా, వాటి సంఖ్య కూడా తక్కువే. హంసవింశతిలో కూడా అవి పేర్కొనబడలేదు. అర్థాలంకారాలు చంద్రాలోకంలో నూరు వరకు కని

పిస్తాయి. ప్రతాపరుద్రి యశోభూషణంలో అలంకారాల సంఖ్య 73. కావ్యాలంకార సంగ్రహంలో — రూపకాదులైన ప్రతీయమానౌపమ్యములు (సామ్యము వ్యంగ్యంగా కనిపించేవి) 16. సమాసోక్తి, పర్యాయోక్తి మొదలైన ప్రతీయమానవస్తుకములు (వస్తువు వ్యంగ్యంగా గోచరించేవి) 10. రస భావాలు వ్యంగ్యంగా గోచరించే రసవదాది అలంకారాలు–4. మిగిలిన ఉపమాదులు 40. మొత్తం అలంకారాలు - 70. అని రామరాజ భూషణుడు పేర్కొన్నాడు. రసవదాది అలంకారాలు – 7 అని ప్రతాప రుద్ర యశోభూషణం పేర్కొంటుంది. ఈ విధంగా ఈ అర్థాలంకారాల సంఖ్య విషయంలో పండితుల్లో అభిప్రాయ భేదాలు కనిపిస్తున్నాయి. (కా. సం. 563, 564).

కావ్యశోభాహేతువులైన ఈ అలంకారాలు హంస వింశతిలో ఒక చోట— "ఉపమా రూపక....... విభావనాద్యలంకారంబులును" (3-128) అని షుమారు ముప్పైరెండు అలంకారాల పేర్లను కవి పట్టికగా ఇచ్చాడు. అయితే ఇవన్నీ కూడా దాదాపు అన్ని అలంకార శాస్త్ర గ్రంథాల్లోను చోటుచేసుకొని, బహుళ ప్రచారంలో ఉన్నాయి కాబట్టి, మరలా వాటిని క్కడ పేరు పేరున వివరించడం అవసరం లేదని భావించి, అలంకారాలకు సంబంధించిన పై ముఖ్యాంశాలను మాత్రమే ఇక్కడ ప్రస్తావించడం జరిగింది.

అష్టభాషలు :- భారతదేశంలో వివిధ రాష్ట్రాల్లో, పలు ప్రాంతాల్లో ఎన్నో భాషలు వ్యవహారంలో ఉన్నాయి. ఇవిగాక పర్వత ప్రాంతాల్లో మాట్లాడే భాషలు మరి కొన్ని ఉన్నాయి. గ్రియర్సన్ వంటి భాషా తత్వవేత్తలు భారతదేశంలోని భాషలనన్నిటిని పరిశీలించి, వాటిని భాషా కుటుంబాలుగా, వర్గాలుగా విభజించి ఉన్నారు.

అయితే ఇదంతా గూడ భాషా శాస్త్రం అధ్యయనానికి వచ్చిన తరువాత జరిగిన కృషి. హంస వింశతి నాటికి భాషా శాస్త్ర ప్రసక్తే లేదు. ప్రాచీన కాలంలో అష్ట భాషలనే పేరుతో వ్యవహారంలో ఉండే సంస్కృతం మొదలైన ఎనిమిది భాషలనే కవి హంస వింశతిలో పేర్కొన్నాడు.

అపభ్రంశ భాష :- ఇది, ప్రాకృతం అపభ్రంశం కాగా అందుండి

పుట్టిన భాష. ఇప్పుడీ భాష ఏ రాష్ట్రంలోను వ్యవహారంలో నున్నట్లు దాఖలాలు లేవు అతి ప్రాచీన కాలాన ఇది అభీర దేశంలో వ్యవహారంలో నున్నట్లు మాత్రం తెలుస్తున్నది. పూర్వం సంస్కృత నాటకాల్లో విద్యాగంధం లేని నీచ జాతి పాత్రలకు ఈ అపభ్రంశ భాషనుపయోగించేవాళ్ళు.

ఆంధ్ర భాష :— దీనికి తెలుగు తెనుగు అనే పేర్లు కూడా ఉన్నాయి. దాదాపు ఆరుకోట్ల ఆంధ్రులు ఈ భాషను మాట్లాడుచున్నారు. భారత దేశంలో హిందీ తర్వాత అధిక సంఖ్యాకులచే మాట్లాడబడుచుండే భాష ఇదే. భారత దేశ భాషల్లోని ఏ భాషకూ తీసిపోనంతటి సాహిత్య సంపద ఆంధ్ర భాషకుంది. సంస్కృతం నుండి ఆంధ్ర భాష పుట్టిందని, దానికిది వికృతి అనీ పూర్వం అనుకొనేవాళ్ళు. కాని భాషా శాస్త్రం అభివృద్ధి చెందడంతో ఆంధ్రం ద్రావిడ భాషల్లో ఒకటని సశాస్త్రీయంగా నిరూపింపబడింది.

అజంత (అచ్ + అంత) భాషయైన ఆంధ్రం వినేందుకు మధురంగా ఉంటుంది కాబట్టి "దేశ భాషలందు తెలుగులెస్స" అని మన పూర్వ కవుల చేతను, "*Etalian of the East*" అని ఆంగ్లేయులచేతను కీర్తింపబడినది.

చూళికా భాష:- పైశాచీ భాషా భేదమే చూళికా భాష. దీన్ని పైశాచీ భాష మాదిరిగానే పూర్వం నాటకాల్లో వాడేవాళ్ళు.

పైశాచి భాష:- సంస్కృత నాటకాల్లో పూర్వం, పిశాచి, రాక్షసాది భయంకరమైన పాత్రలకు నాటక కర్తలు యీ భాషను వాడేవాళ్ళు. ఇది ప్రాకృత భాష నుండి పుట్టింది. కొద్ది భేదాలతో కేకయ, నేపాలాది దేశాల్లో పూర్వం యీ భాషను వాడేవాళ్ళు. గుణాఢ్యుడు పైశాచీ ప్రాకృతంలోనే "బృహత్కథా మంజరి" అనే ప్రపంచ ప్రసిద్ధమైన కథా కావ్యాన్ని రచించాడు. నేటి పంజాబీ భాషపైన పైశాచీ భాషా ప్రభావం ఎక్కువగా ఉంటుందని భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

ప్రాకృతం :— మహారాష్ట్ర దేశీయమైన ప్రాకృతం సంస్కృత భాష నుండి పుట్టింది. ఇది ద్వితీయ ప్రకృతి. జైనం, బౌద్ధం వంటి అవైదిక మత పాత్రలకునూ, తక్కువ స్త్రీ పాత్రలకునూ, నాటకాల్లో

ప్రాకృత భాషను వాడేవాళ్ళు. ప్రాకృత వాఙ్మయం సరస్వతీ దేవి బాల్యమందలి వాక్కులని పెద్దల అభిప్రాయం. హాలుడు సంకలనం చేసిన గాథా సప్తశతి అనే గ్రంథం ప్రాకృతంలో వ్రాయబడింది.

మాగధి :- ప్రాకృతం నుండి పుట్టిన భాష మాగధి. పూర్వం మగధ (నేటి బీహారు) దేశంలో యీ భాష వాడుకలో వుండేది. ధీవర, లుబ్ధాది అధమ పాత్రలకు ఈ భాషను పూర్వ నాటక కర్తలు ఉపయోగించారు. మాగధి అనే అపభ్రంశ ప్రాకృతం నుండి పుట్టిన బిహారి భాష నేడు బీహారు రాష్ట్రంలో వ్యవహారంలో ఉంది. దీనిలో మాగహి, భోజపురి, మైథిలి అనే మూడు ఉప భాషలున్నాయి.

శౌరసేని :- శౌరసేని ప్రాకృత జన్యం. శూరసేన దేశ ప్రజలు మాట్లాడే భాష కావడం వల్ల దీనికి పేరు వచ్చి ఉంటుంది. సంస్కృత నాటక కర్తలు తమ నాటకాల్లో వైశ్య, శూద్రాది మధ్యమ పాత్రలకీ భాషనుపయోగించేవాళ్ళు.

సంస్కృతం :- ఈ భాషనే దేవ భాష అని అంటారు. ఇది ఆద్య ప్రకృతి. కావ్య నాటకాదుల్లో దేవ, భూసుర ముని, ఋషి, నృప, అమాత్య, కంచుకి, విట, విదూషక, విరక్త, నృపాంగన, వారాంగనాది ఉత్తమ పాత్రలకు సంస్కృత భాష నుపయోగించేవారు. (ఆం. వి. *V-2291*) "జనని సమస్త భాషలకు...." అని ప్రస్తుతికెక్కిన సంస్కృతం నేడు ఏ ప్రాంతంలోను వ్యవహారంలో లేదు. అయినా విస్తృతమైన వాఙ్మయం ఉండడంవల్ల సర్వవిజ్ఞానాన్ని తనలో ఇముడ్చుకొని వెలుగొందుతుండే భాష సంస్కృతం.

## అష్టాదశ పర్వాలు

మహాభారతం పద్దెనిమిది భాగాలుగా విభజింపబడి ఉంది. ఈ భాగాలకే పర్వాలు అని పేరు. సంస్కృతంలో వ్యాసుడు రచించిన మహాభారతం నూరు పర్వాలు కలిగి ఉన్నట్లు తెలుస్తుంది.

"అది యుం పౌష్యంబు పౌలోమంబాస్తీకంబాది వంశావతారంబు సంభవ పర్వంబు........స్వర్గారోహణంబు హరివంశంబు భవిష్యత్పర్వంబు నను శత పర్వంబులు కలిగి...." (ఆ. ప. 1-33)

అష్టాదశ పర్వాలే అంతర పర్వాల మూలంగా నూరు పర్వాలౌతున్నాయి. ఈ పద్దెనిమిది పర్వాలను హంసవింశతిలో నారాయణామాత్యుడు పేర్కొన్నాడు. (3-128). ఇవి లోకానికి తెలిసినవే కావున, ఆయా పర్వాల శ్లోక సంఖ్య, అందలి ప్రధాన కథా విషయాలు మాత్రమే ఇక్కడ సంక్షిప్తంగా వివరింపబడుతున్నాయి.

ఆది పర్వం :- మహాభారతంలో మొట్టమొదటి పర్వం. 9984 శ్లోకాలు దీనిలో ఉన్నాయి. పౌష్యోదంక మాహాత్మ్యం, భృగువంశ కీర్తనం, నాగ గరుడ సంభవం, సముద్ర మథనం, సౌపర్ణోపాఖ్యానం, ఆస్తీక చరిత్ర, జనమేజయుని సర్పయాగం, వ్యాస జననం, దేవదైత్య దానవ, ముని, యక్ష, పక్షి, గంధర్వాది పలుభూతాల జననం. యయాతి చరిత్ర, ధృతరాష్ట్ర పాండురాజుల జననం. ధార్తరాష్ట్ర, పాండవుల పుట్టుక, కుమారాస్త్ర విద్యా ప్రదర్శనం, జతు గృహ దహనం, హిడింబు వధ, హిడింబాదర్శనం, ఘటోత్కచ జననం ఏకచక్ర పురానికి పాండవులు వెళ్ళి బకుని చంపడం, ద్రౌపదీ దృష్టద్యుమ్నుల జననం. తాపత్య వశిష్ఠౌర్వోపాఖ్యానం. ద్రౌపదీ స్వయంవరం. రాజ్యార్ధలాభం. ఖాండవప్రస్థ నివాసం. సుందోపసుందుల ఉపాఖ్యానం. ద్రౌపదియందు సమక్రియ, ఉలూపి సమాగమం, చిత్రాంగద యందు అర్జునుని ద్వారా బభ్రువాహనుని జననం. ద్వారకా గమనం. సుభద్రార్జునుల వివాహం, అభిమన్యుని పుట్టుక గాండీవ దేవదత్త దివ్యరథాశ్వలాభం, ఖాండవ దహనం, మయ భుజంగ మోక్షణం, మందపాలోపాఖ్యానం అను కథా భాగాలు ఉన్నాయి. ఆది పర్వంలో పద్దెనిమిది అంతర పర్వాలున్నాయి. (ఆ. ప. I-35)

ఆంధ్ర మహాభారతంలో కూడా కథా భాగాలు దాదాపుగా ఇవే ఉంటాయి కాబట్టి, కేవలం పర్వం, అందులోని ఆశ్వాసాల సంఖ్య, గద్య పద్యాల సంఖ్య మాత్రమే ఇక్కడ ప్రదర్శించడం జరిగింది. ఆంధ్ర మహాభారతం. ఆది పర్వం. ఆశ్వాసాలు-8. గద్యపద్యాలు-2031.

సభా పర్వం :- ధర్మరాజుకు సభాప్రాప్తి, రాజసూయ యాగం. జరాసంధవధ, దిగ్విజయం, శిశుపాల వధ, దుర్యోధనుని చూచి ద్రౌపది భీముడు నవ్వుట, జూదమాడుట, ధర్మరాజు జూదంలో పరాజయం

పొందుట, పాంచాలి పాండవులనుద్ధరించుట, మరల ద్యూత పరాజితులై పాండవులు వనవాసానికి వెళ్ళుట. ఇత్యాది కథా భాగాలతో 4311 శ్లోకాలతో సభాపర్వం ఒప్పుచున్నది. అంతర పర్వాలు తొమ్మిది ఉన్నాయి. (ఆ. ప. 1-37) ఆంధ్ర మహాభారతం. సభాపర్వం. ఆశ్వాసాలు-2. గద్యపద్యాలు-618.

అరణ్యపర్వం :- ఇది భారతంలో మూడో పర్వం. కిమ్మీర వధ, యుధిష్ఠిర భీమసేనుల సంవాదం. ఈశ్వర – అర్జునుల యుద్ధం, దివ్యాస్త్రలాభం, స్వర్గగమనం, బృహదశ్వ మహమునిని చూడడం నలోపాఖ్యానం, ధర్మరాజు తీర్థాభిగమనం, జటాసురుని చంపడం, భీముడు సౌగంధిక పుష్పాన్ని తేవడం అగస్త్య ఉపాఖ్యానం, శిబిచక్రవర్తి కథ, ఋష్యశృంగుని చరిత్ర, కార్తవీర్యుని వధ, మాంధాతృ జన్మం, సుకన్యా చ్యవనుల వృత్తాంతం, వంద్య అష్టవక్రుల వివాదం, తిత్తిరి మహర్షి వృత్తాంతం. అర్జునుడు దివ్యాస్త్రాలను పొంది హిరణ్యపుర నివాసులైన రాక్షసులను చంపుట. మార్కండేయ ఉపాఖ్యానం, ఘోషయాత్ర, దుర్యోధనుని విడిపించుట, కలియుగ ధర్మం. వామాశ్వహరణం, ఇంద్రద్యుమ్న ఉపాఖ్యానం, సరస్వతీ గీత, దుంధుమారు చరిత్ర, జయద్రథుడు ద్రౌపదిని అపహరించుట, ఉద్దాలక ఉపాఖ్యానం, వైన్యోపాఖ్యానం, రామాయణ కథ, సావిత్ర్యుపాఖ్యానం, పాండవులు ద్వైతవనాన్ని చేరుట, ఇంద్రుడు కర్ణుని కవచకుండలాలను దానంగా పుచ్చుకొనుట, నారాయణ ఉపాఖ్యానం, యముడు ధర్మరాజుని అనుశాసించుట, అనే కథా భాగాలు అరణ్య పర్వంలో ఉన్నాయి. దీనిలో అంతర పర్వాలు పదహారు. శ్లోకాలు. 13664. (ఆ. ప. 1-39). ఆంధ్ర మహాభారతం-అరణ్యపర్వం. ఆశ్వాసాలు-8. గద్యపద్య సంఖ్య 2894.

విరాట పర్వం :- అరణ్యవాస గడువును పూర్తిచేసి పాండవులు విరాటరాజు కొలువు చేరేందుకై, శమీవృక్షంపై తమ ఆయుధాలను దాచడం, తమని గుర్తుపట్టని మారువేషాల్లో, పాండవులు, ద్రౌపది విరాటుని కొలువు చేరుట, భీముడు కీచకుని చంపుట, ఉత్తర గోగ్రహణం, ఉత్తరాభిమన్యుల వివాహ వృత్తాంతం, మొదలైన కథా భాగాలు విరాట పర్వంలో ఉన్నాయి. ఇది మహాభారతంలో నాల్గవ పర్వం. ఇందులో

3500 శ్లోకాలున్నాయి. (ఆ. ప. 1-41) ఆంధ్ర మహాభారతం. విరాట పర్వం. ఆశ్వాసాలు–5. గద్యపద్య సంఖ్య–1624.

ఉద్యోగ పర్వం :- భారత యుద్ధ ప్రయత్నంలో పాండవులు ఉపప్లావ్యంలో విడిదిచేయడం. అర్జునుడు శ్రీ కృష్ణుని సహకారాన్ని అర్థించడం. అర్జునుడు శ్రీకృష్ణుని తన రథ సారథిగా ఉండమని ప్రార్థించుట. సంజయ రాయబారం, పాండవుల యుద్ధ ప్రారంభాన్ని విని ధృతరాష్ట్రుడు చింతించుట. సనత్సుజాతుడు ఆధ్యాత్మిక కథలను వినిపించుట. శ్రీకృష్ణ రాయబారం. దుర్యోధనుని దుర్మంత్రం. కృష్ణుడు విశ్వరూపాన్ని చూపడం, కర్ణుని జన్మరహస్యం తెలిపి కృష్ణుడు కర్ణుని పాండవుల వైపు రమ్మని ఆహ్వానించడం. ఉదంకుడను దూత పాండవుల వద్దకు రావడం. భీష్ముడు కర్ణుని అర్ధరథునిగా ఎన్నికచేసి నందుకు కర్ణుడు కోపించి భీష్ముడున్నంతవరకు యుద్ధభూమికి రానని ప్రతిజ్ఞ చేయడం. అంబ ఉపాఖ్యానం, సంక్రందనోపాఖ్యానం. శ్వేతాభిషేకం-వంటి కథా భాగాలతో ఉద్యోగపర్వ మొప్పుచున్నది. ఇది భారతంలో ఐదవ పర్వం. పదకొండు అంతర పర్వాలున్నాయి. ఈ పర్వంలో మొత్తం శ్లోక సంఖ్య 6990. (ఆ. ప. 1-43). ఆంధ్ర మహాభారతం. ఉద్యోగ పర్వం. ఆశ్వాసాలు–4. గద్య పద్య సంఖ్య–1562.

భీష్మ పర్వం :- భీష్మ పర్వం భారతంలో ఆరో పర్వం. యుద్ధ పర్వాల్లో మొదటిది. 5884 శ్లోకాలు ఈ పర్వంలో ఉన్నాయి. జంబూ ఖండ వినిర్మాణం. సంజయుడు ధృతరాష్ట్రునకు చెప్పుట. భూవిస్తారం. భీష్మాభిషేకం. అర్జునుని విషాదం. కృష్ణుడు మోక్ష దర్శన హేతువులను చెప్పి అర్జునుని మోహ భ్రాంతిని తొలగించుట. అర్జునుడు తన రథంపై శిఖండిని ఉంచుకొని భీష్ముని పడగొట్టుట. - వంటి కథా భాగాలతో భీష్మ పర్వ మొప్పుచున్నది. దీనిలో అయిదు అంతర పర్వాలున్నాయి. (ఆ.ప. 1-45) ఆంధ్ర మహాభారతం. భీష్మ పర్వం. ఆశ్వాసాలు-3. గద్య పద్యాలు-1172.

ద్రోణ పర్వం :- ద్రోణుడు సైన్యాధిపతిగా అభిషేకింపబడుట. అర్జునుడు సంశప్తకులతో యుద్ధం చేసేందుకు పోవుట. భగదత్తుని

చంపుట. ద్రోణుడు, కర్ణుడు మొదలైన వారంతా కూడి అధర్మయుద్ధంలో అభిమన్యువధ. అర్జున ప్రతిజ్ఞ, ఏడు అక్షౌహిణుల సైన్యాన్ని నాశనంచేసి, సైంధవుని చంపుట. అలంబస, శ్రుతాయు, జలసంధ, సోమదత్త, భూరి శ్రవ బాహ్లిక, విరాట, ద్రుపద, ఘటోత్కచ మొదలైన వీరులందరూ యుద్ధంలో మరణించుట. ద్రోణ వధ. అశ్వద్ధామ ఆగ్నేయాస్త్ర కీర్తనం, కృష్ణార్జునుల వృత్తాంతం అనే కథా భాగాలు ద్రోణపర్వంలో ఉన్నాయి. మహాభారతంలోని పర్వాల వరుసక్రమంలో ఏడోది. యుద్ధ పర్వాల్లో రెండోది. దీనిలోని శ్లోక సంఖ్య 10,919. అంతర పర్వాలు–8. (ఆ. ప. 1–47) ఆంధ్ర మహాభారతం. ద్రోణ పర్వం – ఆశ్వాసాలు-5. గద్య పద్యాలు-1861.

కర్ణపర్వం :– మహాభారతంలో ఎనిమిదోది, యుద్ధపర్వాల్లో మూడోది కర్ణపర్వం. కర్ణాభిషేకం, కర్ణునకు రథ సారథిగా శల్యుని నియమించడం. త్రిపుర దహనోపాఖ్యానం. యుధిష్ఠిర అర్జునుల పరస్పర క్రోధ వచనాలు. కర్ణుని రథ చక్రం భూమిలో క్రుంగుట. ఇంద్రాదిత్యుల పరస్పర సంవాదం. కర్ణుని వధ. – వంటి కథా భాగాలున్నాయి. ఈ పర్వంలోని శ్లోక సంఖ్య 4900. దీనిలోని అంతర పర్వాలు–6. (ఆ. ప. 1-49). ఆంధ్ర మహాభారతం. కర్ణ పర్వం. ఆశ్వాసాలు - 3. గద్య పద్యాలు - 1124.

శల్య పర్వం :– యుద్ధపర్వాల్లో నాల్గోది, మహాభారతంలోని వరుసక్రమంలో తొమ్మిదో పర్వం. ఇందులో శల్యుడు యుద్ధభారాన్ని పూనుట. కురుకుమార వధ. ధర్మజుడు శల్యుని చంపుట. కురు ముఖ్యులందరూ యుద్ధంలో మరణించుట. సహదేవుడు శకుని చంపుట. సంజయ గ్రహణ మోక్షణం, దుర్యోధనుడు నీటిలో ప్రవేశించుట, భీమ దుర్యోధనుల గదాయుద్ధం, సరస్వతి మొదలగు పుణ్యతీర్థాల కీర్తనం – అనే కథా భాగాలున్నాయి. దీనిలో అంతర పర్వాల సంఖ్య నాలుగు. శ్లోక సంఖ్య 3220. (ఆ. ప. 1–51). ఆంధ్ర మహాభారతం, శల్యపర్వం. ఆశ్వాసాలు – 2. గద్యపద్యాలు - 827.

సౌప్తిక పర్వం:– కృపుడు కృతవర్మ అశ్వద్ధామ కలిసి పాండవ శిబిరాన్ని చేరుట. అశ్వద్ధామ ఆ రాత్రి ఉప పాండవులను నిద్రిస్తుండగా

సంహరించుట. శ్రీకృష్ణ ప్రసాదం వలన పాండవులు, సాత్యకి ప్రమాదం నుండి తప్పుకొనుట. భీముడు అశ్వద్ధామను వెంబడించుట, అశ్వద్థామ శరమోక్షణం చేయుట. దానిని కృష్ణుడు పరిహరించుట, అర్జునుడు దివ్య బాణాలను ప్రయోగించుట, వ్యాస అశ్వద్ధాములు ఒకరినొకరు శపించుకొనుట. అశ్వద్ధామ శిరోరత్నాన్ని పాండవులు కనుగొనుట - వంటి కథా భాగాలు సౌప్తిక పర్వంలో ఉన్నాయి. దీనిలో అంతర పర్వాలు-3, 2870 శ్లోకాలున్నాయి. (ఆ. ప. 1-53) ఆంధ్ర మహాభారతం. సౌప్తిక పర్వం. ఆశ్వాసాలు - 2. గద్యపద్యాలు – 375.

స్త్రీ పర్వం :- మహాభారతంలో స్త్రీ పర్వం పదకొండోది. వీర పత్నుల విలాపాలు, గాంధారి దృతరాష్ట్రుల కోప ప్రసాదనాలు, ధర్మరాజు యుద్ధంలో చనిపోయిన బంధువర్గానికి యదావిధి సంస్కారం పతగు వారలను నియమించుట, భారత వీరులకు దహన సంస్కారాలు చేయుట, కుంతీదేవి కర్ణుని జన్మను గురించి చెప్పుట. ధర్మజుని విలాపం, ధర్మరాజు పట్టాభిషిక్తుడగుట, చార్వాక నిగ్రహం, గృహ ప్రవిభాగం - అనే కథా భాగాలు కలవు. ఇందులో ఐదు అంతర పర్వాలు, 1775 శ్లోకాలున్నాయి. (ఆ. ప. 1-55). ఆంధ్ర మహాభారతం. స్త్రీ పర్వం ఆశ్వాసాలు 2. గద్య పద్యాలు - 376.

శాంతి పర్వం :– శాంతి పర్వంలో 14525 శ్లోకాలు నాలుగు అంతర పర్వాలున్నాయి. ఇది మహాభారతంలో పన్నెండో పర్వం. బంధువర్గమంతా యుద్ధంలో మరణించారన్న నిర్వేదంతో వున్న ధర్మజుడు శ్రీకృష్ణుని బోధలచే శాంతచిత్తుడగుట. అంపశయ్యమీద ఉన్న భీష్ముడు ధర్మరాజుకు ఆపద్ధర్మాలు, మోక్ష ధర్మాలు చెప్పుట - వంటివి ఇందులో వున్న కథా భాగాలు. (ఆ. ప. 1-57). ఆంధ్ర మహాభారతం. శాంతి పర్వం. ఆశ్వాసాలు–6. గద్య పద్య సంఖ్య–3093.

అనుశాసన పర్వం :– అంతర పర్వాలు రెండు, 12000 శ్లోకాలు కలిగిన అనుశాసన పర్వం, మహాభారతంలో పదమూడోపర్వం. పితామహుడగు భీష్ముని ద్వారా ధర్మరాజు సర్వ ధర్మాలను దాన విధులను, ఆచార విధులను తెలుసుకొనుట. పుత్రాను శాసనం, భీష్మ స్వర్గారోహణం– అనే కథా భాగాలతో అనుశానన పర్వమొప్పుచున్నది. (ఆ. ప్ర. 1–59).

అశ్వమేధ పర్వం:– ఇందులోని కథా భాగాలు అశ్వమేధ ఆరంభం, సంవర్త మరుత్తీయోపాఖ్యానం, స్వర్ణకోశ సంప్రాప్తి, పరీక్షిత్తుజననం. అర్జునుడు యాగ అశ్వాన్ని అనుసరించుట, రాజులతో యుద్ధం, అర్జున-బభ్రువాహనుల మధ్య యుద్ధం. నలోపాఖ్యానం, అనుగీత, బ్రాహ్మణ గీత, గురుశిష్య సంవాదం - మొదలైనవి. దీనిలో రెండు అంతర పర్వాలున్నాయి శ్లోక సంఖ్య 4420. ఆంధ్ర మహాభారతం. అశ్వమేధ పర్వం. అశ్వాసాలు–4. గద్య పద్య సంఖ్య–978.

ఆశ్రమవాస పర్వం :– ఇది పదిహేనో పర్వం. ధృతరాష్ట్రుడు గాంధారి విదుర, సంజయులతో ఆశ్రమ వాసానికి వెళ్ళుట. కుంతీదేవి గురు శుశ్రూష పరాయణయై గాంధారీ ధృతరాష్ట్రులను అనుసరించుట, వ్యాసుని వరప్రసాదంవలన యుద్ధంలో చనిపోయినపుత్ర పౌత్రులందరిని చూసి దుఃఖం వీడి పరమ సిద్ధిని పొందుట, పాండవులు నారదుని వలన యాదవుల వ్యసనాల గురించి తెలుసుకొనుట - అనే కథా భాగాలతో ఆశ్రమవాస పర్వమొప్పుచున్నది. ఈ పర్వంలో అంతర పర్వాలు మూడు. శ్లోకాలు. 1106. (అ. ప. 1–63) ఆంధ్ర మహాభారతం. ఆశ్రమ వాస పర్వం. అశ్వాసాలు–2. గద్య పద్య సంఖ్య–362.

మౌసల పర్వం :- యాదవులు మద్యపాన పరవశులై శాపకారణంగా సముద్ర తీరంలో కలహించుకొని పరలోక గతులగుట, బలరామ, శ్రీకృష్ణుల నిర్యాణం, అర్జునుడు ద్వారకకు పోవుట, వాసుదేవాది యాదవులకు సంస్కార క్రియలుచేసి, భర్తలను కోల్పోయిన యాదవుల భార్యలను తీసుకొని వస్తుండగా గాండీవ దివ్య బాణాల శక్తి పోవుట, వ్యాస మహర్షి బోధనలచే అర్జునుడు సన్యాసాన్ని స్వీకరించుట – వంటి కథా భాగాలు మౌసల పర్వంలో ఉన్నాయి. ఇందులో అంతర పర్వాలు లేవు. ఈ పర్వం 300 శ్లోకాలను కలిగి ఉన్నది. (అ. ప. 1-65) ఆంధ్ర మహాభారతం. మౌసల పర్వం అశ్వాసాలు-1. గద్య పద్యాలు–226.

మహాప్రస్థానం :– పరీక్షిత్తునికి రాజ్య పట్టాభిషేకం చేయుట, పాండవులు పాంచాలి సమేతంగా పరమసిద్ధికి వెళ్ళుట – అనే కథా భాగాలను కలిగింది మహాప్రస్థాన పర్వం.ఇందులో అంతర పర్వాలులేవు.

120 శ్లోకాలు మాత్రమే వున్నాయి. (అ. ప. 1–65). ఆంధ్ర మహా భారతం. మహాప్రస్థానం. ఆశ్వాసం–1. గద్య పద్యాలు–79.

స్వర్గారోహణం :– పదునెనిమిదవ పర్వమైన స్వర్గారోహణ పర్వం భారతంలో చివరిది. కర్ణునికి నరకప్రాప్తి, తన్మోక్షణం, భారత వీరులు స్వర్గం చేరుట, కర్మపరిపాకోపభోగం - అను కథా భాగాలతో 200 శ్లోకాలను కలిగి వున్నది. ఇందులో కూడ అంతర పర్వాలు లేవు. (అ. ప. 1-85). ఆంధ్ర మహాభారతం. స్వర్గారోహణ పర్వం. ఆశ్వాసం – 1. గద్య పద్య సంఖ్య-98.

ఈ విధంగా సంస్కృత భారతంలో అష్టాదశ పర్వాలు, అంతర పర్వాలు, హరివంశ, భవిష్యత్పర్వాలు కలిసి మొత్తం నూరు పర్వాలలో కథంత నడుస్తుంది. జన వ్యవహారంలో మాత్రం భారతం పదునెనిమిది పర్వాల గ్రంథంగానే ప్రచారంలో ఉంది. ఆంధ్ర మహాభారతంలో కూడా పద్దెనిమిది పర్వాలున్నాయి. ఒక్కొక్క పర్వం మరలా ఆశ్వాసాలుగా విభజింపబడి ఉంది. సంస్కృత భారతం కేవలం శ్లోకాల్లో ఉంటే, ఆంధ్ర మహాభారతం గద్య పద్యాత్మకమైన చంపూ కావ్యంగా వ్రాయబడింది.

## అష్టాదశ పురాణాలు

భారతీయ విజ్ఞానానికి, సంస్కృతికి పట్టుకొమ్మలు వేదాలు. అట్టి వేదాల అర్థాన్ని లోకానికి సులభ రీతిలో విపులీకరించడానికి సహకరించేవిపురాణాలు. (ప్ర. మ. పు. 3)

"సర్గశ్చప్రతి సర్గశ్చ వంశో మన్వంతరాణిచ
వంశాను చరితం చేతి లక్షణా నాంతు పంచకం"

పురాణాలు ఐదు లక్షణాలను కలిగి ఉంటాయని పైశ్లోకం వ్యక్తపరుస్తుంది. అష్టాదశ పురాణాలను పరిశీలించినట్లైతే, యీలక్షణాల అనుక్రమణికతో కూడిన రచన మనకు కనిపిస్తుంది. భారతీయ జిజ్ఞాసువులైన ఆర్షఋషులు తమకు తెలిసిన విజ్ఞానాన్ని పురాణాల్లో నిక్షిప్తంచేసి, వాటిని

భార త్రీయ విజ్ఞాన సర్వస్వాలుగా తీర్చిదిద్దారు. అందువల్ల పురాణారచన ఐదు లక్షణాల్లో ఇమడలేదు.

భాగవత పురాణం, పంచలక్షణాలను కలిగినది పురాణమని, దశలక్షణాలను కలిగినది మహాపురాణం అని పేర్కొన్నది. అదే విధంగా బ్రహ్మవైవర్త పురాణం కూడ పురాణ లక్షణాలను ఐదుకంటెఎక్కువ గానే పేర్కొంది. (ప్ర. మ. పు. 12, 13)

"మ" ద్వయం "భ" ద్వయంచైవ "బ్ర" త్రయం "వ" చతుష్టయం
అ-నా-ప-లిం-గ-కూ-స్కా-ని పురాణాని పృథక్ పృథక్".

ఈ శ్లోకం అష్టాదశ పురాణాల పేర్లలోని మొదటి అక్షరాలతో ఏర్పడింది. మకారంతో మొదలయ్యే పురాణాలు రెండు (మత్స్యపురాణం, మార్కండేయ పురాణం) భకారంతో మొదలయ్యే పురాణాలు రెండు (భవిష్య, భాగవతపురాణాలు) బకారంతో మొదలయ్యే పురాణాలు మూడు (బ్రహ్మాండ, బ్రహ్మోత్తర, బ్రహ్మవైవర్త పురాణాలు), వకారంతో మొదలయ్యే పురాణాలు నాలుగు (వరాహ. వామన, వాయు, విష్ణుపురాణాలు) అకారం అగ్నిపురాణానికి, "నా" నారదీయ పురాణానికి, "ప" పద్మ పురాణానికి, "లిం" లింగ పురాణానికి, "గ" గరుడ పురాణానికి, "కూ" కూర్మ పురాణానికి, "స్కా" స్కాంద పురాణానికి సంకేతాలు. ఈ విధంగా ఈ శ్లోకం అష్టాదశ పురాణాలను సులభంగా గుర్తుంచుకొనేందుకు సహాయపడుతుంది.

పురాణాల సంఖ్య విషయంలో పండితుల్లో భేదాభిప్రాయాలున్నాయి. కొందరు అష్టాదశ పురాణాల్లో శ్రీ భాగవతానికి బదులు దేవీ భాగవతాన్ని, వాయు పురాణానికి బదులు శివ పురాణాన్ని చేర్చుతారు. హంసవింశతి కర్త నారాయణామాత్యుడు మాత్రం భాగవత, వాయు పురాణాలను అష్టాదశ పురాణాల్లోనివిగానే పరిగణించాడు.

పురాణ వర్గీకరణలో కూడ భేదాభిప్రాయాలున్నాయి. గుణత్రయ విభాగాన్ని అనుసరించి, విష్ణువును స్తుతించేవి సాత్త్విక పురాణాలని, సరస్వతీ చతుర్ముఖ కృశానుల కీర్తించేవి రాజస పురాణాలని, శివ, లింగ,

దుర్గ, విఘ్నేశ, కుమారుల స్తుతించేవి తామస పురాణాలని, పద్మపురాణంలో పేర్కొనబడి ది.

హరప్రసాదశాస్త్రి పురాణాల్లోని విషయాన్ని దృష్టిలో ఉంచుకొని, విజ్ఞాన స్వరసాలనదగినవి, తీర్థవ్రత మాహాత్మ్యాలను వర్ణించేవి, పూర్వోత్తర భాగాలందు ప్రక్షిప్తంగా చేరినవి, చరిత్రక అంశాలున్నవి, మత ప్రాధాన్యత కలిగినవి, విష్ణు అవతారాల పేర్లుతో ఉన్నవి - మొదలైనవిగా వర్గీకరించాడు. (ప్ర. మ. పు. 23-26). భారతీయ ప్రాచీన విజ్ఞాన సర్వస్వాలనదగిన పురాణాలను హంసవింశతిలో ఒకచోట పేర్కొనడం జరిగింది. (3–128) అష్టాదశ పురాణాలను అకారాది క్రమంలో ఒక్కొక్కదానిలోని శ్లోక సంఖ్య, విశేషాంశాలు ఇక్కడ సంక్షిప్తంగా ప్రదర్శింప బడుతున్నాయి.

అగ్ని పురాణం :- "యత్ర దీశానకం కల్పవృత్తాంతమధికృత్యచ
వసిష్ఠయాగ్నినాప్రోక్తమాగ్నేయం తత్ప్రచక్షతే
తచ్చషోడశ సాహస్రం సర్వక్రతు ఫలప్రదం".

ఈశానక కల్పవృత్తాంతాన్ని గూర్చి అగ్ని వసిష్ఠునికి చెప్పిందే అగ్నిపురాణం. ఇందులో 16 వేల శ్లోకాలున్నాయి.

అగ్నిపురాణం మొదటి అధ్యాయం అవతారాలనుగురించిన వర్ణనతో ప్రారంభమౌతుంది. రామ–కృష్ణ అవతారాలను రామాయణ, మహాభారతాల్లో లాగా ఈ పురాణంలో కూడ విపులంగా వర్ణించడం జరిగింది మత సంబంధమైన కర్మకాండలు కూడ ఇందులో విపులంగా వర్ణించబడ్డాయి. గయ తీర్థ స్థల మాహాత్మ్యాన్ని గూర్చి ప్రత్యేకంగా వర్ణించారు. రాజుల విధులు, యుద్ధ విషయాలు చర్చించడం జరిగింది. సృష్టిక్రమాది విషయాలు మాత్రం జాబితాలుగా ఇచ్చారు. శాలివాహన విక్రమాదిత్యాది రాజ వంశ చరిత్రలున్నాయి. ఒక అధ్యాయంలో ఆయుర్వేద వైద్యం చెప్పబడింది. మిగతా అధ్యాయాల్లో శివ, దేవీభక్తి విషయాలు, ఛందస్సు, వ్యాకరణం మొదలైన శాస్త్రాది విషయాలు అనేకం ఈ పురాణంలో చర్చించబడ్డాయి కాబట్టి ఇది విజ్ఞాన సర్వస్వం వంటిదని పండితుల అభిప్రాయం. *(V.PXXXV)*.

కూర్మ పురాణం:- "యత్రధర్మార్థ కామానాం మోక్షస్య చ, రసాతలే।
మాహాత్మ్యం కథయా మాస కూర్మరూపి జనార్దనః।
ఇంద్రద్యుమ్న ప్రసంగేన ఋషిభిః శుక్రసన్నిధౌ।
సప్తదశ సహస్రాణి లక్ష్మీ కల్పాను షంగికం॥"

ఇంద్రద్యుమ్నునకు, శుక్ర సన్నిధులైన ఋషులతో కలిగిన ప్రసంగంలో కూర్మరూపంలో ఉన్న జనార్దనుడు లక్ష్మీకల్పానికి సంబంధించి రసాతలంలోని ధర్మార్థ కామమోక్షలను గూర్చి వివరించిందే కూర్మ పురాణం. ఇందులో 17000 శ్లోకాలున్నాయి.

విష్ణువు కూర్మావతారం ఎత్తాడు. ఆ పేరుతో ఈ పురాణం ఉండడం మూలంగా దీన్ని వైష్ణవ సంబంధమైన పురాణంగా భావించడానికి ఆస్కారముంది. కాని ఇది శైవ సంబంధమైన పురాణం. శివ స్తోత్రాలు, దేవీ స్తోత్రాలు ఈ పురాణంలో ఎక్కువగా ఉన్నాయి. ఈ పురాణాన్ని రెండు సమ భాగాలుగా విభజింప వచ్చును. మొదటి భాగంలో సృష్టిక్రమం, విష్ణు అవతారాలు వర్ణింపబడినాయి. తరువాత భైరవునిచే అంధకానురుడు ఓడింపబడుట. మహేశ్వరి, శివ, సతి, హైమవతి అనే చతుర్విధ శక్తుల గురించి, శివుని అవతారాలను గూర్చి వర్ణించడం జరిగింది.

రెండవ భాగంలో కథలు లేవు. ఇది మరలా ఈశ్వర గీత, వ్యాస గీత అని రెండు భాగాలుగా ఉంది. ఈశ్వర గీతలో శివ సంబంధమైన విజ్ఞానమంతా చెప్పబడింది. వ్యాస గీతలో శివభక్తి సంబంధమైన వ్రతాలు, ఉపవాసాలు, పండుగలు మొదలైనవాటిని గూర్చి వివరించడం జరిగింది.

కూర్మ పురాణంలోని 12వ అధ్యాయంలో భైరవయామల, వామ, జైన మొదలైన సిద్ధాంతాల ప్రస్తావన ఉండడంవల్ల ఇది క్రీ.శ. మొదటి శతాబ్దంలో రచింపబడి యుండునని విల్సన్ అభిప్రాయం. *(V. P. Introduction)*.

గరుడ పురాణం :- యదాచ గారుడే కల్పే వినతా గరుడోద్భవం
అధికృత్యాబ్రవీ ద్విష్ణుర్గారుడం తదిహోచ్యతే।
తదాష్ట దశాసైకం చ సహస్రాణీహ పఠ్యతే॥

గారుడ కల్పంలో, వినతా కుమారుడైన గరుత్మంతుని గూర్చి విష్ణువు చెప్పిందే గరుడ పురాణం. ఈ పురాణంలో 19 వేల శ్లోకాలున్నాయని పై శ్లోకం వల్ల తెలుస్తున్నా, ఇప్పుడు దొరుకుతున్న ప్రతుల్లో మాత్రం 7 వేల శ్లోకాల కన్నా ఎక్కువ లేవు. బ్రహ్మ ఇంద్రునికి మరల ఈ పురాణాన్ని గూర్చి చెప్పాడు. ఇందులో గరుడుడి జన్మవృత్తాంతానికి సంబంధించిన విషయ వివరణ ఎక్కువగా లేదు. ఈ పురాణంలో సృష్టి క్రమాన్ని గూర్చి మొదట చెప్పారు. తరువాత మత సంబంధమైన వ్రతాలను, సూర్య సంబంధమైన పవిత్ర స్థలాలను వర్ణించారు. తాంత్రిక యుగంలోని శైవ, విష్ణు, సూర్య స్తోత్రాలు కూర్చబడ్డాయి. జ్యోతిషం, హస్తసాముద్రికం, రత్నపరీక్ష, వైద్యం వంటి విలువైన శాస్త్రాంశాలు ఇందులో చర్చించబడ్డాయి. ఆఖరి అధ్యాయాల్లో ప్రేత కల్పాన్ని గూర్చి చెప్పడం జరిగింది. ఇన్ని విషయాలతో కూడిన ఈ పురాణాన్ని విజ్ఞానసర్వస్వంగా పేర్కొంటున్నారు. (ప్ర. మ. పు. - 25).

నారదీయ పురాణం :-

"యత్రాహ నారదో ధర్మాన్ బృహత్కల్పాశ్రియానిహ
పంచవింశత్సహస్రాణి నారదీయం తదుచ్యతే"

నారదుడు బృహత్కల్పంలో ఆచరించవలసిన ధర్మాల గూర్చి ఈ పురాణంలో పేర్కొన్నాడు. ఇందులో 25 వేల శ్లోకాలున్నట్లు చెప్పబడింది. ప్రస్తుతం దొరుకుతున్న ప్రతుల్లో 3500 శ్లోకాలు మాత్రమే ఉన్నాయి. వీటిలో పురాణానికి సంబంధించిన పంచలక్షణాలు కూడ లేవు. ఈ పురాణం ప్రధానంగా విష్ణు భక్తిని చాటేందుకై రచింపబడినట్లు తెలుస్తున్నది కాబట్టి వివిధాలైన స్తోత్రాలు, విష్ణు భక్తిని చాటే ధ్రువ, ప్రహ్లాద, మోహిని రుక్మాంగద వంటి కథలూ ఈ పురాణంలో వర్ణించబడ్డాయి. ఈ పురాణం చివరలో "ఇది గోహంతకుల, భగవద్వ్యతిరేకుల సమక్షంలో చెప్పకూడదు" అని ఉన్నందువల్ల, ఒహుశ మహమ్మదీయుల పరిపాలన కాలంలో ఇది రచింపబడి యుండునని విల్సన్ అభిప్రాయం. (ప్ర. మ. పు. 25)

పద్మ పురాణం :- సృష్టి ప్రారంభంలో బంగారు పద్మంలో బ్రహ్మ కనిపించడంవల్ల దీనికి పద్మపురాణం అని పేరు వచ్చింది. ఇందులో 55 వేల శ్లోకాలున్నాయి.

ఏత దేవ యదా పద్మమభూత్ హిరణ్మయం జగత్
తద్వృత్తాంతాశ్చ యత్ర ద్వత్ పాద్మ మిత్యుచ్యతే బుధైః
పాద్మం తత్పంచ పంచా సత్సహస్రాణీహ కధ్యతే.

అష్టాదశ పురాణాల పట్టికలో రెండోదిగా పద్మపురాణం కనిపిస్తుంది. ఇది పురాణాలన్నింటిలోకెల్ల పెద్దది. ఇది ఐదు ఖండాలుగా విభజింపబడింది. అవి సృష్టి, భూమి, స్వర్గ, పాతాళ, ఉత్తర ఖండాలు. క్రియా యోగ సారం అనే ఆరో ఖండం కూడ ఇందులో కనిపిస్తుంది.

ఈ పురాణాన్ని మొదట బ్రహ్మ, పులస్త్యునికి చెప్పాడు. అతడు భీష్మునికి చెప్పినట్లు నైమిశారణ్యంలో లోమహర్షణ కుమారుడైన ఉగ్రశ్రవుడు (సూతుడు) ఋషులకు వినిపించాడు.

సృష్టి ఖండంలో బ్రహ్మాండ వర్ణన, సృష్టి వివరణ, మన్వంతరాలు, వంశవర్ణన, మొదలైనవి వర్ణింపబడినాయి. అజ్మీరులోని పుష్కర సరస్సు, పవిత్రమైన తీర్థంగా యీ ఖండంలో పేర్కొనబడింది.

ప్రధానంగా తీర్థస్థలాల వర్ణనలున్న భూమి ఖండంలో 127 అధ్యాయాలున్నాయి. స్వర్గ ఖండంలో భూమికి పైభాగంలో ఉన్న లోకాల వర్ణన ఉంది. వైకుంఠం అన్ని లోకాలకన్న పైన ఉన్నట్లు తెలుపబడింది. దక్షయజ్ఞం మొదలైన కథలు కూడ ఇందులో ఉన్నాయి.

పాతాళ ఖండంలో శేషుడు రాముని కథను వివరించినట్లు చెప్పబడింది. ఇందులో ప్రధానంగా నాగుల లోకమైన పాతాళానికి సంబంధించిన వర్ణన ఉంది ఉత్తర ఖండంలో దిలీపునకు – వసిష్ఠునకు మధ్య జరిగిన సంభాషణల్లో వైష్ణవ మాహాత్మ్యం మొదలైనవి కూడ ఇందులో వర్ణింపబడినాయి.

పద్మపురాణంలో చివరిది క్రియా యోగ సారం. కలియుగంలో మానవులు తపో నిధానులు కారు కాబట్టి వారి మత సంబంధమైన విషయాలు ఎట్లుంటాయో వ్యాసుడు జైమినికి చెప్పిన విధంగా, సూతుడు ఋషులకు చెప్పినట్లు వర్ణింపబడింది. విష్ణు పురాణం చివరి అధ్యాయంలోని విషయాలే మరలా ఇక్కడ కూడా కనిపిస్తాయి.

ఈ పురాణ మందలి విషయాన్ని పరిశీలించిన విల్సన్ ఇది

క్రీ. శ. 12 - 16 శతాబ్దాల మధ్య కూర్చబడినదిగా అభిప్రాయపడినాడు *(V.P. XVII).*

బ్రహ్మవైవర్త పురాణం :-

"రథం తరస్య కల్పస్య వృత్తాంత మధికృత్యయత్
సావర్ణినా నారదాయ కృష్ణ మాహాత్మ్య సంయుతం
యత్ర బ్రహ్మ వరాహస్య చరితం వర్ణ్యతేముహుః
తదష్టాదశ సాహస్రం బ్రహ్మవైవర్తముచ్యతే"

సావర్ణి నారదునకు బ్రహ్మవైవర్త పురాణాన్ని చెప్పినట్లు పై శ్లోకంలో ఉన్నది. కాని, ఇప్పుడు దొరుకుతున్న బ్రహ్మవైవర్తంలో మాత్రం నారాయణ ముని నారదునకు చెప్పినట్లు, తరువాత నైమిశార ణ్యంలో సూతుడు ఋషులకు చెప్పినట్లు కనిపిస్తుంది. ఈ పురాణంలో 18000 శ్లోకాలున్నాయి; ఇది కృష్ణమాహాత్మ్యంతోనూ, రథం తర కల్ప వృత్తాంతం తోనూ కూడి ఉన్నది. ఇందులో బ్రహ్మ - వరాహ చరిత్ర పలుమార్లు చెప్పబడింది.

బ్రహ్మ, ప్రకృతి, గణేశ, కృష్ణ జన్మ అని నాలుగు ఖండాలుగా యీ పురాణం విభజింపబడింది.

బ్రహ్మఖండంలో వివిధశిల్ప వృత్తులకు సంబంధించిన కులాలపుట్టుక వివరాలనూ, ప్రకృతి, గణేశ ఖండాల్లో, దేవి, గణేశ దేవతలకు సంబంధిం చిన కథలూ, కృష్ణ జన్మ ఖండంలో రాధా కృష్ణుల; గోపికా కృష్ణుల లీలలు కృష్ణమాహాత్మ్యం, కృష్ణస్తోత్రాలూ వర్ణింపబడినాయి. *[V.P. XI]*

బ్రహ్మాండ పురాణం :—

"యచ్చబ్రహ్మాండ మాహాత్మ్య మధికృత్యాబ్రవీత్ పునః
తచ్చద్వాదశ సహస్రం బ్రహ్మాండం ద్విశతాధికం
భవిష్యాణాంచ కల్పానాం శ్రూయతే యత్ర విస్తరః
తద్బ్రహ్మాండ పురాణాంచ బ్రహ్మణా సముదాహృతం"

బ్రహ్మాండ పురాణంలో బ్రహ్మ అండం యొక్క మహాత్మ్యాన్ని వివ రించాడు. ఇందులో 12200 శ్లోకాలున్నాయి. రాబోవు కల్పాలను గురించి ఈ పురాణంలో బ్రహ్మ వివరంగా చెప్పాడు. అనేక మహాత్మ్యాలతోనూ,

వివిధాలైన ఖండాలతోనూ కూడుకున్నదీ పురాణం. ఇది చాల వరకు స్కాందపురాణాన్ని అనుసరించినట్లు విషయ పరిశీలనలవల్ల తెలుస్తున్నది.

ఈ పురాణ ప్రతుల గురించి విల్సన్‌గారు యీ విధంగా పేర్కొన్నారు. "బ్రహ్మాండ పురాణం రెండు భాగాలుగా దొరికింది. మొదటి భాగంలో 124 అధ్యాయాలూ, రెండవ భాగంలో 78 అధ్యాయాలూ ఉన్నాయి. ఈ పురాణంలోని మొదటి భాగానికి వాయు పురాణానికి చాల పోలికలున్నాయి. ఈ భాగాన్ని పరిశీలిస్తే "ఇతి వాయుపురాణె" అనె ఉండవల్సింది, "ఇతి బ్రహ్మాండ పురాణె" అని ఉందా? అన్నంత దగ్గర పోలికలున్నాయి. రెండవ భాగం మాత్రం వాయు పురాణంతో ఎటువంటి పోలికలు లేక స్వతంత్రమైందిగా ఉంది. అగస్త్య మహర్షి కంచికి పోవుట. అచ్చట హయగ్రీవ రూపంలో విష్ణువు ప్రత్యక్షమగుట. వారి సంభాషణలో వచ్చిన మోక్ష ప్రసక్తి. పరాశక్తిపూజ దుర్గ అవతారమైన లలితాదేవి కథ. భాండాసుర వధ. లలితాదేవి పూజా విధానం. ఇత్యాదు లిందు వర్ణింపబడ్డాయి కాబట్టి, ఇవి శాక్తేయులు కూర్చిన కథలుగా విల్సన్ అభిప్రాయపడినాడు. బ్రహ్మాండ పురాణంలోని రెండో భాగం దక్షిణ భారత దేశంలో సంహితగా పరిగణింప బడుతుంది.

*[V. P. lii]*

బ్రహ్మోత్తర పురాణం :–

"బ్రహ్మణాభి హితం పూర్వం యావన్మాత్రం మరీచమే
బ్రహ్మంతు దశ సాహస్రం పురాణం పరి కీర్తితం"

మరీచికి బ్రహ్మ యీ పురాణాన్ని చెప్పాడు. ఇందులో 10 వేల శ్లోకాలున్నట్లు పై శ్లోకంలో చెప్పబడంది. కాని ప్రస్తుతం దొరుకుతున్న ప్రతుల్లో 7 లేదా 8 వేల శ్లోకాలు మాత్రమే కనబడుతున్నాయి. ఆది పురాణంగా పేర్కొనబడుతున్న బ్రహ్మ పురాణానికి అనుబంధంగానే చెప్ప బడిందే బ్రహ్మోత్తర పురాణం.

ఈ పురాణంలో మొదట సృష్టిక్రమాన్ని గూర్చిన వర్ణనలూ, మన్వంతరాలు, సూర్య చంద్ర వంశాలు, వారి రాజ్యాలను గురించిన వర్ణనలూ ఉన్నాయి. తరువాత ఒరిస్సాలోని పవిత్రమైన సూర్య, శైవ దేవాలయాలను, వనాలను గురించిన వర్ణనలు అధికంగా కనిపిస్తాయి.

ఈ పురాణంలోని విషయాలను పరిశీలించినట్లైతే క్రీ. శ. 13, 14 శతాబ్దాల మధ్య యీ పురాణం రచింపబడినట్లుగా భావించడానికి వీలున్నది. హంసవింశతిలో ఈ పురాణం బ్రహ్మోత్తర ఖండమని పేర్కొనబడింది. *[V.P. XV].*

భవిష్య పురాణం :_

యత్రాధి కృత్య మాహాత్మ్య మాదిత్యస్య చతుర్ముఖః
అఘోర కల్ప వృత్తాంత ప్రసంగేన జగత్ స్థితం
మనవే కథయా మాస భూత గ్రామస్య లక్షణం
చతుర్దశ సహస్రాని తథా పంచశతాని చ
భవిష్యం చరితప్రాయం భవిష్యం తదిహోచ్యతే''

బ్రహ్మ మనువుకు అఘోరకల్ప వృత్తాంతాన్ని గూర్చి చెప్పే సందర్భంలో, ప్రపంచ స్థితిగతుల, సకల జీవరాశుల, ప్రవృత్తుల, భవిష్యత్తుకు సంబంధించిన విషయాలు వివరింపబడ్డాయి. అదే భవిష్యత్పురాణం. (దీనికి మరో పేరు భవిష్య పురాణం). దీనిలోని శ్లోక సంఖ్య 14500 లుగా చెప్పబడింది.

ఈ పురాణానికి సంబంధించిన ప్రతులు రెండు విధాలుగా దొరుకుతున్నాయి. 7000 శ్లోకాలుగల భవిష్యత్పురాణం ఒకటి. రెండవ భవిష్యోత్తర పురాణం లో కూడ 7000 శ్లోకాలే వున్నాయి.

భవిష్యత్పురాణంలో 126 చిన్నచిన్న అధ్యాయా లున్నాయి. మొదట ఈ పురాణంలో సృష్టిని గురించి వర్ణింపబడింది. ఆ తరువాత మత సంబంధమైన కర్మ కాండలు, వివిధాలైన ఆశ్రమాలు కులాలు, కులవృత్తులు, వ్రతాలు, ఉపవాస నియమాలూ మొదలైన ఎన్నో విషయాలు వివరింపబడ్డాయి. మహాభారత మందలి చ్యవన మహర్షి కథ, నాగపంచమి మొదలైన కథలూ ఇందులో ఉన్నాయి. కృష్ణ, సాంబుల సంభాషణ సుదీర్ఘంగా ఇందులో చోటుచేసుకొన్నది. చివరి అధ్యాయంలో సూర్య ఆరాధకులైన మాగుల ప్రస్తావన కూడా ఉంది. ఇచ్చట "మాఘ" అను పర్షియన్ శబ్దంతో అగ్నిని ఆరాధించే ఇరానీయనులను కూడా ప్రస్తావించడం జరిగింది.

భవిష్యోత్తర పురాణం కూడా దీనికి సంబంధించిందేనని పండితాభిప్రాయం. ఈ పురాణాన్ని కృష్ణుడు ధర్మరాజుకు చెప్పినట్లుంది. దీనిలో కూడ చాలా వరకు వ్రతాలనూ, కర్మకాండలను గూర్చి, రథోత్సవం, మదనోత్సవం మొదలైన పండుగల గూర్చి వర్ణనలున్నాయి. కామ దహన కథలూ చెప్పబడ్డాయి. దీనిలోని ఉత్సవ విశేషాలను పరిశీలిస్తే, మహమ్మదీయుల పరిపాలనకు పూర్వం మన దేశ ప్రజల స్థితి గతులు, వారి ఆచార వ్యవహారాలు ఎలా ఉండేవో చక్కగా తెలుస్తాయి. అంటే ఈ పురాణం అనాటి సమకాలీన జీవిత విధానానికి అద్దం లాంటిదని చెప్ప వచ్చును. *(V.P- Int duction).*

భాగవత పురాణం :- శుకమహర్షి పరీక్షిత్తునకు చెప్పిన భాగవత పురాణాన్ని నైమిశారణ్యంలో సూతుడు ఋషులకు వినిపించాడు.

"యత్రాధి కృత్య గాయత్రీం వర్ణ్యతే ధర్మ విస్తరః
వృత్రాసురవధో పేతం తత్భాగవత ముచ్యతే!
సారస్వతస్య కల్పస్యమధ్యేయే స్యుర్నరామరః
తద్వృత్తాంతోద్భవం లోకే తద్భాగవతముచ్యతే
అష్టాదశ సహస్రాణి పురాణం తత్ప్రకీర్తితం"

భాగవత పురాణంలో "గాయత్రి"లోని ధర్మాలు విస్తృతంగా వివరింపబడ్డాయి. వృత్రాసుర వధ, సరస్వతి కల్పంలో నరుల-అమరుల వృత్తాంతాలు వర్ణించబడ్డాయి. దీనిలోని శ్లోక సంఖ్య 18000.

ఈ పురాణం 12 స్కందాలుగానూ, 332 అధ్యాయాలు గానూ విభజింపబడింది. ఇందులో కూడ అన్ని పురాణాల్లోలాగే సృష్టిక్రమం విపులంగా వర్ణింపబడింది. సాంఖ్యాది సిద్ధాంతాలు ఇందులో చోటు చేసుకొన్నాయి. 3వ స్కందంలో బ్రహ్మసృష్టిని గూర్చిన వివరాలున్నాయి. తరువాత స్కంధంలో మన్వంతరాలు వర్ణించబడ్డాయి. 5వ స్కంధంలో మన్వంతరాలతో పాటు బ్రహ్మాండ వర్ణన చేయబడింది. 6వ స్కంధంలో విష్ణుమాహాత్మ్యాన్ని తెలిపే అనేకకథలున్నాయి. 7వస్కంధం ముఖ్యంగా ప్రహ్లాద చరిత్రను తెలుపుచున్నది. 8వ స్కంధంలో క్షీరసాగర మథనం మత్స్యావతార గాథలూ, 9వ స్కంధంలో సూర్య చంద్ర వంశాల రాజుల

చరిత్రలూ, 10వ స్కంధంలో అతిప్రసిద్ధికెక్కిన కృష్ణావతార గాథలూ, 11వ స్కంధంలో యాదవుల నాశనం, కృష్ణుని మరణం, కృష్ణుడు ఉద్ధవునకు యోగ విద్యను తెలుపుట. మొదలైన విషయాలు వర్ణింపబడినాయి, 12వ స్కంధంలో కలియుగంలోని రాజుల చరితం, పరీక్షిత్తు మరణం, జనమేజయుని సర్పయాగం మొదలైన విశేషాలు చోటుచేసుకొన్నాయి.

అష్టాదశ పురాణాల్లో కొందరు శ్రీ భాగవతానికి స్థానం కల్పిస్తే, మరి కొందరు దేవీ భాగవతానికి స్థానం కల్పించారు. ఈ విషయంలో పండితుల్లో అభిప్రాయ భేదాలున్నాయి, *(V.P. XXIV)*

ఇచ్చట అత్యంత ప్రచారంలోనున్న శ్రీ భాగవతాన్నే తీసుకొని అందలి విషయాలే సంక్షిప్తంగా వివరించడం జరిగింది. ఈ భాగవత పురాణాన్ని సహృదయ హృదయావర్జకంగా పోతన ఆంధ్రీకరించాడు.

మత్స్య పురాణం :-

శ్రుతీనాం యత్ర కల్పాదౌ ప్రవృత్త్యర్థం జనార్దనః
మత్స్యరూపేణ మనవే నరసింహస్య వర్ణనం
అధికృత్యాబ్రవీత్ సప్త కల్ప వృత్తం మునివ్రతాః
తన్మాత్స్యమితి జానీధ్వం సహస్రాణ్యథ వింశతిః.

వేదాలను రక్షించేందుకై కల్పారంభంలో విష్ణువు మత్స్యరూపాన్ని దాల్చి, మనువుకు నరసింహుని కథ, సప్త కల్పాల వృత్తాంతం చెప్పిందే మత్స్యపురాణం. ఈ పురాణంలో 20 వేల శ్లోకాలున్నాయని పై శ్లోకం వల్ల తెలుస్తుంది. ఇప్పుడు దొరుకుతున్న ప్రతుల్లో 14 లేదా 15 వేల శ్లోకాలకన్నా ఎక్కువగా లేవు.

ప్రళయం ప్రపంచాన్ని ముంచి వేసినప్పుడు మత్స్యరూపంలోనున్న విష్ణువు మనువు ఉన్న పడవను తన కొమ్ముకు తగిలించుకొని సురక్షిత ప్రదేశానికి తీసుకొని పోతున్న సందర్భంలో మనువుకు-మత్స్య రూపంలో ఉన్న విష్ణువుకు జరిగిన సంభాషణే ఈ పురాణంలో ఎక్కువ భాగం ఆక్రమించుకొంది. మొదటి అధ్యాయాల్లో సృష్టిక్రమం, కర్మకాండలు, రాజవంశాల గూర్చిన వర్ణనలు, సంసారిక ధర్మాలను గూర్చిన వర్ణనలు ఉన్నాయి.

తరువాత అధ్యాయాల్లో శివ సంబంధమైన త్రిపురాసుర సంహారం గిరిజా కళ్యాణం, కుమార సంభవం, మాయ, అంధకాసురుల సంహారం, విష్ణు అవతారాల వర్ణనలు, నర్మదా మొదలైన స్థలమాహాత్మ్యాలు, భవిష్యత్తులో రాబోవు రాజుల వర్ణనలు ఈ పురాణంలో ప్రధానంగా కనిపిస్తాయి.

మార్కండేయ పురాణం:-

యత్రాధికృత్య శకునీన్ ధర్మాధర్మ విచారణామ్
వ్యాఖ్యాతం యద్ముని ప్రశ్నే ఋషిభిః ధర్మచారిభిః
మార్కండేయేన కథితం తత్సర్వ విస్తరేణతు
పురాణం నవసాహస్రం మార్కండేయ మిత్యుచ్యతే.

మార్కండేయ పురాణం ధర్మపక్షుల కథతో ప్రారంభమౌతుంది. మార్కండేయుడు తాను ధర్మాచారపరులైన ఋషుల వలన విన్న విషయాలను ఈ పురాణంలో వివరంగా చెప్పాడు. ఇందులో 9 వేల శ్లోకాలున్నాయి.

జైమిని ముని మార్కండేయుని ఆజ్ఞానుసారం పింగాక్షం, నిబోధం సుపత్రం, సుఖం అనే పక్షులను ఈ దిగువ ప్రశ్నలడుగుతాడు.

1. వాసుదేవుడు ఎందుకు మానవుడుగా అవతరించాడు?
2. ద్రౌపది పంచ పాండవులకు భార్యగా ఎందుకు కావలసి వచ్చింది?
3. బలరాముడెందుకు తపమాచరించాడు?
4. కృష్ణార్జునుల రక్షణ – అండ వుండి కూడ ఉపపాండవులు ఎందుకు చంపబడ్డారు?

ఈ ప్రశ్నలకు సమాధానంగా చెప్పబడిన కథలే ఎక్కువ భాగం మార్కండేయ పురాణంలో ఉన్నాయి. కావున యీ పురాణాన్ని ఒక విధంగా మహాభారతానికి అనుబంధమని భావించడానికి ఆస్కారం ఉంది.

ఇంకా ఈ పురాణంలో వృత్రాసుర వధ, బలరాముని తపస్సు, హరిశ్చంద్రోపాఖ్యానం, స్వాయంభువ మన్వంతర కాలంలో ప్రపంచ పరిస్థితులు, వైవస్వతమన్వంతరం, మిగిలిన మన్వంతరాలు, దుర్గాదేవి

మహిమ, విజయాలు మొదలైన కథా విశేషాలెన్నో వర్ణించ బడ్డాయి. మన్వంతరాల వర్ణన తరువాత వైవస్వత మనువు వంశక్రమం, నరిష్యంతుని కుమారుడు దాముని వరకు వర్ణింపబడింది. ఈ పురాణంలో దుర్గా మాహాత్మ్యం ఎక్కువగా వర్ణింపబడి ఉండడంతో ఆయాఘట్టాలు ప్రతిదినం బెంగాలు లోని దుర్గాలయాల్లో నేటికి పఠింపబడుతున్నాయి.

మార్కండేయ పురాణాన్ని అష్టాదశ పురాణాల్లో మొదటిదిగా పండితులు భావిస్తున్నారు. కాబట్టి ఇది మహాభారత కాలం నాటిదై ఉంటుందని ఊహించ వచ్చును. *(V.P. XXXII)*.

లింగ పురాణం :-

"యత్రాగ్నిలింగ మధ్యస్థః ప్రాహదేవో మహేశ్వరః
ధర్మార్థ కామమోక్షార్థ మాగ్నేయ మధికృత్యచ
కల్పాంతం లైంగమిత్యుక్తం పురాణం బ్రహ్మణా స్వయం
తదేకాదశ సాహస్రమితి...... ....".

అగ్నిలింగా (మహేశ్వరుడు) ప్రత్యక్షమై, అగ్ని కల్పాంతంలో ధర్మార్థ కామ మోక్షాలుండే విధానాన్ని వివరించాడు. ఇందులో 11 వేల శ్లోకాలున్నాయి. బ్రహ్మదేవుడే స్వయంగా దీనికి లింగ పురాణం అని పేరు పెట్టాడని పై శ్లోకం వల్ల తెలుస్తుంది.

ఈ పురాణంలో మొదట సృష్టిక్రమం, మనువులు, మన్వంతరాలు వర్ణించ బడినాయి. శివుని అవతారాలను సంక్షిప్తంగా వర్ణించారు. ఎవరు గొప్ప అనే విషయంలో బ్రహ్మ విష్ణువుల మధ్య వివాదం వచ్చింది. అప్పుడు వారి మధ్య అగ్నిలింగం ఏర్పడింది. దాని ఆది అంతాలు తెలుసుకొనేందుకై బ్రహ్మ విష్ణువులు ఒకరు క్రిందికి, మరొకరు పైకి కొన్ని వేల సంవత్సరాలు ప్రయాణం చేశారు. కాని వారికి అగ్నిలింగం యొక్క ఆద్యంతాలు అంతుదొరక లేదు. లింగం పై భాగంలో "ఓం" అనే అక్షర కనిపించింది. దాని నుండే వేదాలు పుట్టాయి. బ్రహ్మ విష్ణువులు శివుని మాహాత్మ్యాన్ని తెలుసుకొన్నారు.

తరువాత ఈ పురాణంలో పద్మకల్పాన్ని గూర్చిన వివరాలు ప్రస్తా

విష్ణువులు శివుని స్తుతించుట, శివుని 28 అవతారాలను గూర్చిన కథలు ఉన్నాయి. భాగవతంలో అంబరీషో పాఖ్యానం వలె ఇందులో శివభక్తుడైన దధీచి కథ ఉంది.

కృష్ణుని కాలంలో వైవస్వత మన్వంతరం లోని అనేక రాజవంశాల వర్ణనలు అనేక అధ్యాయాల్లో వర్ణించ బడినాయి. విల్సన్‌గారు ఈ పురాణం క్రీ.శ. 8, 9 శతాబ్దాల మధ్య కూర్చబడినదిగా అభిప్రాయ పడినారు. *(V.P. - XLI)*.

వరాహ పురాణం :-

"మహ వరాహస్య పునర్మాహాత్మ్య మధికృత్యచ
విష్ణునాభిహితం క్షోణ్యైత ద్వారాహమిత్యుచ్యతే
మానవస్య ప్రసంగేన కల్పస్యముని సత్తమాః
చతుర్వింశత్సహస్రాణి తత్పురాణ మిహోచ్యతే".

మానవ కల్పప్రసంగంలో, విష్ణువు మహావరాహ అవతారమెత్తి భూమిని ఉద్ధరించుట, వరాహం యొక్క మాహాత్మ్యాలు వరాహపురాణంలో వర్ణించ బడినట్లు, ఇందులో 24 వేల శ్లోకాలున్నట్లు పై శ్లోకం వల్ల తెలుస్తుంది. కాని నేడు దొరుకుతున్న ప్రతుల్లో 10 వేల శ్లోకాలు మాత్రమే ఉన్నాయి.

ఈ పురాణంలో ప్రపంచ సృష్టి, రాజవంశాల వర్ణనలు చెదురుమదురుగా ఉన్నాయి. మనువుల మన్వంతరాల వర్ణనలు లేవు. లింగ పురాణం వలె ఇదికూడ మత సంబంధమైనదే. ఈ పురాణంలో విష్ణు స్తోత్రాలు, విష్ణు మాహాత్మ్యం తెలిపే కథలు, వైష్ణవ తీర్థస్థలాలను గూర్చిన విషయాలు అధికంగా ఉన్నాయి. మధురా మాహాత్మ్యం పేర ఆ నగర విశేషాలు వివరంగా వర్ణించ బడ్డాయి. లింగపురాణంలో శైవానికి సంబంధించిన విషయాలు ఎక్కువగా ఉన్నట్లే, దీనిలో వైష్ణవ సంబంధమైన విషయాలు ఎక్కువగా ఉండడం వల్ల ఇది మతపరమైన పురాణమని చెప్పవచ్చును. వైష్ణవ మతసంబంధమైన ఈ పురాణం రామానుజాచార్యుల కాలం (క్రీ.శ. 12వ శతాబ్దం)లో రచించి యుండునని విల్సన్ గారి అభిప్రాయం *(V.P XI iii)*.

వామన పురాణం :-

"త్రివిక్రమస్య మాహాత్మ్యమధికృత్య చతుర్ముఖః
త్రివర్గ మభ్యధాత్తచ్చ వామనం పరికీర్తితం
పురాణం దశసాహస్రం కల్పానుగం శివం".

బ్రహ్మ, త్రివిక్రమ మాహాత్మ్యాన్ని, త్రివర్గాలనూ, శివకల్పాన్ని గూర్చి వివరించిందే వామన పురాణం. దీనిలో 10 వేల శ్లోకాలున్నాయి.

ఈ పురాణంలో పులస్త్య నారదుల సంభాషణ సందర్భంగా లింగ పూజా విధానాన్ని గూర్చి చెప్పబడింది. వైష్ణవ పురాణాల్లో అనుసరించిన కొత్త పద్ధతి ఇది. ఈ పురాణంలో స్థల మాహాత్మ్యాల వర్ణనలు అధికంగా ఉన్నాయి. దక్షయజ్ఞం, శివుడు కాశీ సమీపంలో గల పాపమోచన తీర్థానికి పోవుట, కేదారేశ్వరం, స్థాణుతీర్థం, గోదావరి పవిత్రత మొదలైన విషయాలు ఈ పురాణంలో విపులంగా వివరించ బడ్డాయి.

సృష్టిక్రమం, మన్వంతరాలు మాత్రం ఈ పురాణంలో చాలా కొద్దిగా ఉన్నాయి. రాక్షసుల రాజైన బలిచక్రవర్తి, అతని కాలంలోని విశ్వవర్ణన, విష్ణువు వామనావతరం ఎత్తుట, మొదలైన ఘట్టాలు వర్ణించ బడ్డాయి. పురాణం చివరిలో స్వారోచిష మన్వంతారాన్ని గూర్చి చెప్ప బడింది. హరిహరులకు సమానమైన ప్రతిపత్తి కల్గించి వారి మాహాత్మ్యాలను గూర్చి వర్ణించడం ఈ పురాణ మందలి ప్రత్యేకత. *[V.P.-Xlvi]*

వాయు పురాణం :-

శ్వేతకల్ప ప్రసంగంలో వాయువు చెప్పిన ధర్మాలు, శివమాహాత్మ్యం మొదలైన వాటితో కూడుకొని వాయుపురాణం 24 వేల శ్లోకాలతో కూడి ఉన్నట్లు ఈ క్రింది శ్లోకం వల్ల తెలుస్తుంది.

"శ్వేతకల్ప ప్రసంగేన ధర్మాన్ వాయురిహాబ్రవీత్
యత్రైత ద్వాయువీయం స్యాద్రుద్ర మాహాత్మ్య సంయుతం
చతుర్వింశత్సహస్రాణి పురాణం తదిహోచ్యతే".

అష్టాదశ పురాణాల్లో వాయుపు రాణానికి బదులు కొన్నిచోట్ల

శివపురాణాన్ని పేర్కొనడం జరిగింది. పశ్చిమ భారతంలో శివపురాణం ఉపపురాణంగా పరిగణింప బడుతుందని వన్స్‌కెన్నడీ అభిప్రాయం.

వాయువు చెప్పిన ఈ పురాణాన్ని సూతుడు నైమిశారణ్యంలో ఋషులకు చెప్పినట్లు తెలుపబడింది ప్రక్రియ, ఉపోద్ఘాతం, అనుషంగం, ఉపసంహారం అని నాల్గు విధాలుగా ఈ పురాణం విభజింపబడి ఉంది.

ప్రక్రియ విభాగంలో సృష్టికి సంబంధించిన వర్ణనలున్నాయి. ఉపోద్ఘాతంలో 33 కల్పాల వర్ణనలు, నీలకంఠస్తోత్రం, దక్షయజ్ఞం, మహేశ్వర మాహాత్మ్యం మొదలైన విషయాన్నాయి. అనుషంగమనే విభాగంలో సప్తర్షులు, శ్రాద్ధకల్పం, సూర్యవంశ, చంద్రవంశ వర్ణనలూ చోటు చేసుకొన్నాయి. భవిష్యత్ మన్వంతరం యోగ మాహాత్మ్యాలను గూర్చిన వర్ణనలు ఉపసంహారంలో ఉన్నాయి. *(V.P.- XX1).*

విష్ణుపురాణం :–

విష్ణుపురాణం అష్టాదశ పురాణాల వరుసక్రమంలో మూడవది. పరాశరుడు వరాహకల్పాన్నిగూర్చి వివరించిన విషయాలు ఈ పురాణంలో ఉన్నాయి. ఇందులో శ్లోకాలు 23 వేలదాక ఉన్నట్లు ఈ క్రింది శ్లోకం వల్ల తెలుస్తుంది.

వరాహకల్ప వృత్తాంత మధికృత్య పరాశరః
యత్ప్రాహధర్మానఖిలాన్ తదుక్తం వైష్ణవం విదుః
త్రయో వింశతి సాహస్రం తత్ప్రమాణం విదుర్బుధాః

*[V P.-XXI]*

విష్ణుపురాణం ఆరు ఖండాలుగా విభజింపబడింది. మొదటి ఖండంలో 22 అధ్యాయాలున్నాయి.. నారాయణుడు కల్పారంభంలో కనిపించుట, సృష్టి, నాలుగువర్ణాలు వారి విధులు, ధ్రువుని చరిత్ర, ప్రహ్లాద చరిత్ర, మొదలైనవి మొదటి ఖండంలో వర్ణించ బడ్డాయి.

రెండవ ఖండంలో 16 అధ్యాయాలున్నాయి. భౌగోళిక వర్ణన, ఏడు ద్వీపాలు, ఏడుసముద్రాలు, మేరుపర్వతం, సరస్సులు, వనాలు, భారతవర్షాదులు, గ్రహాలు భరతుని చరిత్ర మొదలైన విషయవర్ణనలు రెండవ ఖండంలో ఉన్నాయి.

మనువులు, మన్వంతరాలు, వేదవిభాగాలు, శ్రాద్ధకర్మలు, బుద్ధావతారం మొదలైనవి మూడవఖండంలో వర్ణించబడ్డాయి. ఇందులో 18 అధ్యాయాలున్నాయి.

నాల్గవ ఖండంలో 24 అధ్యాయాలున్నాయి. సూర్యవంశ, చంద్రవంశ రాజుల చరిత్రలు ఇందులో అధికంగా కనిపిస్తాయి. మిధిల రాజుల చరిత్రలు, పురూరవుడు, తుర్వసు, ద్రుహ్యు, కురు మొనలైనవారి చరిత్రలూ, మగధరాజులు, మౌర్యులు, నవనందనలను గూర్చిన విషయాలు నాల్గవ ఖండంలో విపులంగా ఉన్నాయి.

ఐదవ ఖండం చాల పెద్దది. ఇందులో 38 అధ్యాయాలున్నాయి. కృష్ణుని పుట్టుక మొదలు నిర్యాణం వరకూ సాగిన కృష్ణుని జీవిత చరిత్ర ఇందులో విపులంగా వివరించబడింది.

ఎనిమిది అధ్యాయాలు మాత్రమేఉన్న ఆరోఖండంలో ప్రళయం - కలియుగంలోని మానవులు, విష్ణుభక్తి ఇత్యాదులు వర్ణించబడినాయి. *[V.P. - Contents].*

స్కాంద పురాణం :-

యత్రమాహేశ్వరాన్ ధర్మానధి కృత చ షణ్ముఖః
కల్పేతత్పురుషేవృత్తం చరితైరుప బృంహితం
స్కాంద నామపురాణంచ ఏకాశీతిర్నిగద్యతే
సహస్రాణి శతంచైక మితిమర్త్యేషు కథ్యతే.

మహేశ్వరుడు కుమారస్వామికి (స్కందుడు) తత్పురుష కల్పంలో నూరు ధర్మాలను, విధులను గూర్చి వివరంగా చెప్పిన విషయాలతో కూడిందే స్కాంద పురాణమని దీంట్లో 81100 శ్లోకాలున్నాయని, పై శ్లోకం ద్వారా తెలుస్తున్నది.

ఈ పురాణం సంహితలతో, ఖండాలతో, మాహాత్మ్యలతో నిండి ఉంది. కాశీఖండం ఒక్కటే 15 వేల శ్లోకాల్లో వర్ణింపబడింది. ఈ పురాణములో ఇది చాల ముఖ్యమైంది. ఈ ఖండం ఘజనీమహమ్మద్ కాశీ మీదికి మొదటిసారి దండయాత్ర చేసిన కాలంలో వ్రాయబడిందని విల్సన్

అభిప్రాయం. ఉత్కళ ఖండంలో ఒరిస్సా ప్రాంతం దాని పవిత్రత, జగన్నాథ క్షేత్ర మాహాత్మ్యం వర్ణించబడినాయి. అవికాక బ్రహ్మోత్తర ఖండం, రేవాఖండం, శివరహస్యఖండం, హిమవత్ ఖండం మొదలైనవి ఈ పురాణంలో ఉన్నాయి.

స్కాందపురాణంలో ఉన్న సంహితల్లో - సూత, సనత్కుమార, సౌర, కపిల సంహితలు ప్రధానమైనవి. ఇంకా అనేకమైన సంహితలు ఉన్నాయి. సి.పి. బ్రౌన్ సంపాదించిన స్కాందపురాణ ప్రతిలో ఏడు సంహితలు, పన్నెండు ఖండాలు ఉన్నట్లు తెలుస్తున్నది. మెకంజి సమకూర్చిన స్కాందపురాణ ప్రతిలో 36 మాహాత్మ్యాలు ఉన్నట్లు పేర్కొన్నారు. *[V.P. - Xliv]*.

## అష్టాదశ సంహితలనే స్మృతులు

వేదసంహితలు, వాజస్నేయ సంహిత, కథాసంహిత, కపిత్యల కథాసంహిత, తైత్తరీయ సంహిత కాలప సంహిత-ఇలా అనేక విధాలైన సంహితలు కనిపిస్తున్నాయి. (*H.S L. 2, 3*) అదేవిధంగా ఆయుర్వేద ములో చరకసంహిత, జ్యోతిషంలో గర్గసంహిత మొదలైన శాస్త్ర సంహితలూ ఉన్నాయి.

శబ్దకల్పద్రుమం ధర్మశాస్త్రాలైన స్మృతులను ధర్మసంహితలంటారని అమరంలో చెప్పబడినట్లు పేర్కొంది. *[S.K.D II - 787]* హంస వింశతిలో కవి అష్టాదశ సంహితలనే స్మృతులు అని పేర్కొన్నాడు. కాబట్టి ధర్మసంహితలను స్మృతులుగానే స్వీకరించవలసి ఉంది. కవి పేర్కొన్న సంహితల పేర్లుకూడా ఈ స్మృతిగ్రంథాలకే సరిపోతున్నాయి

ధర్మసంహితలైన ఈ స్మృతులు వేద విజ్ఞేయాలైన ధర్మశాస్త్రాలను వివరిస్తున్నాయి. "శ్రుతస్తు వేదోవిజ్ఞేయో ధర్మశాస్త్రంతు వైస్మృతిః" అని మనుస్మృతి చెప్తుంది.

ఈ ధర్మసంహితలన్నీ కల్పసూత్రాలపై అధారపడి వ్రాయబడినవి. ప్రతి ధర్మశాస్త్ర గ్రంథం ఆచారధర్మం, వ్యవహారధర్మం, ప్రాయశ్చిత్త ధర్మం, కర్మఫలం అనే నాలుగు విధాలైన ధర్మాలను గురించి తెలియపరుస్తుంది.

ధర్మశాస్త్రాల సంఖ్య విషయంలో అభిప్రాయ భేదాలున్నాయి. కొందరు వీటిని అష్టాదశ స్మృతులన్నారు. హంసవింశతి, వాణీవిలాస వనమాలిక గ్రంథాల్లో వీటి సంఖ్య పదునెనిమిదిగానే పేర్కొనబడింది. కాని వాటిపేర్లలో మాత్రం భేదాలు కనిపిస్తున్నాయి.

"మనుకాత్యాయన విష్ణుదక్షగురుయామ్యంబుల్ తగన్ గౌతమం
బునుశాత్యాయన యాజ్ఞవల్క్య హరితంబుల్ వ్యాసవాసిష్ఠశో
భన సంవర్తన పరాశరాత్రిలస దాపస్తంబుల్ భార్గవం
బనగా మేల్ స్మృతులొప్పు శంఖలిఖితాఖ్యన్‌గూడి పద్దెన్మిదై"
(వా.వి.వ.మా. పుట 12)

హంసవింశతిలో వాసిష్ఠ, శౌనక, గౌతమ, గాలవ, వారుణ, మహేశ్వర, బ్రాహ్మ, బౌద్ధాయన, భృగు, గురు, ఆత్రేయ, నారద, పారాశర, భారద్వాజ, విశ్వామిత్ర, రురు, మృకండు, రైభ్య అని అష్టాదశస్మృతుల పేర్లను కవి పేర్కొన్నాడు. (3-128).

మరికొన్ని చోట్ల ఈ క్రింది స్మృతులు పేర్కొన బడినాయి. గౌతమ బౌద్ధాయన, ఆపస్తంబ, వాసిష్ఠ, విష్ణు, హరిత, శంఖ లిఖిత, వైఖానస, ఔశాన, కాశ్యప, బృహస్పతి, యాజ్ఞవల్క్య, పరాశర, నారద, మను స్మృతులు. *[H.S.L -201]*. ఈ విధంగా అష్టాదశ స్మృతులందు పండితుల్లో భేదాభిప్రాయాలు కనిపిస్తున్నాయి. పైన పేర్కొన్న స్మృతులే కాకుండా ఇంకా 152 వరకు స్మృతులుంటాయని పేర్కొనబడింది. *[H.S L. - 202]* హంసవింశతిలో పేర్కొన్న స్మృతిగ్రంథాల్లోని విశేషాంశాలను ఇచ్చట సంక్షిప్తంగా వివరించడం జరిగింది.

గురుసంహిత :-

గురు అంటె బృహస్పతి అనే అర్థం ఉంది. కాబట్టి గురుసంహిత అంటే బృహస్పతిసంహిత అని భావించవచ్చును. హంసవింశతి, వాణీ విలాస వనమాలిక గ్రంథాల్లోనూ, సంస్కృత సాహిత్య చరిత్రల్లోనూ, ఎక్కడ ఈ స్మృతి గ్రంథాల ప్రసక్తి వచ్చినా బృహస్పతి సంహితను పేర్కొనడం జరిగింది. కాబట్టి అష్టాదశ స్మృతుల్లో దీనికి స్పష్టమైన స్థానమున్నట్లు తెలుస్తున్నది.

గురుసంహిత క్రీ.శ. 200 - 400 మధ్యకాలంలో రచింపబడినట్లు పండితుల అభిప్రాయం. ఇది అనేక ఖండాలుగా విభజింపబడింది. బృహస్పతి స్మృతి మనుసంహితకు వ్యాఖ్యానమే అని మరి కొందరూ హించుచున్నారు. *[HIS L. 202]*

గౌతమ సంహిత :- దీనినే గౌతమ ధర్మసూత్రాలంటారు. ఇది మూడు ప్రశ్నల గ్రంధం. దక్షిణ భారతదేశంలో ఈ గ్రంథం ఎక్కువ వ్యాప్తిలో ఉంది. ఇది జన్మచే సామవేదం. కాని ఇందలి విషయాలు సర్వశాఖా సామాన్యమైనవి. ఈ గ్రంథంలోని 26వ అధ్యాయం సామ విధాన బ్రాహ్మణాన్ని అనుసరించడం వల్ల ఈ సూత్రం సామ శాఖీయ మని స్పష్టమౌతున్నది. గౌతమ ధర్మ సూత్రానికి హరదత్తుడు మితాక్షర వ్యాఖ్యను రచించాడు. ఇందలి లౌకిక ధర్మాలు హిందూ కోడ్‌లో ఉదహరింపబడినాయి. (సం. వి. కో॥ 556).

నారద సంహిత :-

నారద స్మృతి కీ. శ. 100-300 మధ్య కాలంలో రచింపబడినట్లు తెలుస్తుంది. ఇది రెండు రకాలుగా ఈనాడు దొరుకుతుంది. అవి సంక్షిప్త గ్రంథం, విస్తృత గ్రంథం. క్రీ. శ. 650లో వున్న బాణుడు యీ గ్రంథాన్ని ప్రస్తావించాడు. *(H.S.L. 202).*

పరాశర సంహిత :-

ఈనాడు పరాశర సంహిత సంక్షిప్త రూపం మాత్రమే దొరుకుతుంది. విస్తృత గ్రంథం దొరుకుటలేదు. క్రీ శ. 1297-1386 ప్రాంతంలో మాధవాచార్యుడు పరాశర స్మృతి సంక్షిప్త గ్రంథానికి పరాశర మాధవీయం అనే పేర వ్యాఖ్యాన గ్రంథాన్ని రచించాడు. పరాశర స్మృతిని క్రీ.శ. 100-500 మధ్య కాలంలో రచించి ఉంటారని పండితులూహించుచున్నారు. *(H.S L. 202).*

బౌద్ధాయన సంహిత :-

ఈ సంహితకు బౌద్ధాయన ధర్మసూత్రం అని పేరు. ఇది నాలుగు ప్రశ్నల గ్రంథం. ఈ గ్రంథంలోని విభాగాలను అధ్యాయాలంటారు. గోవిందస్వామి బౌద్ధాయన స్మృతికి వ్యాఖ్యానాన్ని రచించాడు. "ఇతర

శాఖలవారు బౌద్ధాయనాన్ని అనుసరించిన ఎడల స్వసూత్రాన్ని అనుస రించినట్లౌతుంది" అని వృద్ధ మనువు చెప్పడం వల్ల, బౌద్ధాయన స్మృతి, స్మృతుల్లోకెల్ల ప్రమాణమైందని పండితాభిప్రాయం.

బ్రాహ్మ్య సహింత :-

దీనినే బ్రహ్మసూత్రాలని కూడ అంటారు. బ్రహ్మ సూత్రాలంటే బ్రహ్మ స్వరూపాన్ని నిర్వచించేవని అర్థం. బాదరాయణుడు బ్రహ్మ స్వరూపాన్ని నిర్వచించడానికై వేదాంత సూత్రాలని పిలువబడుతున్న బ్రహ్మసూత్రాలను రచించాడు. (సం. వి. కో. II 153).

భరద్వాజ సంహిత :-

భరద్వాజ మహర్షిచే రచింపబడిన శ్రౌత సూత్రం. ఇదే భరద్వాజ సంహిత. సప్తర్షులందరూ సూత్ర స్మృతి కర్త లగుట వలన, ఈ గ్రంథం భరద్వాజ కృతం అని వైదిక లోకంలో ఉండే ప్రసిద్ధిని అంగీకరించవలసి ఉంది. కాని గ్రంథరీతి అవిధంగా లేదు. ఇందలి భాగాలు ప్రశ్నల రూపంలోనే ఉన్నాయి. (సం. వి. కో. II 556).

భృగు సంహిత :-

భృగు సంహితనే మనుస్మృతి, లేక మానవ ధర్మ సంహిత అని కూడా అంటారు. ఇప్పుడు దొరుకుతున్న మనుస్మృతి పన్నెండు అధ్యా యాల గ్రంథం. ఈ సంహితను భృగు మహర్షి చెప్పడంవల్లనూ, భృగు మానవ ధర్మ సూత్రాలకు చాల ప్రచారాన్ని కలిగించడం వల్లనూ మనుస్మృతికి భృగు సంహిత అని పేరు వచ్చి ఉంటుంది. నిరుక్తం, భారతం, వాణీ విలాస వనమాలిక మొదలైన గ్రంథాల్లో ఇది మను స్మృతి అనే పేర్కొనబడింది. సృష్టిక్రమంతో ప్రారంభమై వేదాంత విషయాలతో భృగు సంహిత ముగుస్తుంది. ఈ స్మృతి కాలాన్ని నిర్ణ యించడానికి కచ్చితమైన అధారాలేమీ లేవు. భారతదేశంలోనే గాక బర్మా, సయామ్, జావా మొదలైన దేశాల్లో ఈ గ్రంథం బహుళ ప్రచా రాన్ని పొందింది. ఈ స్మృతిని అనుసరించి ఆయా దేశాల్లో ఎన్నో న్యాయ శాస్త్ర గ్రంథాలు వెలువడ్డాయి. దీనికి ఎన్నో వ్యాఖ్యానాలు ఉన్నప్పటికీ, మేధాతిథి, కుల్లూక భట్టు వ్రాసిన వాఖ్యానాలు ప్రముఖ మైనవిగా భావించబడుతున్నాయి. *(H.S.L.202).*

వాసిష్ఠ సంహిత :- ఇది ముప్పై అధ్యాయాల గ్రంథం. దీనిలో మను, హారీత, గౌతమ, ప్రజాపతి, యమ, వసిష్ఠ, కార్తిక, భాల్లవి, వాజస, కాయక మతాలున్నాయి.

ధర్మసూత్రాల్లో ఇది రెండు ప్రశ్నల గ్రంథం. ఈ రెండును శ్రౌత సూత్రంలోని 28, 29 ప్రశ్నలని కొందరు, కాదని కొందరూ అంటున్నారు. ఒక్కొక్క ప్రశ్నకు పదకొండు పటాలున్నాయి. ఈ సూత్రాలు సామయికాచారాలను బోధిస్తున్నాయి. సామయికాచారాలంటే సమయానికి సంబంధించిన ఆచారాలు. సమయమంటే మానవ నిర్మితమైన వ్యవస్థ. అది విధి, నియమ, ప్రతిషేధాలచే మూడు విధాలుగా ఉంటుంది. (సం. వి. కో. II - 553) అంటే మానవ నిర్మితమైన ఈ వ్యవస్థ (సమాజం) లో విధి (ఆచరించవలసినవి) ప్రతిషేధ (ఆచరించగూడనివి) నియమాలకు (ఏర్పాట్లు లేదా కట్టుబాట్లు) సంబంధించిన ధర్మ సూత్రాలనీ సంహిత బోధిస్తుందని చెప్పవచ్చును.

విశ్వామిత్ర సంహిత :-

విశ్వామిత్రుని కౌశికుడని కూడ అంటారు కాబట్టి విశ్వామిత్ర ప్రణీతమైన ఈ గ్రంథానికి కౌశిక సూత్రమని కూడా పేరు. ఇది అధర్వణ శ్రౌత సూత్రాల్లో ఒకటి. అధర్వణ శాఖకు సంబంధించిన మరొకటి వైతాన సూత్రం. కౌశిక సూత్రానికి గాని వైతాన సూత్రానికి గాని వ్యాఖ్యానాలు కనిపించడం లేదు. ఈ రెండు సూత్రాలు యాగ్య క్రియాచరణంలో ప్రమాణాలు. అధర్వణ వేదంలోని మంత్రాలను తీసుకొని ఆయా కర్మలను కౌశిక సూత్రం ప్రతిపాదించింది. దీని తరువాతిదైన వైతాన సూత్రం కౌశిక మతాన్ని ఉదాహరణగా పేర్కొంది.

(సం. వి. కో. II - 558)

అధర్వణ శాఖీయ గృహ్య సూత్రాలకు కూడా కౌశిక సూత్రమనే ప్రసిద్ధి ఉంది. ఈ కౌశిక సూత్రాలు, వివాహాది కర్మకాండలనేగాక అధర్వణ వేదీయాలైన అభిచారి కర్మలను కూడ ప్రతిపాదిస్తున్నాయని మెగ్డానల్ అభిప్రాయం. (సం. వి. కో. II 558).

శౌనక సంహిత :- దీనికే శౌనక సూత్రమని పేరు.

ఋగ్వేద శ్రౌత సూత్ర శాఖకు చెందిన అశ్వలాయన, శాంఖాయన

నిర్మితాలుగా రెండు సూత్రాలు ప్రసిద్ధి పొందాయి. ఈ శాఖకు సంబంధించి శౌనకుడు కూడా ఒక సూత్రాన్ని రచించినట్లు తెలుస్తుంది. కాని అది ఇప్పుడు దొరకడం లేదు. (సం. వి. కో. II 553).

హంస వింశతిలో పేర్కొన్న అష్టాదశ సంహితలనే స్మృతుల్లో కేవలం పదకొండు సంహితలకు మాత్రమే వివరాలు దొరకడంవల్ల వాటిని పైన వివరించడం జరిగింది.

గాలవ, వారుణ, మాహేశ్వర, ఆత్రేయ, రురు, మృకండు, రైభ్య సంహితలు కూడా హంస వింశతిలో స్మృతి గ్రంథాల్లోనే పేర్కొన బడినాయి. కాని ఇవి సంస్కృత సాహిత్య చరిత్రల్లోగాని, భారతం, వాణీవిలాస వనమాలిక మొదలైన గ్రంథాల్లోగాని కనుపించడం లేదు. వీటికి బదులుగా విష్ణు, దక్ష, యాజ్ఞవల్క్యాది స్మృతుల పేర్లు కొన్నిట్లో కనిపిస్తే, హారిత, వైఖానస, ఔశానస, కాశ్యపాది స్మృతుల పేర్లు మరి కొన్నిట్లో కనుపిస్తున్నాయి. అయితే సర్వసాధారణంగా అష్టాదశ స్మృతుల్లో కనిపించే విష్ణు, హరిత, యాజ్ఞవల్క్య, ఆపస్తంబ సూత్రాలు హంస వింశతిలో పేర్కొనక, గాలవ, వారుణాది సంహితలను పేర్కొనడం వల్ల అవి స్మృతి గ్రంథాలో, లేక మరే కోవకైనా చెందిన సంహితలేమో-ఇంకా పరిశీలింపవలసి ఉంది.

## చౌషష్టి విద్యలు

చౌషష్టి (అరవైనాలుగు) విద్యలు మహావిద్యలని, ఉపవిద్యలని రెండు రకాలు. మహావిద్యలు పద్దెనిమిది, ఉపవిద్యలు నలభైఆరు కలిసి అరవైనాలుగు విద్యలౌతున్నాయి. వీటినే చతుష్షష్టి కళలని కూడ వ్యవహరిస్తున్నారు. (ఆం.వా. I ఉ.వి.).

కళ అనగా ఒక విశిష్ట శక్తిస్వరూపం. శాంత్యతీతకళ, శాంతికళ, విద్యాకళ, ప్రతిష్ఠాకళ, నివృత్తికళ అనే ఈ ఐదు కళల్లో ప్రధానమైనవి. కళల లక్ష్యం కళకాదు. ఆత్మస్వరూప సాక్షాత్కారం, పరమతత్త్వాభిము సంపాదించడమే ఉత్తమ కళ లక్ష్యమని తాత్వికుల అభిప్రాయం. (శాంతి - 52, 53).

కళలు అనంతాలని శుక్రాచార్యులు చెప్పారు. అయినా వీటికి

లోకంలో చతుష్షష్టి కళలని ప్రసిద్ధి ఉంది. ఈ చతుష్షష్టి కళల పరిగణనం అన్నిచోట్ల ఒకేవిధంగా లేదు.

లలిత విస్తరం నందలి కళాసూచికలో ఈ కళలు వందవరకు పేర్కొనబడ్డాయి. వాత్స్యాయన కామసూత్రాలకు జయమంగ వ్యాఖ్య ప్రకారం కళలు, అవాంతర కళలతో కలిసి 508 అవుతున్నాయి, శుక్రనీతి సారసూచిలో అరవైనాలుగూ, ప్రబంధకోశ సూచికలో డెబ్బైనాలుగు వరకు, ఈ కళల సంఖ్య కనిపిస్తున్నది. రామాయణ చంపూ ప్రబంధ వ్యాఖ్యలో అరవైనాలుగు కళలు గుర్తింపబడినాయి.

లోకంలో వీటికి చతుష్షష్టి కళలు లేదా చతుష్షష్టివిద్యలు అనే వ్యవహారం ఉన్నా, సంఖ్య విషయంలో భేదాభిప్రాయాలు కనిపిస్తున్నాయి. ఈ కళల సంఖ్యా పరిగణనంలోనేగాక, నామపరిగణనంలో కూడా భేదాలున్నాయి.

కర్మాశ్రయాలైన గీతాదికళలు ఇరవైనాలుగు, ద్యూతాశ్రయాలైన దురోదాది కళలు ఇరవై, శయనోపచారిక కళలు పదహారు, ఉత్తర కళలు నాలుగు అని అరవైనాలుగు కళలను చెప్పి, అవి అవాంతర కళలతో కలిసి మొత్తం 508 వరకూ కళల సంఖ్య పెరుగుతుందని, వాత్స్యాయన కామసూత్రాల వ్యాఖ్యాత వివరించాడు. ఈ కళల్లో ఎక్కువభాగం కామశాస్త్రానికి సంబంధించినవై ఉన్నాయి. శుక్రనీతి సారంలో చెప్పిన కళల్లో ఎక్కువ భాగం అర్థికశాస్త్రానికి, లోకతంత్రానికి సంబంధించి ఉన్నాయి. లలిత విస్తరం అనే గ్రంథంలో పేర్కొన్న చతుష్షష్టి కళల్లో ఎక్కువభాగం వృత్తి విద్యలకు, లోకవ్యవహారానికి, ప్రజాజీవిత విధానానికి సంబంధించి కనిపిస్తాయి. దీనినిబట్టి రచయితల వైయక్తిక ఇష్టాయిష్టాలననుసరించి కూడా ఈ కళల పేర్లలో మార్పులు జరుగుతుంటాయని తెలుస్తుంది. ప్రపంచమంతా కళామయమే కాబట్టి ఇక్కడ యక్తిక ఇష్టాలకు చాలినంత అవకాశం కూడా లేకపోలేదు.

రామాయణ చంపూ ప్రబంధ వ్యాఖ్యలో పేర్కొన్న చతుష్షష్టి కళలనే కొన్ని పేర్ల మార్పులతో నారాయణామాత్యుడు హంసవింశతిలో ఒకచోట చౌషష్టివిద్యలనే పేర, పట్టిక రూపంలో ఇచ్చాడు. (1-155). వీటినెలాగూ తర్వాత వివరించడం జరుగుతుంది కాబట్టి, [illegible]తులనా

త్మక పరిశీలనకు అనుకూలంగా ఇచ్చట రామాయణ చంపూ ప్రబంధ వ్యాఖ్యలోని చతుష్షష్టి కళలకు సంబంధించిన శ్లోకం యథాతథంగా ప్రదర్శింప బడుతున్నది.

"ఇతిహాసాగమాద్యశ్చ కావ్యాలంకార నాటకం
గాయకత్వం కవిత్వంచ కామశాస్త్రం దురోదరం
దేశభాషాలిపి జ్ఞానం లిపి కర్మచ వాచకం
సర్వాణి చావధానాని స్వరశాస్త్రంతు శాకునం
సాముద్రికం రత్నశాస్త్రం తథాశ్వగతి కౌశలం
మల్లశాస్త్ర సూదకర్మ భూరుహాణాంచ దోహదం
గంధవాదో ధాతువాదః ఖన్యావాదో రసస్య చ
జలవాదో అగ్నిస్తంభః ఖడ్గస్తంభో జలస్యచ
వాచస్తం భోవయస్తంభో వశ్యాకర్షణమేవచ
విద్వేషణోచ్చాటనే చ మారణం కాలవంచనం
పయసిప్లవ చాతుర్యం పాదుకాశిద్ధిరేవచ
మృత్సిద్ధి ర్ఘుటికాసిద్ధిరైంద్రజాలిక మేవచ
అంజనం నరదృష్టిస్తు వంచనం స్వరవంచనం
మణిమంత్రౌషధానాంచ సిద్ధయశ్చోర కర్మచ
వేత్రలోహాశ్మమృద్దారువేణు కర్మాంజన క్రియాః
అదృశ్యకరణే దూరకరణీ మృగయారతిః
వాణిజ్యం పాశుపాల్యంచ కృషిరాసవ కర్మచ
లావక కుక్కుట మేషాది యుద్ధకారణ కౌశలం
చతుష్షష్టి కళాశ్చైతాః కళావిద్భిః ప్రకీర్తితాః"

ప్రపంచంలో ఉదయం లేచినప్పటి నుండి మరుసటి రోజు ఉదయం వరకు జరిగే ముఖశోధనం, దంతధావనం, అనులేపం, కేశ సంస్కారం, అధరన ఖరాగం, తాంబూలసేవనం, స్నానం, భోజనం అనంతర వినోదం, కామోత్సవం మొదలైన మానవుని క్రియాశీలక పనులన్నీ కళలో భాగాలే. చాతుర్యంగా చేసే ప్రతి పని కూడ కళ అవుతున్నది. కాబట్టి సర్వప్రపంచం కళా మయమని చెప్ప వచ్చును. చతుష్షష్టి కళలు లేదా చౌషష్టి విద్యల్లో ఉండే భేదాలను తులనాత్మకంగా

గుర్తించడం కోసం వాత్స్యాయన కామసూత్రాలు, లలిత విస్తరం శుక్రనీతిసారం, ప్రబంధకోశ సూచిక, రామాయణ చంపూ ప్రబంధా లందు చెప్పబడిన కళల పేర్లను హంసవింశతిలో పేర్కొన్న పేర్లకు ఎదురుగా కుండలీకరణాల్లో చూపడం జరిగింది.

కుండలీకరణాల్లో ఉపయోగించిన సంకేతపదాల వివరణ.
శు.నీ.సా. = శుక్రనీతిసారం.
రా.చం.ప్ర. = రామాయణ చంపూ ప్రబంధం
ప్ర.కో.సూ. = ప్రబంధ కోశ సూచిక.
వా.కా.సూ. = వాత్స్యాయన కామసూత్రాలు.
ల.వి. = లలిత విస్తరం.
(విషయసేకరణ శాంతి సాహిత్య సంకలనం నుండి)

అంజన భేదాలు :-

అంజనం (రా.చం.ప్ర.) అంజనభేదాలు అనేకం గలవు. ఇది ఆయుర్వేదానికి సంబంధించిన విద్య. నారికేళాంజనం, నీలాంజనం, కపోతాంజనం, కర్పూరాంజనం, దివ్యాంజనం, మాయాంజనం, హరిద్రాంజనం, సౌవీరాంజనం మొదలైన అంజనభేదాలనెరంగి అవి తయారు చేయడంలో కూడా నేర్పు చూపడం ఒక కళ. (అం. వా. I 14)

చతుష్షష్టి కళల్లో చాలాచోట్ల అంజనవిద్య అని ఉంది. అంజనవిద్య అంటే ఒకవిధమైన కాటుకను అరచేతికి వ్రాసి, అందు పోయిన ధనాన్ని దొంగలను, నిధినిక్షేపాలను చూపించగల శక్తి. (ఆం.వా. I - 415)

అగ్నిస్తంభనం :-

అగ్నినిరోధక్రియా (శు.నీ.సా.). ఇది మంత్రశాస్త్రానికి సంబంధించిన విద్య ఈ విద్యకు దుర్వాస కల్పసూత్రాలు మొదలైన గ్రంథాలున్నాయి. మంత్రానికి ఆకర్షణం, స్తంభనం, మారణం, మోహనం, వశీకరణం, ఉచ్చాటనం అన్నే ఆరు ప్రయోగాలున్నాయి. వీటిలో జలస్తంభనం, అగ్నిస్తంభనం, వయఃస్తంభనం అనేవి స్తంభనప్రయోగానికి సంబంధించినవి. మంత్ర ప్రయోగం చేసి అగ్నిని స్తంభింపచేసే సామర్థ్యాన్ని కలిగి ఉండడమే అగ్నిస్తంభన విద్య లేదా కళ అంటారు

అదృశ్య కరణి :- అదృశ్య కరణీ (రా. చం. ప్ర.) ఇతరులకు కనపడకుండా వస్తువులను దాచుట, తాను దాగుట మొదలైనవన్నీ అదృశ్య కరణి కళలో చేరుతాయి. (అం. వా. I ఉ. వి.)

అరదం బరపుట :- రథః (ల. వి.) సారథ్యమ్ (శు.నీ.సా.) అరదం బరపుట అంటే రథాన్ని నడపడంలోని సామర్థ్యం. ఇది ధనుర్వేదంలోని రథ శిక్షణకు సంబంధించిన కళ. రథాన్ని నడిపేవాడు ఉత్సాహం, దర్పం, ఇంగితం, హర్షం, ఖేదం, దైన్యం, పారవశ్యం, బలం, దుర్బలం, నిమిత్తం అనే దశ లక్షణాలను కలిగి ఉండాలి మూఢత్వం, ప్రమత్వం, రథ చోదనా క్షమత్వం, భీరుత్వం అనే లక్షణాలుండరాదు. ఈ లక్షణాలన్నీ కలిగి ఉండేవాడే రథాన్ని నడపడంలో కళానైపుణ్యాన్ని ప్రదర్శించగలడు. (అం. వా. I 204 అశ్వహృదయ పరిజ్ఞానం).

ఇంద్రజాలం :- ఇంద్రజాల యోగః (వా. కా. సూ.) ఇంద్రజాలికమ్ (రా. చం. ప్ర.) ఇంద్రజాలమ్ (ప్ర. కో. సూ.) ఇంద్రజాలః (వా. కా. సూ.).

ఇంద్రజాల విద్యంటే చూపరుల కన్నులను భ్రమపెట్టుట. అని వాత్స్యాయన కామ సూత్రాలకు వ్రాసిన రతిరేఖ వ్యాఖ్యలో ఉంది. (పుట 45). అంటే లేనిది ఉన్నట్లుగానూ, ఉన్నది లేనట్లుగానూ చూసే వారి కన్నులను భ్రమింపచేసేదన్నమాట. దీనిలో అనేక రకాలైన అవాంతర భేదాలున్నాయి. మహేంద్రజాలం, గజకర్ణం, గోకర్ణం, గారడీ, కనుకట్టు, హస్తలాఘవం, మొదలైన వానిని ప్రధాన భేదాలుగా పేర్కొనవచ్చును. ఇంద్రజాలకుడు పైన పేర్కొన్న వాటిలో నేర్పును ప్రదర్శించే సామర్థ్యాన్ని కలిగివుండాలి. అప్పుడే కళాకారుడనిపించుకొంటాడు. (అం. వా. I ఉ. వి.).

ఉచ్చాటనం :- "హిచ్చాటనే (రా. చం. ప్ర.). ఇది మంత్ర శాస్త్రాల్లోని అరు ప్రయోగాల్లో ఒకటి. అంతేకాదు అరు విద్యల్లో కూడా ఇది ఒకటి. మంత్ర శాస్త్రాన్ని అనుసరించి ఉచ్చాటన ప్రయోగం వల్ల పిశాచాదులను తరిమి కొట్టే నేర్పును కలిగివుండడమే ఈ కళా శక్తి. (అం. వా. I 358).

కవిత్వం :- గ్రంథ రచనం (ల. వి.) కావ్యక్రియా (వా. కా. సూ.) కావ్యం (ప్ర. కో. సూ.).

ఛందశ్శాస్త్రాన్ని క్షుణ్ణంగా తెలుసుకొని, ఆశు, గర్భ, బంధ, చిత్ర కవిత్వాలను చెప్పడంలో నేర్పు కలిగి ఉండాలి. (అం. వా. I 415).

కాలవంచన :- కాలవంచనమ్ (రా. చం. ప్ర.). బహు కాలానుభవాన్ని స్వల్పకాలానుభవంగానూ, స్వల్పకాలానుభవాన్ని బహుకాలానుభవంగానూ భావింపచేయడం, లేదా అతీత, అనాగత అంశాలను ప్రత్యక్షంచేసి వర్తమాన విషయాలుగా చూపడం. ఉదాహరణకు ఒక ఇంద్రజాలికుడు సా॥ 5 గం॥లకు ప్రదర్శన. అరగంట ఆలస్యంగా వచ్చాడు. ప్రేక్షకులు అడిగారు. లేదండీ నేను సరిగ్గా సమయానికే వచ్చాను. కావాలంటే మీ గడియారాలు చూచుకోండి అన్నాడు. 5 గం॥ ఉంది. అలా కాలాన్ని భ్రమింపజేయడం ఈ కళలోని ప్రత్యేకత.

కుట్టుపనుల వినోదం :- సూచీకర్మ (ల. వి.). వాత్స్యాయనుడు కుట్టుపనిని సూచీవాన కర్మ అని పేర్కొన్నాడు. గుడ్డలు కుట్టుట అని రతిరేఖ వ్యాఖ్యానించింది. (పుట 46). రంగు దారాలతో చిత్రవిచిత్రాలైన బట్టలు కుట్టడంలో చమత్కారాన్ని ప్రదర్శించడం. బట్టలమీద రకరకాల డిజైన్లలో అందంగా ఆకర్షణీయంగా పూలు, తీగెలు మొ॥ కుట్టే నేటి ఎంబ్రాయిడరీ పని కూడా ఈ విద్యకు సంబంధించిందే.

కులాల కర్మం :- (కుమ్మరి కర్మం) మృత్కర్మ (రా.చం.ప్ర.) కళాసైపుణ్యాన్ని ప్రదర్శించి, వివిధ రకాలైన పాత్రలను, చిత్రవిచిత్రాలైన బొమ్మలను మట్టితో తయారు చేయడం. (అం. వి. IV-3009).

కృషి :- భూమిని దున్ని పంటలు వేసే విధానాన్ని తెలియచేసే అనేక శాస్త్రగ్రంథాలున్నాయి. నిర్ణయ సింధువు, సస్యానందం, రెట్టమతశాస్త్రం మొదలైనవి ప్రాచీన గ్రంథాలు. ఏ కార్తెలో ఏ పంట వేస్తే బాగా పండుతుంది. వర్షాలు ఏ కార్తెలో కురుస్తాయి. ఇత్యాది శాస్త్రీయ విషయాలు తెలుసుకొనడం తద్వారా అధిక దిగుబడులు సాధించడం. [అం. వా. I ఉ. వి.) ఈ నాడు ఈ విద్య రేడియోలు, టీ. వీ. ల.

ద్వారా రైతుల కందుబాటులోనికి వచ్చి, వాళ్ళ అధిక దిగుబడులు సాధించేందుకు అవకాశం కల్పిస్తున్నది.

కౌక్కోకం :— రతిజ్ఞానం (శు. నీ. సా.) ఇది కామ శాస్త్రానికి సంబంధించిన కళ. మనస్సు మొదలైన ఇంద్రియాలచే కోరబడిన విషయానుభవాన్ని పొందడం. ఇందలి రతి భేదాలు, చుంబనాది భేదాలు, తెలుసుకొని రమించి విషయ సుఖాన్ని అందించడం, పొందటం అనేది ఒక నేర్పు. "బలం బలవతాం చాహం కామరాగ వివర్జితమ్
ధర్మా విరుద్ధో భూ తేషు కామోస్మి భరతవర్షభ" (7-11).
అని కామశాస్త్రం భగవద్గీతలో ప్రశంసించబడింది, (ఆం, వా. I ఉ. వి.).

ఖడ్గస్తంభనం :- ఖడ్గస్తంభః [రా. చం, ప్ర.). స్తంభనమనేది మంత్ర శాస్త్రాల్లోని ఆరు ప్రయోగాల్లో ఒకటి. ఈ మంత్ర ప్రయోగం వల్ల ఖడ్గ నిరోధం చేయడంలో నేర్పు ప్రదర్శించడం. (చూడు అగ్ని స్తంభనం).

ఖనిజ వాదం :- ఖన్యవాతః (ప్ర. కో. సూ.). ఖనిజవాదాన్ని రామాయణ చంపూ ప్రబంధం ఖన్యావాదమని పేర్కొంది. ఖనిజం అనగా భూమిలో నుండి త్రవ్వి తీసిన, ముడి లోహం. అభ్రకం, ఇనుము, వెండి, ఇత్యాదులు ఆ కోవకు చెందుతాయి. ఈ ఖనిజాల గుణాలను, ఉపయోగాలను, అవి దొరికే స్థలాలను చక్కగా తెలుసుకొని వాటిని ఉపయోగించడంలో నేర్పును కలిగివుండడం.

గంధవాదం :— గంధవాదః (ప్ర. కో. సూ. & రా. చం. ప్ర.) వాత్స్యాయనుడు దీనినే గంధయుక్తి అని పేర్కొన్నాడు. అత్తరు తయారు చేయడంలో నేర్పును కలిగివుండటం అని రతిరేఖ వ్యాఖ్యలో ఉంది. (పు 45) గంధవాదమంటే వాసన చూసి వస్తువును గుర్తుపట్టగల నేర్పు అని కొందరి అభిప్రాయం. (ఆం. వి. VI 3008).

గజారోహణం :— హస్తిలక్షణమ్ (ల. వి.) గజాశ్వగతి శిక్ష(శు.నీ.సా.) వైనయకీజ్ఞానమ్" (వా.కా.సూ.) గజారోహణమ్ (ప్ర.కో.స.)

ఈ విద్య గజశాస్త్రానికి సంబంధించింది. మృగ చర్మీయం

రాజపుత్రీయం అనే గ్రంథాలు ఈ శాస్త్రాన్ని తెలుపుతున్నాయి. ఏనుగుల్లో భద్ర, మంద్రం, మృగం అని మూడు జాతులున్నాయి. భద్ర జాతిలో గభీరవేది అనే ఒక లక్షణం కనిపిస్తుంది. ఈ జాతికి చెందిన ఏనుగు ఉత్తమమైందిగా చెప్పబడుతుంది. (అం. వా. I ఉ. వి.) (అ. వి. II 941).

ఆయా గజజాతుల లక్షణాలను తెలుసుకొని, వాటిని వశపరచుకొని, వాని ఆరోహణ, అవరోహణ క్రమాన్ని తెలుసుకొని, దానిలో నేర్పును ప్రదర్శించడం, ఈ విద్యలోని ప్రత్యేకత అని రతిరేఖ వ్యాఖ్యవలన తెలుస్తుంది. (వా. కా. సూ. 49).

గానం :- గీత పఠితం. (ల. వి.) గీతం (వా. కా. సూ.) వాద్యవాదన జ్ఞానం (శు. నీ. సా.) గీతం (ప్ర.కో.సూ.)

ఇది సంగీత శాస్త్రానికి సంబంధించిన అంశం. "గం" అంటే గానం' ధర్వ అంటే ధరించిన వారు, వీరే గాంధర్వులు. వీరికి సంబంధించింది కావున ఇది గాంధర్వ వేదమైంది. ఇది సామవేదానికి ఉపవేదం. నృత్య గీత వాద్యాలతో కూడుకున్నదీ సంగీత విద్య. ఇది సర్వజ్ఞుడైన శివుని వలన ప్రకాశించిందని చెప్తారు. (అం, వ. I ఉ. వి.) చక్కని కంఠం కల్గి శ్రోతలు గానరసంలో ఓలలాడేటట్లు పాడే నేర్పు కలిగి ఉండడం గానకళ.

ఘుటికా సిద్ధి :- ఘుటికాసిద్ధిః (రా. చం. ప్ర.) ఇది అంజనాది అష్టసిద్ధుల్లో ఒకటి. ఔషధం మొదలైన వాని కుప్పెల మూలమున ఫలం కల్గుట. (అం. వా. I-10).

చరాచర అన్యథా కరణం:- సర్వాణీ చాపదానాని (రా.చం.ప్ర.) ఇది ఇంద్రజాలానికి సంబంధించింది. చరాలను అచరాలుగాను, అచరాలను చరాలు గాను మార్చే నైపుణ్యంగల విద్య ఇది. అంటే మనిషిని శిలగాను, శిలను మనిషినిగాను మార్చడం మొదలైన వానికి సంబంధించిందన్నమాట.

చిత్తరువులు వ్రాయుట :- చిత్రలేఖనం (పా.భే.శృం.గ్రం.)

ఆలేఖ్యమ్ (వా.కా.సూ.) రూపావిర్భావ కృతి జ్ఞానం. (శు. నీ. సా.) చిత్రకర్మ (ప్ర.కో.సూ.) "రూపకర్మ" (ల. వి.).

చక్కగా ఒక చిత్రాన్ని రచించడాన్నే చిత్రలేఖనం లేదా ఆలేఖ్యం అని అంటారు. చిత్రలేఖనంలో ఆరు అంగాలున్నాయి. 1] రూపభేదం 2] ప్రమాణం 3] భావయోజనం 4] లావణ్య యోజనం 5] సాదృశ్యం 6] వర్ణికాభంగం. ఈ అంగాలను అందులోని మెళుకువలను తెలుసుకొని జీవ చైతన్య ముట్టిపడేటట్లు అందంగా, ఆకర్షణీయంగా బొమ్మలు వ్రాయడం. (వా.కా.సూ.44). నేడు రేఖాత్మక చిత్రకళ, కార్టూను చిత్రకళ, ఆధునిక చిత్రకళ మొదలైన వెన్నో శాఖలు వచ్చాయి.

చోరత్వం :- చోర కర్మ (రా. చం, ప్ర.) దొంగతనం చేయడంలో నేర్పు.

జలస్తంభనం :- జలనిరోధ క్రియా (శు. నీ. సా.) మంత్ర శక్తి చేత నీటిని స్తంభింపచేసే శక్తి కలిగి ఉండడమే జలస్తంభన విద్య. (చూడు అగ్నిస్తంభనం).

జూదం :- ద్యూత విశేషః (వా. కా. సు.) ద్యూత క్రీడా రంజనం. (శు. నీ. సా) దురోదరం (రా. చం. ప్ర.).

జూద విద్య రెండు విధాలు. అవి 1) ప్రాణి జూదం - అంటే పొట్టేళ్ళు, కోడి పుంజులు, లావుక పిట్టలు, డేగలు, పావురాలు, గుఱ్ఱాలు మొదలైన పక్షి - జంతు జాతులతో పందెం కాయడంలో నైపుణ్యాన్ని కలిగివుండడమన్నమాట. 2) అప్రాణి జూదం - ఇందులో సొగటాలు, చదరంగం, ఇస్పేట్, పచ్చీసు మొదలైనవి చేరుతాయి. వీటిలో నైపుణ్యాన్ని కలిగివుండడం కూడా ఒక కళే. ఈ కళల్లో కోడి పందేలకు సంబంధించి కుక్కుట శాస్త్రం అనే ప్రత్యేక శాస్త్ర గ్రంథం వుంది.

(అం. వా. I ఉ. వి.)

జోళ్ళు నిర్మించుట :-

"పశుచర్మాంగ నిర్హారః" (శు.నీ.సా.). చర్మకర్మ (ప్ర.కో.సూ.) చర్మంతో చెప్పులు కుట్టడంలో నైపుణ్యాన్ని సంపాదించడం.

తురగారోహణం :-

"అశ్వగతి కౌశలం" (రా.చం.ప్ర.) "అశ్వలక్షణం, (ల.వి.) గజాశ్వ గతిశిక్షా (శు.నీ.సా.) తురగారోహణమ్ (ప్ర.కో.సూ.).

తరుగారోహణం అంటే గుర్రాన్ని ఎక్కి స్వారీ చేయడంలో గల నైపుణ్యం. అందుకు అశ్వగతులు తెలిసివుండాలి. సమ, ఉన్నత, విషయాంబుకీర్ణ, శుద్ధ, నతాగ్ర, తృణపీరువార్ధ్య, స్థాణప్రకీర్ణ, ఉపల సంప్రకీర్ణ, పార్శ్వోన్నతి అని అశ్వగతులు తొమ్మిది విధాలు. (ఆం.వా. I-204). ఈ అశ్వగతి భేదాలన్నిటిని తెలిసి; తురగారోహణ, అవరోహణ క్రమాల్లో చాకచక్యం సంపాదించి గుర్రాన్ని నడపడంలో నేర్పు కలిగి ఉండడం.

దృష్టివంచనం :-

దృష్టిని మోసపుచ్చడం దృష్టివంచన. అంటే కనుకట్టు విద్య కావచ్చును. ఇది ఇంద్రజాలంలో ఒక అవాంతరభేదం. (చూడు ఇంద్రజాలం).

దృష్టి విశేష జ్ఞానం :-

ఇది విజ్ఞానానికి, ముందుచూపుకు సంబంధించింది. ఏ సమస్య నైనా, ఏ విషయమైనా, అవగాహనతో ముందుచూపుతో పరిశీలించి పరిష్కరించే నైపుణ్యం కలిగి ఉండడం.

దేశ భాషల విజ్ఞానం :- "దేశ భాషల పట్టిక" (ల, వి.) దేశభాష (వా. కా. సూ.) "నానాదేశ వర్ణ లేఖనం" (శు. నీ. సా.) "దేశభాషా" (ప్ర. కో. సూ.) "దేశ భాషా (రా. చం. ప్ర). దేశభాషలను చక్కగా తెలిసికొని ఉండడం. అంటే దేశభాషలన్నింటిని అర్థంచేసుకొనే శక్తి, మాట్లాడే సామర్థ్యం కలిగివుండుట. (ఆ.వా. I ఉ.వి.) (వా.కా.సూ. 48)

దోహద ప్రకారం :- ఉద్యాన నిర్మాణం (ల. వి.) వృక్షాయుర్వేద యోగాః (వా. కా, సూ.) "వృక్ష చికిత్సా" (ప్ర. కో. సూ.) "వృక్ష పాలనమ్" (శు.నీ.సా.) చెట్లు, పొదలు, తీగలు మొదలైనవి, కాలమందు పుష్పించి ఫలించేందుకు చేసే దోహద క్రియ (ఆం. వా. I ఉ. వి.)

ఉదా :- చింతచెట్టు పాదుదగ్గర (త్రవ్వి గోధుమలు, మినుములు) మాంస లేపనం చేస్తే విశేషంగా ఫలిస్తుంది. (అం. వా. II - 1161) అదేవిధంగా ద్రాక్షచెట్టు పాదుదగ్గర కుందేలు, తొండ మొదలైన వాని మాంసాన్ని వేస్తే ఎక్కువ ఫలాన్ని ఇస్తుంది. (అం. వా III-1528., ఇదే విధంగా అన్ని చెట్లు దోహద క్రియలు తెలిసి ఉండడం ఈ విద్య ప్రత్యేకత.

దౌత్య కర్మం :- దూత ధర్మాలను, సమయ సందర్భాలనుబట్టి ప్రవర్తించవలసిన తీరును చక్కగా తెలిసి, నేర్పు, ఓర్పు కల్గి, సమయానుసారంతో కార్య భారాలను వహించి, రాయబారాలను చాకచక్యంగా నిర్వర్తించడం.

ధాతు వాదం :- ధాతు సంయోగం (శు. నీ. సా.) ధాతుకర్మ (ప్ర. కో. సూ.). రంగుచూసి వస్తువు యొక్క లక్షణాన్ని తెలుసుకొనే నేర్పు (అం. వా. VI-3008). కొండల్లో పుట్టిన తాళకం, శిలాజిత్తు, హరితాళం, మణిశిల, మైలు తుత్తం మొదలైన ధాతువుల గుణాలను తెలిపేది ధాతువాదం, అని వాత్స్యాయనుడు పేర్కొన్నాడు. లోహాలున్న ప్రదేశాలు కనుగొనుట అని రతిరేఖ వ్యాఖ్య తెలుపుతుంది. (పుట 47). కాబట్టి ఈ విద్యలో నేర్పు సంపాదించాలంటే,లోహాలుండే స్థలాలను గుర్తించడమే గాక, ఆయావస్తువుల గుణాగుణాలను తెలిసి, ప్రయోగించే నైపుణ్యం కలిగి ఉండాలన్న మాట.

పక్షి గతి భేదాలు :- ప్రకృతిలో చక్కగా నడవగల పక్షులు హంస, మయూరి, మొదలైనవి ఉన్నాయి. స్త్రీలకు హంస గమన, మయూర గమన అనే కవి ప్రయోగాలు కనిపిస్తాయి. కాబట్టి ఆయా పక్షిగతి భేదాలను తెలుసుకొని నడకలో నేర్పును సంపాదించడం ఒక కళ. లేదా పక్షుల ఎగిరే విధానాలను కూడా పక్షిగతి భేదాలే అంటారు. కాబట్టి పక్షుల నెగురవేసే విధానాలు, సమయాలు, స్థలాలు బాగా తెలిసి, వాటి నెగురవేసి, ప్రత్యర్థుల మీద విజయం సాధించే నేర్పు కలిగి ఉండడం. పూర్వం పావురాలను, డేగలను ఎగురవేసే పద్ధతులున్నట్లు సాహిత్యాధారాలున్నాయి. ఇప్పుడు కూడా అరేబియా దేశాల్లో *Falcon Shikari* (డేగవేట) అమలులో ఉంది.

పటకార కర్మం :- పట బంధః (శు.నీ.సా.) దీనినే అంబర క్రియ

అంటారు. రంగు రంగుల దారాలను పడుగు పేకలుగా కలిపి చిత్ర విచిత్రమైన బట్టలను నేయడంలో నైపుణ్యాన్ని ప్రదర్శించడం. (ఆం.వి. I.11)

పాక చమత్కారం :- అన్నాది సంపచనం (శు. నీ. సా.), భక్ష్య భక్ష్య క్రియ (వా. కా. సూ.) ఈ శాస్త్రంలో నలభీమ పాకాలు ప్రసిద్ధాలు. అన్ని జబ్బులకు మందులు లేకుండానే భక్ష్య పదార్థాల్లో ఉప్పు, పులుసు, పసుపు, కారం మొదలైన వస్తువులు ఏ యే వంటకాలకు, ఏ యే వస్తువులు ఎంతెంత మోతాదుల్లో వేయాలో తెలిసి, వంట చేసిన ఎడల మందుల అవసరం లేకుండా ఆరోగ్యాన్ని కలుగజేస్తాయి. (ఆం. వా. I ఉ. వి,). కాబట్టి ఈ కళలో ప్రావీణ్యం సంపాదించాలంటే పాకశాస్త్ర విషయాలు బాగా తెలిసి వంటకాలు రుచికరంగా ఉండడమే కాకుండా, ఆరోగ్యకరంగా కూడా ఉండేటట్లు చేయుడంలో నేర్పు సంపాదించడమన్న మాట.

పాశుపాల్యం :- అశ్వహస్తిగో అజలక్షణమ్ (ల. వి.). గజాది పల్యాణ క్రియ (శు నీ.సా.). పాశుపాల్యం(రా.చం.ప్ర.)ఇది గో శాస్త్రానికి సంబంధించిన కళ. పాశుపాల్యం అనగా పశువులను పాలించుట అని అర్థం. అంటే పాడిని అభివృద్ధిచేసే విధంగా పశువులను సంరక్షణచేయడమన్న మాట. సహదేవుడు గోశాస్త్రానికి సంబంధించి ఒక గ్రంథాన్ని రాసాడు. దీనిలో పశువుల వర్ణనలు, సుళ్ళు, శుభ లక్షణాలు, వాని వలన కలిగే ఫలాలు, పశువ్యాధులు, వానిని నివారించే విధానాలు వివరంగా ఉన్నాయి. (ఆం.వా. I ఉ.వి.). పశువులకు సంబంధించిన పై విషయాలన్నీ చక్కగా తెలుసుకొని, పశువులను సంరక్షించడంలో నేర్పును సంపాదించుట. -గోదోహనం, పశువైద్యం, మొదలైన వానిలో నేర్పు. అదే విధంగ పశువుల లక్షణాల నెరిగి వానిని పాలించుటలో నేర్పును సంపాదించుట. (ఆం.వి. VI-3008) ఇది వృత్తి విద్యలకు సంబంధించింది. ఇది ఈనాడు ఉత్తమజాతి పశువుల నుత్పత్తి చేయడం, పాడి పరిశ్రమ, పశువైద్యం, పశువుల దాణా మొదలైన అన్ని తీరుల్లో అభివృద్ధి చెంది ఉంది.

బేరం :- బేర మంటే వ్యాపారం. వాణిజ్యం చేస్తున్నప్పుడు ధాన్యాదులు కొనుగోలు కాలం, విక్రయ కాలం, లాభ విధి, విక్రయ నిషేధ వస్తు వివరణలు, ఇత్యాది విషయాలను తెలుసుకొని, అందులో

నైపుణ్యాన్ని సంపాదించడం. (ఆం.వా. I ఉ.వి.). ఇది కూడా వృత్తి విద్యలకు సంబంధించిందే. వ్యాపారం అందరూ చేయలేరు. వ్యాపారంలో ఉండే పై మెలుకువలన్నీ తెలిసినప్పుడే వేపారి లాభ విధి పొందగలడు. ఇది ఈనాడు వాణిజ్య శాస్త్రంగా అభివృద్ధి చెంది ఉంది.

మణిమంత్ర క్రియలు :- మణిమంత్రౌషధానాం (రా.చం.ప్ర.) మణి క్రియలు, మంత్ర క్రియలు అని ఇవి రెండు విధాలు. మణి క్రియనే, మణిరాగాకార కర్మ, మణి భూమికా కర్మ అని వాత్స్యాయన కామసూత్రాల్లోనూ, మణిరాగః అని లలిత విస్తారంలోనూ పేర్కొనబడింది. దీనిన్ని మణిసిద్ధి అని కూడ అంటారు. మణుల మహిమలను తెలుసుకొని, వాటి ద్వారా విషదోషాలను తొలగించడం. శుక్ర నీతి సారంలో మంత్ర క్రియను, మంత్రవాదః అని పేర్కొన్నారు. మంత్రక్రియను, మంత్ర సిద్ధి అని కూడ అంటారు. మనోబలంతో ఇతరుల రోగాలను పోగొట్టే విద్యనే మంత్రక్రియ అంటారు. (ఆం.వి. VI-3009).

మల్లశాస్త్రం :- బాహువ్యాయామః (ల. వి.). మల్లయుద్ధమ్ (శు.నీ.సా.). వ్యాయామికీ జ్ఞానం (వా.కా.సూ.). ఈ శాస్త్రంలో 12దండలు 12 గతులు, 12 మొనలు, 12 కాయమానాలు, 14 పిసరులు, 16 ఉపవీతాలు, 32 విన్నాణాలు, 32 ప్రచారాలు, 3 నరకులు మొదలైన వెన్నో విషయాలున్నాయి. వీటన్నిటిలో నైపుణ్యం సంపాదించడమే ఈ కళలోని ప్రత్యేకత. కాని, వీటి వివరాలు తెలుపే శాస్త్రగ్రంథాలు నేడు దొరకడం లేదు. (ఆం.వా. I ఉ.వి.). ఈ మల్లశాస్త్రంలో ఉండే అనేక శాఖల పేర్లు హంస వింశతిలో ఉన్నాయి. వీటన్నిటిని శాస్త్రవర్గంలో వివరించడం జరిగింది.

మహేంద్రజాలం :- ఇది ఇంద్రజాలంలో ఒక అవాంతర భేదం. (చూడు - ఇంద్రజాలం).

మైరేయము గూర్చువగ :- ఆసురం (ల. వి.). మద్యాదికృతః (శు.నీ.సా.). ఆసవకర్మ (రా.చం.ప్ర.) మత్తు పానీయాలైన మద్యం మొదలైనవానిని త్రాగడం, త్రాగించడంలో నేర్పు కలిగివుండుట.

మొనకట్టు :- మొనకట్టు అంటే వ్యూహరచన. కాబట్టి ఇది యుద్ధ

శాస్త్రానికి సంబంధించిన వ్యూహరచనా విశేషాలకు సంబంధించిన విద్య. వ్యూహాలు అనేక విధాలు. నాలుగు ప్రకృతి వ్యూహాలు. పదిహేడు దండ వ్యూహాలు; ఆరు భోగ వ్యూహాలు; రెండు మండల వ్యూహాలు; ఆరు ప్రధాన వ్యూహాలు. మొత్తం నలభై ఒక్క వ్యూహాలు. వ్యూహాంగాలు గురు మతానుసారంగ ఏడు, శుక్రుని మతాన్ని అనుసరించి ఐదు ఉన్నాయి.

ఈ వ్యూహరచనా విశేషాలన్నింటిని చక్కగా తెలుసుకొని వ్యూహ రచనలో నైపుణ్యం కలిగి ఉండడమే మొనకట్టు విద్య. (ఆ.వా.I ఉ.వి.)

మోహనం :- ఇది మంత్ర శాస్త్రాల్లోని ఆరు ప్రయోగాల్లో ఒకటి. మోహన ప్రయోగం అంటే ఇతరులను మోహింపచేయడం లేదా రంజింప చేయడం అని కొందరి అభిప్రాయం. (ఆం. వా. I ఉ. వి. మరియు ఆ. వి. VI 3008).

యోగవాదం :- యోగశాస్త్రం భారతీయ విద్యల్లో బహు ప్రాచీన మైంది. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి అనే ఎనిమిది అంగాలతో కూడుకున్నది యోగ విద్య.

"యోగాంగానుష్ఠానాద శుద్ధిక్షయే జ్ఞాన దీప్తిరా వివేకాఖ్యాతేః".

యోగవిద్య వల్ల అశుద్ధి క్షీణిస్తుంది. అవిద్య నశించి, జ్ఞానం పెరుగు తుంది. వివేక ఖ్యాతి కలిగి జ్ఞానప్రకాశం వర్ధిల్లుతుంది అని యోగవిద్య ప్రశంసింపబడింది. (యో. ద. 88, 89). కాబట్టి ఈ విధమైన యోగ విద్యలో నేర్పు, ప్రతిభ ప్రదర్శించడమే ఈ విద్యలోని ప్రత్యేకత,

రత్న పరీక్ష :- రత్నవేద పరీక్ష (శు. నీ. సా.) రత్న పరీక్ష (ప్ర.కో.సూ.). పద్మరాగం, మరకతం, గోమేధికం, వైఢూర్యం, పుష్య రాగం, మౌక్తికం, ప్రవాళం, వజ్రం, నీలం అనేవి నవరత్నాలు. వీని జన్మస్థానాలు, జాతులు, గ్రహాలు, దోషాలు తెలుసుకొని, వాటిని ధరిం చడం వల్ల కలిగే [illegible]ాలను వివరించగల నైపుణ్యాన్ని సంపాదించడం. (ఆం. వా. I ఉ. వి.)

రథ కార కర్మ:- దారుకర్మ (రా. చం. ప్ర.). రథాలను తయారు చేయడంలో చక్కని నేర్పు ప్రదర్శించడం. అదేవిధంగా కఱ్ఱతో బొమ్మలు మంచాలు, కుర్చీలు, మొదలైన గృహోపకరణాలను తయారుచేయడంలో కూడా చక్కని నైపుణ్యం సంపాదించడం. ఇది వృత్తివిద్యల్లో వడ్రంగి *(Carpentary & Carviug)* పనితనానికి సంబంధించిన కళ. వృత్తివిద్యా కళాశాలల్లో నేడు ఇది పఠనాంశంగా కూడా ప్రవేశ పెట్టుచున్నారు.

రసవాదం :- రసవాదః (ప్ర. కో. సూ.) (రా. చం. ప్ర.) పాదరసం, గంధకం మొదలైన రసాయనాల గుణాలను తెలుసుకొని, వాటిని ఉపయోగించి మంచి ఫలితాలను పొందడం. (ఆం,వా. I ఉ.వి.).

లావక, కూర్మ, కుక్కుట, మేషాదుల పోరు హత్తించుట :- లావక, కూర్మ, కుక్కుట, మేషాది యుద్ధకారణ కౌశలం(రా.చం.ప్ర). "మేష, కుక్కుట, లావక, యుద్ధ విధిః" (వా.కా.సూ.). కుక్కుట పోరు అంటే కోడి పందెం. దీనిలో ఆరె పందెం, కత్తి పందెం అని రెండు భేదాలున్నాయి. కోడి పుంజుల్లో రంగులను బట్టి నెమలి, కాకి, డేగ, పింగళి, కోడి మొదలైన భేదాలు గలవు. రంగులను బట్టి ఆయా జాతి కోళ్ళ విజయావకాశాలకు అనుకూలమైన నక్షత్రాలు జాములు మొదలైన విషయాలను కుక్కుట శాస్త్రం విధించింది. ఈ శాస్త్ర విషయాలను తెలుసుకొని పందాలు నిర్వహించడంలో నైపుణ్యాన్ని కలిగి ఉండడం. (కు.శా. 20). అదేవిధంగా లావుక, (పావురం), కూర్మ(తాబేలు), మేషాదులు (పొట్టేలు) మొదలైన వాటి లక్షణాలను విజయావకాశాలను తెలుసుకొని, పందాలు నిర్వహించడంలో నైపుణ్యాన్ని సంపాదించడం.

లిపి లేఖనం:- లిపి భేదం, లిపిః (ల.వి.). వర్ణరంజనమ్ (శు.నీ.సా.) లిఖితమ్ (ప్ర.కో.సూ.). లిపి కర్మ (రా.చం.ప్ర.). అక్షర లక్షణాలను, వాని లేఖన పద్ధతులు చక్కగా తెలిసి, ఎలా వ్రాస్తే మనోహరంగా ఉంటుందో అలా వ్రాయడంలో నేర్పు ప్రదర్శించడం. ఇందులో భాష, వాక్య నిర్మాణం, దస్తూరి అనే అంశాలు ప్రధానమైనవి.

లోహకారకత్వం :- లోహక్రియ (రా.చం.ప్ర.) లోహాలతో వివిధాలైన వస్తువులను తయారుచేయడంలో నైపుణ్యం. (ఆం. వి. VI-3080).

వచన సిద్ధి :- వాచకం (రా. చం. ప్ర.) పుస్తక వాచనం. (వా.కా.సూ.). రసం ఉట్టిపడే తీరులో గ్రంథాన్ని శ్రావ్యంగా చదవడంలో నైపుణ్యాన్ని కలిగి ఉండడం. అని రతిరేఖ వ్యాఖ్యానం. అంటే మాట్లాడినా, చదివినా శ్రోతలనాకర్షించే విధంగా ఉండాలన్న మాట. ఈ కళలో వాచకం, కంఠధ్వని, మాట్లాడే తీరు ప్రధానమైన అంశాలు. (వా. కా. సూ. 46).

వయః స్తంభనం :- వయః స్తంభః (రా.చం.ప్ర.). ఇది మంత్ర శాస్త్రానికి సంబంధించిన విద్య మంత్రశాస్త్రంలోని స్తంభన ప్రయోగం ద్వారా మనసును స్తంభింపచేయడంలో నైపుణ్యాన్ని కలిగి ఉండడం. ముసలితనం కనబడకుండా మరుగుపరుచే విద్య అని కొందరి అభిప్రాయం. (అ.వా. I ఉ.వి.) (అ.వి. VI-3009).

వశ్యాకర్షణం :- వశ్యాకర్షణమ్ (రా.చం.ప్ర.). స్త్రీ పురుషులు ఒకరికొకరు వశులగుటకు, ఒకరిచే ఒకరు ఆకర్షింపబడేందుకు ఏ యే వన మూలికలుపయోగపడుతాయో తెలుసుకొనే విద్యను వశ్యాకర్షణం అంటారు. (ఆ.వా. I-416). అంటే ఇది నేటి అలంకరణ విద్యకు సంబంధించిందన్న మాట. వస్త్రాలంకరణ, కేశాలంకరణ మైలేపనాదులు *(Cosmotics)* మొదలైనవి ఇందులో ముఖ్యభాగాలు. ఇవన్నీ తెలిసి ఆకర్షణీయంగా అలంకరించుకోవడంలో నేర్పు ప్రదర్శించడం.

వాకట్టు :- వాచస్తంభనమ్ (రా.చం.ప్ర.). వాకట్టు అంటే వాయికట్టుట. అంటే మాటలాడకుండ చేయడం అని అర్థం. ఇంద్రజాలంలో ప్రావీణ్యంగల ఇంద్రజాలికుడు తన కళానైపుణ్యంతో ఎదుటి వానిని మాట్లాడకుండా చేసే నేర్పు. ఇది ఇంద్రజాలంలో ఒక అవాంతర భేదం. (చూడు. ఇంద్రజాలం.) (అం. వి VI-3009).

విద్వేషణం :- భేద్యం (ల. వి.). విద్వేషణః (రా. చం. ప్ర). ఒకరిపై ఇంకొకరికి కలహాన్ని కలిగించడంలో నేర్పును కలిగి ఉండే విద్యను విద్వేషణం అంటారు. (అం.వి. VI-3008).

విలువిద్య :- ధనుర్వేదః, ధనుష్కలాపః (ల. వి.) అస్త్రనిపాతమ్ శరసంధానమ్ (శు.నీ.సా.). ఆయుధాభ్యాసః (ప్ర.కో.సూ.) విలువిద్యను

గురించి తెలిపే ప్రాచీన గ్రంథం ధనుర్వేదం. విల్లును, అంబుల పొదిని ధరించి లక్ష్యాన్ని భేదించే విధంగా బాణాలు వేయడంలో నైపుణ్యాన్ని ప్రదర్శించడం. (ఆం.వా. I ఉ.వి.).

వేట సన్నాహం :- మృగయా (రా.చం.ప్ర.) వేటకు కావలసిన ఆయుధాలను సమకూర్చుకొని, వేటాడుటలో నేర్పును ప్రదర్శించడం ఈ విద్యలోని ప్రత్యేకత. (ఆం.వి. VI-3008).

శాకునం :- శకునిరుతం (ల. వి.). శాకునం (ప్ర. కో. సూ.). నిమిత్తజ్ఞానమ్. (వా.కా.సూ.) శకున శాస్త్రం ఒక పనిని, లేదా కార్యాన్ని చేయదలచినప్పుడు; వాటికి సంబంధించిన శుభ, అశుభ లక్షణాలను తెలియచేస్తుంది. (అం. వా. I 414). ఈ లక్షణాలను తెలిసి కార్యసాధనలో నేర్పును చూపడం.

శిలాభేదకర్మం :- అశ్మక్రియ (రా. చం. ప్ర.) పాషాణ కర్మ (ప్ర. కో. సూ.). కాష్ఠపాషాణాది సత్క్రియా (శు. నీ. సా.). దీనినే పాషణ క్రియ అంటారు. రాళ్ళను తమకవసరమైన విధంగా పగులగొట్టడం, వాటితో వివిధ రకాలైన శిల్పాలను చేయడంలో నేర్పు కలిగి ఉండడం. (ఆం.వి. VI-3008).

శూర్పకార కర్మం :- వేణుకృతిః (శు. నీ. సా.). వేణుక్రియ (రా.చం.ప్ర.). వెదురుతో వివిధ రకాలైన బుట్టలు, చేటలు, మొదలైనవి చేయడంలో నైపుణ్యాన్ని సంపాదించడం. (ఆం. వా. VI-3008).

సంహరణం :- మారణం (రా. చం. ప్ర.). ఋగ్వేదం, యజుస్సామవేదాలకు చెందక ప్రత్యేకంగా శ్యేనయాగం, అభిచార కర్మలను (శత్రువులను సంహరించడానికి చేసే జపహోమాదులను) నిర్ణయిస్తుంది. అధర్వణ, భద్రకాళి మొదలైన ఉగ్రదేవతల ప్రార్థనల్లు అనేక ఋక్కుల్లో ఉన్నాయి. ఆ మంత్ర ప్రయోగాల్లో సంహరణం ఒకటి. పై విషయాలన్ని తెలిసి మారణ విద్యలో నేర్పు సాధించడం.

స్వరవంచన :- స్వర వంచనం. (రా. చం. ప్ర.). శ్రోతలను కళాకారుడు ఇతరుల స్వరాలను అనుకరించి, ఆ వ్యక్తులే అని భ్రమింప చేయడం. (ఆ. వి. VI 3004). దీనినే నేడు ధ్వన్యనుకరణ [*Mymicry*]

అంటున్నారు. దీనిలో ప్రముఖ వ్యక్తుల కంఠస్వరాల ననుకరించడం, పశుపక్ష్యాదుల ధ్వనుల ననుకరించడం. రైలు, బస్సులు మొదలైన వాని ననుకరించడం మొదలైన ఎన్నో శాఖలున్నాయి. ఇది ఖాండికం అనే నృత్యంలో కూడా ఒక భాగంగా ఉండేది. (చూడు ఖాండికం - నాట్యకళ). ఈ స్వర వంచన రామాయణంలో మారీచుడు రాముని గొంతుతో "హా లక్ష్మణా" అని అరవడంతో ప్రారంభమైందని ధ్వన్యను కరణ సమ్రాట్ డా॥ నేరెళ్ళ వేణుమాధవ్‌గారి అభిప్రాయం.

స్వరశాస్త్ర పరిజ్ఞానం :- ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో కుడి ఎడమ ముక్కు రంధ్రాల ద్వారా బయటకు వచ్చే గాలికి సూర్య - చంద్రుల స్వరాలని ప్రసిద్ధి. ఇవి సకల శుభాశుభాలను లోక వ్యవహారాన్ని జీవిత కాలాన్ని తెలియచేస్తాయి. (అం. వా. I–416). సూర్యచంద్ర స్వరాలను బట్టి శుభాశుభాలను చాకచక్యంగా చెప్పగలనేర్పు ఈ విద్యలోని ప్రత్యేకత.

సాముద్రికం :- సాముద్రికమ్ (ప్ర. కో. సూ. & రా. చం.ప్ర.). ఇందులో స్త్రీ, పురుష సాముద్రికాలని రెండు విధాలు. పురుష సాముద్రి కంలో - పురుషుని లలాటం, కన్నులు, ముక్కు, చెవులు, శిరోజాలు, బొడ్డు పాదం, హస్తాలు, గోళ్ళు, అవయవాల పొందికను చూసి ఫలా ఫలాలు చెప్పడం. అదే విధంగా స్త్రీఅవయవాలను పరిశీలించి, శుభా శుభాలను తెలియజేయడం. ఈ విద్యల్లో నైపుణ్యం ప్రదర్శించడం ఈ కళలోని ప్రత్యేకత. (స. సా. 195, 196).

### ఛందస్సు

పద్య రచనా శిల్పానికి సంబంధించిన నియమావళి ఛందస్సు. దీనిలో గణాలు, యతి ప్రాసలు, గురు లఘువులు మొదలైనవన్నీ వస్తాయి.

గణాలు:- కొన్ని అక్షరాల సముదాయాన్ని గణమని అంటారు. ఇవి ఏకాక్షర, ద్వ్యక్షర, త్ర్యక్షర, చతురక్షర గణాలని నాలుగు రకాలుగా ఉంటాయి. ఈ గణాలు గురు లఘువులతో ఏర్పడు తుంటాయి. స్థూలంగా గురువు అంటే దీర్ఘాక్షరం. లఘువు అంటే హ్రస్వాక్షరం.

గురు లఘువులతో ఏర్పడే ఈ గణాలు విసర్గ, సూర్య, ఇంద్ర చంద్ర గణాలనే పేర్లతో వ్యవహరింప బడుతుంటాయి. ఛందశ్శాస్త్రానికి సంబంధించిన, గణాలు, యతి, ప్రాసభేదాలు మొదలైనవన్నీ హంస వింశతిలో చండశర్మ విద్యా పరిశ్రమ సందర్భంగా పేర్కొన బడ్డాయి (3-128). ఛందశ్శాస్త్ర విషయాలన్నీ, ఈ శాస్త్ర గ్రంథాలన్నిటిలోను సాధారణంగా కనిపిస్తుంటాయి కాబట్టి, ఆయా విషయాలు, వాటి అవాంతర భేదాలను సూక్ష్మంగా పరిశీలించి వివరించకుండా, ముఖ్యమైన అంశాలను మాత్రమే ఇక్కడ సంక్షిప్తంగా ప్రస్తావించడం జరిగింది.

గణాల పేర్లు :- కం॥ గలనగణములిను, డింద్రుడు
నల, నగ, సల, భ, ర, త, లింక నగగ, నహ, సలా,
భల, భగురు, మలఘు, సవ, సహ,
తల, రల, నవ, నలల, రగురు తగలిందుడగున్.

సూర్యగణాలు-2 :- గలము, నగణము.

ఇంద్రగణాలు - 6, నలము, నగము, సలము, భగణం, రగణం, తగణం.

చంద్రగణాలు-14 :- నగగము, నహము, సలలము, భలఘువు,, భగురువు, మలఘువు, సవము, సహము, తలఘువు, రలము, నవము, నలలము, రగము, తగము.

విసర్గగణాలు-8 :- యగణం, మగణం, తగణం, రగణం, జగణం భగణం, నగణం, సగణం.

ఈ గణాలతో ఉత్పల, చంపక, శార్దూల, మత్తేభాది వృత్తాలు, కందం మొదలైన జాతులు, సీసం మొదలైన ఉపజాతులనే పద్యాలేర్ప డుతుంటాయి.

యతి :- "యతిర్విచ్ఛేద సంజ్ఞకః" అని యతి శబ్దాన్ని వృత్త రత్నాకరం నిర్వచించింది. యతి సంస్కృత శబ్దం. ఛందో పరిభా షలో దీనికి విచ్ఛేదమని అర్థం. ఇక్కడ విచ్ఛేదమంటే పరిచ్ఛేదమనే అర్థాన్ని గ్రహించాలి యతిస్థానం పరిచ్ఛేదం కావాలి. ఆ స్థానంలో పూర్వా పరాల అఖండ శబ్దం ప్రయుక్తం కారాదని సంస్కృత ఛందోనియమము. పదమధ్యంలో యతి రాకూడదు. యతిస్థానంలో పదచ్ఛేదం లేకుంటే యతి భంగ దోషం కలుగుతుందని సంస్కృత లాక్షణికులు శాశించి యున్నారు.

"యమనం యతిః విరామః జిహ్వేష్ట విశ్రామస్థానమితి యావత్ యదుక్తం కావ్యాదర్శే శ్లోకేషు విశ్రమస్థానం పదచ్ఛేదం యతింవిదుః" సంస్కృతంలో విచ్ఛేద మాత్రయతి ఉండగా, తెలుగులో యతి అందుకు భిన్నంగా పాదాద్యక్షర యతిమైత్రి విధిగా పాటింపబడుతూ ఉంది. యతి విషయంలో తెలుగు – సంస్కృతంలో ఉండే తారతమ్యాన్ని అనంతామాత్యుడీవిధంగా తెలిపాడు.

కం॥ ఎన్నిటి యతిరావలెనని
రన్నిట సంస్కృతము నందు నగువిచ్ఛేదం
బెన్నిట యతి రావలెనని
రన్నిట తెలుగునకు మొదటి అక్షరమమరున్.
(ఛం.ద. 1-129)

అంటే సంస్కృతంలో యతి విచ్ఛేదరూపంలో ఉంటే, తెలుగులో పాదాద్యక్షర యతి మైత్రి విధిగా ఉంటుందని భావం, అందుకే తెలుగులో యతి భేదాలు అనేకంగా కనిపిస్తాయి. స్వరవళులు (అచ్చుల మీద యతి మైత్రి చెల్లించేవి) వ్యంజనవళులు (హల్లుల మీద యతి మైత్రి చెల్లించేవి) ఉభయవళులు (ఉభయాక్షరాలమీద యతిమైత్రి చెల్లించేవి) అని ఇవి ప్రధానంగా మూడు విధాలు. ఇవి మరలా అవాంతర భేదాలతో రకరకాల పేర్లతో బహుళంగా ఉన్నాయి.

అభేదయతి, అఖండయతి, ఉభయయతి మొదలైన యతుల హంసవింశతిలో దాదాపు ఇరవైకి పైగా పేర్కొనబడినా అవి ఛందశ్శాస్త్ర గ్రంథాల్లో విపులంగా వివరింపబడి వున్నాయి కాబట్టి, వాటినన్నిటిని మరలా ఇక్కడ వివరించడం జరగలేదు.

ప్రాస :– "ద్వితీయో వర్ణః ప్రాసోత్ర పాద పాదేషు
కించప్రాసస్సర్వేషు చైక ఏవస్యాత్"
అని చింతామణి ప్రాసను నిర్వచించింది.

తెలుగు పద్యాల్లో ప్రతి పాదంలోని రెండవ అక్షరం ప్రాసమని పిలువబడుతుంది. ప్రాసలో హల్లులకే మైత్రి నియతంగా ఉంటుంది. హల్లులమీది స్వరమైత్రి అపేక్షితంగాదు. ప్రాసలో సాధారణంగా ఏ

హల్లున కాహల్లే మైత్రిగల్గి ఉంటుంది. యతిలో మాదిరి దీంట్లో సవర్ణాలు చెల్లవు. ప్రాస స్థానంలో ద్విత్వము, సంయుక్తము, పూర్ణబిందు పూర్వకము మొదలైన అక్షరాలు మొదటి పాదంలో ఉంటే మిగిలిన అన్ని పాదాల్లో కూడా అవే అక్షరాలు రావలసి ఉంటుంది.

కవి ప్రయోగాల్లో ప్రాసమైత్రీ విశేషాలు కలిపిస్తుండడాన్ని బట్టి ఛందశ్శాస్త్రకారులు, వాటినన్నిటిని పరిశీలించి కొన్ని ప్రాస భేదాల నేర్పరచి ఉన్నారు. ఛందశ్శాస్త్ర గ్రంథాలైన కవి జనాశ్రయం, చూడామణి ప్రాసభేదాలను పేర్కొనలేదు. అనంతుడు, చిత్రకవి పెద్దన పండ్రెండు ప్రాస భేదాలను పేర్కొన్నారు. లక్షణ విలాసం - ఇరవై. యతిప్రాస విలాసం - ఇరవై నాలుగు. లక్షణదీపిక - పదిహేను. లక్షణ శిరోమణి - పన్నెండు. కూచిమంచి తిమ్మకవి-ఏడు. రంగకవి-పన్నెండు. అప్పకవి – పన్నెండు. ప్రాస భేదాలను పేర్కొని ఉన్నారు. ఈ ప్రాసభేదాల్లో దాదాపు ఇరవై వరకు హంసవింశతిలో చెప్పబడ్డాయి. అవన్నీ సర్వసాధారణంగా అన్ని ఛందశ్శాస్త్ర గ్రంథాల్లోను దొరుకు తాయి కాబట్టి వాటినన్నిటిని ఇక్కడ వివరించడం జరగలేదు.

ఇరవై ఆరు ఛందస్సులు :-

గాయత్రి, ఉష్ణిక, అనుష్టుప్, త్రిష్టుప్, జగతీ, బృహతీ, పంక్తి అని ఋక్ ప్రాతిశాఖ్యాన్ని అనుసరించి, వైదిక ఛందస్సు ఏడు ప్రధాన విభాగాలుగా ఉన్నాయి.

మహాకావ్య యుగంలో లాక్షణికులు ఛందస్సుల నన్నింటిని ఇరువై ఆరు జాతులుగా విభజించారు. ప్రతి జాతిలోని ఛందస్సుకు నాలుగు చరణాలుంటాయి.

వైదిక ఛందస్సులో పేర్కొనబడిన గాయత్రి, ఉష్ణిక్, త్రిష్టుప్ బృహతి, పక్తి అనే ఛందస్సులకునూ, మహాకావ్య యుగంలో వెలసిన అవే శాస్త్రీయ ఛందో జాతులకునూ భేదం ఉంది. కాని అనుష్టుప్, జగతీ ఛందస్సుల్లో మాత్రం భేదం లేదు.

క॥ ఛందము లిరువది యారగు
నందుల వృత్తములు పుట్టిన పరిమితములై
ముందాది మకవి బృందము
లందొక కొన్నింటినొడవి రంచిత ఫణితన్.

(వా.వి.వ.మా. – 279)

పై పద్యంలో ఛందస్సులు ఇరవైఆరు అని టేకుమళ్ళ రంగశాయి కవి పేర్కొన్నారు. వాటి పేర్లను నారాయణ మాత్యుడు హంసవింశతి లో పట్టిక రూపంలో ఇచ్చాడు. ఏయే ఛందస్సులో ఏయే వృత్తాలు అవిర్భవిస్తాయో వీటినన్నిటిని ఇక్కడ వివరించడం జరిగింది.

ఉక్త :- ఈ చందస్సులో శ్రీవృత్తం ఒక్కటే వుంది.

అత్యుక్త :- దీనిలో స్త్రీవృద్ధి అను వృత్తం ఉంది.

మధ్య :- వినయ, నారీ, మృగీ అనే వృత్తాలు ఈ ఛందస్సులో ఉన్నాయి.

ప్రతిష్ఠ:—దీంట్లో బింబ, సుకాంతి, కన్య, వ్రీళ అనే వృత్తాలున్నాయి.

సుప్రతిష్ఠ :- దీనిలో సుందరి, ప్రసణ, అంబుజ, సతి, నంద, ప్రతి అనే వృత్తాలు గలవు.

గాయత్రి :- ఈ ఛందస్సులో విచిత్ర, తను మధ్య, సురలత, వసుధ, చంద్ర వదన, సావిత్రి, వసుమతి, అనే వృత్తాలున్నాయి.

ఉష్ణిక్ :- విభూతి, మదన విలసిత, కుమార విలసిత, కుమార లలిత, మదరేక, సురుచిర, హంస మాలిక, లోల, మధుమతి అనే వృత్తాలు ఈ ఛందస్సులో ఉన్నాయి.

అనుష్టుప్ :- ఈ ఛందస్సులో గల వృత్తాలు - విద్యున్మాల, చిత్రపధ, మాణవక, ప్రమాణి, సమాని, సింహరేఖ, హంసరుత, నారాచక, నాగరక, వితాన, విమాన మొదలైనవి.

బృహతి :- దీనిలో భుజగ, శిశురుత, హలముఖి, భద్రక అనే వృత్తాలు కలవు.

పంక్తి .- రుగ్మవతి, మత్త, మయూరసారి, శుద్ధ విరాటి, పణవ,

మణిరంగ, కౌముది, మనోరమ, చంపకమాలి, నంది, వీర విలసితోర్మి, పంక్తి, రసాలి - వృత్తాలు ఈ ఛందస్సులో ఉన్నాయి.

త్రిష్టుప్ :- దీనిలో శాలిని. ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర, రథోద్ధత, చంద్రిక, రథాగత, కాంత, శ్యేణి, వాతోర్మి, తోదక, ఉపస్మిత, సుముఖి, భ్రమర విలసిత, వృత్త, పృథివి, వృంత, మౌక్తిక మాల, శిఖండి, విరుతి, ఏకరూప అనే వృత్తాలు కలవు.

జగతి:- ఈ ఛందస్సులో భుజంగ ప్రయాత, తోటక, ఇంద్రవంశ, వంశస్థ, ద్రుత విలంబిత, తోదక, స్రగ్విణి, జలధర మాల, ప్రియంవద, ప్రమితాక్షర, జలోద్ధత గతి, విశ్వదేవి, ప్రహేయ, చంద్రవర్త్మ, ప్రముదిత వదన, కుసుమ విచిత్ర, మణిమాల, లలిత, నవమాలిని, మేఘవిలసిత, పదమాలి, ఉజ్వల - వృత్తాలున్నాయి.

అతి జగతి:- ఈ ఛందస్సులో ప్రహర్షిణి, రుచిర, మత్త మయూర, మంజుభాషిణి, జలద, ప్రభాత, క్షమ, చంచరీక, మత్త హాసిని, సుమంగళి, చంచరీకావతి అనే వృత్తాలు కలవు.

శక్వరి :- వసంత తిలక, పరాజిత, వనమయూర, ప్రహరణ కలిత, హంస బాధా, భూనుత, జలధర, సుందర, కమల విలసిత, నవ నందిని వృత్తాలు ఈ ఛందస్సులో కలవు.

అతిశక్వరి :- ఈ ఛందస్సులో మణిభూషణశ్రీ, అలసగతి, మాలిని, సుకేసర, మనోజ్ఞ, మణిగణ నికర, స్రజ, హంసయాన, ఇల; చంద్రరేఖ, నళిని, - వృత్తాలున్నాయి.

అష్టి :- దీనిలో పద్మ, ప్రియకాంత, చంద్రశ్రీ, మోదిని, వాణి, పంచ చామరం, మదన దర్ప, ఫల సదన, గజవిలసిత, అశ్వగతి అను వృత్తాలున్నాయి.

అత్యష్టి :- శిఖరిణి, సుగంధి, హరిణి, పలాశదళ, మందాక్రాంత, నర్కుట, వదకోకిల కాంక, పృథ్వీ, వంశపత్రి పతిత, చంపక కేసరి అనే వృత్తాలు ఈ ఛందస్సులో ఉన్నాయి.

ధృతి :- ఈ ఛందస్సులో కుసుమ లతా కేల్లిత, మత్తకోకిల, హరిణప్లుత, అతివినయ, త్వరితపదగతి, క్ష్మాహర, నిషా, హరనర్తన అను వృత్తాలున్నాయి.

అతిధృతి :- దీనిలో శార్దూల విక్రీడిత, మేఘ విస్ఫూర్జిత, తరళ, చంద్రకళ, భూతిలత, శుభిక, కంఠభూషణ అనే వృత్తాలున్నాయి.

కృతి :- ఈ ఛందస్సులో మత్తేభ విక్రీడిత, ఉత్పలమాల, అంబురుహ, కచరప్లుత, ప్రభాకలిత, సువదన, అనే వృత్తాలున్నాయి.

ప్రకృతి :- ఈ ఛందస్సులో స్రగ్ధర, చంపకమాల, లాటీవిట, వనమంజరి, మణిమాల, కనకలత, కరిబృంహిత అనే వృత్తాలు కలవు.

ఆకృతి :- దీనిలో మహాస్రగ్ధర. సుభద్రక, మానిని, తురగ, మద్రక, విచికిలిత – అనే వృత్తాలుంటాయి.

వికృతి :- ఈ ఛందస్సులో అశ్వలలిత, కవిరాజవిరాజిత, పద్మనాభ, మత్తాక్రీడ - అను వృత్తాలున్నాయి.

సంకృతి :- సరసిజ, క్రౌంచపదం, అష్టమూర్తి, తన్వి అనే వృత్తాలు ఈ ఛందస్సులో కలవు.

అభికృతి :- దీనిలో చందుర, భాస్కర విలసిత, జలదరవ అనే వృత్తాలున్నాయి.

ఉత్కృతి :- ఈ ఛందస్సులో భుజంగ విజృంభిత, అపవాహ, వరాహ, మంగళ మహాశ్రీ అనే వృత్తాలు కలవు.

పై విషయాలను పరిశీలిస్తే ఇరవై ఆరు వైదిక ఛందస్సుల నుండి అసంఖ్యాకములైన వృత్తాలనబడే పద్యాలు ఆవిర్భవించాయని తెలుస్తున్నది. ఇవన్నీ కూడా సంస్కృతంలో ప్రచారంలో ఉండవచ్చునేమోగాని, తెలుగులో వీటిలో ఉత్పల, చంపకాది కొన్ని వృత్తాలు మాత్రమే బహుళ ప్రచారంలో ఉన్నాయి. వీటి లక్షణాలన్ని ఛందశ్శాస్త్ర గ్రంథాల్లో విపులంగా చర్చించబడి ఉన్నాయి.

ఈ ఇరవై ఆరు ఛందస్సుల నుండే పదాలు కూడా ఆవిర్భవించినట్లు భరతుడు నిర్దేశించిన విధానాన్ని ఆంధ్ర వాగ్గేయకారుల చరిత్ర అనే గ్రంథంలో బాలాంత్రపురజనీ కాంతరావు పేర్కొన్నాడు.

"నిబద్ధంచానిబద్ధంచ తత్పదం ద్వివిధంస్మృతమ్
అతాళంచ సతాళంచ ద్విప్రకారంచ తద్భవేత్
సతాళంచ ధ్రువార్థేషు నిబద్ధం తచ్ఛవైస్మృతమ్"

నియతాక్షర సంబంధం కల్గి యతితోనూ, తాళంతోనూ కూడిన పదం నిబద్ధ పదం. యతి ప్రాస నియమాలు లేకుండా అనియతాక్షరమైన పదం అనిబద్ధ పదం.

నిబద్ధ పదాల్లో ప్రధానమైనవి వృత్తపదాలు. ఇవి సమ వృత్తాలు, అర్ధ సమవృత్తాలు, విషమ వృత్తాలనీ మూడు రకాలు. ఉక్త, అత్యుక్తాధి ఇరివై ఆరు ఛందస్సుల నుండి వృత్తాలను తీసుకొని ధ్రువా ధ్యాయంలో పదాలుగా భరతుడు లక్షణం చెప్పాడు. శ్రీ ప్రతిష్ఠ సుప్ర తిష్ఠ, విద్యుద్భ్రాంత మొదలైనవి, రెండు వందల వరకూ పదాలను చెప్పి వీటినే ధ్రువ పదాలుగా నిర్దేశించాడు. (ఆంధ్ర వాగ్గేయ కారుల చరిత్ర - 56, 57) దీనిని బట్టి పద సాహిత్యానికి కూడా ఈ వైదిక ఛందస్సే మూలమని తెలుస్తుంది.

## నిఘంటువులు

నిఘంటువులు నిరుక్తానికి ఉపభాగాలు లేదా అనుబంధాలని చెప్ప వచ్చును. నిరుక్తం వేదాలలోని నామవాచకాలను, క్రియలను వివరి స్తుంది. నిఘంటువులు నామవాచకాలను, అవ్యయాలను, క్రియలను వివరిస్తాయి. వైదిక శబ్దరూపానికి, తదర్థ విజ్ఞానానికి నిరుక్తం, ప్రాతి శాఖ్యలు ఏవిధంగా సహాయపడుతున్నాయో అదేవిధంగా లౌకిక శబ్దార్థ రూపవిజ్ఞానానికి నిఘంటువులు, వ్యాకరణాలు ఉపయోగపడుతున్నాయి.

పూర్వ నిఘంటువులు నామవాచకాది పదాలను, పట్టికల రూపంలో శ్లోకాల్లో చెప్పేవి. వీటిని ఆనాటి విద్యార్థులు కంఠస్థం చేసేవారు. ఈ నిఘంటువులు రెండు విధాలుగా ఉండేవి. పర్యాయ లేక ఏకార్థవాచ కాలను తెలిపే నిఘంటువులు (*Syncnyms*). సజాతీయ పదసంబంధ మైనవి. (*Hom nyms*). పర్యాయ పద నిఘంటువుల్లో విషయాన్ని బట్టి లేదా లింగవిభాగాన్ని అనుసరించి పదాలను కూర్చేవారు. అదేవిధంగా నామవాచకాలను, అవ్యయాలను ఇలా ఏదో ఒకదానిని బట్టి నిఘంటు వులను తయారుచేసేవారు. సంస్కృతంలో ఉండే ఈ పద్ధతే తెలుగులోనికి కూడా వచ్చింది. తత్ఫలితంగా తెలుగులోని ప్రాచీన నిఘంటువులన్నీ సంస్కృత నిఘంటువుల మార్గంలోనే తయారు చేయబడుతుండేవి. హంసవింశతి నాటి విద్యావిధానంలో నిఘంటువుల కంఠస్థం చేసే పద్ధతి

ఉండి ఉంటుంది. కాబట్టే అనాడు ప్రచారంలో నున్న ఈ విధమైన నిఘంటువులు హంసవింశతిలో దాదాపు ఇరవైదాక పేర్కొనబడ్డాయి. వాటినిచ్చట అకారాది క్రమంలో నిఘంటు రచనాకాలం, రచయిత పేరు, విషయవిశ్లేషణతో సంక్షిప్తంగా వివరించడం జరుగుతుంది.

అజయపాల :- క్రీ.శ. 1075 - 1140 ప్రాంతంలో "నానార్థ రత్నమాల" అనే పేరుతో ఒక నిఘంటువును అజయపాలుడనే బౌద్ధసన్యాసి నిర్మించాడు. దీనికే నానార్థ సంగ్రహమని, అజయపాల నిఘంటువని వ్యవహారంలో పేర్లున్నాయి. ఈ నిఘంటువు శ్లోకాలతో కూర్చబడింది. దీనికి గద్యాత్మకమైన వివరణ వచ్చింది. కాని రచయిత పేరు లేదు. ఈ నిఘంటువు అముద్రితం. దీని వ్రాతప్రతులు తంజావూరు లైబ్రరీలో ఉన్నాయి. (*H.S L.* 193, ఆ సం.వా.చ. II 440)

అమరం :- సంస్కృత నిఘంటువుల్లో ఇది బహుళ ప్రచారాన్ని పొందింది. ఇది శ్లోకరూపంలో మూడుకాండలుగా విభజింపబడి ఉంది. ఈ నిఘంటువు ప్రతి కాండం చివరలో "ఇత్యమర సింహకృతే" అని ఉండడం మూలంగా ఈ నిఘంటువు రచయిత అమరసింహుడని తెలుస్తున్నది.

శ్లో॥ "ధన్వంతరి క్షపణ కామరసింహశంఖు
బేతాళ భట్టఘటకర్ప కాళిదాసాః
ఖ్యాతో వరాహ మిహిరో నృపతే సభాయాం
రత్నానివై వరరు చిర్నవ విక్రమస్య"

అను శ్లోకాన్నిబట్టి అమరసింహుడు విక్రమాదిత్యుని కొలువులో నున్న నవరత్నాల్లో ఒకడని తెలుస్తుంది. ఇతడు క్రీ.శ. 600 ప్రాంతం వాడని పండితుల అభిప్రాయం. అమరం లింగభేదాన్ని అనుసరించిన పర్యాయ పదకోశం.

అమరకోశంలోని మూడుకాండలు, మరలా వర్గాలుగా విభజింపబడి ఉన్నాయి. దిక్, కాల, ధీ, వాక్, శబ్దాది, నాట్య, పాతాళ, భోగి, నరక వంటి వర్గాలు మొదటి కాండలో చెప్పబడ్డాయి. ద్వితీయ కాండలో

భూమి, పుర, శైల, వనౌషధి, సింహాది, మనుష్య, బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రవర్గాలున్నాయి. తృతీయకాండలో విశేష్య, నిఘ్న, సంకీర్ణ, నానార్థ, నావార్థావ్యయ. అవ్యయ, లింగాది సంగ్రహవర్గాలు చెప్పబడ్డాయి.

అమరకోశానికి దాదాపు 50 దాక వ్యాఖ్యలు వచ్చాయి. వానిలో క్షీరస్వామి వ్రాసిన "అమరకోశోద్ఘాటనం" పేర్కొనదగినది.(అ.కో.పీఠిక.) అమరకోశంలోని ప్రతి ఖండంలో చివర గ్రహింపబడిన వర్గాల పేర్లను వరుసగా పేర్కొంటూ ఒక శ్లోకం ఉంటుంది. ఇది ఏ వర్గంలో ఏ శబ్దం ఉందో గ్రహించడానికి సులభమార్గాన్ని సూచిస్తుంది.

అమరశేషం :- అమరకోశానికి అమరశేషం, అనుబంధం. దీనికే త్రికాండ శేషమనే మరోపేరు కూడా ఉంది. క్రీ.శ. 1170లో బెంగాలును పాలించిన లక్ష్మణసేన మహారాజు కాలంలోనున్న పురుశోత్తమ దేవుడు ఈ కోశాన్ని కూర్చాడు. (*H.S L. 194*).

అమరశేషం, అమరకోశంలోని లోపాలను పూరించి, దానికెంతో వన్నె తెచ్చింది. దీనివల్ల రచయితకు గొప్ప కీర్తిప్రతిష్ఠలు వచ్చాయి. "అలౌకికత్వాద మరస్యకోశే, నయాని నామానిస ముల్లలేఖ............ పరిభాషాదికం సర్వమత్రాప్యమర కోశవత్" అనే వ్యాక్యాలను బట్టి పైన దెలిపిన విషయాలు నిర్ధారణ అవుతున్నాయి. అమరశేషంలో దాదాపు 800 శ్లోకాలున్నాయి. పురుషోత్తముడు కవిప్రయుక్త పదాలనే తీసుకొన్నాడు. అప్రయుక్తమైన పదాలు ఇతర నిఘంటువుల్లో ఉన్నా ఇతడు గ్రహించలేదు. (సం.వా.చ. II-436).

ఏకాక్షర నిఘంటువు :- ఈ గ్రంథాన్ని కూర్చినవాడు మాధవాచార్యుడు. దీనికి "ఏకాక్షర రత్నమాల" అనే పేరు కూడా ఉంది. ఏకాక్షర కోశం అనే మరో నిఘంటువు గలదు. ఇది ఏకాక్షర పదాలను వివరించే నిఘంటువు. దీని కర్త వరరుచి. కాని కొందరు ఇది వరరుచి కూర్చిన నిఘంటువు కాదని, ఎవరో అర్వాచీనుడు వరరుచి పేర ఈ నిఘంటువును ఇకూర్చాడని అభిప్రాయ పడుతున్నారు. ఇది చాలా చిన్న నిఘంటువు ందర్ర నిఘంటువని దీనికి మరోపేరు కూడా ఉంది. (సం.వా చ. II-442).

కేశవ :- ఈ పేరుతో రెండు నిఘంటువులు కనిపిస్తున్నాయి. క్రీ. శ. 12వ శతాబ్దారంభంలో కేశవస్వామి కూర్చిన నానార్థార్ణవ సంక్షేప ఒకటి. ఇది సజాతీయ పదాలకు సంబంధించిన నిఘంటువు. (*A Lexicon on Homonims*). ఈ నిఘంటువు పద పదార్థాలను, లింగ విభాగాన్ని తెలిపే విధంగా కూర్చబడింది. *(H. S. L. 193)*.

రెండవది క్రీ. శ. 1600 ప్రాంతంలో కేశవ దైవజ్ఞుడు కూర్చిన "కల్పద్రు" అనే నిఘంటువు. ఇది పర్యాయ పదాలకు సంబంధించిన నిఘంటువు. *(A Lexicou on Syn nyms)*. పర్యాయ పద నిఘంటువుల్లో ఇంత గొప్పది లేదనవచ్చును. ఈ నిఘంటువు భూ భు, వ, స్వర్గ, అనే పేర్లతో మూడు స్కంధాలుగా విభజింపబడింది. భూ స్కంధంలో 18 ప్రకాండలు, భువ స్కందంలో 5 ప్రకాండలు, స్వర్గ స్కందంలో 4ప్రకాండలూ, ఉన్నాయి. ఇది 4000 శ్లోకాలు గల నిఘంటువు.

(సం.వా.చ II-446).

క్షీరస్వామి :- అమర కోశోద్ఘాటనం అనే పేరుతో క్షీరస్వామి అమర కోశానికి వ్యాఖ్యానం వ్రాసాడు. ఇది అమరానికి వ్రాయబడిన వ్యాఖ్యానాల్లో మొదటిది. ప్రముఖమైంది కూడా. ఇతని పూర్తి పేరు భట్ట క్షీరస్వామి. క్రీ. శ, 1140 ప్రాంతంలోని వాడైన వర్ధమానుడు తన "గణరత్న మహోదధి"లో ఇతన్ని పేర్కొనడంచేతనూ, ఇతడు, రాజశేఖర, భోజమహారాజుల తన వ్యాఖ్యానంలో పేర్కొనడం చేతనూ, ఇతడు క్రీ.శ. 1 00 ప్రాంతంలో జీవించి ఉంటాడని చెప్పవచ్చును. ఇతని అమర కోశోద్ఘాటన వ్యాఖ్యానం సులభంగానూ, సమిర్శకంగానూ, ఉండడమే కాకుండా, ఇందులో పూర్వగ్రంథాల్లోని అనేక శబ్దాలు ఉదహరింపబడినాయి. (సం.వా.చ. II-433).

చింతామణి :- ఇది అభిదాన చింతామణి కావచ్చును. దీనికి "నామమాల" అనే మరో పేరు ఉంది. నిఘంటు శేషం అనే అనుబంధ కోశం కూడా ఉంది.ఇది వృక్ష శాస్త్రానికి సంబంధించిన పదాలను వివరించే నిఘంటువు. క్రీ శ. 11వ శతాబ్దంలోని వాడైన హేమచంద్రుడు దీని కర్త.

*(H. S. L. 194)*

తారపాల :- తారపాలుడు నిర్మించిన ఈ నిఘంటువు ఇప్పుడు లభ్యం కావడం లేదు. సర్వానందుడు మరికొందరు వ్యాఖ్యాతలు తారపాలుని పేరును స్మరించి వుండడం వల్ల ఇతడొక కోశ నిర్మాత అయివుండ వచ్చునని భావించడానికి వీలున్నది. (సం.వా.చ. II-440). ఇది అలభ్యం కాబట్టి వివరాలేమి తెలియవచ్చుటలేదు.

ధనంజయ ;- జైన మతస్తుడైన ధనుంజయుడు కూర్చిన నామమాల నిఘంటువుకే ధనంజయ కోశమని పేరు. ఇతడు "ద్విసంధానం" అనే గ్రంథాన్ని కూడా వ్రాసినట్లు ఈ నిఘంటువులో చెప్పుకొన్నాడు. ధనుంజయుడు క్రీ. శ. 1123 ప్రాంతంలోని వాడని తెలుస్తున్నది, ఈ నిఘంటువులో సంకీర్ణ, నానార్థాలనే రెండు పరిచ్ఛేదాలున్నాయి. 1933 లో వావిళ్ళ వారు ఈ నిఘంటువును ప్రచురించారు. (సం. వా. చ. II-440 & ధ. ని. పీఠిక).

ధన్వంతరి :- ఇది వైద్య శాస్త్రానికి చెందిన నిఘంటువు. ధన్వంతరి క్షపణకామర సింహ అను శ్లోకాన్ని బట్టి విక్రమాదిత్యుని ఆస్థానంలోని నవరత్నాల్లో ఒకడైన ధన్వంతరి ఈ నిఘంటు నిర్మాత అయి ఉంటాడని భావించడానికి వీలున్నది. ఈ నిఘంటువు అమరసింహునికి పూర్వమే నిర్మింపబడినట్లు తెలుస్తున్నది. గుడూచ్యాది వర్గం, శతపుష్పాది వర్గం. చందనాది వర్గం, కరవారాది, ఆమ్రాది వర్గం, సువర్ణాది వర్గం, మిశ్రమాది వర్గం. అని ఈ నిఘంటువు ఏడు వర్గాల్లో కూర్చబడి ఉంది.

ధరణి :- ధరణీ (శ్రు౦. గ్రం.). ధరణీదాసుడు నిర్మించిన నిఘంటువు కాబట్టి దీనికి ధరణి అన్ని పేరు వచ్చింది. కాని అలాంటి నిఘంటువు ఏదీ ఇప్పుడు లభ్యం కావడంలేదు. సర్వానందుడు, మొదలైన వ్యాఖ్యాతలు కొందరు ఇతనిని పేర్కొని, కొన్ని వాక్యాల్ని ఉదహరించడం వల్ల ధరణీదాసుడు ఒక కోశకర్త అని మాత్రం తెలుస్తున్నది. (సం. వా. చ. II 441).

నానార్థ రత్నమాల :- నానార్థ రత్నమాలిక (శ్రు౦. గ్రం). ఇది నానార్థాలను తెలిపే నిఘంటువు. ఇది గ్రంథకర్త కొన్ని వ్రాతప్రతుల్లో

భాస్కరుడని, కొన్నిట్లో ఇరుగపదండ నాథుడని ఉండడంవల్ల కర్తృత్వ నిర్ణయం సందిగ్ధంగా ఉంది. ఆంధ్ర లిపిలో ముద్రితమైన నానార్థ రత్నమాలలో-

"శ్రీమానిరుగప దండేశో నాత్యల్పం నాతి విస్తరం
ఇతి జగదుపకారిణ్యామిరుగప దండాది నాథ రచితాయామ్"

అని ఉంది కాబట్టి దీని రచయిత ఇరుగప దండనాథుడే అయి ఉంటాడని భావించవచ్చును. ఇతడు క్రీ. శ. 1377 - 1404 ప్రాంతంలో రెండవ హరిహరునకు మంత్రిగా ఉన్నట్లు తెలుస్తూంది.

నానార్థ రత్నమాలలో ఏకాక్షర, ద్వ్యక్షర, త్ర్యక్షర, చతురక్షర, సంకీర్ణ, అవ్యయాలనే ఆరు కాండలున్నాయి. దీనిలోని ప్రతి కాండంలోనూ, "క" కారం మొదట "క్ష" కారం వరకు గల వర్ణాల అంతమందు గల శబ్దాలూ, వాని వివిధార్థాలు క్రమ పద్ధతిలో పేర్కొనబడినాయి. ప్రాచీన నిఘంటువుల్లో ఇది ఒక విధంగా అక్షరక్రమంలో నిర్మించిందని చెప్ప వచ్చును. ఈ నిఘంటువులో 1265 శ్లోకాలున్నాయి. పంద్యభట్టు దీనికి వ్యాఖ్య రచించినట్లు తెలుస్తుంది. కాని అది ముద్రణ భాగ్యాన్ని నోచుకో లేదు. ఈ నిఘంటు నిర్మాణంలో పూర్వ పద్ధతులనే అవలంభించినప్పటికి చక్కని రచనా ప్రణాళికతో నిర్మింపబడిన నిఘంటు విది. (నా.ర.మా.) (సం.వా,చ. II 443).

మాధవ :- క్రీ. శ. 1377-1404 ప్రాంతంలో విజయనగరాన్ని ఏలిన రెండవ హరిహరరాయుల మంత్రి మాధవాచార్యుడు. ఇతడు ఏకా క్షర రత్నమాల అనే పేరుతో ఒక నిఘంటువును నిర్మించాడు. ఈ నిఘం టువులో ఒక్కొక్క అక్షరానికి గల అనేక అర్థాలు వివరింపబడ్డాయి. *(H. S. L. 197)* ఏకాక్షర రత్నమాల, గ్రంథకర్త పేరుతో మాధవ నిఘం టువు అనే ప్రసిద్ధికెక్కింది. అందువల్ల హంసవింశతిలో నారాయణమా త్యుడు దీన్ని "మాధవ"మనే పేర్కొన్నాడు. (చూడు. ఏకాక్షర నిఘంటువు)

మేదిని :- పా. భే. అకార. (శృం. గ్రం.). మేదినీ కోశాన్ని నానార్థ నిఘంటువు అని కూడా అంటారు. దీనిని మేదినీ కరుడు నిర్మిం చడం వల్ల దీనికి మేదిని అనే వ్యవహారం స్థిరపడింది. ఇతడు క్రీ. శ. 12వ శతాబ్దం వాడని తెలుస్తుంది. ఈ నిఘంటువు చాలా వరకు విశ్వప్ర

కొశం అనే కోశాన్ని పోలి ఉంటుంది. పద్మనాభదత్త, మల్లినాథుడు వంటి వారు తమ వ్యాఖ్యల్లో "మేదిని"ని స్మరించడం వల్ల, ఇది బహుళ ప్రచారాన్ని పొంది ఉంటుందని భావించవచ్చును. (సం.వా చ, II-442), "అకార" (శృం. గ్రం.) :– క్రీ. శ. 12వ సతాబ్దివాడగు హేమచంద్రుడు "అనేకార్థ సంగ్రహం" అనే నిఘంటువును నిర్మించాడు. ఇది ఆరు కాండల కోశం. ఇందులో అకారాది, కాది (క+ఆది) క్రమంలో రచయిత శబ్దార్థాలను సమకూర్చాడు. (సం.వా.చ. *II*–441). అనాటి నిఘంటు రచనా ప్రణాళికల్లో అకారాది, కాది క్రమంలో శబ్దార్థాలను గూర్చడం క్రొత్త పద్ధతి, అంటే నేటి నిఘంటు రచనా ప్రణాళిక ఆనాడే మనకు కనిపిస్తుందన్నమాట. కాబట్టే దీనికి అకారాది నిఘంటువనే పేరు స్థిరపడి ఉంటుందని భావించవచ్చును.

యాదవ వైజయంతి ,– రామానుజాచార్యుల గురువు యాదవ ప్రకాశకుడు "వైజయంతి" అనే పేర ఒక నిఘంటువును నిర్మించాడు. క్రీ. శ. 1050 – 1100 మధ్యకాలంలో జీవించిన ఈ రచయిత కాంచీపుర నివాసి. స్వర్గ, అంతరిక్ష, భూమి, పాతాళ, సామాన్య, ద్వ్యక్షర, త్ర్యక్షర, శేష అనే ఈ నిఘంటువు ఎనిమిది కాండల్లో స్త్రీ, పుం, నపుంసక అధ్యాయ విభాగాల్లో నిర్మితమై ఉంది. రచనా ప్రణాళికలో ఇది హలాయుధ కోశాన్ని పోలి ఉన్నా దానికంటే విపులంగా ఉందని చెప్పవచ్చును. (సం.వా.చ. *II* 438).

రభస :– ఇది రభస పాలుడు నిర్మించిన నిఘంటువని తెలుస్తున్నది. గ్రంథకర్త పేరుతోనున్న దీని అసలు పేరు ఏమిటో తెలియవచ్చుట లేదు. "ఇతి రభసః" అని సర్వానందుడు మొదలైన వ్యాఖ్యాతలు అందొకటి రెండు వాక్యాలు ఉదహరించడం వల్ల రభస పాలుడు ఒక నిఘంటువు నిర్మాత అని మాత్రం తెలుస్తుంది. (సం.వా.చ. *II* 441).

వాగురి :– భాగురుడు "త్రికాండకోశం" అనే నిఘంటువును నిర్మించాడని చాలమంది పండితులు అభిప్రాయ పడుతున్నందువల్ల, వాగురి అనే దాన్ని భాగురిగా స్వీకరిస్తే సరిపోతుంది. (వబయోరభేదః కదా!). క్షీరస్వామి అమరకోశ వ్యాఖ్యలో భాగురి పేరుతో చాలచోట్ల

అనేక శ్లోకపాదాలను ఉదహరించినాడు. కాని "త్రికాండ" కోశమనే పేరు చెప్పలేదు. సర్వానందాది వ్యాఖ్యాతలు త్రికాండ కోశాన్ని పేర్కొన్నారు కాని భాగురి పేరు ప్రస్తావించ లేదు. అయితే ఈ వ్యాఖ్యాతలు ఉధహరించిన శ్లోకపాదాలు ఒకటే కావడంవల్ల త్రికాండ కోశాన్ని భాగురి నిర్మించి ఉంటాడని చెప్పవచ్చును. (సం.వా.చ. II-430).

విశ్వ :- ఈ నిఘంటువును విశ్వరూపుడు నిర్మించాడు. ఇప్పుడు ఈ నిఘంటువు లభించుటలేదు. అయితే ఈ నిఘంటువును వ్యాఖ్యాతలు ఉదహరించటం వల్ల ఒకప్పుడు ఈ "విశ్వ" నిఘంటువు ఉండేదని భావించడానికి అవకాశం ఉంది. (సం.వా.చ. II-441).

విశ్వప్రకాశం:- ఇది ఒక గొప్ప నిఘంటువు. క్రీ.శ. 11వ శతాబ్దంలో మహేశ్వరుడు ఈ కోశాన్ని నిర్మించాడు. బహుళ ప్రచారాన్ని పొందిన ఈ నిఘంటు రచనా ప్రణాళికను గ్రంథకర్త ఒక శ్లోకంలో ఇలా వివరించాడు. "ఏకద్విత్రిచతుః పంచ షడ్వర్ణానుక్రమోజ్వలైః కాంతాది వర్గఃనానార్థ సంగ్రహోయం విధీయతే". విశ్వప్రకాశంలోని శబ్ద విభాగం కైకక (క+ఏక) కద్వికి, కత్రిక, ఇత్యాదిగా ఉంటుంది. మహేశ్వరుడే విశ్వప్రకాశానికి అనుబంధంగా "శబ్దభేదప్రకాశం" అనే దాన్ని నిర్మించాడు. విశ్వప్రకాశంలో సంస్కృత వాఙ్మయంలోని పదజాలం చాలావరకు అర్థ, లింగ భేదాలతో కనిపిస్తుంది. (*H.S.L.* 1934 & సం.వా.చ. II-4384 & వి.ప్ర. పీఠిక),

శబ్దార్ణవం:- "శబ్దార్ణవ ఉత్పలినీ సంసారావర్త ఇత్యపి కోశో వాచస్పతి వ్యాడి విక్రమాదిత్య నిర్మితాః"

పైన పేర్కొన్న పురుషోత్తమ దేవుని శ్లోకాన్నిబట్టి వాచస్పతి అనే పండితుడు "శబ్దార్ణవం" అనే నిఘంటువును నిర్మించినట్లు తెలుస్తుంది. హేమచంద్రుని అభిదాన చింతామణి వ్యాఖ్యలో ఇతని ప్రశంస ఉంది. ఈ నిఘంటువు పేరుకు తగినట్లు రూపాంతరాలతో ఉన్న శబ్దాలను శబ్దార్ణవంలో కూర్చబడినట్లు త్రికాండ, చింతామణి వంటి గ్రంథాల్లో ఉదహరించిన వాట్ని బట్టి తెలుస్తుంది. ఇంతకుమించి ఈ గ్రంథానికి సంబంధించిన వివరాలు ఇప్పటికి దొరకలేదు. (సం.వా.చ. II-430)

శాశ్వత :- ఈ నిఘంటు నిర్మాత శాశ్వతుడు కాబట్టి దీనికీపేరు వచ్చి ఉంటుంది. దీనికి "అనేకార్థసముచ్చయం" అనే పేరు కూడ ఉంది. దీనిలో ఎనిమిది వందల శ్లోకాలున్నాయి. క్షీరస్వామి ఇతనిని పేర్కొన డంవల్ల ఇతడు క్రీ.శ. 6వ శతాబ్దం వాడని తెలుస్తుంది. ఈ నిఘంటువులో గ్రంథకర్త మొదటి మూడు భాగాల్లోనూ శబ్దార్థాలను చక్కగా వివరించాడు. మిగిలిన భాగాల్లో అవ్యయాదుల రూపాలు చెప్పాడు. ఇది చాలమంది వ్యాఖ్యతలకు ప్రామాణికమైన నిఘంటువు. (సం.వా.చ. II-437).

శుభాంక :- శుభాంగ (శ్రం. గ్రం.). మహేశ్వరుడు తన విశ్వ ప్రకాశ నిఘంటువుకు, భోగీంద్రుడు, కాత్యాయనుడు, సాహసాంకుడు. వాచస్పతి, వ్యాడి, విశ్వరూపుడు, శుభాంగుడు, భాగురుడు, గోపాలితుడు మున్నగు వారు రచించిన గ్రంథాలెన్నో తాను విశ్వకోశాన్ని నిర్మించేందుకు ఉపకరించాయని, విశ్వ కోశ నిర్మాత మహేశ్వరుడు చెప్పుకొన్నాడు. దీనిని బట్టి శుభాంగుడు ఒక నిఘంటు కర్త అనీ, ఇతడు మహేశ్వరుని కంటె పూర్వుడని తెలుస్తున్నది. (వి ప్ర. పీఠిక.) నిఘంటువు అలభ్యం.

హలాయుధ :- హలాయుధుడు నిర్మించిన నిఘంటువు కాబట్టి దీనికి వ్యవహారంలో హలాయుధ అనే పేరు స్థిరపడింది. దీనిలో స్వర్గ, భూమి, పాతాళ, సామాన్య, అనేకార్థ లనే అయిదు కాండలున్నాయి, ప్రతి కాండంలోనూ స్త్రీలింగ, పుంలింగ, నపుంసకలింగ, నానార్థ లింగాది సంజ్ఞలతో అధ్యాయాలున్నాయి. ఈ నిఘంటు నిర్మాత హలాయుధుడు మాన్య ఖేటాధిపతియైన మూడవ కృష్ణ రాజుకు సమకాలికుడువడంచేత ఇతడు క్రీ. శ. 950 ప్రాంతం వాడని చెప్పవచ్చును. (సం.వా.చ. *II* 437).

## వేదాలు

ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణవేదం అని వేదాలు నాలుగు. వేదాలు అనాదులనీ, అపౌరుషేయాలనీ భారతీయ సంప్రదాయం చెప్తుంది. ఆధునికులు ఈ భావాన్నొప్పుకొనరు. ప్రాచీన మానవుని ప్రకృతి పరిశీలనలోంచి, నిర్మించబడినవి వేదాలు అని ఆధునిక విమర్శకుల అభిప్రాయం.

వేదాల్లో ప్రాచీనమైంది ఋగ్వేదం. క్రీ. పూ. 1500 ప్రాంతంలో ఋగ్వేదం రచింపబడి ఉంటుందని మాక్సుముల్లరు అభిప్రాయం. బాల గంగాధర తిలక్ మాత్రం క్రీ. పూ. 4500 ల నాటిదని నిర్ణయించారు. (సం.వి.కో. II 573) ఈ విధంగా వేదకాల నిర్ణయంలో భేదాభిప్రాయా లున్నాయి.

అర్ష మహర్షులు సందర్శించిన అనేక విషయాలు మంత్రరూపంలో ఏకరాశిగా ఉన్నవాటిని తరువాతి మహర్షులు వృత్తరూపంలో ఉన్న మంత్రాలను ఋక్కులుగానూ, గీతరూపంలో ఉన్న వాటిని సామములు గానూ, వృత్తగీత రూపాల్లో ఉన్నవాటిని యజస్సులుగానూ విభజించారు. వారే త్రైవిధులనబడు మహర్షులు. పై మూడు వేదాలవలె అధర్వణ వేదం యజ్ఞోపయుక్తం గాకుండుటను కనిపెట్టి అధర్వణ శాఖ వారు యజ్ఞోపయోగిగా ఒక కాండను చివర్లో చేర్చినారు. నాటి నుండి అది కూడ ప్రాముఖ్యతను పొంది వేదాల్లో నాల్గోదయింది. (వి. స. VI 172).

ఋగ్వేదం :- ఇందులోని మంత్రాలు ఋక్కుల రూపంలో ఉండటం వల్ల ఇది ఋగ్వేంగా ప్రసిద్ధి పొందింది. భారతీయ విద్యలకు ఓంకారం, ప్రపంచ వాఙ్మయానికి శ్రీకారం అనదగింది ఋగ్వేదం. ఈ వేదంలోని ఋక్కులను శౌనకుడు సూక్తాలు, అనువాకాలు అని విభజించి, అందులోని ముఖ్యమైన భాగాలకు "మండలాలు" అని పేరు పెట్టాడు. అలాగే కాత్యాయన మహర్షి ఋక్కులను "వర్గాలు" అధ్యాయాలుగా విభజించి ప్రధాన భాగాలకు "అష్టకాలు" అని నామకరణం చేశాడు. అలాంటివి ఋగ్వేదంలో ఎనిమిది అష్టకాలున్నాయి. అయా ప్రతులను బట్టి ఋగ్వేదంలోని ఋక్కుల సంఖ్య వేరువేరుగా ఉంది. వీనిని చక్కగా పరిశీలించగా ఋగ్వేదంలో మొత్తం 10472 ఋక్కులున్నట్లు తెలుస్తుంది.

ఋగ్వేదంలోని సూక్తాలను దర్శించిన ఋషుల సంఖ్య 371. వీరితో పాటు వాగ్దేవి, జుహూదేవి, లోపాముద్ర, గోదాది మొదలుగాగల ఇరవై నాలుగు మంది స్త్రీలు కూడ ఉన్నారు. భూగోళశాస్త్రం, ధర్మశాస్త్రం మొదలైన ఎన్నో శాస్త్రాలు ఇందులో చెప్పబడ్డాయి. ఇది అనేక ఆర్య భాషలకు, పురాణేతిహాసాలకు, ఎన్నో శాస్త్రాలకు పుట్టినిల్లు.

కవితామయమైన వర్ణనలు, సామాజిక పరమైన ఆచార వ్యవహారాలు, స్వయంవరం, అనులోమ వివాహాలు మొదలైన ఎన్నో విజ్ఞాన దాయకమైన విషయాలు ఋగ్వేదంలో ఉన్నాయి. కాబట్టి ఇది ఒక విజ్ఞానఖని అని చెప్పవచ్చును;

సామవేదం :- (సంహిత) సామవేదం పూర్వార్చిక, ఉత్తరార్చిక అని రెండు భాగాలుగా ఉంది. పూర్వార్చికలో ఆరు ప్రపాఠకాలు, ఉత్తరార్చికలో ఎనిమిది ప్రపాఠకాలున్నాయి. మొత్తం ఋక్కుల సంఖ్య 1791. వీనిలో 261 మంత్రాలు పునరుక్తాలు. పునరుక్తాలను తీసేస్తే సామమంత్రాల సంఖ్య 1530 మాత్రమే.

సామసంహితలోని మంత్రాల్లో 75 తప్ప మిగతావన్నీ ఋక్సంహిత నుండి గ్రహించినట్టివే. సోమ యాగంలో పఠింపదగిన క్రమాన్ని అనుసరించి ఋగ్వేదంలోని మంత్రాలనే వేరుగా కూర్చారు. ఇందులో ఋగ్వేదంలోని మంత్ర స్వరం కంటె విలక్షణమైన, శ్రావ్యమైన, మనోహరమైన గాన స్వరం ఉంది. ఉచ్చారణ భేదాల వలన, ప్రవచన భేదాలవల్ల వచ్చిన పాఠభేదాలు, యాగంలో సామ మంత్రాల ప్రత్యేకతను చాటుచున్నాయి, అందువల్ల ఇది ప్రత్యేక సంహితగా ఒప్పుచున్నది.

ఈ సంహిత మొదట ఏడు శాఖలుగా ఉండింది. ఈ శాఖల్లో చివరిదైన రాణాయనీయ శాఖ మరి తొమ్మిదిశాఖలుగా విస్తరిల్లింది. సామంలో చెప్పబడిన ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ, సప్తమ స్వరాలకునూ, భారతీయ సంగీత శాస్త్రంలోని సప్తస్వరాలైన "స - రి - గ - మ - ప - ధ - ని" అనేవి సరిపడుతున్నాయని నారద శిక్షలోని ఈ శ్లోకం వల్ల తెలుస్తుంది.

"యస్సామ గానాం ప్రథమః సవేణోర్మధ్యమ స్స్మృతః
యోనౌద్వితీయోగాంధారః తృతీయస్త్వృషభస్స్మృతః
చతుర్థషడ్జ ఇత్యాహుః పంచమోధైవతో భవేత్
షష్ఠోనిషాదో విజ్ఞేయః సప్తమః పంచమః స్మృతః

ఈ శ్లోకాన్ని బట్టి సామగానంలోని ప్రథమాది స్వరాలకు భారతీయ సంగీత స్వరాలు ఈ క్రింది విధంగా ఉంటాయి.

1 2 3 4 5 6 7
మ గ రి స ధ ని ప

ఇవే మన సంగీతంలోని "సరిగమపధని" అనే సప్త స్వరాలు.
(వి. స. VI - 177).

యజుర్వేదం :- కృష్ణయజుశ్శాఖ, శుక్లయజుశ్శాఖ అని యజుర్వేదంలో ముఖ్యంగా రెండు శాఖలున్నాయి. వీనిలో మరల పన్నెండు కృష్ణ యజుశ్శాఖలు పదునైదు శుక్ల యజుశ్శాఖలు ఏర్పడినాయి. తరువాత ఉపశాఖలతో కలిసి కృష్ణ యజుశ్శాఖలు 101 అయినాయి. "ఏకశతమధ్వర్యు శాఖాః" అనే పతంజలి వాక్యాన్ని బట్టి ఆయన కాలం నాటికే ఈ విస్తృతి జరిగిపోయిందని తెలుస్తున్నది. కాని ఇందులో సంహిత పాఠభేదం వలన ఏర్పడిన రెండు శాఖలు తప్ప మిగిలిన వన్నీ ప్రవర్తకుల పేర్లను అనుసరించి ఏర్పడినాయి.

యజుర్వేదంలో, ప్రధాన శాఖల్లోని కృష్ణయజుశ్శాఖా ప్రవర్తకుల్లో తిత్తిరి మహర్షి, శుక్లయజుశ్శాఖా ప్రవర్తకుల్లో యాజ్ఞవల్క్య మహర్షి అగ్రేసరులు. అర్వాచీనాలైన ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలు కొన్ని వైశంపాయన యాజ్ఞవల్క్యులకు సంబంధించిన ఒక గాథతో యజుర్వేదం కృష్ణ, శుక్ల భేదాలతో రెండుగా అయినట్లు తెలుస్తుంది. యజుర్వేదం నుండి మొదట శుక్లయజుశ్శాఖ విడిపడింది. అలా విడిపోగా మిగిలింది కృష్ణ యజుశ్శాఖ అయింది. పాశ్చాత్యుల వ్రాతలనుబట్టి ఇది క్రీ.పూ. వేయి సంవత్సరాల నాటిదని తెలుస్తుంది. కాని పురాతన ఆర్యుల యజ్ఞ యాగాచరణకు పూర్వం ఋక్కులతో కూడ యజస్సులు వెలసినా యని కొందరు పండితులు భావిస్తున్నారు. (వి.స. VI-178).

అథర్వణవేదం :- ఇది ఋక్, సామ, యజుర్వేదాల కంటె అర్వాచీనమైంది. దీనిలో 20 కాండలు ఉన్నాయి. చివరి కాండమ విట్నీ పండితుడు అంగీకరింపక పోయినా దీనిలో 150 ఋక్కులు ఉన్నా యని పేర్కొన్నాడు. వాయుపురాణాన్ని బట్టి అథర్వణ వేదంలోని ఋక్కుల సంఖ్య 5980 అని తెలుస్తుంది. శౌనకం, పైప్పలాదం అనే రెండు ప్రధాన శాఖలు ఇందులో ఉన్నాయి.

ఈ వేదం ఐహిక సుఖబోధకు సంబంధించినది. అలాగని ఇది ఆముష్మిక సుఖబోధకు దూరమైందికాదు. ఆ విషయాలు కూడ ఇందులో ప్రస్తావించబడినాయి. ఇది తరువాత వచ్చిన మంత్ర, వైద్య, జ్యోతిషాది శాస్త్రాలకు మార్గదర్శకంగా ఉంది. వేదకాలం నాటి ఎన్నో సాంఘిక ఆచారాలు ఇందు ప్రస్తావించబడినాయి. గృహ సంస్కారాలు, వివాహాలు, అంత్య సంస్కారాలు, స్త్రీపురుషులను వశపరచుకొనుట, కట్టుబోతు, చేతబడి మొదలైన సాంఘిక విషయాలెన్నో అధర్వణ వేదంలో చోటు చేసుకొన్నాయి. (వి.స. VI-181).

ప్రకృతి వర్ణనలు, సాంఘిక విషయాలు, శాస్త్రాంశాలు మొదలైన ఎన్నో విషయాలను ప్రతిపాదిస్తున్న ఈ వేదాలు ప్రాచీన తమమైన భారతీయ విజ్ఞాన సర్వస్వాలని పండితుల అభిప్రాయం.

## వేదాంగాలు

"శిక్షా వ్యాకరణం. ఛందః నిరుక్తం జ్యోతిషం తథా
కల్పస్యేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణః"
(సం.ఆ.వి.కో. II-552)

భారతీయ విజ్ఞాన సంపదకంతటికీ వేదాలే మూలం. ఇవి శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అనే ఆరు అంగాల తోనూ, పురాణ న్యాయ, మీమాంస, ధర్మశాస్త్రాలనే ఉపాంగాలతోనూ ఒప్పుచున్నాయి. అంగ *[Subordinate]* విజ్ఞానం సంపూర్ణంగా ఉన్నప్పుడే అంగి *[Main]* అయిన వేదాలయొక్క స్వరూపం చక్కగా తెలుస్తుంది. వేదాంగాలు దేనికదే విలక్షణమై, ప్రధానమైనవిగా ఉంటూ వేద స్వరూపాన్ని వ్యక్తపరిచేందుకు ఉపకరిస్తున్నాయి.

కల్పం:- పైన పేర్కొన్న శ్లోకంలో వరుసక్రమాన్నిబట్టి కల్పం ఆరవది. "........వేదస్యహస్తః కల్పో" అనే సూక్తిని బట్టి కల్పం వేద పురుషునికి హస్తం అని తెలుస్తుంది.

కల్పం సూత్రాలతో కూడుకున్న నిబద్ధగ్రంథం. శ్రౌతసూత్రాలు' గృహ్యసూత్రాలు, ధర్మసూత్రాలు అని కల్పం మూడువిధాలు. అయినా

శ్రౌతసూత్రాలే లోకంలో కల్పం అని ప్రసిద్ధికెక్కి ఉన్నాయి.

శ్రౌతసూత్రాలు :- శ్రౌత కర్మలను గూర్చి తెలిపేవి కాబట్టి వీనికి శ్రౌతసూత్రాలని పేరు వచ్చింది. వీనిలో అనేక శాఖలున్నాయి. వీనిలో ఋగ్వేదశ్రౌతసూత్రాలు, కృష్ణ, శుక్ల యజుర్వేద శ్రౌత సూత్రాలు, బోధాయన, భరద్వాజ, హిరణ్యకేశి, శ్రౌతసూత్రాలు, అధర్వణ శ్రౌతసూత్రాలు చెప్పుకోదగ్గ శ్రౌత సూత్ర శాఖలు. ఈ సూత్రాలన్నీ అగ్న్యాధాన, అగ్నిహోత్ర, ధర్మపూర్ణిమాసాది సప్తహావిస్సంస్థలను, అగ్నిష్టోమ, వాజపేయ, అతిరాత్రాది, సప్తసోమ సంస్థలను ప్రతిపాదిస్తున్నాయి.

గృహ్యసూత్రాలు:- గర్భాదాన, పుంసవన, జాతకర్మ, నామకరణ, అన్నప్రాశనాది గృహసంబధమైన కర్మలను ప్రతిపాదించుటచే వీనికి గృహ్యసూత్రాలని పేరు వచ్చింది. వీనిలో మొత్తం నలభై కర్మలు చెప్పబడినాయి. ఈ గృహ్యసూత్రాల్లో ఆంధ్రదేశంలో పూర్వం నుండి ఆపస్తంబుని సూత్రాలు ప్రచారంలో ఉన్నాయి. గృహ్యసూత్రాల్లో కూడ శ్రౌతసూత్రాలవలె అనేక రకాలైన వేదశాఖీయ సూత్రాలు కలవు.

ధర్మసూత్రాలు :- మనదేశంలో గౌతమ ధర్మసూత్రాలు, బౌద్ధాయన ధర్మసూత్రాలు ప్రధానంగా ప్రచారంలో ఉన్నాయి.

ఛందస్సు :- నారాయణామాత్యుడు వేదాంగాల్లో ఛందస్సుపేరు చెప్పలేదు. కాని ఛందశ్శాస్త్రానికి సంబంధించిన ఇరువది ఆరు ఛందాలను, గణ, యతి, ప్రాస భేదాలను వివరంగా పట్టికల్లో ఇచ్చాడు. (చూడు ఛందస్సు).

జ్యోతిషం :- "జ్యోతిషామయనం చక్షుః" అనే సూక్తినిబట్టి జ్యోతిషం వేదానికి కన్నుల వంటిదని తెలుస్తుంది. వేదాంగ జ్యోతిషమనే పేరుతో "లగధ" ప్రణీతమైన రెండు గ్రంథాలు దొరుకుతున్నాయి. వీటిలో ఒకటి ఋగ్వేదాంగం, రెండవది యజుర్వేదాంగం. వీటిలో మొత్తం 45 శ్లోకాలు ఉన్నాయి. ఇందలి గణనా విధానం అతిపురాతనమైంది. కాలక్రమంలో జ్యోతిషం, సంహిత, గణితం, జాతకం అని మూడు స్కంధాలుగా విభజింపబడింది. తరువాత కాలంలో ఒక్కొక్క స్కంధంపై అసంఖ్యాకాలైన గ్రంథాలు వెలశాయి. (సం.వి.కో. VIII-574).

నిరుక్తం :- వేదాంగాల్లో ఒకటైన నిరుక్తం యాస్కాచార్య నిర్మితమైన వైదిక నిఘంటువు. దీనిలో పదాల అవయవార్థాలు వివరింపబడినాయి. (ఆ.శ.ర. 2-630).

సీ॥ అర్థాంతికమ్మున నమరు పూర్వోత్తర
ఋక్కుల సంధులు పెక్కువ గలఁ
గలుగు కాలంబుగతి నిరుక్తము దెల్పు
(వా.వి.వ.మా. 283)

కాబట్టి నిరుక్తం, వేదాల్లోని పదాలు, అవి ఏర్పడేవిధానం, ఉచ్చారణా పద్ధతి, పదాల అవయవార్థాలు మొదలైన వానిని తెలిపే వైదిక నిఘంటువని తెలుస్తున్నది.

వ్యాకరణం :- వేదాంగాల్లో ఒకటి వ్యాకరణం. ఇది వేదానికి ముఖం వంటిది." వేదస్య........ముఖం వ్యాకరణం" "వ్యాకరణాలు" దేశంలో చాలా కనిపిస్తున్నాయి. పాణినిని పూర్వమే వ్యాకరణాలున్నట్లు తెలుస్తుంది. వేదాంగ వ్యాకరణ విషయంలో పండితుల్లో భేదాభిప్రాయాలున్నాయి. పాణినీయ అష్టాధ్యాయమే వేదాంగ వ్యాకరణం అని కొందరి అభిప్రాయం. (సం.వి.కో. VIII - 573). మరి కొందరి మతం ప్రకారం పాణినికి పూర్వుడైన ఆపస్తంబుడు పేర్కొన్నదీ, ఛాందోగ్యోపనిషత్తులో పేర్కొనబడిందీ, అయిన "వేదవేదమే" వేదాంగ వ్యాకరణం. (వి.స. VI-188).

వ్యాకరణాలు వేద సంబంధాలుగా అనేకం వెలశాయి. వానికి మరలా భాష్యాలు పుట్టినాయి. త్రిభాష్య రత్నానికి వ్రాయబడిన వైదికాభరణం అనే వ్యాఖ్యలో వర్ణసమామ్నాయం, స్థాన ప్రయత్నం, సంహిత, సంధి, స్వర, సవర్ణ దీర్ఘాదులు ప్రకరణ క్రమంలో మిక్కిలి సులభ పద్ధతిలో చెప్పబడ్డాయి.

శిక్ష :- "శిక్షా ఘ్రాణంతు వేదస్య" అనే సూక్తిని బట్టి మానవునికి ముక్కువలే వేదానికి శిక్ష ముఖ్యమైన అంగమని తెలుస్తుంది.

"శిక్ష్యతే వర్ణాద్యుచ్చారణ మన యేతిశిక్షా" అనే వ్యుత్పత్తిననుసరించి వర్ణ స్వరాదుల ఉచ్చారణ క్రమాన్ని ఉపదేశించే గ్రంథం శిక్ష అని తెలుస్తున్నది. వర్ణ సమామ్నాయం, వర్ణోత్పత్తి, స్వర సంచారం,

కాలనియతి, ఉచ్చారణ విశేషాలు, వర్ణక్రమం మొదలైన అంశాలెన్నో శిక్షలో చెప్పబడినాయి. (సం.వి.కో. VIII–497).

ఇట్టి శిక్షలు దేశంలో అనేకం ఉన్నాయి. అందు వ్యాస, భరద్వాజాది 13 శిక్షలు నాలుగు వేదాలకు సంబంధించినవై ఉన్నాయి.

శయ్యా - పాకములు

శయ్య :- పద్య గద్యాత్మకమైన రచనా శిల్ప కళనే మనం స్థూలంగా శయ్య అంటున్నాం. భరతుడు మొదలు జగన్నాథ పండితుని వరకూ గల పూర్వాలంకారికులెవ్వరూ శయ్యను గూర్చి చెప్పలేదు. వారి మతానుసారం శయ్య రీతిలోనే అంతర్భవిస్తుంది. వామనుడు మాత్రం కావ్యాలంకార సూత్రవృత్తిలో శయ్య అనే పేరుతో వ్యవహరించక "పరివృత్త్య సహిష్ణుత్వం శబ్దపాకం" అని దీనినే చెప్పాడు. "యత్పదాని త్యజంత్యే పరివృత్త్యసహిష్ణుతాం తం శబ్దన్యాస నిష్ణాతాః శబ్దపాకం ప్రచక్షతే" విద్యానాధుడు ప్రతాపరుద్రీయంలో ద్రాక్షాది అర్థగత పాకాలను వేరుగా చెప్పి, వామనుడు చెప్పిన ఈ శబ్దపాకాన్ని శయ్య అనే పేరుతో విభాగించి చెప్పాడు. "యాపదానాం పదాన్యోన్య మైత్రీ శయ్యేతి కథ్యతే" అని ప్రతాపరుద్రీయం.

కం॥ "కదిసి పదములు ముందరి
పదములతో పరమమైత్రి ఎరగని పరపదా
పదాస్పద మనకుండిన గతులందది శయ్య...." (న.భూ.)

పై అలంకారికుల అభిప్రాయాలను బట్టి పదమైత్రి, పరపదాసహిష్ణుత శయ్యకు ముఖ్యలక్షణాలని తెలుస్తున్నది. పదమైత్రి అంటే పదాలు ఒకదానితో నొకటి సరళంగా కలిసిపోవడం. ముత్యాలదండవలె అందంగా కూర్చబడిన పదాల్లోంచి, ఏదైన ఒక పదాన్ని తొలిగించి, దాని స్థానంలో అదే అర్థం గల మరొక పదాన్ని కూర్చితే ఆ రచనా సౌందర్యం చెడుతుంది. అంటే ఆ స్థానంలో మరే పదమూ పొసగదన్న మాట. ఆ విధంగా పదాలను కూర్చడమే పరివృత్త్య సహిష్ణుత. దీనినే శయ్య అంటారు.

ఈ భావాన్నే భామహుడు "మాలాకారో రచయతి యథాసాధు విజ్ఞేయ మాలాం, యోజ్యం కావ్యేష్వవహితథియా తత్వదేవాభిదానం". అని చెప్పారు.

పూలమాలనల్లే కళాకారుడు ఏ పువ్వు తర్వాత దేని నుంచాలి, ఏ రంగు తర్వాత ఏ రంగు కలపాలి. మాలలో లావు సన్నాలెలా ఉంటే ఆ పూలమాల అందంగా ఆకర్షణీయంగా ఉంటుందో తెలిసి రచిస్తాడు. ఆలా కూర్చిన పూలమాలలో ఒక పూవుతీసి, దాని స్థానంలో మరొకపూవు నుంచితే దాని అందం చెడిపోతుంది. ఆదేవింగా పద్య రచనలో కూడా ఒక పద స్థానంలో మరొక పదం పొసగకుండేటట్లు వ్రాయడమే శయ్య అంటారు. ఈ భావాన్నే కళాపూర్ణోదయంలో పింగళి సూరన "పొసగు ముత్తెపు సరుల్ పొహళించినలీల తమలోన దొరయు శబ్దముల గూర్చి...." అని వివరించాడు. (మ. చ. పీఠిక 3119). ఇదే భావాన్ని *Wordsworth* *"The choice of best words in best place"* అని తెలిపాడు.

ఉదా :- జిగినెలు వన్నెకాడెదుట చేరిన వేళల ముద్దుగుల్కమె
ల్లగ నడువందొడంగు, ఘనలౌల్యపు జూపుల జూచు, మోహపుం
బిగువున బల్కరింప జనుబెళుకుచు పయ్యెదకొంగు దీటుడె
క్కగ చిరునవ్వు నవ్వు నొడగూడిన సిగ్గున నేగునవ్వలన్.

(హం.వి. 2-105).

ఈ పద్యంలో ప్రియుడెదురుకాగా, మోహపు బిగువులో, సిగ్గు తెరలలో, చూచే చూపులు, చిరునవ్వులతో కూడిన నాయిక హావభావాలను చిత్రకారుని కుంచెనుండి జాలువారిన సిగ్గరి చిత్రమో అన్నట్లు కవి చిత్రీకరించాడు. ఈ పద్యంలో పదాల పొందిక ఉంది. అంతేగాదు. "నెలు వన్నెకాడు, లౌల్యపు చూపులు, మోహపు బిగువు, సిగ్గుననేగుట" మొదలైన పదాలను తొలగించి, అదే అర్థంలో వేరే పదాలను కూర్చితే, ఈ పద్యంలో సొగసు పోతుంది. అంటే పరపదా సహిష్ణుత, పరివృత్త్య సహిష్ణుత గల రచనన్నమాట.అదే శయ్య. (*Choice of best words in best place*).

పాకము :- రసాస్వాదనకు అర్హమైన రచన పాకమని ప్రతారుయ శోభూషణం. ఉదీరితార్థ పరిపాకమని నరస భూపాలీయం. అర్థగాంభీర్యం పాకం. గాంభీర్యమంటే ఆస్వాద్యమానతా విశేషమని కొందరు, రసోచిత శబ్దార్థ నిబంధనం పాకమని మరికొందరు, శ్రవణామృతంగా ఉండేటువంటి పద వ్యుత్పత్తి పాకమని ఇంకొందరు పాకాన్ని నిర్వచించి ఉన్నారు.

పై నిర్వచనాలను బట్టి పాకమనేది అనుప్రాసాదులమాదిరి కేవలం శబ్దగతంగాక, రసోచితాలైన శబ్దార్థాల నాశ్రయించి ఉంటుంది. ఏవిధంగానైతే వంటకాల్లో పాకం నానారుచ్య పదార్థాల సమ సంయోగంవల్ల బహువిధ రుచులను కల్గిస్తుందో అదేవిధంగా కావ్యంలో రీతి, గుణ, వృత్తుల కలయిక వల్ల రసాస్వాదన యోగ్యతను కూర్చేది పాకమని చెప్పవచ్చును. మొదట ద్రాక్ష, నారికేళ పాకాలని రెండే ఉండేవి. తరువాత కదళీ పాకాన్ని కూడా చేర్చి వీటి సంఖ్యను మూటికి పెంచారు. హంస వింశతిలో ఈమూడు పాకాలు పేర్కొనబడ్డాయి. "....శయ్యా సౌష్ఠవంబు తెలిసి, ద్రాక్ష. కదళీ, నారికేళ పాకంబుల కవిత్వ రచన లెరింగి" (5-128).

ద్రాక్షాపాకం.– "ద్రాక్షాపాకో భవేత్స్యోయం బహిరంతః స్ఫురద్రసః" అంటే ఏ విధంగానైతే ద్రాక్ష ఫలం నోటిలో వేసుకోగానే, రస్వాసాదన యోగ్యంగా ఉంటుందో అదేవిధంగా ఏదైనా మనం చదివినప్పుడు అన్వయ కాఠిన్యాది క్లిష్టత లేకుండా రసాస్వాదన యోగ్యంగా ఉండే రచన ద్రాక్షా పాకంలో ఉందన్నమాట. ఇంకొక విశేషం కూడా ఉంది. ద్రాక్షపండు ఏ విధంగా పరిత్యాజ్యం *(Wustage)* అంతగా లేక అంతా ఆస్వాద యోగ్యమో అదే విధంగా ఈ పాక రచన కూడా సులభంగా అర్థమై, అంతా రసాస్వాదన యోగ్యంగానే ఉంటుంది.

ఉదా:– ఉ॥ చీమ చిటుక్కుమన్న విను చిమ్మట బుఱ్ఱనవేగు నంతలో
నే ముదమంది చూచు, సరటీ పశుపక్షిమృగాది జంతువుల్
వేమరుబోవు చప్పుడులు విస్మయమందగ నాలకించునా
హా! మరి రాక తక్కెనొ యటంచు తలంచు వియోగ
వేదనన్ (హం, వి 3-40)

ఈ పద్యం చదువగానే విరహ వేదనలో తన ప్రియుని రాకకై ఎదురు చూస్తూ చీమ చిటుక్కుమంటే తన ప్రియుడే వస్తున్నాడనుకొని ఆతృతతో ఎదురు తెన్నులు చూచే ఒక నాయిక మన కట్టెదుట నిలుస్తుంది. ఇలా సాగే రచనా విశేషం ద్రాక్షాపాకం.

కదళీపాకం :– కదళీ అంటే అరటి పండు. ద్రాక్షపండు వలె దీన్ని చటుక్కున నోట్లో వేసుకొని రుచి చూచేందుకు వీల్లేదు. ఏ విధంగానైతే అరటిపండు పొట్టుతీసి, నోట్లోవేసుకొని, తిని రుచి చూస్తామో; అదేవిధంగా

కష్టశ్రమతో (ఒకటి రెండు మార్లు చదవడం, పదాలకు అర్థాలను చూచు కోవడం ఇత్యాది) రసాస్వాదన యోగ్యమైన రచన కదళీ పాకం. అరటి పండులో పరిత్యాజ్యం దాని తొక్క. అదేవిధంగా ఈ పాక రచనా విశేషంలో కూడా పరిత్యాజ్యమైన పదాలు కొన్ని ఉండవచ్చును.

ఉదా :- శాంతము లయ్యె నెండలు, నిశాంతము లయ్యె పధూశుచంబు, ల
త్యంతము వాడి వేడికి వాంతములయ్యె ప యోజములక్, ప్రశా
క్రాంతములయ్యె వాతెరలు, కాంతములయ్యె మహోష్ణవస్తు లా
శాంతములయ్యె తావులు నిశాంతములన్ హిమ వారి బారికిన్
(హం.విం. 3-172).

ఈ పద్యంలో హేమంత ఋతు వర్ణన ఉంది. హేమంతంలో కురిసే మంచుకు ప్రకృతిలో జరిగే మార్పులను కవి ఇక్కడ అలంకారి కంగా ర్ణివంచాడు. "శాంతము, నిశాంతము (నిశ + అంతము=పసుపు పూయడం) అశాంతము మొదలైన పదాలను చమత్కారంగా ప్రయోగిం చాడు. ఈ పద్యాన్ని రెండు, మూడు మార్లు చదువుకొని అర్థాలు, అన్వ యం చూచు కొంటే గాన్ని దానిలోని చమత్కారం సుబోధం కాదు.

నారికేళ పాకం :- నారికేళమంటే కొబ్బరి కాయ. దీని పైభాగ మంతా పొట్టు, టెంకతో కఠినంగా ఉంటుంది. లోపలి కొబ్బెర నీళ్ళు, మృదువుగానూ, మధురంగాను ఉంటాయి. కాబట్టి నారికేళ పాక మంటే పైకి కఠినంగా కనిపించినా అంతరాంతరాల్లో మృధు మధు రంగా ఉండే రచనా విశేషమని భావం. (బహిర్కాఠో నారికేళపాకస్య తర్కృదుర్భవేత్). నారికేళంలో ఆస్వాద యోగ్యం ఎంత ఉంటుందో పరిత్యాజ్యం కూడా అంతే ఉంటుంది. అంతేగాదు ఆస్వాద యోగ్యమైన పదార్థాన్ని మనం పొందాలంటే, ఋారు తీసి, టెంక పగులగొట్టికాని మనం పొందలేము. అదే విధంగా ఈ పాక రచనా విశేషాన్ని కూడా మనం చదవగానే అర్థం చేసుకోలేము. కఠిన పదాలు, దీర్ఘ సమాసాలు, అన్వయ కాఠిన్యంతో కూడింది నారికేళ పాకం.

మ॥ కనదృక్షాలయమౌ మహాబిలమునం గన్పట్టు భాస్వచ్ఛమం॥
తనవానర్ఘ మణి-దటి న్యధిప పత్రాజిత్తునిం కేచ్చనో

మునుదాగ్రొ కొని కాలకృష్ణుడన నంభోజాప్తుడప్పశ్చిమాం
బు నిధించెర తదబ్జనాభు రుచినా పొల్పొందె క్రౌంజీకటుల్॥
(హం.వి. 2–218).

ఈ పద్యంలో కవి సూర్యాస్తమయాన్ని వర్ణిస్తూ కృష్ణుడు సత్రాజిత్తుకు శమంతక మణిని తెచ్చి యిచ్చిన కథను జోడించాడు. అన్వయ కాఠిన్యం, పదార్థ క్లిష్టత, దీర్ఘ సమాసభూయిష్టంగా సాగే ఇటువంటి రచనా విశేషం నారికేళ పాకం. ఆముక్తమాల్యదలోని అనేక పద్యాలు దీనికి చక్కని ఉదాహరణలు.

## శాస్త్రాలు

సంస్కృత వాఙ్మయంలో వివిధ శాఖల విజ్ఞానాన్ని తెలియచేసే శాస్త్రాలు చాలా ఉన్నాయి. వేదార్థాలను స్పష్టపరిచే వేదాంతాలు వుట్టిన తరువాత ఖేదప్రామాణ్య – అప్రామాణ్య వాదాలు, జీవ - ఈశ్వర భేద వాదాలు, ఈశ్వర అస్తి-నాస్తి వాదాలు మొదలైన వానిని ఆధారంగా ఆర్ష మహర్షుల తత్త్వాన్ని అన్వేషించేందుకు పూనుకొన్నారు. తత్ఫలితంగా దర్శనాలనే శాస్త్రగ్రంథాలు వెలువడ్డాయి. దర్శనమంటే తత్త్వ నిరీక్షణ రూప జ్ఞానం అని అర్థం. దానిని ప్రతిపాదించడంవల్ల శాస్త్రం దర్శన మైంది. (సం. వా. చ. II - 100).

హంస వింశతిలో–"వేదాంత వైశేషిక భాట్ట ప్రాభాకర పూర్వోత్తర మీమాంసాది శాస్త్రంబులును........" (3-127) అని నారాయణామాత్యుడు పేర్కొన్నాడు. పైన పేర్కొన్న ఆరుశాస్త్రాల్లో పూర్వమీమాంస, ఉత్తర మీమాంస, వైశేషిక మూడు షడ్దర్శనాల్లోనివి. నారాయణమాత్యుడు షడ్దర్శనాల్లో ఈ మూడింటినే పేర్కొని, మిగిలిన న్యాయ, సాంఖ్య, యోగ, దర్శనాలను పేర్కొనలేదు. వానికి బదులుగా వేదాంత, భాట్ట, (మీమాంస) ప్రాభాకర (మీమాంస) అనే శాస్త్రాలను పేర్కొన్నాడు.

పూర్వ మీమాంస సూత్రాలకు, శబరస్వామి రచించిన భాష్యాన్ని ఆధారంగా గ్రహించి కుమారిలభట్టు "తంత్రవార్తికం" అనే గ్రంథాన్ని రచించాడు. ఇది లోకవ్యాప్తమైంది. దీనికి భట్ట సోమేశ్వరుడు, భట్టు భవదేవుడు మొదలైనవారు వ్యాఖ్యలు రచించారు. ఇవన్నీ కుమారిల

భట్టును అనుసరించిన వర్గంచే దీనికి భాట్ట మీమాంస శాస్త్రమని పేరు వచ్చింది. భాట్టమతానికి కొంచెం భేదంతో ప్రభాకరుడు ప్రతిపాదించిన సిద్ధాంతాల మూలంగా ప్రభాకర మీమాంసమనే మతం ఏర్పడింది. నారాయణామాత్యుడు పేర్కొన్న ఈ ఆరుశాస్త్రాలను గురించి సంక్షిప్తంగా ఇక్కడ వివరించడం జరిగింది.

ఉత్తరమీమాంస:- మీమాంస మనగా చర్చ, విమర్శ అని అర్థం. వేదాలకు సంబంధించిన విమర్శనాత్మక చర్చయే మీమాంసా శాస్త్రం. ఇది పూర్వమీమాంస, ఉత్తరమీమాంస అని రెండు భాగాలుగా ఉంది. కర్మానంతరం మోక్షసిద్ధిని ప్రసాదించే జ్ఞానోపదేశం చేసేది కాబట్టి దీనికి ఉత్తర మీమాంసమని పేరు వచ్చింది. ఉత్తర మీమాంస కర్త బాదరాయణుడు. ఇతడు వేదాల చివరి భాగాలకు ఉపనిషత్తుల్లోని భావాలను సూత్రాలుగా రచించాడు. అందుకే వీటికి బాదారాయణ లేక వ్యాస సూత్రాలని పేరు. వేదాల్లోని చివరి విషయాలను చెప్పడంవల్ల, వేదాంత సూత్రాలనీ, బ్రహ్మపదార్థ ప్రతిపాదకాలవడంవల్ల బ్రహ్మసూత్రాలనీ, శరీర సంబంధమైన జీవుని స్వరూపాన్ని గూర్చి చెప్పడంవల్ల శారీరక సూత్రాలనీ వీటికి వేరు వేరు పేర్లు వచ్చాయి. దీని కర్త బాదరాయణుడే వ్యాసుడనీ, అతడు క్రీ పూ. 500 - 700 మధ్య ఈ సూత్రాలను రచించి ఉంటాడని పండితుల అభిప్రాయం.

(వి.స. VI–264)

ఉత్తర మీమాంసాన్నే శంకరాచార్యులు వేదాంద మీమాంస శాస్త్రమని పేర్కొన్నాడు. మీమాంస సూత్రాలు నాలుగేసి పాదాలను కలిగి, నాలుగు అధ్యాయాలుగా ఉన్నాయి. ఇందులో మొత్తం 552 సూత్రాలు ఉన్నాయి. వీనికి శంకరాచార్యులు, రామానుజాచార్యులు వరుసగా భాష్యాలు వ్రాశారు. ఈ భాష్యాలాధారంగా దేశంలో ద్వైత, అద్వైత, ద్వైతాద్వైత, విశిష్టాద్వైత మొదలైన దర్శనాలెన్నో వెలిశాయి. (సం.వా.చ. II–132).

పూర్వ మీమాంస :- దీనియందు జైమిని మహర్షి సూత్రాలు గలవు. ఇది క్రీ.పూ. 4వ శతాబ్దానికి పూర్వమే రచింపబడిన గ్రంథం. బోధాయనుడనే నామాంతరం గల ఉపవర్షుడు పూర్వమీమాంసకు వృత్తి

రచించాడు. ఆ తరువాత శబరస్వామి మీమాంస సూత్రభాష్యాన్ని, రచించాడు. దీనికి కుమారిలభట్టు, ప్రభాకరభట్టు అనేవాళ్ళు (క్రీ.శ. 600-680) వ్యాఖ్యలు రచించారు. అదేవిధంగా మండన మిశ్రుని విధి వివేకం, భావనావివేకం, మీమాంసానుక్రమణికలు, సాయణ మాధవాచార్యుల జైమిని న్యాయమాల, అప్పయ దీక్షితుల విధి రసాయనం, వేంకటాధ్వరి మీమాంస మకరందం, ఆపదేవుని మీమాంస న్యాయ ప్రకాశం, అన్నం భట్టు రాణకభావనా కారికలు మొదలైన గ్రంథాలెన్నో మీమాంస శాస్త్రానికి సంబంధించినవి వచ్చాయి.

పూర్వమీమాంస పన్నెండు అధ్యాయాల గ్రంథమని భావిస్తున్నారు. ఇందులో చివర నాలుగు అధ్యాయాలకు సంకర్షణ కాండ అని పేరు. ఇవి సంకీర్ణార్థ నిరూపకాలగుటచే వీనికీపేరు వచ్చింది. ఈ నాలుగు అధ్యాయాలకు శబరస్వామి భాష్యాన్ని రచించినట్లు తెలుస్తుంది. ఖండదేవుడు భాట్టదీపిక అనే వ్యాఖ్యను రచించాడు. భాస్కరభట్టు. భాట్టచంద్రిక అనే. వ్యాఖ్యను రచించాడు. కావున చివరి నాలుగు అధ్యాయాలు కూడ జైమినివే అని పండితుల అభిప్రాయం. కాని శైలిని బట్టి విషయాన్ని బట్టి ఈ అధ్యాయాలు జైమినివి కావని పండితులు కొందరు అభిప్రాయపడుతున్నారు.

పూర్వమీమాంస సిద్ధాంతాలు ఈ విధంగా ఉన్నాయి. "వేదం స్వతః ప్రకాశం. దానికి కర్తలేదు. విధ్యర్థవాద మంత్ర రూపమయిన వేదశబ్ద రాశి నిత్యం. దానికెన్నడును నాశనం లేదు. సృష్టి అంతయు శబ్దమూలకమే. వేదాన్ని అనుసరించి సకల ప్రపంచం సృష్టింపబడుతున్నది. ఉత్తరసృష్టి పూర్వ సృష్టినిపోలి ఉంటుంది. ధర్మాచరణమే ఇష్టార్థసిద్ధికి మూలకారణం. వేదం విధించినదే ధర్మం. యజ్ఞాది క్రతువులే యజమానికి ఫలాన్ని ఇస్తాయి. కాని ఫలదాత అయిన ఈశ్వరుడు వేరుగాలేడు." ఈ విధంగా పూర్వమీమాంసలో సిద్ధాంతాలు ప్రతిపాదింపబడి ఉంటాయి.

ఈ సిద్ధాంతాల తత్త్వాన్ని పరిశీలించినట్లయితే, "వేదం ప్రమాణం కాదు. దేహాతి రిక్తమైన ఆత్మలేదు" అని బోధించే లోకాయత (చార్వా )

మతాన్ని అణచుటకై "వేదమే ప్రమాణం. దేహాతిరిక్తమై జ్ఞానాశ్రయమైన ఆత్మ ఉంది. అది కర్మజన్యమైన స్వర్గాదిసుఖాలను అనుభవిస్తుంది. అనే అభిప్రాయాలను ప్రచారం చేసేందుకై పూర్వమీమాంస పుట్టినట్లు తెలుస్తుంది. (సం.వా.చ. II-34

పూర్వోత్తర మీమాంసలకు గల సంబంధాన్ని గూర్చి భిన్నాభిప్రాయాలున్నాయి. శంకరాచార్యులు మీమాంసాశాస్త్రాలను రెండుగా గ్రహిస్తే, రామానుజుడు రెండింటిని ఒకటిగానే స్వీకరించాడు. అయితే రెండూ వేదాలకు వ్యాఖ్యానరూపాలే. బాదారాయణుడు సాంఖ్యతత్త్వాన్ని విశేషంగా విమర్శించాడు. వైశేషిక సిద్ధాంతాలను ఖండించాడు. ఈ గ్రంథాల్లో వివిధ బౌద్ధశాఖలను, లోకాయత, భాగవత సిద్ధాంతాలను గూర్చిన చర్చకూడా ఉంది. (వి.స. VI-263).

ప్రాభాకరం:— ఇది ఒక పూర్వమీమాంస మతభేదం. తంత్రవార్తిక కర్త అయిన కుమారిలభట్టు శిష్యులలో ఒకడైన ప్రభాకరుడు పూర్వమీమాంస సూత్రాలకు ఉపవర్షుడు రచించిన వృత్తిని, శబరస్వామి భాష్యాన్ని అనుసరించి "బృహతి" అనే మత గ్రంథాన్ని రచించాడు. దీనికే ప్రాభాకరమని పేరు. ఇది ప్రతిపాదించే మతానికే ప్రాభాకర మతమని పేరు. ప్రభాకరుడు ఉపవర్ష వృత్తి, శబరభాష్యాలకు వ్యతిరేకంగా గాక సరిగ్గా వానిని అనుసరించాడని, కుమారిలభట్టు తంత్రవార్తికానికి వేరుగా పెక్కుచోట్ల తన అభిప్రాయాలను ఆవిష్కరించాడని మహా మహోపాధ్యాయ గంగానాథ ఝూగారి అభిప్రాయం.

ఈ సిద్ధాంతంలో "ఆత్మశూన్యం కాదు. ఎందుకంటే ఆత్మనుశూన్యరూపంగా చెప్పే వాళ్ళను నీవు శూన్యరూపాన్ని అనుభవించావా? లేదా? అని అడిగినప్పుడు లేదని చెప్పితే శూన్యం లేదని తెలుస్తుంది. అనుభవించినట్లు చెప్పితే దేనివలన శూన్యం అనుభవించారో అదే ఆత్మ అని, అది శూన్యానికి లక్షణమని తెలుస్తుంది. శూన్యానికి విలక్షణమైన ఆత్మయందు మనస్సుయొక్క సంయోగం వలన జ్ఞానం కలుగుతుంది. జ్ఞానగుణం వలన ఆత్మ చేతనమని స్పష్టమౌతుంది. స్వభావంలో ఆత్మజడం. ఈ జడమైన ఆత్మలో సుఖం, దుఃఖం, ఇచ్ఛ, ద్వేషం, ప్రయత్నం, ధర్మం, అధర్మం, ప్రియం మొదలైన గుణాలు ఉన్నాయి. ఇందులో ఆనం

మయ కోశమే ఆత్మ. విజ్ఞానమయకోశంలో బుద్ధి ఆత్మయొక్క జ్ఞాన గుణం. ఎలాగంటే ఆనందమయకోశంలో ఉండే చేతనం గుప్తమైంది. వివేకం లేని వానికిది ప్రతీతి అవడంలేదు. సుషుప్తిలో ఆత్మకు జ్ఞానంలేదు. కాబట్టి ఆత్మజడం, ఆత్మస్వరూపమైన నిత్యజ్ఞానం జీవునిలో లేదు. అనిత్య జ్ఞానం ఉంది. ఈ విధంగాసాగే ఈ సిద్ధాంతంలో ఆనందమయకోశం ఆత్మగాను, బుద్ధి దాని గుణంగాను ప్రతిపాదింపబడింది. ఇది ఈ సిద్ధాంతం యొక్క సారభూతమైన సంక్షిప్త సారాంశం.

(సం.వా.చ. II-117), (స.సా.-31).

భాట్టం:- ఇది ఒక మతసిద్ధాంతపరమైన శాస్త్రం. పూర్వ మీమాంసా శాస్త్రానికి, శబరస్వామి రచించిన భాష్యాన్ని స్వీకరించి కుమారిల భట్టు వ్రాసిన "తంత్రవార్త్తికం" అనే గ్రంధం మూడు విభాగాలుగా ఉంది. 1) శ్లోకవార్త్తికం, 2) తంత్ర వార్త్తికం, 3) టుప్టీక.

పూర్వమీమాంస సూత్రాల్లోని ప్రథమ అధ్యాయంలో మొదటిదైన తర్కపాదానికి శ్లోక రూపంలోనున్న వ్యాఖ్య శ్లోక వార్త్తికం. అంపలి రెండవ పాదం మొదలు మూడవ అధ్యాయం చివరి వరకు గద్యరూపంలోనున్న భాష్యం తంత్రవార్త్తికం. మూడవ అధ్యాయం తరువాత నుండి 12వ అధ్యాయం చివర వరకు మిక్కిలి సంగ్రహంగానున్న వ్యాఖ్య టుప్టీక.

దేశవ్యాప్తమైన ఈ తంత్ర వార్త్తికానికి అనేక వ్యాఖ్యానాలు వచ్చాయి. వీనిలో భట్ట సోమేశ్వరుని న్యాయ సుధ, భట్ట భవదేవుని తౌతాతిక మత తిలకం, గంగాధర మిశ్రుని న్యాయపారాయణం, అన్నం భట్టు సుబోధిని, గోపాల భట్టు మితాక్షరి మొదలైనవి ప్రముఖమైనవి. ఇవన్నీ కుమారిల భట్టు మతాన్ని అనుసరించినవగుట వలన ఈ మీమాంస శాస్త్రానికి భట్టు మతం అను పేరు వచ్చింది దీనినే భాట్టం అని కూడా అంటారు. (భట్టు మతానికి సంబంధించింది భాట్టం).

ఈ మత సిద్ధాంతం ఈ విధ గా ఉంటుంది. "ఆత్మ విద్యుల్లత వలె క్షణికరూపం కాదు. అయినా స్థిరస్వరూపమైన ఆత్మ జడరూపంగానూ చేతనా రూపంగానూ ఉంటుంది. నిద్ర నుండి మేల్కొనిన వాడు నేను

జడమై నిద్రపోతినని చెప్పుచున్నాడు. కావున ఆత్మ జడ రూపం. మేల్కొనిన వానికి స్మరణ కలుగుతుంది కాని ప్రతీతి కానట్టి పదార్థం యొక్క స్మరణ కలుగదు. సుషుప్తిలో ఆత్మస్వరూపం తప్ప వేరేది జ్ఞాన సాధనంగా ఉండ లేదు. కావున స్మరణానికి కారణం సుషుప్తి అందలి జ్ఞానం, ఇదే ఆత్మస్వరూపం. ఈ విధంగా ఆత్మ ఆకాశ ప్రకాశం వలె, మెరుపు తీగవలె ప్రకాశ, అప్రకాశ రూపాలుగా ఉంటుంది.

జ్ఞాన రూపంగా ఉండడం వల్ల ప్రకాశంగాను జడరూపంగా ఉండడం వల్ల అప్రకాశ రూపంగానూ, ఉంది. అంటే సుషుప్తి చేతనం యొక్క అభాస సహిత అజ్ఞానానందమయ కోశం ఆత్మ అని చెప్పబడుచున్నది. ఈ ఆభాసం, ప్రకాశ రూపంగాను, అజ్ఞానం అప్రకాశ రూపం గాను ఉంది. ఈ విధంగా ఆనందమయ కోశం ప్రకాశ మానంగానూ, అప్రకాశ మానంగానూ ఉండడం వల్ల ఆనందమయ కోశమే ఆత్మ అని చెప్పబడుచున్నది. (సం.వా.చ. II-116 & స.సా. 30). ఆత్మ తత్వాన్ని బోధించే, ఈ భాట్టం యొక్క సిద్ధాంతాల సారాంశాన్ని పైన సంక్షిప్తంగా ప్రదర్శించడం జరిగింది.

వేదాంతం :- వైదిక సాహిత్యం, సంహిత. బ్రాహ్మణం. అరణ్యకం అని మూడు విభాగాలుగా ఉంది. వీటిలో సంహిత భాగాలు అతి ప్రాచీనమైనవి. బ్రాహ్మణాలు గద్య రచనలు. వీటి యందు యజ్ఞ యాగాదులకు సంబంధించిన అనేక విషయాలున్నాయి. బ్రాహ్మణాలకు చివర ఉన్న భాగాలకు అరణ్యకాలని పేరు ఇవి అరణ్యాల్లో అధ్యయనం చేయాలన్న నియమం ఉండడం వల్ల వీటికీ పేరు వచ్చింది. భారతీయ ఆధ్యాత్మిక విచారానికి మూలకందాలైన ఉపనిషత్తులు ఆరణ్యకాల చివరల్లో ఉన్నాయి. అందుకే వీటికి వేదాంతాలని పేరు.

ఉపనిషత్తుల సంఖ్య విషయంలో పండితుల్లో అభిప్రాయభేదాలున్నాయి. వీటి సంఖ్య 108 వరకూ ఉంటుందని కొందరంటే, 200 కంటె మించి ఉంటాయని మరి కొందరు భావిస్తున్నారు. కాని చాల మంది దశోపనిషత్తులే ప్రధానమైనవిగా భావిస్తున్నారు. వీటికి శంకరాది పూర్వాచార్యులు భాష్యాలు రచించారు. (సం.వి.కో. II-573).

వైశేషికం :- వైశేషికం షడ్దర్శనాల్లో ఒకటి. ఈ దర్శనాన్ని కణాదుడు నిర్మించినట్లు ప్రతీతి. కణాదముని కపోత వృత్తిని అవలంభించి వీధుల్లో పడిన గింజలు ఏరుకొని జీవించడం మూలంగా ఇతనికీ పేరు వచ్చింది. ఉలూక మహర్షి పుత్రుడవడంచేత ఇతనికి ఔలుక్యుడనే పేరు కూడా ఉంది. ఈశ్వరుడు ఉలూక రూపంలో వచ్చి ఇతనికి షట్పదార్థ విజ్ఞానాన్ని విశదీకరించాడన్ని పరంపరగా వస్తుండే ప్రతీతి.

ఇది పదార్థం, ఇవి దీని గుణాలు అన్ని విస్పష్టంగా షట్పదార్థ విజ్ఞానాన్ని విశదీకరించడం అనే విశేషాన్ని బట్టి ఈ దర్శనానికి వైశేషికమనే పేరు వచ్చింది. (సం.వా.చ. II-104).

వైశేషిక దర్శనానికి కణాద దర్శనమని ఔలుక్య దర్శనమన్ని కూడా పేర్లున్నాయి. కాణాదం, పాణినీయం సర్వశాస్త్రోపకారకాలని భావింపబడుతున్నాయి. విశేషం ఉన్నందున ఈ దర్శనాకిని వైశేషికం అని పేరు వచ్చింది. ఈ సిద్ధాంతంలో "విశేషం" అనే పదార్థం అంగీంరింపబడుతుంది.

వైశేషిక సూత్రాల్లో ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష, సమవాయాలనే ఆరు పదార్థాలున్నాయి. ఈ షట్పదార్థ నిరూపణమే వైశేషికం. "అభావం" అనే ఏడవ పదార్థాన్నికూడా వైశేషికంలోచేర్చారు.

వైశేషికంలో ఈ విధంగా ఉంది. ప్రమేయ పరిశీలనం అధికం. పదార్థాలు ఆరు. అభావంతో అవి ఏడు ఔతున్నాయి. ప్రత్యక్షం, అనుమానాలు రెండే ప్రమాణాలు. శబ్ద ప్రమాణాన్ని వీరు అంగీకరించరు. చాక్షుష మొక్కటే (కంటితో చూచిందే) ప్రత్యక్షం. సమవాయం, అనుమేయం, పీలుపాక వాదం ఇష్టం. హేతు, అభావ, సమాలు మూడు. స్వప్నాలన్నీ అసత్యాలు. కర్మస్థితి, వేద సంస్కారం మొదలైన వాటిలో వీరికి భేదాలున్నాయి. వైశేషికులు ఆరంభవాదులు అని ప్రతీతి. వీరి మతంలో ఆత్మలు జడరూపాలు. విశేషగుణాలన్నీ పోవడమే వైశేషిక మోక్షం. (వి.స. VI-266).

## సిద్ధాంతాలు

"పైలజ రోమజ వాసిష్ఠసోమ సూర్యాది సిద్ధాంతంబులును...." (3-128). ఈ సిద్ధాంతాలు అయిదు. వీటినే పంచ సిద్ధాంతాలంటారు. ఇవి జ్యోతిశ్శాస్త్రానికి సంబంధించినవి. జ్యోతిషం అనేది వేదాంగాల్లో ఒకటి. ఈ విజ్ఞానమంతా సిద్ధాతం, జాతకం, సంహితాస్కంధం అని మూడు విభాగాలుగా ఉంది. (సం,వా.చ. II-163).

ఈ మూడు విభాగాల్లో మొదటిదైన సిద్ధాంత భాగానికి సంబంధించి పూర్వకాలం నుండి అనేక సిద్ధాంతాలు వాడుకలో ఉన్నాయి. ఈ సిద్ధాంతాలన్నీ - దిక్స్కంధ లగ్నకాలాలు, సూర్యచంద్ర గ్రహణాలు, గ్రహ సమాగమం, ఉదయాస్తమయాలు, భూగోళం మొదలైన వాటిని గురించి వివరిస్తాయి. వీటిలో పౌలిశ, రోమశ, పైతామహ, వాసిష్ఠ సూర్యసిద్ధాంతాలు ప్రాచీనమైనవని వరాహమిహిరాదులు చెప్పినారు. ఈ పంచ సిద్ధాంతాలనే నారాయణామాత్యుడు హంసవింశతిలో పేర్కొన్నాడు. కాని హంసవింశతిలో పౌలిశ సిద్ధాంతం పైలజ అనీ, రోమశ సిద్ధాంతం రోమజ అని పేర్కొనబడినాయి. హంసవింశతిలో పైతామహ సిద్ధాంతం ప్రసక్తిలేదు. దానికి బదులుగా సోమసిద్ధాంతం పేర్కొనబడింది. "పౌలిశ రోమక వాసిష్ఠసౌర పైతామహేషు యత్రోప్తం తన్నక్షత్రానయనం ఆర్యభటోక్త్యా, తదుక్తిరతః" పంచ సిద్ధాంతాలను గూర్చి బ్రహ్మగుప్తుడు (బ్రహ్మస్ఫుటవాదం) చెప్పిన పై శ్లోకంలో సోమ సిద్ధాంతం లేదు. కాబట్టి పై శ్లోకంలో చెప్పిన పంచసిద్ధాంతాలే ప్రాచీనమైనవని, అనంతర కాలంలో ప్రచారానికి వచ్చిన సోమసిద్ధాంతాన్ని నారాయణామాత్యుడు హంసవింశతిలో చేర్చి ఉంటాడని ఊహించవచ్చును.

పైలజ :- (పౌలిశ) ఇది ప్రాచీనకాలం నుండి మన దేశంలో వాడుకలోనున్న జ్యోతిష సిద్ధాంతాల్లో ఒకటి. వరాహమిహరుడు రచించిన "పంచసిద్ధాంతిక" అనే జ్యోతిష గ్రంథంలో దీని ప్రస్తావన ఉంది.

ఈ సిద్ధాంత గ్రంథంలో సూర్య, చంద్ర గ్రహణాలు, ఉజ్జాయింపుగా గణించ బడ్డాయి. తూర్పుపడమరల నిడివి, సంఖ్యల భేదం,

యవన పట్టణానికి ఉజ్జయినికి మధ్య గుర్తింపబడ్డాయి. (*The difference in Longitudes between the city of the Yavanas and Ujjain was noted*).

ఈ సిద్ధాంత గ్రంథంలో రచయిత క్రాంతిజ్యాల పట్టికలను[*Sines*] సమకూర్చాడు. ఇది ఎక్కువగా గోళసంబంధమైన గణిత (*Spherical Astronomy*) సూత్రాలను వివరిస్తుంది. పౌలిశ సిద్ధాంతం నక్షత్రాల గమనాలను, గ్రహగతులలోని వ్యత్యాసాలను (*anomslie in movements of planets*) గుర్తించింది. ఇది మన దేశంలో బహుళ ప్రచారాన్ని పొందిన సిద్ధాంత గ్రంథం. (*H.S.L.* 196 సం.వా.చ. II-165).

రోమజ :– (రోమక, రోమశ) దీని గ్రంథకర్త రోమశుడు. (రోమకుడు) అవడం చేత, దీనికి రోమ సిద్ధాంతం అనే పేరు వచ్చింది. వరాహమిహిరుడు మొదలు క్రీ.శ. 17వ శతాబ్దంలో "హాయనరత్నం" అనే సిద్ధాంత గ్రంథాన్ని రచించిన బలభద్ర పండితుని వరకు దీనిని పంచ సిద్ధాంతాల్లో ప్రశంసించారు. దీనిలో జ్యోతిషానికి సంబంధించిన గణిత సూత్రాలు (*Principles of Astronomy*) వివరింపబడినాయి. ఈ సిద్ధాంతం యుగపద్ధతిని అనుసరించక "మెటానిక్ పీరియడ్" ను అనుసరించింది. *Metonic period = Period of 19 years [235 lunar months] Cove ing all the changes of moon* (*O. D. 749*). దీనియందు గ్రహణాలను గూర్చిన ప్రసక్తి తక్కువగా ఉంది. భూగోళంలో ఉత్తర దక్షిణాలుగా మధ్యమండు రేఖ (*Meridian*) గ్రీకుల పట్టణాన్ని అనుసరించి గణింపబడింది. సూర్య చంద్ర గమనాల ననుసరించి ఉత్తర, దక్షిణాయనాలను గణించడం జరిగింది. [*The tropical reveluti ns of the Sun and moon were caliculated*]. ఈ గ్రంథంలో గ్రీకుల గణిత సిద్ధాంత సూత్రాలు వివరింపబడినాయని శాస్త్రవేత్తల అభిప్రాయం (*H.S.L.* - 196, & సం.వా.స. II–165).

వాసిష్ఠ సిద్ధాంతం :– దీనికి విశ్వప్రకాశం అనే పేరు కూడా ఉంది ఈ గ్రంథంలోని అవతారికను బట్టి వామదేవుడు ప్రార్థించగా వృద్ధ వశిష్ఠుడు దీనిని రచించినట్లు తెలుస్తున్నది. కొన్ని స్మృతులు ఋషుల పేర్లతో వెలసినట్లు ఇదికూడా వశిష్ఠుని పేరుతో ప్రసిద్ధికెక్కింది. ఏది

ఏమైనాను ఈ సిద్ధాంత గ్రంథం క్రీస్తుకు పూర్వమే రచింపబడినట్లు తెలుస్తుంది. ఇది అముద్రితం. గణిత, జాతక సంహితా స్కంధాలను పూర్తిగా వివరించిన మహాగ్రంథం ఇది. ఇందలి గణిత స్కంధం నేటికిని సజీవమై ఉంది.

ఈ గ్రంథంలో గ్రహాల స్థితిగతులకు సంబంధించిన క్రమాతిరిక్తాలు (*Irregularities*) ఎక్కువగా గుర్తింపబడినాయి.

(*H S.L.* - 166 & ఆ.సం.వా.చ. II-164).

సూర్యసిద్ధాంతం :– ఇప్పుడు ప్రచారంలో నున్న ప్రాచీన సిద్ధాంతాల్లో ఇది ప్రముఖమైంది. దేశమంతట బహుళ ప్రచారాన్ని పొందింది. ఈ సిద్ధాంతం జ్యోతిష సిద్ధాంతాలన్నింటికంటే అగ్రగణ్యమైనదని బాదరాయణుని అభిప్రాయం.

మయుని తపస్సుకు మెచ్చి సూర్యుడు తన అంశపురుషుని ఆజ్ఞాపించగా అతడు మయునకు సూర్యసిద్ధాంతాన్ని చెప్పినట్లు ఈ గ్రంథావతారికలో ఉంది. ఈ సిద్ధాంతానికి సౌరసిద్ధాంమనే నామాంతం కలదు. ఇది మొత్తం పద్నాలుగు అధికారాలు గల గ్రంథం. దీనికి అర్వాచీనమైన వ్యాఖ్యలే అనేకం ఉన్నాయికాని, ప్రాచీనమైన వ్యాఖ్యలేమీ దొరకడం లేదు. క్రి.శ. 1572లో భూధరుడు వ్రాసిన వివరణం, క్రీ.శ. 1613లో రంగనాథుడు వ్రాసిన గూఢార్థప్రకాశం, క్రి.శ. 1670లో నృసింహగణకుని వాసనాభాష్యం, క్రీ.శ. 1719లో దాదాబాయి పండితుని సౌరసారచంద్రికిరణావళి, చోళసూరి, యల్లయార్యుడు, అమరేభ్యుడు, భైరవుడు మొదలైనవారు సౌరసిద్ధాంతానికి రచించిన వ్యాఖ్యలు బహుళ ప్రచారంలో ఉన్నాయి.

గ్రహస్ఫుటాదికంలో జ్యోతిశ్శాస్త్రవేత్తలు, సూర్య సిద్ధాంతాన్ని ఎక్కువ ప్రమాణంగా గ్రహిస్తున్నారు. ఈ సిద్ధాంత గ్రంథంలో భూమధ్యరేఖ విషయమై సామాన్య నిబంధనం మాత్రమే చేయబడింది. *[It gave a general rule for the equation of the centre]* ఈ సిద్ధాంతంలో గ్రహణ సంబంధ విషయాలు (*Eclips*) సంపూర్ణంగా వివరింపబడినాయి. (*H.S.L* - 166 & సం.వా.చ. II-165).

అనుబంధం – I

## హంసవింశతి - గ్రంథ సంస్కరణం

హంసవింశతి అంటే బ్రౌనుకు చాలా యిష్టమని ప్రతీతి. అందుకే బ్రౌను 1845లో హంసవింశతికి ఒక శుద్ధ వ్రాతప్రతిని తయారు చేశాడు. (*Vol. I. D. No. 912*). హంసవింశతిలోని పదాల నన్నిటిని ఏర్చి, కూర్చి హంసవింశతి సూచికలను పేర రెండు సంపుటాలను నిర్మించాడు. (*D.No. 3100. D.No. 3102*). ఈ గ్రంథాలన్నీ మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉన్నాయి. ఇవిగాక నేడు దీని ముద్రిత ప్రతులు నాలుగు కనిపిస్తున్నాయి. అందులో మొదటిది వావిళ్ళవారు 1929వ సంవత్సరంలో ప్రచురించిన Scholors Edition. రెండవది 1938న సంవత్సరంలో శృంగార కావ్యగ్రంథ మండలి, మచిలీపట్నం వారు ప్రచురించింది. మూడవది 1964వ సంవత్సరంలో వావిళ్ళవారు మద్దులపల్లి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారి లఘుటీకతో ప్రచురించింది. నాల్గవది శతావధాని సుబ్బన్నగారు పరిష్కర్తగా తెలుగు అకాడమీ, హైదరాబాదువారు ప్రచురించింది. ఇవిగాక హంసవింశతికి 1882లో ప్రచురించిన చిత్తూరు ప్రతి ఒకటి ఉన్నట్లు తెలియవచ్చింది కాని అది నేడు దొరకనందువల్ల దానిని పరిశీలించుట జరగలేదు. హంసవింశతికి గల మిగిలిన ప్రతులన్నీ ఈ పరిశోధన సందర్భంగా పరిశీలించడం జరిగింది.

హంసవింశతిలో లౌకిక, శాస్త్ర, సాంకేతిక పదాలు బహుళంగా ఉన్నాయి. ఇవన్నీ ఒక్కొక్క ప్రతిలో ఒక్కొక్క విధంగా కనిపిస్తు న్నాయి. పరిష్కర్తలెవ్వరూ వీటినంతగా పట్టించుకోలేదేమో ననిపిస్తు ది. దీనికి కారణాలు కూడా లేకపోలేదు. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం, హంస వింశతి, తారాశశాంకం మొదలైన శృంగార ప్రబంధాలను 1911లో నిషేధించింది. 36 సంవత్సరాల తర్వాత 1947లో, టంగుటూరి ప్రకాశం పంతులుగారు మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి అయినప్పుడు నిషేధాజ్ఞలు ఉపసంహరించుకోగా హంసవింశతి వెలుగులోనికి వచ్చింది. హంసవింశతి ప్రధానంగా కథాప్రబంధం కాబట్టి దీనిని ప్రచురించిన పరిష్కర్తలు కూడా

కథాదృష్టితోనే చూచారు. కాని దీనిలో రాశీభూతంగా ఉండే విజ్ఞాన విషయాలకు సంబంధించిన పదాల జోలికంతగా పోయినట్లు కనిపించదు. శాస్త్ర విషయాలకు సంబంధించిన పదాలనైతే సంబంధిత శాస్త్రగ్రంథాలను పరిశీలించి నిర్ణయించవచ్చును. కాని వృత్తి పరికరాలు, ఆటలు మొదలైన వాటికి సంబంధించిన పదాలను నిర్ణయించేందుకు ఏ శాస్త్ర గ్రంథాలు ఆ రోజుల్లో అంతగా ఉపకరించేవికావు. వీటికి ఆయావృత్తి పనివాళ్ళను సంప్రదించి నిర్ణయించవలసి ఉండేది. ఇది ఏ ఒక్క వ్యక్తికీ సాధ్యమయ్యే పనికాదు. కాబట్టే హంసవింశతికి ఇప్పటివరకూ ముద్రిత ప్రతులను తయారుచేసిన పరిష్కర్తలు తమకు అందుబాటులో నున్నంత వరకూ పాఠభేదాలు నిర్ణయించి, దీన్ని ప్రచురించారు. అయినా మొన్న మొన్నటి వరకూ వచ్చిన హంసవింశతి ప్రతుల్లో చాలా పదాలు సశాస్త్రీయంగా లేక లోపభూయిష్టంగానే ఉన్నాయి.

పరిష్కర్త, ఏదైనా ఒక గ్రంథానికి ముద్రణప్రతిని తయారుచేసే టప్పుడు కవి హృదయాన్ని తెలిసి అందులోని పాఠభేదాలను నిర్ణయించ వలసి ఉంటుంది. హంసవింశతి స్వభావాన్నిబట్టి, దాంట్లో కుప్పలు తిప్పలుగా ఉండే సాంకేతిక, శాస్త్రీయపదాల పాఠాలను నిర్ణయించడంలో పరిష్కర్తలు భ్రమ ప్రమాదాలకు లోనైనట్లు తోస్తున్నది. ఉన్నంతలో ఈ ప్రబంధాన్ని సశాస్త్రీయంగా పరిశీలించి బ్రౌను తయారుచేసిన హంసవింశతి పదసూచికలే కొంత మెరుగ్గా ఉన్నాయి. ఇప్పుడు హంసవింశతికున్న ప్రతులను పరిశీలిస్తే బ్రౌను సూచికలను కూడా ఈ పరిష్కర్తలుపయోగించుకొన్నట్లు తోచదు. శృంగార కావ్యగ్రంథమండలి వారి ప్రతి బ్రౌను చేసిన పాఠ నిర్ణయాలకు కొంత దగ్గరిగా ఉంది. అయినా సాంకేతికశాస్త్ర పదాలెన్నో సంస్కరించవలసిన అవసరం ఉంది.

ఈ పరిశోధన సందర్భంగా హంసవింశతిలో ఉండే సాంకేతిక శాస్త్రపదాలకు వివరాలను సేకరించే పట్ల, ఆ పదాలు ఒక్కొక్క ప్రతిలో ఒక్కొక్క విధంగా ఉండడం, కొన్నిచోట్ల ఏ ఒక్కపదమూ కూడా శాస్త్రీయంగా లేకపోవడం గమనించడం జరిగింది. అందువల్ల ఇంత విలువైన విజ్ఞానంతోగూడిన హంసవింశతిని సశాస్త్రీయంగా పరిశీలించి పరిష్కరించవలసిన అవసరముందని తోచింది. ఈ క్రింది ఉదహరణా

లను పరిశీలిస్తే హంసవింశతి ముద్రిత ప్రతులు పాఠభేదాల విషయంలో ఎంత అధ్వాన్నస్థితిలో ఉన్నాయో మనం గమనించవచ్చును.

కేవలం లక్షణశాస్త్ర విధేయులైన పండితులు పరిష్కర్తలు కావడం వల్ల గణ, యతి ప్రాసాది నియమాలను దృష్టిలో పెట్టుకొని పద్యాలకు పద్యాలే మార్చివేశారు.

కం॥ బోగాలవారి యిండ్లకు
బోగాలకు మించి యరుచి బోగామించున్
బోగాల వలపు విడియపు
బాగాలివ కుసుమ దీప్తివలె మూపెనయన్

(వా.ప్ర. S.E. 5-116)

కం॥ బోగాలవారి యిండ్లకు
బోగాదమి మించి యరుచి బోగామించెన్
బాగాల వలపు విడియపు
బాగాలవ కుసుమదీప్తి వలె మోపైనన్ (శృం. గ్రం. 5-120).

కం॥ బోగాలవారి యిండ్లకు
బోగాలకు మరిగి యతడు పోగా మరగెన్
బోగాలపు వలపు విడెపు
బాగాలమరించు తిత్తి వలె మూపెనయన్ (వావిళ్ళ-5-116).

పై పద్యాల్లో క్రీగీతలు గుర్తించిన పదాలను పరిశీలిస్తే పరిష్కర్తలు పద్యపాదాలకు పాదాలనే ఛందస్సు చెడకుండా తమ కిష్టము వచ్చినట్లు మార్చివేశారనే విషయం తెలుస్తుంది.

అదేవిధంగా "కేరగరాదు,నవ్వి గిలిగింతలు పెట్టగరాదు.... (1-15) అనే ఉత్పలమాల పద్యం అన్నిప్రతులలో నాలుగుపాదాలుంటే శృం.గ్రం. వారి ప్రతిలో అయిదు పాదాలున్నాయి. దీనిలోని 3, 4 పాదాలు మిగిలిన ప్రతుల్లోని 3, 4 పాదాలు ఒకదానితో నొకటి సంబంధంలేకుండా ఉన్నాయి. ఈ విధంగా చెడగొట్టి ఛందోబద్ధం చేసిన పద్యాలు హంస వింశతిలో చాలానే ఉన్నాయి.

హంసవింశతిని లక్షణ విధేయంగానే కాకుండా, విజ్ఞాన సర్వస్వం దృష్ట్యా కూడా అందులోని పదాలను జాగ్రత్తగా పరిశీలించి పాఠభేదాలను నిర్ణయించవలసి ఉంటుంది. పద స్వరూపం సరిగ్గా లేకుంటే దానికి సంబంధించిన విజ్ఞానం కూడా మరుగున పడిపోయే ప్రమాదముంది.

గృతశౌచస్థలి :- (4-214) ఈ పదం ఇప్పుడున్న హంసవింశతి ప్రతులన్నిటిలోను ఇదేవిధంగా ఉంది. అష్టోత్తరశత తిరుపతుల్లో ఒకటైన ఇది ఘృతశైలమేగాని గృత శౌచముగాదు."ఘృతశైలే పాపహరం"అని దీని సంస్కృత మూలం.

వజ్రపురి :- (4-214) ఇది కూడా అష్టోత్తరశత తిరుపతులలో ఒకటి. అన్ని ప్రతుల్లోనూ ఇదేవిధంగా ఉంది. వ్రజపురి అని ఉండాలి, వ్రజపురమే వ్రజమండలమైన బృందావనం. "బృందావనే నంద సూనుం" అని దీనికి సంస్కృతమూలం. (క. తీ - 466).

మధ్యము :- (5-122) తాళ భేదాల్లో ఇది పేర్కొనబడింది. సంగీత శాస్త్రగ్రంథాల్లో మధ్యతాళం కనిపించడం లేదు. మఠ్యతాళమే ఉంది. "ధ్రువో మఠ్యరూపకశ్చ ........ సప్తతాళాః. ప్రకీర్తితాః" బ్రౌను శబ్దసూచికలోనూ, శృం. గ్రం. ప్రతిలోనూ ఇది మఠ్య అనే ఉంది. ఈ పాఠభేదమే సరియైంది.

స్ఫుటితకము :- (5-152) ఇది కామశాస్త్రానికి సంబంధించింది. చుంబన భేదం. అన్ని ప్రతుల్లోనూ ఇదేవిధంగా ఉంది. స్ఫురితకం అని ఉండాలి. కామ శాస్త్ర గ్రంథాలు ఈ పదాన్నే సూచిస్తున్నాయి. "వదనే ప్రవేశితం చౌష్ఠం.....ఓష్ఠం నోత్తర ముత్సృహతే ఇతి స్ఫురితకం" అని వాత్స్యాయనసూత్రం. (వా.ర.రే -144).

పైలజ, రోమజ :- (3-128) ఇవి రెండూ పంచసిద్ధాంతాల పేర్లలోనివి. మూడు ప్రతుల్లోనూ ఇదేవిధంగా ఉన్నాయి: పౌలిశ, రోమక అని ఉండాలి. "పౌలిశ, రోమక, వాసిష్ఠ, సౌర, పైతామహేషు........" అన్నవి పంచసిద్ధాంతాలు. (చూడు. సిద్ధాంతాలు). గ్రంథ విస్తర భీతిచే హంసవింశతిలో సంస్కరించవలసిన పదాలనన్నిటిని ఇక్కడ ప్రదర్శించ

లేక పోతున్నాను. కాని సశాస్త్రీయంగా హంసవింశతిని పరిష్కరిస్తే సంస్కరించి, నిర్ణయించవలసిన పాఠభేదాలు కోకొల్లలు. అందులో కొన్ని మాత్రమే ఈ క్రింది పట్టికలో చూపబడుతున్నాయి.

| హం. విం. లో పదాలు ఉండే తీరు. | — | ఉండవలసిన తీరు. |
|---|---|---|
| 1. కుండవల (4–185) (బెస్తల వృత్తి పరికరం) | | కండెవల |
| 2. దెమ్ములు (4–184) ( ,, ,, ) | | దీములు |
| 3. అమకు వల ( ,, ,, ) | | అనువల |
| 4. కుడుతరి కొయ్యలు– (పాలె వృత్తి పరికరాలు) | | ఉడుత కొయ్యలు |
| 5. కారపాలిక — — | | కీరమాలిక |
| 6. వంటెఱ్ఱది (కోడిపుంజుల్లో భేదాలు) | | కంటెఱ్ఱది |
| 7. సూది కాలుది ( ,, ,, ) | | పోగలది |
| 8. బాశిరాగం (5-123) (సంగీతశాస్త్రం-రాగం పేరు) | | బౌళిరాగం |
| 9. హేజిజ్వ ( ,, ,, ) | | హేజిజ్జి |
| 10. మంగళకౌశికి ( ,, ,, ) | | మంగళక్తైశికి |
| 11. ఉల్భన (5–155) (కామశాస్త్రం–చౌశీతి బంధాలు) | | ఉద్భగ్న |
| 12. హాళక కరణము ( ,, ,, ) | | హులకరణము |

ఈ విధమైన శాస్త్ర, సాంకేతిక పదాలు, లౌకిక, వృత్తిపరికరాల పదాలు హంసవింశతిలో పట్టికల రూపంలో ఉన్నవాటి వన్నిటిని జాగ్రత్తగా పరిశీలిస్తే స్వస్వరూపాన్ని పోగొట్టుకొని సంస్కారాన్ని ఆశించే పదాలు సహస్రాధికంగా ఉంటాయి.

పదస్వరూపం సరిగా లేకుంటే దానికి సంబంధించిన విజ్ఞానం కూడా సరిగ్గా ఉండదు. ఒకదాని కింకొకటి అనుకొనే ప్రమాదం ఉంది. కాబట్టి, విజ్ఞాన సర్వస్వమైన హంసవింశతిలోని పదజాలాన్ని సశాస్త్రీయంగా పరిశీలించి, సరియైన పాఠభేదాలతో చక్కని ప్రతిని తయారుచేసి, తగిన వివరణతో ప్రచురిస్తే, ఆ విజ్ఞానమంతా నలుగురికీ అందుబాటులోకి రాగలదని ఆశించవచ్చును.

ఈ విజ్ఞాన ప్రబంధాన్ని సుష్ఠుగా పరిష్కరించాలంటే కేవలం ఛందో లక్షణ సమన్వయంగాని, వివిధ శాస్త్రాల పరిచయంగాని చాలదనిపిస్తుంది. పల్లెటూళ్ళలో జానపదుల ఆచార వ్యవహారాలు, వినోదాలు వేడుకలు మొదలైన అంశాలతో కూడిన వారి జీవిత విధానంతో కూడా పరిచయముంటే తప్ప ఈ ప్రబంధాన్ని పరిష్కరించడం అంత సులువుగా తోచదు. ఉదాహరణకు ఈ క్రింది పద్యాన్ని పరిశీలించండి........

తే॥ డేగ, నెమిలి, పింగళి, కోడిడేగ, కాకి
వన్నెలై దింటి కిరులందు వన్నెలందు
రాజ్య భోజన గమన నిద్రా మరణము
లను విచారించి యుపజాతులను వచించి
[3-213-వావిళ్ళ-Scholors Edition 1920]

వన్నెలై దింటిలో నిండు వన్నెలందు.
[3-213 వావిళ్ళ-లఘుటీక ప్రతి 1964]

వన్నెలై దింటి కిరవొందు వన్నెలందు
[3-213 *AP*. సాహిత్య అకాడమి ప్రతి 1977]

పై పద్యంలో రెండవ పాదము చాలా ముఖ్యమైంది. ఇందులో కవి కోడి పుంజులలోని అయిదు జాతులను (1. డేగ, 2. నెమిలి, 3 పింగళి, 4. కోడి డేగ, 5. కాకి) గురించి, ఈ అయిదు జాతులకు ఆయా సమయాల్లో ప్రాప్తించే భోగాలు 1. రాజ్యము, 2. భోజనము, 3. గమనము, 4. నిద్ర, 5. మరణము (పై పద్యంలో 3వ పాదము)లను గురించి వివరిస్తున్నాడు.

కోడి పందాలు - చీకటి పందాలని, వెన్నెల పందాలని రెండువిధాలుగా ఉంటాయి. కృష్ణ పక్షం రోజుల్లో జరిగే పందాలు చీకటిపందాలు. శుక్ల పక్షంలో జరిగే పందాలు వెన్నెలపందాలు. ఈ పందాల్లో పైన చెప్పిన అయిదు జాతుల కోడి పుంజులకు ఏయే సమయాల్లో రాజ్యము, భోజనము, గమనము అనే భోగాలు ఉన్నాయో పందెగాండ్రు వీటిని

తెలుసుకునే సాధనాలైన కట్టుముళ్ళ ద్వారా తెలుసుకొని జాతి పుంజులను పందానికి వదులుతూ ఉంటారు. రాజ్యభోగము, భోజన భోగము ఉన్న పుంజులు తప్పక గెలుస్తాయనీ, గమన భోగమున్న పుంజు కూడా గెలిచే అవకాశముంటుందనీ జానపదులైన పందెగాండ్ర నమ్మకము. నిద్ర, మరణ భోగాలున్నప్పుడు ఏ జాతి కోడిని పందానికి వదలరు. ఆ సమయాల్లో అవి ఓడి పోతాయని జానపదుల విశ్వాసం.

పై పద్యంలోని రెండవపాదం ఇప్పటి వరకు వచ్చిన హంసవింశతి ప్రతులన్నిటిలోనూ తప్పుగానే పరిష్కరింపబడినది. పల్లెటూళ్లలో జరిగే కోడి పందాలు తీరుతెన్నులు, ఆచార వ్యవహారాలు తెలిస్తేగానిఇటువంటివి పరిష్కరించడం కష్టం. ఇవన్నీ తెలిసి, అర్థ విచారణచేసి, ప్రకరణాన్ని బట్టి పై పాఠాన్ని నిర్ణయిస్తే "వన్నెలైదింటి కిరులందు వెన్నెలందు" అని ఉంటుంది. అంటే వన్నెలు (రంగులను)బట్టి ఏర్పడే అయిదు జాతుల కోడి పుంజులకు ఇరులందు=చీకటి పందాల్లో. వెన్నెలందు=వెన్నెల పందాల్లో ఏయే భోగాలుంటాయో విచారించి పందెగాండ్రు ఆయా జాతి పుంజులను పందానికి వదులుతున్నారనే కవి హృదయం మనకు తెలుస్తుంది.

కోడి పందాల విషయంలో జానపదుల్లో ఉండే ఈ అంశాలన్నీ తెలిస్తేగాని పై పాఠాన్ని పరిష్కరించడం కష్టం. అందుకనే విజ్ఞాన సర్వస్వమైన హంస వింశతికి ఇప్పటి వరకు వచ్చిన ముద్రిత ప్రతులను పరిశీలిస్తే వివిధములైన లౌకిక విషయాలతోగానీ, అనేక శాస్త్రాంశాలతోగానీ పరిచయంలేని పరిష్కర్తలు ఎటువంటి భ్రమ ప్రమాదాలకు లోనైనారో గమనించవచ్చును. ఇలా స్వస్వరూపాలను పోగొట్టుకొని పరిష్కారాన్నాశించే పదాలు ఈ ప్రబంధం నిండా ఉన్నాయి. కాబట్టి ఏ ఒక్క వ్యక్తి హంసవింశతిని సక్రమంగా పరిష్కరించడమనేది సాధ్యముగానిపనే.అలాంటప్పుడు తెలుగు సంస్కృతీ విజ్ఞానాల అభివృద్ధియే లక్ష్యంగా ఆవిర్భవించిన తెలుగు విశ్వవిద్యాలయం లాంటి సంస్థలైనా ప్రణాళికా బద్ధంగా ఈ విజ్ఞానప్రబంధాన్ని సుష్ఠుగా పరిష్కరించి, చక్కని ప్రతిని తయారుచేస్తే అది ఆంధ్రులకు మహోపకారమే అవుతుందనడంలో సందేహం లేదు.

# అకారాది (వివరణ) పద సూచిక

| | | | | |
|---|---|---|---|---|
| ఆం.వి. | ఆంధ్ర విజ్ఞానము, సంపుటాలు (1 to 7) | కందుకూరి బాలసూర్యప్రసాద భూపాలుడు | — | — |
| ఆం వి.స. | ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము సంపుటాలు (1 to 3) | కొమర్రాజు వేంకట లక్ష్మణరావు | ఆంధ్ర పత్రికా ముద్రణాలయము | 1932 |
| ఆం.సాం.చ. | ఆంధ్రుల సాంఘిక చరిత్ర | సురవరం ప్రతాపరెడ్డి | | ప్రథమ ముద్రణ |
| ఆం.చం. | ఆంధ్ర చంద్రాలోకము | అడిదము సూరకవి | — | — |
| ఆం.మ.భా. | ఆంధ్ర మహాభారతము | కవిత్రియం | సాహిత్య అకాడమీ, వావిళ్ళ ప్రతులు | — |
| ఆం.భా. | ఆంధ్ర మహాభారతోపన్యాసములు | — | ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు | ద్వితీయ ముద్రణం |
| ఆం.వా. | ఆంధ్ర వాచస్పత్యము, సంపుటాలు I. II. III. | కొట్ర శ్యామలశాస్త్రి | ది ఓరియంట్ పబ్లిషింగ్ హౌస్ | 1959 |
| ఆ.శ.ర. | ఆంధ్ర శబ్దరత్నాకరము, సంపుటాలు I. II. III. | చెలమచెర్ల రంగాచార్యులు | వెంకట్రామా అండ్ కో విజయవాడ | 1964 |
| అ.క. | అకశేరుకాలు, చతుర్థభాగం | బి. హెచ్. సీతారామస్వామి | తెలుగు అకాడమీ | — |
| ఆ మా. | ఆముక్తమాల్యద | వ్యాఖ్య- వేదం వేంకట్రాయశాస్త్రి | వేదం వేంకట్రాయశాస్త్రి అండ్ బ్రదర్సు మద్రాసు | 1964 |
| ఆం స. | ఆంధ్ర నామ సర్వస్వము పూర్వభాగము | ముసునూరి వేంకటశాస్త్రి | రామ్‌శేషు ప్రెస్ రాజమండ్రి | 1971 |

| | | | | |
|---|---|---|---|---|
| ఉ.కాలా. | ఉత్తర కాలామృతము | — | వావిళ్ళ ప్రతి | 1955 |
| క.పూ. | కళాపూర్ణోదయము | వ్యాఖ్య- మల్లాది సూర్యనారాయణశాస్త్రి | అద్దేపల్లి & కో రాజమండ్రి | 1963 |
| కా.సం. | కావ్యాలంకార సంగ్రహము | వ్యాఖ్య- సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి | యం. శేషాచలం అండ్ కంపెనీ | 1976 |
| కు.శా. | కుక్కుటశాస్త్రము | వేమనూరి గంగాధరం | కొంపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్ | 1957 |
| కే.ప్ర | కేరళ ప్రశ్నము, (ఆంధ్ర తాత్పర్యసహితము) | అలూరు వాసుదేవ దైవజ్ఞసిద్ధాంతి | వావిళ్ళప్రతి | 1957 |
| కొ.క.శా. | కొక్కోక కళా శాస్త్రము | ఎఱ్ఱయకవి | వ్రాతప్రతి | 20-5-1911 |
| క్రొ.సం.వి.ద. | క్రొత్త సంగీత విద్యా దర్పణము | ఏకా సుబ్బారావు | తెనాలి ఓరియంటల్ ముద్రణాలయము | 1957 |
| ఖ ల.శి. | ఖడ్గ లక్షణ శిరోమణి | నవనప్ప | మద్రాసు ప్రభుత్వ ఓరియంటల్ సిరీస్ | 1950 |
| గ్రి.సం. | గ్రిహ సంహిత 1,2 సంపుటాలు | అళ్ళ సుబ్బారావు | రామకృష్ణశాంతి సమితి | 1971 |
| గా.క.బో. | గాన కళా బోధిని | పార్థసారధి<br>శ్రీమతి ద్వారక పార్థసారధి | బాలసరస్వతి బుక్ డిపో | 1965 |

| | | | | |
|---|---|---|---|---|
| గు.జ్యో.ప్ర. | గుప్తజ్యోతిష ప్రభావము | పండిత జోగిపర్తి స్వామిగుప్త సిద్ధాంతి | వెంకటేశ్వర పబ్లిషింగ్ హౌస్ | 1964 |
| గృ.వ. | గృహ పరిశ్రమలు | పద్మశ్రీ తాడి బ్రహ్మానందవర్మ | జి. జోగిరాజు పబ్లికేషన్సు | 1975 |
| చ.చి. | చరక చికిత్స | వ్యాఖ్య- సుమదుపాటి విశ్వనాథశాస్త్రి | వావిళ్ళ ప్రతి | — |
| ఛ. | ఛప్పన్నము | భట్టోత్పలుడు వ్యాఖ్య- వడ్డాది వీర్రాజు | కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్ | 1957 |
| జ్యో.చ. | జ్యోతిష చక్రప్రదర్శిని | చల్లా నరసింహశాస్త్రి | — | 1962 |
| జ్యో.ర. | జ్యోతిష రత్నావళి (సం) III | కూనపులి శేషావతారశాస్త్రి | మురళీపవర్ ప్రెస్ | 1973 |
| తా.ప. | తాళ్ళపాక పలుకుబళ్ళు | రామలక్ష్మి ఆరుద్ర | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ | 1971 |
| తె.ఛం.రీ. | తెలుగులో ఛందో రీతులు | రావూరి దొరైస్వామిశర్మ | త్రివేణి పబ్లిషర్సు | 1962 |
| ధ.క్షే.మా. | ధర్మపురి క్షేత్ర మాహాత్మ్యము | శ్యామశాస్త్రి | — | — |
| ధ.ని. | ధనంజయ నిఘంటువు | ధనంజయుడు | వావిళ్ళప్రతి | 1933 |
| ధన్వ.ని. | ధన్వంతరి నిఘంటువు | ధన్వంతరి | — | — |
| ధ.వి.వి. | ధనుర్విద్యా విలాసము | కృష్ణమాచార్యుడు | మద్రాసు ప్రభుత్వ ఓరియంటల్ సిరీస్ | విరోధి మాఘ |

| | | | | |
|---|---|---|---|---|
| నా.ప్ర. | నాడీజ్ఞాన ప్రకాశిక | చావిళ్ళవారి ప్రతి | | — |
| నా.శా. | నాట్య శాస్త్రము | పోణంగి శ్రీరామ అప్పారావు | | — |
| నా.ర.మా. | నానార్థ రత్నమాల | ఇరుగపదండనాథుడు | వావిళ్ళప్రతి | 1924 |
| ని.వే.ర. | నిగూఢ వేద రహస్యము | శ్రీవఝ్ఝుల వెంకటరామశాస్త్రి | ప్రేమచంద్ | |
| | శ్రీ అరవింద దర్శనము | శ్రీరామకవచం వెంకటేశ్వరశాస్త్రి | పద్మిని కేషన్స్ | 1968 |
| నృ.ర. | నృత్త రత్నావళి (జాయప) | రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ | ఆంధ్రప్రదేశ్ | |
| | | | సంగీతనాటక అకాడమీ | 1909 |
| ప.పా. | పదబంధ పారిజాతము (సం) II | నార్ల వెంకటేశ్వరరావు | ఆంధ్రప్రదేశ్ | |
| | | విద్వాన్ విశ్వం, వి. కోదండరామయ్య | సాహిత్య అకాడమీ | 1961 |
| పూ.గా.ల. | పూర్వ గాథా లహరి | వేమూరి శ్రీనివాసరావు | వెంకట్రామ అండ్ కో | 1971 |
| ప్ర.ఉ. | ప్రద్యుమ్నోదయము | విశ్వనాథ సత్యనారాయణ | వి.యస్.యస్. ప్రింటర్స్ | 1969 |
| ప్ర.జ్ఞా. | ప్రశ్న జ్ఞానము | భట్టోత్పలుడు | | |
| ప్ర మ.పు. | ప్రథమాంధ్ర మహా పురాణము | డి.వి. సుబ్రహ్మణ్యము | శ్రీవాణీ ప్రచురణలు | 1973 |
| బ.రా. | బసవ రాజీయము | బసవరాజు | చందా నారాయణశెట్టి | 1933 |
| బృ.జా. | బృహ జ్జాతకము | ఆలూరు వాసుదేవశాస్త్రి | వావిళ్ళప్రతి | 1914 |
| భా.ప్ర. | భావ ప్రకాశ 1,2 | ముక్కామల వెంకటశాస్త్రి | — | 1954 |
| భా.భౌ.భూ. | భారతదేశపు భౌతిక భూగోళము | మహీధర్ | నేషనల్ బుక్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా | — |
| భు.దీ. | భువన దీపిక | పద్మప్రభుసూరి | విజయప్రెస్, వరంగల్ | 1969 |

| | | | | |
|---|---|---|---|---|
| మ.చ | మను చరిత్ర | వ్యాఖ్య, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి | వెంకట్రామ అండ్ కో | 1968 |
| మాం.వృ.కో. | మాండలిక వృత్తిపద కోశము I | భద్రిరాజు కృష్ణమూర్తి | ఆంధ్రప్రదేశ్ | 1962 |
| " | " " IV | బూదరాజు రాధాకృష్ణ | సాహిత్య అకాడమీ | 1968 |
| ము.సిం. | ముహూర్త సింధువు | వాడ్రేవు సూర్యనారాణమూర్తి | — | — |
| యో.ద. | యోగ దర్శనము | పండిత గోపదేశ్ | భారతీ ప్రెస్, తెనాలి | 1952 |
| యో.ర. | యోగ రత్నాకరము | యేటూరు శ్రీనివాసాచార్యులు | — | 1940 |
| వ.గు.చం. | వస్తు గుణ చంద్రిక | చెరుకుపల్లి వెంకటరామయ్య | కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్ | 1970 |
| వ.గు.ప్ర. | వస్తు గుణ ప్రకాశిక | పోటూరి వాసుదేవశాస్త్రి | అద్దేపల్లి అండ్ కో | 1958 |
| వా.కా. | వాత్స్యాయన కామ సూత్రములు | ధనికొండ | భగవాన్ పబ్లికేషన్సు | |
| వా.ర.రే. | వాత్స్యాయనీయము (రతిరేఖ వ్యాఖ్య) | మేడిచర్ల ఆంజనేయమూర్తి, | — | |
| వా.వి.వ. | వాణీ విలాస వనమాలిక | అనుముల రాఘవశర్మ<br>వేదుమళ్ళ రంగశాయి | | 1945 |
| వి.ప్ర. | విశ్వ ప్రకాశము (సటీకము) | మహేశ్వరుడు | మద్రాసు ప్రభుత్వ<br>ఓరియంటల్ సిరీస్ | 1953 |
| వి.స. | విజ్ఞాన సర్వస్వము (1 to 12) | సంకలనము | వావిళ్ళప్రతి<br>తెలుగు భాషా సమితి హైదరాబాదు | 1933<br>— |

| | | | | |
|---|---|---|---|---|
| వి.సా.చ. | విజయనగర సాంఘిక చరిత్ర | పుట్టపర్తి నారాయణాచార్యులు | రంగనాథ పబ్లికేషన్స్, కడప | — |
| వై.యో.ర. | వైద్య యోగ రత్నావళి | ములుగు రామలింగయ్య | | — |
| శు.స. | శుక సప్తతి | కదిరీపతి నాయకుడు | వావిళ్ళ ప్రెస్ | 1951 |
| శ్రీ.కా.మ. | శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యము | వ్యాఖ్యాత- దీపాల పిచ్చయ్యశాస్త్రి | — | — |
| శాంతి. | శాంతి (సంకలనము) | భార్గవ విద్యాదేవకులపతి | వెల్కం ప్రెస్ లిమిటెడ్ గుంటూరు | — |
| సం.అ. | సంప్రదాయ అకారాది ద్రావిడాంధ్ర నిఘంటువు | కంచాడై శేషాచార్యులు | వేదాంత ముద్రాక్షరశాల గుంటూరు | 1939 |
| సం.క.ప్ర. | సంగీత కళా ప్రదర్శిని (సం) I | అపిరాల సత్యనారాయణమూర్తి | పాండురంగ ప్రింటింగ్‌వర్క్స్ | 1960 |
| సం.వా.చ. | సంస్కృత వాఙ్మయ చరిత్ర (సం) II | పుల్లాది సూర్యనారాయణశాస్త్రి | ఆంధ్ర సారస్వత పరిషత్తు | 1961 |
| సం.వి.కో. | సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము ( 1 to 8) | సంకలనము | సంగ్రహాంధ్ర విజ్ఞానకోశ సమితి హైదరాబాదు | — |
| సక. | సకసేరుకాలు 2,3,4 భాగములు | — | తెలుగు అకాడమీ | — |
| స.సా. | సకలార్థ సాగరము | దొరసామయ్య | కళారత్నాకర ముద్రాక్షరశాల, | 1905 |
| సీ.రా.ఆం.సం. | శ్రీ సీతారామాంజనేయ సంవాదము | — | — | — |
| స.సు.అ.దీ | సకల సుగుణ అదృష్ట దీపిక | వడ్డాది వీర్రాజు | సి. వి. కృష్ణా బుక్ డిపో | — |

| | | | | |
|---|---|---|---|---|
| సా శి.స. | సాహిత్య శిల్ప సమీక్ష | పింగళి లక్ష్మీకాంతం | మాధవి బుక్ సెంటర్ | 1976 |
| సూ ని. | సూర్యరాయాంధ్ర నిఘంటువు | సంకలనము | ఆంధ్రసాహిత్య పరిషత్తు | |
| సో.కృ. | పాల్కురికిసోమనాథుడు అతని కృతులు | కీ. శే, డా॥ వి. నరసింహారెడ్డి | వ్రాతప్రతి | |
| హం.విం.(వా) | హంస వింశతి | అయ్యలరాజు నారాయణామాత్యుడు | వావిళ్ళ ప్రతి | 1964 |
| | | | వావిళ్ళ | 1920 |
| హం.విం.(శృ) | హంస వింశతి (శృంగ్రం) | నారాయణామాత్యుడు | శృంగార కావ్య గ్రంధమండలి | 1938 |
| హం.విం. సూ | హంస వింశతి సూచిక 1,2 వ్రాతప్రతి | సి. పి. బ్రౌను | మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంధాలయం | |
| హం.విం | హంస వింశతి వ్రాతప్రతి | సి. పి. బ్రౌను | — | 1845 |

## హిందీ గ్రంథాలు

| | | | | |
|---|---|---|---|---|
| క.తీ. | కళ్యాణ తీర్థాంక | | గీతా ప్రెస్. గోరఖపూర్ | |
| మ.నా.క్ర. | మహాభారత నామాను క్రమణిక | | మోతీలాల్ బానార్సిదాస్ | |
| ర.సి. | రసతంత్రసారమ్ సిద్ధప్రయోగసంగ్రహ్ | | కృష్ణగోపాల ఆయుర్వేద భవన్, అజ్మీరు | 1966 |
| సా.ద. | సాహిత్య దర్పణము | వ్యాఖ్య సత్యవ్రత సిన్హా | చౌకాంబ ప్రచురణ | 1963 |

# ENGLISH BOOKS


| | | | | |
|---|---|---|---|---|
| A.H.D.E. | The American heritage dictionary of the english language | — | Houghton Miffilin Company | — |
| A.I. | Ancient India | R.C, Maiumdar | Motilal Banarsidas | 1971 |
| A.D.G. | Andhra pradesh district gazteers | Cuddaph_Dt. | Revised Edition | — |
| A.S.V. | Administration and Social life under Vijayanagar | | Madras University Historical Series No. 15 | — |
| C.D.H.M. | Classical Dictionary of Hindu Mythology | John Dowson | Trubners Oriental Series | 11th Edition |
| C.O.I. | Census of India 1961 | Volume-II A.P. | Fairs and festivals | — |
| C.T.S.I. | Castes and Tribes of Southern India (I to Iv) | E. Thurston | Govt. Press. Madras | 1909 |
| E.B. | Encyclopaedia Brittanica | — | William Bentan Publisher | 1963 |
| Fis. | Fishes | M. Chardy<br>— | National Book Trust of India. | 1970 |
| G.O,P. | The Geography of the Puranas | S.M.Ali | Peole's Publishing House | 1973 |
| H.S.L. | A History of Sanskrit Literaturs | Dr. V. Varadachari | Ramanarayan Lal Publishers | 1961 |
| H.S.Lit. | A History of Sansktit Literature | A.Macdonell | Motilal Banarasidas | 1970 |

| | | | | |
|---|---|---|---|---|
| Hind. | Hinduism | Louis Renon | Printed in U.S.A. | |
| H.C.I.P. | History and Culture of Indian People | — | Bharathiya Vidyabhavan Publications | |
| L.V. | Laya Vadyas | P. Sambamurthy | All India Hand Crafts Board, New Delhi | — |
| N.N. | The Nighantu and Nirukta | Lakshman Sarup | Motilal Banaraidas | 1967 |
| O.C.E.L, | The Oxford Companion to English Literatuse | Sir Paul Harvay | — | IV Edition |
| R.O.I. | Rivers of India | S.D. Misra | National Book Trust of India | 1970 |
| S.O.E.D. | The Shorter Oxford English Dictionary | William Little | The Standard Literature Calcutta | — |
| S.D.B. | Studies in Devi Bhagavatha | Dr. P. G. Laley, | — — | — |
| S.V. | Sriti Vadyas | P. Sambamurthy | All India Hand Crafts Board, New Delhi | 1959 |
| S.N.I. | Social Life in Northern India | Brij Narayana Sarma | — | — |
| T.B.Z. | A Text Book of Zoology-II | Parkon & Haswell A,J. Marshall | — | — |
| T.I.C. | Traditional Indian Culture | V.R. Narla | Vijaya Books, Vijayawada | 1969 |
| V.P. | Vishnu Purana | H.H. Wilson | Punti Pustak, Calcutta | 1961 |

# SANSKRIT BOOKS

| | | | | |
|---|---|---|---|---|
| B.K. | Bharata Kosa | Manavallirama Krishna Kavi | T.T.D. Printers | 1951 |
| D.N. | Dhananjaya Nighantu | Dhananjay | Vavilla Printers | 1933 |
| Dh.N. | Dhanvanthari Nighantu | — | Konda Sankaraiah & Sons | 1956 |
| D.R. | Dasa Rupaka | Dhanajaya | — | — |
| K.A. | Kavyalankars Sangraha | Bhamaha | Motilal Banarsidas | 1970 |
| K.D. | Kavyadarsa (Dandi.) | Hindi Commentury Pro. Remacnandra Misra | Choukamba Vidya Bhavan | — |
| K.N. | Kavyanusasanam | Hemachendra | Nirnaya Sagar Printers | 1934 |
| N.N.M, | Nanardhamala | Irugupa Danda Natha | Vavilla Printers | 1924 |
| N.R. | Nrith Ratnavali (Jayapa) | Notes : Dr. V. Raghavan | Govt. of Madras | 1965 |
| S.E.D, | Sanskrit English Dictionary | V.S. Apte | Motilal Banarsidas | 1970 |
| S.K.D. | Sabdakalpadrumam Vol. III | ,,, | — | |
| S.K.B. | Saraswathi Kantabharanam | Bhoja | Motilal Banarsidas | - |
| S.S. | Sukasaptati | — | — | — |
| V.K. | Viswakosa | Maheswara | Vavilla Printers | 1931 |